మనోరంజన్ ఝా (జననం 1928) 1952 లో పట్నా విశ్వవిద్యాలయం నుంచి మాస్టర్స్ పట్టా పుచ్చుకున్నారు. "యునైటెడ్ స్టేట్స్ అండ్ ఇండియా, 1930-1935: ఎ స్టడీ ఆఫ్ ది అఫీషియల్ అండ్ నాన్ అఫీషియల్ వ్యూస్ ఇన్ ది యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ పొలిటికల్ డెవలప్‌మెంట్స్ ఇన్ ఇండియా డ్యూరింగ్ 1930-1935." అన్న విషయంపై రచించిన పరిశోధక వ్యాసానికి, ఇండియన్ స్కూల్ ఆఫ్ ఇంటర్‌నేషనల్ స్టడీస్, వారికి డాక్టరేట్ పట్టా ప్రదానం చేసింది. ప్రస్తుతం బెనారెస్ హిందూ విశ్వ విద్యాలయంలో పొలిటికల్ సైన్స్ విభాగంలో రీడర్‌గా పని చేస్తున్నారు. 'కాథరిన్ మేయో అండ్ ఇండియా' అన్న గ్రంథాన్ని రచించారు. ఈ గ్రంథం, 1971 లో ప్రచురితమైంది.

# స్వాతంత్ర్య సమరంలో కేంద్ర శాసనసభ పాత్ర


రచన :

మనోరంజన్ ఝా

అనువాదం :

కుమారి మా. రాజ్యలక్ష్మి





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

1976 ( 1898 )



వెల : **6–75**

Original Title : Role of Central Legislature in the Freedom Struggle (English)

TELUGU TRANSLATION : SWATANTRA SAMARAMLO KENDRA SASANA SABHA PATRA

డిస్ట్రిబ్యూటర్సు :
ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు

PUBLISHED BY THE DIRECTOR, NATIONAL BOOK TRUST, INDIA, A-5 GREEN PARK, NEW DELHI-16, AND PRINTED BY MAHILA PRESS, ANDHRA MAHILA SABHA, UNIVERSITY ROAD, HYDERABAD-500960.

# తొలి పలుకు

దేశ స్వాతంత్ర్య సమరంలో కేంద్ర శాసన సభ పాత్ర గురించిన ఈ గ్రంథాన్ని పరిచయం చేయడం నాకెంతో సంతోషంగా వుంది. పండిత ప్రకర్షతో కూడిన ఈ గ్రంథ రచన చదువరులకు ఆసక్తికరంగా సాగింది. స్వాతంత్ర్య సమరంలోని ప్రధానమైన పోరాటాలు శాసన సభ వెలుపల, ప్రజా ఉద్యమాల రూపంలో జరిగినవే అయినా మన నాయకుల్లో చాలా మంది, బ్రిటిష్ వారితో, వారి పద్ధతిలో విజయవంతంగా పోరాడి, సమర్థులైన ఆరి తేరిన పార్లమెంటరీ వ్యవహర్తలని పించుకున్నారు. శాసన సభలో వీరు తమ కట్టుదిట్టమైన వాద ప్రతివాదాలతో సామ్రాజ్య వాదుల దమన నీతినీ ప్రజలను పీడించడాన్నీ దేశ-ప్రపంచ ప్రజల దృష్టికి తెచ్చారు. 1909, 1919 వ సంవత్సరపు చట్టాల వల్ల విద్యావంతులైన మధ్య తరగతి ప్రజలకు లభించిన పరిమితమైన అవకాశాలను పూర్తిగా వినియోగించుకుని వీరు, వలస విధానపు చెడుగులను బట్ట బయలుచేసి స్వపరిపాలన, దేశ ఐకమత్యమూ అవసరమని చాటి చెప్పారు. శాసన సభాధ్యక్ష పదవీ బాధ్యతల నిర్వహణలో కొత్త సంప్రదాయాలను నెలకొల్పి విఠల్‌భాయిపటేల్, ఈ ఉన్నత పదవికి మరికొంత శోభ తెచ్చి పెట్టారు. పరిమితమైన అప్పటి పరిధిలో ఎన్నికై ప్రతినిధుల హక్కులనూ అధికారాలనూ ఎంతో నైపుణ్యంతో పరిరక్షించారు. మోతీలాల్ నెహ్రూ నాయకత్వంలో స్వరాజ్య పార్టీ, దేశ సంక్షేమం కోసం ఏమాత్రం తలఒగ్గకుండా కృషి చేసింది. వాక్ స్వాతంత్ర్యాన్నీ పత్రికల స్వేచ్ఛనూ పరిమితం చేస్తూ కఠినమైన చట్టాలు అమల్లో వున్నందున శాసన సభ వెలుపల స్పష్టంగా గట్టిగా వ్యక్తం చేయలేని అభిప్రాయాలను శాసన సభలో సమర్థంగా వెల్లడిచేసే అవకాశం ఉండేది.

స్వాతంత్ర్య సమరం సందర్భంగా శాసన సభలో జరిగిన చర్చల ప్రధాన ఘట్టాలను ఈ గ్రంథం తేట తెల్లంగా తెలుపుతుంది. అతి స్వల్ప వ్యవధిలో

ఈ గ్రంథాన్ని తయారు చేసిన డాక్టర్ మనోరంజన్ ఝూనూ ఆయన సహచరులనూ నేను అభినందిస్తున్నాను. ఈ పుస్తక రచనకూ ప్రచురణకూ కారకులైన చారిత్రక పరిశోధన విషయాల భారతీయ సమితిని కూడా నేను అభినందిస్తున్నాను. పార్లమెంటరీ వ్యవహారాల మంత్రి శ్రీ రాజ్ బహాదుర్, దేశ వ్యవహారాలమంత్రి శ్రీ కె. సి. పంత్ ప్రోత్సాహంతో, భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా ప్రచురితమైన ఈ గ్రంథం, మన గొప్ప పార్లమెంటరీ వ్యవహర్తలకు అంజలి. వీరిలో చాలామంది ఇప్పుడు లేరు. చదువరులు దీన్ని ఆదరించగలరు.

యస్. నూరుల్ హసన్

# ఉపోద్ఘాతము

భారత స్వాతంత్ర్యసమరం సందర్భంగా కేంద్ర శాసనసభ వహించిన పాత్రలోని కొన్ని అంశాల పరిశీలన - ఈగ్రంధం. ముఖ్యంగా 1919-47 సంవత్సరాలమధ్య జరిగిన సంఘటనల సమీక్ష ఇది. ప్రధాన విషయానికి ఉపోద్ఘాతంగా తోడ్పడేందుకుగాను సమితిచట్టాలు ఏవిధంగా రూపొందినదీ, 1919 వరకూ దేశప్రజల కోరికలు ఏవిధంగా ఉన్నదీ మొదటి అధ్యాయంలో స్థూలంగా పేర్కొన్నాను. ఓటుచేసేహక్కు అప్పట్లో పరిమితంగానే ఉన్నా, రెండవ సభకన్నా దిగువసభకే ఎక్కువ ప్రజాప్రాతినిధ్యముండేది. కనుక దిగువసభ కార్యక్రమాలకే ఎక్కువ ప్రాముఖ్యమిచ్చాను.

పరిచయ వాక్యాలు వ్రాసిన కేంద్ర విద్యామంత్రి ప్రొఫెసర్ యస్. నూరుల్ హసన్‌కూ, ఈ గ్రంథ రచనకు వీలు కల్పిస్తూ నాకు డెప్యుటేషన్ సెలవు ఇచ్చిన బెనారస్ హిందూ విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులైన డాక్టర్ కె. యల్. శ్రీమాలికీ నా కృతజ్ఞత తెల్పుకుంటున్నాను. వ్రాతప్రతులను చదివినందుకు జవహర్‌లాల్ విశ్వ విద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ యస్. గోపాల్‌కూ ప్రొఫెసర్ బిపిన్‌చంద్రకు కూడా నా కృతజ్ఞత తెల్పుకుంటున్నాను. ఈ గ్రంథ రచన చేయవలసిందని నన్ను ప్రోత్సహించిన, చారిత్రక పరిశోధనా విషయాల భారతీయ సమితి అధ్యక్షులైన ప్రొఫెసర్ రామ్‌శరణ్ శర్మకూ ఈ పుస్తక ప్రచురణకు ఏర్పాటు చేసినందుకు భారత ప్రభుత్వానికి విద్యా విషయాల్లో సలహాదారుగా పనిచేస్తున్న శ్రీమతి యస్. దొరైస్వామికీ ధన్యవాదాలర్పించుకుంటున్నాను. గ్రంథరచనకు కావలసిన విషయ సేకరణలో అతి స్వల్ప వ్యవధిలో ఎంతగానో తోడ్పడిన డాక్టర్ కె. ఆర్. పిళ్ళైకూ శ్రీ రాజ్‌కుమార్‌కూ ఋణపడి వున్నాను. గ్రంథరచనకు అవసరమైన సౌకర్యాలు కల్పించిన సప్రూ హవుస్ లైబ్రరీ, సెంట్రల్ సెక్రటేరియట్ లైబ్రరీ, నెహ్రూ మెమోరియల్ మ్యూజియం అండ్ లైబ్రరీ, నేషనల్

ఆర్కైవ్స్ ఆఫ్ ఇండియా అధికార్లకు నా కృతజ్ఞత. ప్రూఫులు దిద్ది పెట్టినందుకు చారిత్రిక పరిశోధనా విషయాల భారతీయ సమితిలో రిసెర్చి ఆఫీసరుగా పనిచేస్తున్న కుమారి సి. యస్. లక్ష్మికి, స్వల్ప వ్యవధిలో పుస్తకాన్ని ప్రచురించిన చారిత్రిక పరిశోధనా విషయాల భారతీయ సమితి అధికార్లూ ఉద్యోగులకూ నేషనల్ బుక్‌ట్రస్ట్ అధికార్లూ ఉద్యోగులకూ నా ధన్యవాదాలు. టైపు చేయడంలో సహాయపడిన శ్రీ బి. ఆర్. ఆజ్‌మానీ శ్రీ బిస్టలకు నాకృతజ్ఞత.

కేంద్ర శాసనసభ కల్పించిన అవకాశాలను—అవి ఎంతో పరిమితమైనవే అయినప్పటికీ—వినియోగించుకుని భారత జాతీయతకోసం పాటుపడిన వారందరికీ ఈ గ్రంథం నా అంజలి.

మనోరంజన్ ఝా

# వి ష య సూ చి క

# మొదటి అధ్యాయం

# సమితులకు సంబంధించిన చట్టాల అవతరణ

# ప్రజల కోరిక : 1858-1919

## 1857 వ సంవత్సరపు తిరుగుబాటు, అతర్వాత పరిణామాలు

**1857** వ సంవత్సరపు తిరుగుబాటుతో బ్రిటిషు ప్రజలకు ఒక సంగతి స్పష్టంగా తెలిసిపోయింది. భారతదేశాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన ఏజెన్సీద్వారా పాలించడం ఇకమీద సాధ్యంకాదని వారికి అవగాహన అయింది. తిరుగుబాటును ఇంకా పూర్తిగా అణిచివేయక ముందే కంపెనీ చేతులనుంచి అధికారాన్ని ప్రభుత్వం హస్తగతం చేసుకునేందుకు పార్లమెంటులో ఒక బిల్లును ప్రవేశపెట్టారు. అనేక మార్పుల తర్వాత భారతబిల్లుకు 1858 వ సంవత్సరం ఆగస్టు రెండవ తేదీ రాజామోదం లభించింది. దాని ఫలితంగా భారతదేశం బ్రిటిష్ ప్రభుత్వ పాలనలోకి వచ్చింది.

కొత్త ఏర్పాటు కింద బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని ఒక మంత్రి ద్వారా పరిపాలించడం ప్రారంభమైంది. భారతదేశానికి సంబంధించిన మంత్రికి సహాయంగా ఒక సమితి ఏర్పాటైంది. భారతసమితి అని వ్యవహరించిన ఈ సమితిలో పదిహేనుగురు సభ్యులుండేవారు. వీరిలో ఎనమండుగురిని ప్రభుత్వమూ ఏడుగురిని కోర్ట్ఆఫ్ డైరెక్టర్స్ ఆదిలో నామినేట్ చేశారు. ఈసమితి కేవలం సలహాలిచ్చేందుకే. వీటోచేసే అధికారంకూడ కొంతమేరకే వుండేది. భారతదేశ విషయాలమంత్రి మంత్రిమండలిలో సభ్యులు కావడంచేత బ్రిటిష్ పార్లమెంటుకు జవాబుదారీ వహించవలసి వుండేది. అదితప్ప, భారతదేశాన్ని పాలించడానికి సంబంధించినంతవరకు ఆయన నిరంకుశుడుగా తయారయాడు. భారతదేశంలో గవర్నర్ జనరల్ అత్యున్నత అధికారిగా వుండేవాడు.

**1858**, నవంబరు ఒకటవ తేదీన రాణి ప్రకటన విడుదలయిన తర్వాత ఆయన్ను వైస్‌రాయ్ అని వ్యవహరించేవారు. ఆ దరిమిలా బ్రిటిష్‌ప్రభుత్వం ప్రధానమంత్రి సలహామీద వైస్‌రాయ్‌ని నియమించేది. వైస్‌రాయ్ అన్ని విషయాలనూ భారతదేశానికి సంబంధించిన మంత్రికి నివేదించవలసివుంది.

తన విధులను నిర్వర్తించడంలో గవర్నర్ జనరల్‌కు సహాయంగా వుండేందుకు నలుగురు సభ్యులతో ఒక కార్యనిర్వాహక సమితి వుండేది. సిద్ధాంతరీత్యా, ప్రజలకు సంబంధించిన వ్యవహారాలన్నిటినీ గవర్నర్ జనరల్ ఆయన సమితీ నిర్వర్తించేవారు. తాము తీసుకునే ప్రతిచర్యనూ తమ సమితిలో ఎక్కువమంది సభ్యులు ఆమోదించ వలసి వుంది. అత్యవసర పరిస్థితిలో మాత్రం ఆయన మెజారిటీసభ్యుల నిర్ణయాన్ని కాదనవచ్చు.

అప్పటి ఏర్పాట్లప్రకారం శాసనాలను అమలుపరచేందుకు వీలుగా గవర్నర్ జనరల్ కార్యనిర్వాహక సమితిని విస్తృతంచేయ తలపెట్టారు. మరో ఆరుగురు సభ్యులను సమితిలో నియమించారు. వీరిని "అదనపు సభ్యులు" అని వ్యవహరించే వారు. విస్తృత పరచిన సమితిలో పన్నెండు మంది సభ్యులుండేవారు. చట్టరీత్యా అటు వంటి పేరు లేక పోయినప్పటికీ ఈ సమితిని భారత శాసన నిర్మాణసమితి అని వ్యవహ రించే వారు. సభ్యులు నామినేట్ అయినవారో లేక అధికారరీత్యా సభ్యులయినవారో కావడంచేత ఈ సమితి ప్రాతినిధ్య సమితి కాదు. దీన్ని బ్రిటిష్ పార్లమెంటుతో పోల్చ డానికి వీలులేదు. తమకు అందచేసిన ఉత్తర్వులను శాసనాలు చేయడమే దీని పని. అంతే కాక ఈ సమితి ఆమోదించిన ఏ శాసనాన్నీ గవర్నర్ జనరల్ ఆమోదించేవరకూ అమలు జరుపడానికి వీలు లేదు.

## 1861వ సంవత్సరపు భారతీయ సమితుల చట్టం

భారతశాసన నిర్మాణసమితి బ్రిటిష్ పార్లమెంటును పోలివుండాలని తలపెట్టలేదు. అయినా ఇది అనుసరించిన పద్ధతుల మూలంగా త్వరలో ఒక చర్చావేదికగానూ చిన్న పార్లమెంటుగానూ రూపొందడంలో కార్యనిర్వాహక ప్రభుత్వానికి ఇబ్బందిగా తయారైంది. భారతీయులకు బ్రిటిష్ అధికారులకూ పడడంలేదని తిరుగుబాటు సందర్భముగా తేలకి పోవడంతో భారతీయుల్లోని పైతరగతివారిని ప్రభుత్వంలో చేర్చుకుని వారిని తమకు అను కూలంగా చేసుకోవడం అవసరమని బ్రిటిష్ అధికార్లు భావించారు. వారిదృష్టి ముఖ్యంగా జమీందార్లు, భూస్వాములు, వ్యాపారులు, సంస్థానాధీసుల మీద పడింది.

భారతదేశంలోకూడా రాజకీయ చైతన్యం పెరుగుతూవచ్చింది. సమితుల్లో అనధికార్లను చేర్చుకోవలసిందని కోరడం ప్రారంభించారు. 1852 లో కలకత్తాకు చెందిన బ్రిటిష్ భారతసంఘం, బ్రిటిష్ పార్లమెంటుకు పెట్టుకున్న అర్జీలో, "ప్రజలకు ప్రాతినిధ్యముండే శాసనసభను భారతదేశంలో ఏర్పాటు చేయవలసిందనీ, ఆవిధంగా ఏర్పాటైన సమితి ప్రజల మనోభావాలను కొంత మేరకు ప్రతిబింబిస్తుందనీ ప్రజల్లోకూడా అభావం ఏర్పడు తుందనీ అభ్యర్థించింది. [1] అదే సంవత్సరం బొంబాయి సంఘమూ, మద్రాసు వాసుల సంఘమూకూడా ఇదే విధంగాకోరుతూ పార్లమెంటుకు మహజర్లు పంపుకున్నాయి.

భారత శాసన నిర్మాణసమితిలో భారతీయులకు సభ్యత్వమివ్వక పోవడం తిరుగుబాటుకు ప్రధానకారణాల్లో ఒకటనీ భారతదేశంలో బ్రిటిష్ పాలన ప్రయోజనాలదృష్ట్యా ఈ పొర పాటును సవరించుకోవడం తప్పనిసరిఅనీ సయ్యద్ అహ్మద్ ఖాన్ "భారత తిరుగుబాటు" అన్న తమ పుస్తకంలో వక్కాణించారు. 2 ఈ పరిణామాలన్నిటి దృష్ట్యా, భారతదేశానికి సంబంధించిన మంత్రి సర్ ఛార్లెస్‌వుడ్ భారతసమితులను పునర్వ్యవస్థీకరించే వుద్దేశ్య ముతో బ్రిటిష్ పార్లమెంటులో ఒక బిల్లును ప్రవేశపెట్టారు. ఇదే, 1861 వ సంవత్సరం ఆగస్టు ఒకటవ తేదీన భారతీయసమితుల చట్టంగా అమల్లోకి వచ్చింది.

బిల్లును ప్రవేశపెడుతూ ఉడ్, ప్రభుత్వం ఈ చర్య ఎందుకు తీసుకోవలసి వచ్చిందో వివరించారు. అనుకున్నదానికి విరుద్ధంగా ప్రస్తుత శాసన నిర్మాణసమితి చిన్నరకం పార్ల మెంటుగా తయారు కావడంతో గవర్నర్ జనరల్ యొక్క కార్యనిర్వాహక సమితి పనికి అవరోధంగా వుంది. దీన్ని సవరించవలసివుంది. మరొక అంశం, శాసనాలను రూపొం దించే పనితో కొంతమంది భారతీయులకు సంబంధం ఉండేట్టు చూడటం వాంఛనీయమే అయినా, భారతదేశంలో ప్రాతినిధ్య సభవంటి దాన్ని ఏర్పాటు చేయడం అన్నది అసంభవం. 3

దీనిదృష్ట్యా 1861 వ సంవత్సరపు భారతీయసమితుల చట్టం ప్రకారం గవర్నర్ జనరల్ యొక్క కార్యనిర్వాహక సమితిలో అయిదుగురు సభ్యులుంటారు. వీరిలో ముగ్గురిని విదేశాంగ మంత్రీ ఇద్దరిని ప్రభుత్వమూ నియమిస్తారు. సైన్యాధిపతిని అసా ధారణ సభ్యులుగా నియమించేఅధికారం విదేశాంగ మంత్రికి ఇదివరకటి మోస్తరుగానే ఇప్పుడుకూడావుంది. సమితి ఏరాష్ట్రంలో సమావేశమైతే ఆరాష్ట్రపు గవర్నర్ ప్రత్యేక సభ్యులుగా పాల్గొనవచ్చు.

శాసన కార్యకలాపాలకోసం గవర్నర్ జనరల్ సమితిలో అదనపుసభ్యులను నామి నేట్ చేయవచ్చు. వీరిసంఖ్య, ఆరుకు తక్కువకాకుండానూ పన్నెండుకు ఎక్కువకాకుం డాను ఉంటుంది. నామినేట్‌అయిన సభ్యుల్లో సగానికి తక్కువ కాకుండా అనధికారులుగా వుంటారు. యురోపియన్లుగాని మరెవరైనాగాని. ఈ అదనపు సభ్యులు శాసనాలనూ ఉత్తర్వులనూ రూపొందించేందుకు మాత్రమే ఇటువంటి వాటికోసరం జరిగే సమా వేశాల్లో తప్ప, వీరు ఇతర సమావేశాల్లో పాల్గొనరాదు. ఓటుచేయరాదు. వీరు, రెండేండ్లు ఈపదవిలో వుంటారు. అదనపు సభ్యులను నామినేట్ చేసేహక్కేకాక గవ ర్నర్ జనరల్‌కు విస్తృతమైన ఈసమితి కార్యకలాపాలను నిర్వహించేందుకు నిబంధ నలను విధించే అధికారంకూడ వుంది. సమితి సమావేశాలకు ఆయనే అధ్యక్షతవహిస్తారు. సమితిలో ప్రవేశపెట్టిన బిల్లులను పరిశీలించి వాటిని ఆమోదించడం తప్ప శాసన నిర్మాణ

సమితికి మరొకపనిలేదు. భారతదేశంలో ప్రజల నిధులు, మతమూ మత పరమైన హక్కులు, భారతదేశంలో రాణి ప్రజలను ఉపయోగించుకోవడం, సైనిక - నౌకాదళాల నిర్వహణ క్రమశిక్షణ, విదేశరాజులూ ప్రభుత్వాలతో ప్రభుత్వ సంబంధాలు - మొదలైన వాటిగురించి సమితిలోని సభ్యులెవరైనా ఒక శాసనాన్ని ప్రవేశపెట్ట దలచినట్లైతే ముందుగా గవర్నర్ జనరల్ అనుమతి తీసుకోవలసివుంటుంది. ఏదైనా చట్టం చెల్లడానికి గవర్నర్ జనరల్ ఆమోదం అవసరం. గవర్నర్ జనరల్‌కు ఏదైనా ఉత్తర్వును జారీచేసి ఆరునెలలు అమలుపరచే అధికారంకూడా వుంది. అత్యవసర పరిస్థితిని ప్రకటించే అధికారంకూడా ఆయనకు వుంది. ఒకమాటలో చెప్పాలంటే గవర్నర్ జనరల్ అధికారాలను మరింత పటిష్టంచేశారు. కేవలం సలహాలుమాత్రం ఇవ్వకలిగి, శాసనాలను రూపొందించడం కోసం ఏర్పాటైన శాసననిర్మాణసమితి, గవర్నర్ జనరల్‌ను ఏమీ చేయలేదు. వుడ్ ఒక ఏడాది తర్వాత ఎల్‌గిన్‌కు రాస్తూ "మన ప్రభుత్వపు చెప్పు చేతల్లో పాలించే నిరంకుశ ప్రభుత్వమొక్కటే ప్రస్తుతం భారతదేశంలో నెలకొనివున్న పరిస్థితులకు తగినది" అని పేర్కొన్నారు. [4]

## 1861వ సంవత్సరపు భారతీయ సమితుల చట్టం అమలు

1857 వ సంవత్సరములో జరిగిన తిరుగుబాటు సందర్భముగా బ్రిటిష్ ప్రభుత్వానికి సహాయంగావున్న భారతసంస్థానాధీశులనూ వారి మంత్రులనూ సమితిసభ్యులుగా నామినేట్ చేయాలని గవర్నర్ జనరల్ ఆదిలో చాలాఆసక్తి కనబరిచారు. దాని ఫలితంగా పటియాలా మహారాజు సర్ నరేంద్రసింగ్, గ్వాలియర్‌కు చెందిన రాజా దినకర్‌రావ్ రఘునాథ్, రాజా దేవ నారాయణ్‌సింగ్ బహాదుర్ భారతశాసన నిర్మాణసమితిలో సభ్యులుగా నామినేట్ అయారు. సమితిలో సభ్యత్వం పొందిన మొదటి భారతీయులు వీరే. ఆ తరువాత భూస్వాములు సభ్యత్వం పొందారు. 1862 – 1892 సంవత్సరాల మధ్య నలభైఅయిదు మంది భారతీయులు భారతశాసన నిర్మాణసమితిలో అదనపు సభ్యులుగా నామినేట్ అయినట్టు సంఖ్యావివరాలబట్టి తెలుస్తోంది. వీరిలో ఏడుగురు సంస్థానాధీశులు, ఇరవైఅయిదు మంది సంపన్న జమీందారీ కుటుంబాలకు చెందినవారు. [5] రిప్పన్ వైస్‌రాయ్‌గా వున్న కాలంలో, సంస్థానాధీశులనూ పెద్ద జమీందారులనూ నామినేట్ చేసేపద్ధతిని సడలించారు. వాణిజ్యవేత్త అయిన దుర్గాచరణ్‌లా, స్కూళ్ళ ఇనస్పెక్టర్ అయిన రాజా శివప్రసాద్, ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ అయిన సయ్యద్ అమీర్ అలీ వంటి వారిని నామినేట్ చేశారు. ఆకాలంలో సమితిలో బెంగాల్ శిస్తు బిల్లుమీద చర్చ జరుగుతూన్నందు వల్ల బెంగాల్ జమీందార్ల తరఫున ఎవరిపేరునైనా సూచించ వలసిందని రిప్పన్ బ్రిటిష్ ఇండియా సంఘాన్ని కోరారుకూడా. బ్రిటిష్ ఇండియాసంఘం 'హిందూ పేట్రియట్' సంపాదకు

దైన క్రిస్టోదాస్ పాల్ పేరును శిఫార్సు చేసింది. రిప్పన్, ఈయన్ను 1883లో సమితిలో సభ్యులుగా నామినేట్ చేశారు. ఆయన మరణించిన తర్వాత ఆయన స్థానంలో ప్యారే మోహన్ ముఖర్జీ నామినేట్ అయారు.[6]

1872 - 92 మధ్య సయ్యద్ అహ్మద్ ఖాన్, వి. యన్. మాండలిక్, కి. యల్. నూల్కర్, రాష్ బిహారీ ఘోష్ వంటి ప్రముఖ ప్రజానాయకులూ మేధావులూ సమితికి నామినేట్ అయ్యారు.

1861 — 92 మధ్యకాలంలో రాజకీయంగా చాలాముఖ్యమైన రెండుబిల్లులను సమితిలో ప్రవేశపెట్టారు. ఇవి: దేశీయ భాషా పత్రికల బిల్లు ( 1878 ), శిక్షాస్మృతి సవరణ ( ఇల్‌బర్ట్ ) బిల్లు ( 1883-4 ) మొదటి బిల్లు ఉద్దేశ్యం — ఆసమయంలో ప్రభుత్వాన్ని బాగా విమర్శిస్తున్న దేశీయభాషా పత్రికల నోరు మూయడం. ఆసమయంలో సమితిలోని ఒకేఒక భారతీయ సభ్యుడైన మహారాజా జె యం. టాగోర్ తక్కువ తరగతికి చెందిన దేశీయభాషా పత్రికలుకొన్ని సరిగా వ్యవహరించ నందుకు విచారం వ్యక్తపరుస్తూ, బిల్లును సమర్థించారు. ఇల్‌బర్ట్ బిల్లు మొదటి దానికంటె మరింత వివాదాస్పదమైంది. భారతదేశంలోని యూరోపియన్లు దీన్ని వ్యతిరేకించారు. తమమీద యూరోపియన్ మేజిస్ట్రేట్‌లూ న్యాయమూర్తులూ మాత్రమే విచారణ జరిపే ప్రత్యేక సౌకర్యం ఈ బిల్లువల్ల పోతుందని వీరు ఆందోళన చెందారు. శాసన నిర్మాణ సమితిలో సభ్యులైన మహారాజా జె. యమ్. టాగోర్, క్రిస్టోదాస్‌పాల్ వంటి భారతీయులు మాత్రం ఈ బిల్లును ప్రవేశపెట్టినందుకు న్యాయశాఖసభ్యుణ్ణి ఎంతో కృతజ్ఞతాపూర్వకంగా అభినందించారు. ఆతర్వాత, ప్రభుత్వం యూరోపియన్ల ఒత్తిడికి లోనై బిల్లును సవరించేందుకు అంగీకరించింది. యూరోపియన్లను జిల్లామేజిస్ట్రేటు ఎదుటగాని. సెషన్స్ జడ్జి ఎదుటగాని హాజరు పరచినప్పుడు, వారు, కోర్టువారు పంచాయతీవంటిదాన్ని నియమించి దానిచేత విచారణ జరిపించ వలసిందని కోరవచ్చునంటూ బిల్లును సవరించారు. అమీర్ అలీ ఈ సందర్భముగా, 1858లో రాణిచేసిన ప్రకటనను సభ్యులకు గుర్తు చేశారు. ప్రజలందరికీ సమాన న్యాయంచేకూరుతుందని రాణి తమ ప్రకటనలో వాగ్దానం చేశారు. సవరణపట్ల క్రిస్టోదాస్‌పాల్ విచారం వ్యక్తపరచారు. దర్భంగ మహారాజా అంతకంటె ధైర్యంగా మాట్లాడుతూ కోర్టువారు పంచాయతీవంటిదానిచేత విచారణ జరిపించాలని కోరేహక్కు భారత బ్రిటిష్ ప్రజలకు కూడా కల్పించాలని కోరారు. కాని, బిల్లు, సవరణలతోపాటు శాసనమైంది. భారతదేశంలోని బ్రిటిష్‌జాతి వారు వ్యతిరేకించినట్లయితే భారతప్రభుత్వం కొద్దిపాటి పాలనా సంస్కరణలను కూడ చేసే స్థితిలోలేదని దీనివల్ల తేట తెల్లమైంది.

భారతీయ సభ్యులు ద్రవ్య - ఆర్థిక - సాంఘిక చర్యల్లోకూడా ఆసక్తి చూపారు. భారీగా పన్నులను విధించడాన్ని వీరు విమర్శించారు. కాని మహారాజాలు - జమీందార్లు - వ్యాపారస్తులు ఉప్పుపన్నును సమర్థించారు.[7] సయ్యద్ అహ్మద్‌ఖాన్, దక్కన్ వ్యవసాయదారుల సహాయబిల్లు విషయంలోనూ నిర్బంధటీకాబిల్లు విషయంలోనూ శ్రద్ధవహించారు. నిర్బంధటీకాబిల్లును ఆయనే తయారు చేశారు. బిల్లులోని ఏఅంశమూ ప్రజలను నొప్పించకుండా ఉండేట్టు ఎంతో శ్రద్ధవహించి అన్ని అంశాలనూ వీలైనంత సరళంగా రూపొందించారు. కాని, ఎన్నికల సిద్ధాంతాన్ని వ్యతిరేకించడంలో మాత్రం ఆయన చలించలేదు. స్థానిక బోర్డులు మ్యునిసిపాలిటీల విషయంలోకూడా ఆయన ఈ సిద్ధాంతాన్ని వ్యతిరేకించారు.[8]

జాతీయకాంగ్రెస్ అవతరణ:

సమితులను విస్తృతపరచాలన్న కోరిక

1885లో అవతరించినప్పటి నుంచీ భారతజాతీయకాంగ్రెస్, ఉన్నత శాసన నిర్మాణ సమితిని స్థానిక శాసన సమితులనూ విస్తృతపరచాలని కోరుతూ వచ్చింది. తగినంత మంది ఎన్నికైన సభ్యులను సమితుల్లో చేర్చాలని కాంగ్రెస్ కోరుతూవచ్చింది. పరోక్ష ఎన్నికల సిద్ధాంతానికి మాత్రం కాంగ్రెస్ అంగీకరించింది. అంటే మంనిసిపాలిటీలు, స్థానిక బోర్డులు, మొదలైనవి స్థానిక శాసనసమితులకు సభ్యులను ఎన్నుకుంటాయి. స్థానిక శాసనసమితులు ఉన్నత శాసననిర్మాణసమితికి సభ్యులను ఎన్నుకుంటాయి. శాసన సమితుల విధులను పెంచాలనికూడా కాంగ్రెస్ కోరింది. అంటే బడ్జెట్ గురించి చర్చించే హక్కు ప్రశ్నించేహక్కు ఉండాలని కోరింది. సమితులు తీసుకునే నిర్ణయాలను త్రోసి రాజనేహక్కు ప్రభుత్వానికి ఉండవచ్చునని అంగీకరిస్తూనే తమ నిర్ణయాలను త్రోసి పుచ్చిన సందర్భాల్లో సమితుల్లోని ఎక్కువమంది సభ్యులు తమ అభిప్రాయాలలో కూడిన వినతిపత్రాలను సమర్పించినప్పుడు వాటిని అందుకుని పరిశీలించేందుకు కామన్సు సభకు అనుబంధంగా ఒక స్థాయీ సంఘం వుండాలని మాత్రం కాంగ్రెసు కోరింది.

భారతీయులు మొత్తంమీద ఈ సమితులను విమర్శిస్తూ ఉండేవారు. ఈసమితులకు నామినేట్ అయ్యే భారతీయులందరూ పైతరగతికి చెందినవారు. సంస్థానాధీశులూ జమీందార్లూ వ్యాపారస్తులూ వీరు, భారతీయుల ప్రతినిధులని చెప్పటానికి వీలులేదు. బ్రిటిష్ అధికార్లలో కొంతమందికికూడా ఈ సమితులపట్ల సదభిప్రాయం లేదు. "ఈ శాసనసమితులు ఆమోదించే శాసనాలు నిజంగా ప్రభుత్వ ఉత్తర్వులు అనిచెప్పడంలో తప్పేమీ ఉండబోదు " అని లార్డ్ మేక్ డోనల్ 1888లో వ్యాఖ్యానించారు.[9] లండన్‌లోని భారతీయ సమితిని రదుచేయాలని కూడా భారత జాతీయ కాంగ్రెస్ కోరింది,

## 1892 వ సంవత్సరపు భారతీయ సమితుల చట్టం

సమితివిషయంలో భారతీయుల అభిప్రాయాల తీవ్రతను అసలు పట్టించు కోకుండా ఉండే వీలు లేకపోయింది. కాలక్రమేణా ఉప విదేశాంగ మంత్రి ( కర్జన్ ) కామన్స్ సభలో ఒక బిల్లును ప్రవేశపెట్టారు. ఇది, 1892లో భారతీయ సమితులచట్టంగా అమల్లోకి వచ్చింది. సమితుల్లో సభ్యుల సంఖ్యను పెంచడం బడ్జెట్‌ను విమర్శించేందుకూ ప్రశ్నలడిగేందుకూ సభ్యులకు హక్కు ఇవ్వడం - ఈ బిల్లు ప్రధాన ఉద్దేశ్యాలు.

1892 వ సంవత్సరపు చట్టంప్రకారం, గవర్నర్ జనరల్ ఉన్నత శాసనసమితికి నామినేట్ చేసే సభ్యుల సంఖ్య పదికి తక్కువగానూ పదహారుకు ఎక్కువగానూ ఉండ రాదు. ఈ నామినేషన్లు ఎటువంటి పరిస్థితుల్లో చేసేదీ నిర్ణయించే అధికారం గవర్నర్ జనరల్‌కు ఆయన సమితికీ వుంటుంది. అయితే ఆయన ఈ నిబంధనలను భారతదేశానికి సంబంధించిన ఆయన సమితి ఆమోదంతో చేయవలసివుంటుంది. ఈ నిబంధనలను రూపొందించిన తర్వాత పదహారుగురు అదనపు సభ్యుల్లోనూ పదిమందికి మించకుండా అధికారేతరుల నుంచి నామినేట్ చేశారు. సమితిలో అధికారుల మెజారిటీని చెక్కు చెదరకుండా ఉంచేందుకే ఈ విధంగా చేశారు. అధికారేతర సభ్యుల్లో అయిదుగురిని, గవర్నర్ జనరల్ తిన్నగా నామినేట్ చేసేవారు. నలుగురిని. రాష్ట్రీయ సమితుల్లోని అధికారేత సభ్యుల శిఫార్సులమీదా, ఒకరిని కలకత్తా వాణిజ్యమండలి శిఫార్సుమీదా నామినేట్ చేసేవారు.

సమితిసభ్యులకు బడ్జెట్ మీద చర్చజరిపే హక్కు లభించింది కాని, ఓటుచేసేహక్కు లేదు. కొంతమేరకు ప్రశ్నలడిగే హక్కుకూడా సభ్యులకు లభించినది. గవర్నర్ జనరల్ కారణం తెలుపకుండానే ఏప్రశ్నకైనా అనుమతి నిరాకరించవచ్చు. అదీకాక, సమాధానం మీద చర్చ జరుపడానికి వీలులేదు.

1892 - 1909 సంవత్సరాలమధ్య, 1892 వ సంవత్సరపు భారతీయ సమితుల చట్టం, అమల్లోవున్నప్పుడు కొంతమంది ప్రముఖ కాంగ్రెస్‌నాయకులు. ఉన్నత శాసన నిర్మాణసమితిలో సభ్యులుగావున్నారు. వీరు ఫిరోజ్‌షా మెహ్‌తా, జి. కె. గోఖలే, రాష్ బిహారీ ఘోష్, జి. యం. చిత్నవీస్, పి. ఆనందాచార్లు, బిశ్వంభరనాద్, మొహమ్మద్ రహీమతుల్లా సయాని. వీరు సమితిలో తమకున్న పరిమితమైన అవకాశాలను పూర్తిగా వినియోగించుకొని రాజకీయ - ఆర్థిక—సాంఘిక రంగాల్లో భారతీయుల ఇబ్బందులను వెల్లడి చేసేవారు.

## కొత్తధోరణికి ఒరవడి పెట్టిన ఫిరోజ్‌షా మెహ్‌తా

సమితికి 1895 లో నామినేట్ అయిన ఫిరోజ్‌షా మెహతా భారతీయుల పట

ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరునూ విధానాలనూ ధైర్యంగా గట్టిగా విమర్శించడం ప్రారంభించి సమితి కార్యకలాపాల్లో నవచైతన్యాన్ని ప్రవేశపెట్టారు. ప్రభుత్వం 1861 వ సంవత్సరపు పోలీసుచట్టాన్ని సవరిస్తూ సమితిలో ఒక బిల్లును ప్రవేశపెట్టింది. కల్లోలంగాఉన్న ఒక జిల్లాలో అక్కడి ప్రజలను శిక్షించేందుకు పోలీసుదళాన్ని ఉంచి ఆ దళానికయే ఖర్చు నంతటినీ ఆప్రాంతంలోని ఒక వర్గపు ప్రజలనుంచిగాని, కొంత మంది వ్యక్తులనుంచిగాని, వసూలుచేసేందుకు వీలుగా ఈ సవరణబిల్లును ప్రవేశపెట్టారు. ఎవరైనా తమ ఆస్తి పాస్తులను చూసుకోకుండా మరొక చోటికి వెళ్ళినట్టయితే వారు ఆవిధంగా వెళ్ళిపోవడం ఆప్రాంతంలో అల్లర్లకు కారణమైందనిగాని దోహదమైందనికాని అధికార్లు భావించిన పక్షంలో ఆవిధంగా వెళ్ళిపోయినవారి దగ్గరనుంచి సొమ్ము వసూలు చేసే వీలుకూడా ఈ సవరణవల్ల కలిగింది. ఈసవరణ బిల్లువల్ల మేజిస్ట్రేట్లకు నిరంకుశ అధికారాలు ఇంకా చాలా లభించాయి. ఊరేగింపులమీద నిర్బంధాలు విధించడం ఇందులో ఒకటి.

ప్రజలను అణిచివేసేందుకు ఈబిల్లులో ఉద్దేశించిన అంశాలను ఫిరోజ్‌షా మెహతా గట్టిగా విమర్శించారు. కుండ పగులగొట్టినట్టు మాట్లాడుతూ ఆయన : " ప్రభువులవారికి మనవిచేసుకుంటున్నది ఏమనగా ఇంతకంటె సామ్రాజ్య వాదతత్వంతో కూడుకున్నదీ తిరోగామి అయినదీ దుర్వినియోగానికి వీలున్నదీ ప్రజల ధైర్యస్థైర్యాలను చెడగొట్టేదీ మరొకశాసనం ఉండబోదు. అధికార్లకు సామ్రాజ్యవాద శాసనాలంటే ఎంతో ప్రియం. ఇది అటువంటిదేనని స్పష్టంగా తెలుస్తూవుంది. నేరాలను అణిచివేసే సందర్భంలోనూ నేరాలు చేసిన వారిని శిక్షించే సందర్భములోనూ అమాయకులకు శిక్షపడకుండా వారిని బాధించకుండా ఉండేందుకు ఈ వ్యవహారమంతా న్యాయశాస్త్రపరంగా జరుగవలసిందేకాని తాము సమర్థులమూ నిజాయితీతోనూ చిత్తశుద్ధితోనూ వ్యవహరించేవారమూ అని విశ్వసించే వారు తమ అభిప్రాయాలకూ, తమ నైతిక సూత్రాలకూ అనుగుణంగా తీర్పుఇచ్చే అవ కాశం కల్పించరాదు ... అయితే ఇటువంటివారు, తమ హోదా అంతస్తులు కారణంగా కలిగి వుండే లోపాలనూ దురభిప్రాయాలనూ పక్షపాత వైఖరిని విడనాడి వ్యవహరించ గలరని అనుకోవడం అవివేకమే అవుతుంది".

ఫిరోజ్‌షా మెహతా ఈ విధంగా నిర్భయంగా మాట్లాడటం చూసి సమితిలోని అధికారపక్షం తొట్రుపడింది. ఆర్థికమంత్రి సర్ జేమ్స్‌ఉడ్ కోపోద్రిక్తులై ఫిరోజ్‌షా మెహతా ప్రారంభించిన ఈ 'క్రొత్త ధోరణి' ని విరసించారు. పాలనా నిర్వాహణ అధికారుల సామర్థ్యాన్నీ, నిజాయితీనీ గట్టిగా సమర్థిస్తూ ఆయన ఇలా అన్నారు.

"ఈ విమర్శతో నాకెటువంటి సంబంధమూలేదని మనవి చేసుకుంటున్నాను. ప్రభువుల వారి సమితిలోని ప్రతి సభ్యుడూ నాతో ఏకీభవిస్తాడని విశ్వసిస్తున్నాను. సమతి తన కార్యకలాపాలను ఏంతో ప్రశాంతంగా, హుందాగా నిర్వహిస్తుందని సంపాదించుకున్న పేరుప్రతిష్ఠలకు ఈవిమర్శ ఎంతో భంగకరమని నేనుభావిస్తున్నాను."11

ప్రభుత్వ అధికార్లకు ఇది బాగా తగిలిందని దీనివల్ల స్పష్టమవుతూవుంది. బిల్లులోని అణచివేసే అంశాలను తొలగించే ఉద్దేశ్యంతో ఫిరోజ్‌షా మెహతా, జి. ఆర్. చిత్నవీస్, దర్భంగ మహరాజా మరికొంత మంది భారతీయ సభ్యులు బిల్లుకు చాలా సవరణలు ప్రతిపాదించారు. అధికారపక్షం వీటిని తోసివేసింది. బిల్లును ఆమోదించారు.

రాస్ బిహారీ ఘోష్

ఆరోజుల్లో ఉన్నత శాసననిర్మాణసమితిలో ధ్రువతారమోస్తరుగా వెలిగిపోయిన మరొక వ్యక్తి రాస్‌బీహారీ ఘోష్. చక్కటి భాషనుపయోగిస్తూ వ్యంగదోరణిలో మాట్లాడేవారు. రాజద్రోహానికి సంబంధించిన బిల్లులూ - సుంకాలు — బడ్జెటు - శిక్ష - పౌరచట్టాలు — ప్రాథమిక విశ్వవిద్యాలయవిద్య మొదలైన విషయాల గురించి ఆయన సమితిలో మాట్లాడేవారు.

1894లో భారతీయ సుంకాల సవరణబిల్లు నొకదాన్ని ఉన్నత శాసన నిర్మాణసమితిలో ప్రవేశపెట్టారు. అనేకరకాల దిగుమతులమీద కస్టమ్స్ పన్ను విధించే ఉద్దేశ్యంతో ఈ బిల్లును రూపొందించారు. కాని జవుళివస్త్రాలు - నూలు - దారం - వీటిమీద మాత్రం సుంకం ఉండదు. ఆర్థిక ఇబ్బందులవల్ల పన్నులు విధిస్తున్నట్లు ఆర్థికమంత్రి చెబుతున్నప్పటికీ జవుళి వస్త్రాలమీద విధించక పోవడం ఆశ్చర్యకరంగా వుందని అంటూ ఘోష్, లాంకషైర్, మాంచెస్టర్ ప్రాంతాలను సంతోష పరిచేందుకు బహుశ ఈ విధంగా చేసి వుండవచ్చునని పేర్కొన్నారు. ఆయన 1894 మార్చి 10 వ తేదీన సమితిలో ఇలా అన్నారు. 12

" అయ్యో ఇవేళ మాంచెస్టర్ అయింది, రేపు న్యూకాసిల్ కావచ్చు, ఆ తర్వాత బర్మింగ్ హామ్ అవుతుంది. ఈ విధంగా కొనసాగి ఒకనాటికి పన్నులు విధించేందుకు చేపలూ గవ్వలూ మిగులుతాయి. "

1905 లో బెంగాల్ విభజన తర్వాత దేశంలో ముఖ్యంగా బెంగాల్‌లో ఒక శక్తివంత ప్రజా ఉద్యమం ప్రారంభమైంది. ఈ జాతీయ ఉద్యమాన్ని అణిచివేసేందుకు మరికొన్ని అధికారాలు చేపట్టడం అవసరమని ప్రభుత్వం భావించింది. దీనికిగాను 1907లో ఉన్నత శాసననిర్మాణసమితిలో రాజద్రోహానికి దారితీసే సమావేశాలను అరికట్టే బిల్లును ప్రవేశపెట్టారు. ఈ బిల్లును వెంటనే ఆమోదించాలని ప్రభుత్వం ఎంతో గట్టిగా అభి

ప్రాయపడింది. మామూలుగా సమితి సిమ్లాలో జరిపే సమావేశాల్లో ఎటువంటి ముఖ్యమైన శాసనాన్ని ఆమోదించే అలవాటు లేదు. కాని ఈ బిల్లువిషయంలో మాత్రం దీనికి వ్యతిరేకంగానే జరిగింది. 1907 నవంబరు ఒకటవ తేదీన రాస్‌బిహారీ ఘోష్ మాట్లాడుతూ ఈ బిల్లును ఆమోదించవలసిన అవసరాన్నే మొదట ప్రశ్నించారు. ఆతర్వాత ప్రభుత్వం మీద ఈవిధంగా విరుచుకుపడ్డారు.

> "పరిస్థితి ఏ మాత్రమూ ప్రమాదకరంగా లేదని మరొకసారి చెప్తున్నాను. ప్రమాదం ఎక్కడ సంభవిస్తుందో అని దానికోసం అనుక్షణమూ అన్వేషించడం నిజమైన రాజనీతిజ్ఞత లక్షణం కాదు. నా అభిప్రాయం తప్పేకావచ్చు, పరిస్థితి నిజంగా విషమం గానే వుండవచ్చు. దానివల్ల ఏంరుజువవుతూవుంది. ఈదేశంలో పాలిస్తూ వున్న ప్రభుత్వం కొంత మంది అనుకుంటూవున్నట్లు ఉత్తమ శ్రేణికి చెందినదికాదని అందరికీ స్పష్టంగా తెలుస్తూవుంది. ఎవరైనా ఇది గ్రహించలేదు అంటే వారిలో ఏదో పెద్దలోపం ఉందన్న మాట"[13]

## గోపాలకృష్ణ గోఖలే : ప్రతిపక్ష నాయకుడు

గోఖలే 1901 డిశంబరులో ఉన్నత శాసననిర్మాణసమితి సభ్యులయారు. అప్పటి నుంచీ, 1892 వ సంవత్సరపు భారతీయసమితుల చట్టం వ్యవధి పూర్తయేవరకూ అంటే 1909 వరకూ ఆతర్వాత కొన్ని సంవత్సరాలుకూడ గోఖలే శాసన నిర్మాణసమితిలో ప్రముఖవ్యక్తులలో ఒకరుగా ఉండేవారు. ఆయన్ను ప్రతిపక్షనాయకుడు అని పిలిచేవారు. అయితే ఇది తనకు సరైన నామధేయంకాదని గోఖలే అభిప్రాయపడ్డారు. భారత దేశంలో రాజ్యాంగ వ్యవస్థ తీరు తెన్నుల దృష్ట్యానూ, తాము ఎల్లప్పుడూ ప్రతిపక్షంగా వ్యవహరించక పోవడంవల్లా ఆయన ఈవిధంగా అభిప్రాయపడ్డారు.

1905 వ సంవత్సరం బనారెస్‌లో జరిగిన భారతజాతీయ కాంగ్రెసుకు గోఖలే అధ్యక్షత వహించారు, ఆమరణాంతం జాతీయఉద్యమంలో ప్రముఖుల్లో ఒకరుగా వున్నారు. ఆయన గొప్ప మేధావికూడా. ఆర్థికవిషయాల్లో నిపుణుడుగా గణుతికెక్కాడు. ఆయన మాట్లాడేటప్పుడు ఎంతో మృదువుగా మాట్లాడేవారు. అయినా తాము చెప్పేది ఎదుటివారికి నచ్చేట్టు హృదయానికి హత్తుకునేట్టు చెప్పేవారు. ఉన్నత శాసన నిర్మాణసమితిలో ఆయన చేసిన ఉపన్యాసాల్లో ఈ లక్షణాలన్నీ ప్రస్ఫుటించేవి.

సమితిలో మాట్లాడుతూ గోఖలే బడ్జెటులో మిగులువల్ల భారతీయ ఆర్థికవ్యవస్థ చక్కగా వున్నట్టు తెలుస్తూవుందన్న అధికార్ల వాదనను ఖండించారు. సంఖ్యావివరాలు ఆధారంగా ఆయన భారతదేశంలో పేదరికం నానాటికీ పెరుగుతూవుందని నిరూపించారు. ప్రభుత్వం

సైన్యానికి ఎక్కువ ఖర్చు పెట్టడం, పన్నులు భారీగా విధించడం, జవుళివస్త్రాలు మొదలైన దేశంలోని పరిశ్రమలమీద ఎక్సైజు సుంకాలు విధించడం, కర్షకులకు అవసరమైన సేద్యపునీటిసౌకర్యాలు కల్పించక పోవడం — ఇవే భారతదేశంలో పేదరికానికి కారణాలని గోఖలే పేర్కొన్నారు. 1903 వ సంవత్సరం మార్చి ఇరవై అయిదవ తేదీన బడ్జెటు ఉపన్యాసంలో ఆయన ఇలా అన్నారు.

"ప్రస్తుతం నెలకొనివున్న పరిస్థితుల్లో 'భారతీయ ఆర్థిక వ్యవస్థ' పూర్తిగా సైనిక ప్రయోజనాల దయాదాక్షిణ్యాలపై ఆధారపడివుంది. మన ఆదాయాలను ఎక్కువ మొత్తంలో సైనిక కార్యకలాపాలకు కేటాయించడం కొన సాగినంత కాలం ప్రజల ఆర్థిక స్థితిగతులను మెరుగు పరచేందుకుగాని వారిబుద్ధి వికాసానికి కృషి చేసేందుకు గాని ప్రభుత్వం తగిన చర్యలు తీసుకో జాలదు." 14

ప్రజల స్థితిగతులను మెరుగుపరచేందుకు, వారికి కొంత సహాయంచేసేందుకు. ఉప్పు పన్నును మొదట తగ్గించి క్రమేణా పూర్తిగా తొలగించాలనీ జవుళి సరుకులమీద ఎక్సైజ్ సుంకాన్ని తొలగించాలనీ భూమిశిస్తును తగ్గించాలనీ గోఖలే ఉద్ఘాటించారు. ప్రాథమిక విద్యను ఉచితం చేయాలని కోరారు. కర్మాగారాల్లో పనిచేసే వారిపిల్లలకు చదువు చెప్పించే బాధ్యతను కర్మాగారాల యజమానులు వహించేట్లు చూడాలని సూచించారు. 1911 వ సంవత్సరం మార్చి 21 వ తేదీన ఉన్నత శాసన నిర్మాణసమితిలో ఈవిధంగా చెప్పారు.

"ఈ విధంగా చేయడం న్యాయం. ఎందువల్ల ననగా కర్మాగారం యజమానులు పిల్లల నుపయోగించి డబ్బు చేసుకుంటున్నారు. పిల్లల తల్లిదండ్రుల ద్వారాకూడా డబ్బు చేసుకుంటున్నారు. అదీకాక, కర్మాగారాలలో పనివల్ల, పిల్లల తల్లిదండ్రులు తమ పిల్లలచదువు విషయాలలోగాని, ఇతర విషయాలలోగాని తగినంతశ్రద్ధ వహించలేక పోతున్నారు".16

భారతదేశపు జాతీయ — ఆర్థిక అభివృద్ధికి పబ్లిక్ సర్వీసులలో భారతీయులను నియమించడం చాలా అవసరమని గోఖలే ఎల్లప్పుడూ అభిప్రాయపడ్డారు. ఈ విషయంలో చర్యతీసుకోవలసిందని ఆయన ప్రభుత్వాన్ని ఎప్పుడూ కోరుతూవచ్చారు. 1905 వ సంవత్సరం మార్చి 29 వ తేదీన ఆయన ఈవిధంగా అన్నారు.

"ఉన్నత పదవులకు భారతీయులను నియమించాలని కోరుతున్నామూ అంటే కేవలం ఉద్యోగాల కోసరంకాదు. అధికారంతోకూడిన పదవులూ, బాధ్యత—విశ్వాసంతో కూడిన పదవులూ అన్నీ ఒక వర్గపు గుత్తాధికారంగా తయారైనప్పుడు, ఆవర్గానికి చెందనిప్రజలు వారి హీనపరిస్థితి కారణంగా తాము తక్కువతరగతికి చెందినవారమన్న భావంతో కృంగి పోతున్నారు. వారిలో అత్యున్నతులు కూడా, అవసరానికి తగినట్టు తల ఒగ్గక తప్పడం

లేదు. అందువల్ల ఇది మా ఆత్మగౌరవానికీ దేశప్రతిష్ఠకూ సంబంధించిన విషయం. భవిష్యత్తులో మా అభివృద్ధి. ఈ సమస్యను తగినవిధంగా పరిష్కరించడంతో ముడిపడివుంది" 17

గోఖలే గొప్ప ఉదారవాది. ఆరోజులలో వీలున్నంత వరకూ ప్రజల హక్కులనూ స్వాతంత్ర్యాన్నీ పరిరక్షించేందుకు ఎప్పుడూ ప్రయత్నించేవాడు. 1903 వ సంవత్సరం డిశంబరులో ప్రభుత్వం సమితిలో అధికార రహస్యాల ( సవరణ ) బిల్లును ప్రవేశపెట్టి నపుడు గోఖలే గట్టిగా వ్యతిరేకించారు. ఈ బిల్లువల్ల పౌరవిషయాలను కూడా నౌకా - సైనిక విషయాలమోస్తరుగా పరిగణించే వీలు కలుగుతుంది. దీనివల్ల భారతీయపత్రికల స్వేచ్ఛ బాగా తగ్గిపోతుందని గోఖలే గుర్తించారు, ఆయన ఈ విధంగా అన్నారు.

"ఈదేశపు ప్రజలపట్ల ప్రభుత్వ బాధ్యత కేవలం నైతికం మాత్రమే: పశ్చిమ దేశాల్లో మోస్తరుగా చట్టపరమైనది కాదు ఒక వర్గపుప్రజలకు అనుకూలంగా దేశప్రజలందరి ప్రయోజనాలనూ త్యాగంచేయకుండా చూడగల యంత్రాంగం పశ్చిమ దేశాలలో మోస్తరుగా ఇక్కడలేదు. తిరుగులేని మితిలేని అధికారాన్ని కలిగివున్న అధికారులు వ్యవహరిస్తున్న తీరును భారత పత్రికలు నిలుపులేకుండా చేస్తున్న విమర్శ ఒక్కటేకొంత అపు దలగా పనిచేస్తున్నది. ప్రస్తుత పరిస్థితుల్లో పరిస్థితి విచారకరమైనదే అయినా బ్రిటిషు ప్రభుత్వం తీసుకోతగిన ఏకైకచర్య పత్రికలనోరు మూయడంకాదు. పార్లమెంటుచట్టాల ద్వారానూ, ప్రకటనల ద్వారానూ పదేపదే వాగ్దానంచేసినవాటిని చాటుమాటుగా తొలగించే ఉద్దేశ్యంతో విడుదలవుతున్న రహస్యపత్రాలను అరికట్టడం ప్రభుత్వం తీసుకొనవలసిన చర్య . . . . " 18

గోఖలే దౌర్జన్యవాదులనుగాని, తిరుగుబాటు ధోరణిని అవలంబించే ఇతరులను గాని సమర్థించలేదు. కాని 1908-9 లో తొమ్మండుగురు బెంగాలీ దేశభక్తులను దేశవ్యాప్తంగా హింసాకాండలో పాల్గొన్నారన్న ఆరోపణలమీద దేశం నుంచి బహిష్కరించినపుడుమాత్రం ఈ కేసులను పునః పరిశీలించవలసిందనీ వారిని వారి స్వగృహాలకు పంపవలసిందనీ శాసననిర్మాణ సమితిలో గట్టిగా అర్థించారు. ఈ విధంగా చేయడం వీరికి న్యాయం చేకూర్చడమేకాక ముందు రాబోవు సంస్కరణలకు శుభసూచనకూడా అవుతుందని ఆయన అభిప్రాయము. 19

## ఇంకా ఎక్కువ ప్రాతినిధ్యంకోసం అభ్యర్థన

భారత జాతీయ కాంగ్రెస్, 1892వ సంవత్సరపు భారతీయ సమితుల చట్టాన్ని ఆమోదించింది, కొంతవరకైనా మెరుగేకదా అన్న ఉద్దేశ్యంతో. కాని ఈ చట్టంలో ఎన్నికల సిద్ధాంతాన్ని అంగీకరించకపోవడాన్ని గుర్తించకపోలేదు. 1895 లో

సమితుల్లో ప్రశ్నించే హక్కు కలిగినందుకు కాంగ్రెసు సంతృప్తి వ్యక్తపరిచింది. ఇప్పుడు, సభ్యులు ప్రశ్నించేముందు తమ ప్రశ్నలను కొంత వివరించే హక్కుకూడా ఇవ్వాలని కోరింది. క్రమేణా, సమితులను విస్తృతపరచి ఆర్థికవిషయములమీద సభలో ఓటింగ్ జరగాలనికూడా కోరింది. కామన్సు సభలో భారతీయులకు ప్రాతినిధ్యం ఉండాలనీ, భారతదేశానికి సంబంధించిన మంత్రియొక్క సమితికీ, భారతదేశంలోని కార్యనిర్వాహక సమితులకూ భారతీయులను నియమించాలనీ కోరింది. స్వయం పాలనావ్యవస్థ డొమినియన్లలో మోస్తరుగానే భారతదేశంలోకూడా ఉండాలని 1906లో కోరింది. భారతదేశంలోని శాసనసమితుల్లో ప్రజలకు ఇంకా ఎక్కువ ప్రాతినిధ్యం ఉండేట్టూ దేశ ఆర్థిక - పాలనా నిర్వహణపై అధికారముండేట్టూ వాటిని విస్తృత పరచాలని కాంగ్రెస్ కోరింది.

ఈలోగా 1905లో బెంగాల్ విభజన దరిమిలా వేలాదిమంది యువజనులు భారత ప్రభుత్వానికి వ్యతిరేకంగా కార్యకలాపాలు ప్రారంభించారు. లోకమాన్య తిలక్, బిపిన్‌చంద్రపాల్, అరవిందఘోష్ మొదలైన వారి నాయకత్వంలో స్వదేశీ ఉద్యమం ఒకటి ప్రారంభమైంది. భారతదేశంలో బ్రిటిష్ పాలన ప్రజల విశ్వాసాన్ని కోల్పోయి నట్టు తేటతెల్లమైంది. 1905వ సంవత్సరంలో బెనారస్‌లో జరిగిన కాంగ్రెసు మహా సభకు అధ్యక్షతవహిస్తూ గోఖలే భారతదేశంలో బ్రిటిష్ పాలన ప్రారంభమైన తర్వాత మొదటిసారిగా, భారతీయుల్లోని అన్నివర్గాలవారూ తమకు జరుగుతున్న అన్యాయాన్ని ఎదుర్కోవాలన్న ప్రేరణతో రంగంలోకి ఒకటిగా దూకారనీ ఈ ప్రేరణవల్ల ప్రజలలో కలిగిన బ్రహ్మాండమైన సంచలనం దేశచరిత్రలో ఒక ముఖ్యఘట్టమనీ వర్ణించారు.

## మార్లే - మింటో సంస్కరణలు

ఇదే సమయంలో ఇంగ్లాండ్‌లోనూ, భారతదేశంలోను ముఖ్యమైన పరిణామాలు కొన్ని సంభవించాయి. 1905 వ సంవత్సరపు చివరిరోజుల్లో ప్రముఖ లిబరల్ అయిన జాన్ మోర్లే భారతదేశానికి సంబంధించిన మంత్రి అయారు. భారతదేశములో కూడా అగ్రస్థాయిలో మార్పు జరిగింది. 1905 నవంబరులో మింటో గవర్నరు జనరల్ అయారు. ఇంగ్లాండ్‌లో లిబరల్‌పార్టీ అధికారంలో వుండడం, మార్లే భారతదేశానికి సంబంధించిన మంత్రి కావడంతో రాజ్యాంగపరమైన సంస్కరణలను సాధించేందుకు మార్గం సుకరమైందని భారతీయులు ఎంతగానో ఆశించారు. ఈ ఆశల తోనే గోఖలే మార్లేతో చర్చలు జరిపేందుకు 1906 ఏప్రిల్‌లో ఇంగ్లాండుకు బయలు దేరివెళ్ళారు.

గోఖలే, మార్లేను చాలాసార్లు కలుసుకున్నారు. మార్లే, గోఖలే రాజకీయ శక్తిసామర్థ్యాలను అభినందించారు. కాని గోఖలేతో పూర్తిగా ఏకీభవించలేదు. గోఖలేతో తమ సంభాషణలగురించి ఆయన మింటోకు తెలియజేశారు. భారతదేశంలో రాజ్యాంగ సంస్కరణల గురించి ఆయన ఆ సమయంలో మింటోతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతున్నారు. 1906 ఆగస్టు రెండవతేదీ ఆయన మింటోకు ఈ విధంగా రాశారు.

"నిన్న నేను గోఖలేతో అయిదవసారి సమావేశం జరిపాను. ఇదే ఆఖరు కూడా. గోఖలేతో మంచిగా వుండడం మనకెంతో ఉపకరిస్తుంది. ఆయన రాజకీయవేత్త; పాలనా నిర్వహణలోని దార్ఢ్యతను గుర్తెరిగినవారు ; ప్రపంచ జ్ఞానమూ, క్రియాశీలత వున్నవాడు. భారతదేశం ఎప్పటికైనా స్వయంపాలనా ప్రతిపత్తిగల వలసరాజ్యంగా రూపొందాలన్న తన ఆశనూ, ఆశయాన్నీ స్పష్టంగా వెల్లడిచేశాడు. నేనుకూడా నా నమ్మకాన్ని దాపరికంలేకుండా - చాలాకాలం వరకూ మన తరం తర్వాతకూడా ఇది కలగామాత్రమే ఉండిపోతుందని స్పష్టంగా చెప్పాను." 20

భారతదేశంలో సంస్కరణల గురించి తమ అభిప్రాయాన్ని మార్లే ఏమాత్రం దాచుకోలేదు. 1907లో తమ బడ్జెట్ ఉపన్యాసంలో "చాలాకాలంవరకూ నా ఊహకు అందినంతవరకు భారతదేశం, నిరంకుశ వ్యక్తిగత ప్రభుత్వపాలనలో ఉండవలసిందే" నని స్పష్టంగా చెప్పారు. 1908వ సంవత్సరం డిసెంబరు 17వ తేదీ లార్డ్సు సభలో తమ సంస్కరణ ప్రతిపాదనలను ప్రవేశపెడుతూ, భారతదేశంలో పార్లమెంటరీ వ్యవస్థ ఏర్పాటు చేయాలని తాము ఆశించడంలేదని విదితం చేశారు. అంతేకాక భారతీయులగురించి బ్రయిట్ ఒకసారి చెప్పినదాన్ని లార్డ్సుకు గుర్తుచేశారు. "భారతీయులకు మనంఅంటే ఇష్టంలేదు. కాని ఒకవేళ మనం అక్కడినుంచి వైదొలగినట్టయితే ఏంచేయాలోమాత్రం వారికి తెలియదు. వారు అశరాలా గొఱ్ఱెలు, కాపరిలేని గొఱ్ఱెలు." 21

## భారతదేశంలో సంప్రదింపులు — నియోజక వర్గాలు

భారతదేశంలో ఏవో కొన్ని రాజ్యాంగసవరణలు రాబోతున్నట్టు ఇంగ్లాండులో మార్లే ఉపన్యాసాలవల్ల భారతదేశంలో మింటో ఉపన్యాసాలవల్ల తెలిసిపోయింది. తమ అభిప్రాయాలు మార్లేకు నచ్చేట్టుచేసేందుకు గోఖలే కృషిచేస్తున్నట్టు కూడా వెల్లడైంది. దీనితో భారతదేశంలోని ముస్లిం నాయకుల్లోని మతవాదులూ, అభివృద్ధి నిరోధకవర్గాలూ ఆందోళన చెందారు. కొంతమంది బ్రిటిష్ ఉన్నతాధికార్ల సహాయంతోనూ, అలీఘడ్ కళాశాల ప్రిన్సిపాల్ అయిన డబ్ల్యు. ఏ. వి. అర్చిబాల్డ్ సహాయంతోనూ 1906

అక్టోబరు ఒకటవతేదీన ఒక ప్రతినిధివర్గం, మింటోను కలుసుకుంది. "ప్రాతినిధ్య వ్యవస్థలో, ప్రాతినిధ్యం పరిమితమైనా, విస్తృతమైనా, సంఖ్యలో రష్యా తప్ప ఏదైనా ఒక యూరోపు దేశపు మొత్తం జనాభాకంటే ఎక్కువగాఉన్న ఒక వర్గం. దేశంలో ఒక ప్రధానభాగంగా తనకు తగిన గుర్తింపు ఉండాలని కోరడం న్యాయం. ప్రాతినిధ్యవ్యవస్థలో అది ప్రత్యక్షమైనది గాని, పరోక్షమైనదిగాని మహమ్మదీయులకు కల్పించే అంతస్తు వారి హోదా పలుకుబడికి భంగం కలిగించకుండా వారి రాజకీయ శక్తికి తగినట్టేకాకుండా రాజకీయంగా వారి ప్రాముఖ్యానికి, సార్వభౌమ్య రక్షణకు వారు చేస్తున్న సహాయపువిలువకూ తగినట్లు ఉండాలని మనవి చేసుకుంటున్నాము. ఈ సందర్భంగా నూరేళ్ళక్రితం మహమ్మదీయుల హోదా ఎటువంటిదో దృష్టిలో వుంచుకొనవలసిందని కూడా విన్నవించుకుంటున్నాం. అప్పటి సంప్రదాయాలను వారింకా విస్మరించలేదు." 22

మింటో ఇదంతా ఎంతో శ్రద్ధగా విన్నాడు. ఎంతో అవగాహనతో వారికి ఈ విధంగా హామీ ఇచ్చాడు.

"ఈ ఉపఖండంలోని మతవర్గాల విశ్వాసాలూ అలవాట్లను లెక్కలోకి తీసుకోకుండా వ్యక్తిగత వోటింగ్ హక్కును మంజూరు చేసినట్టయితే అది దుర్వినియోగమై విఫలమవుతుందని మీ మోస్తరుగానే నేనుకూడా గట్టిగా విశ్వసిస్తున్నాను. ఈ లోగా పాలనావ్యవస్థలో ఎటువంటి మార్పులుజరిగినా నాకు సంబంధించినంతవరకూ మహమ్మదీయుల రాజకీయ హక్కులకూ మతపరమైన వారి ప్రయోజనాలకూ రక్షణవుంటుందని నేను మీకు చెప్పగలను."23

ఈ "గొప్ప నాటకం" తర్వాత ప్రత్యేక వోటర్ల వ్యవస్థ మంజూరుకూ మార్లే మింటో సంస్కరణలతో కూడిన ఉత్తర్వులకూ అంతా సిద్ధమైంది. 1909 నవంబరు 15వ తేదీన చట్టం అమల్లోకి వచ్చింది.

## 1909వ సంవత్సరపు భారతీయసమితుల చట్టం.

1909 వ సంవత్సరపు భారతీయ సమితులచట్టం, మొట్టమొదటిసారిగా "చట్టాలను రూపొందించేందుకూ ఉత్తర్వులను జారీచేసేందుకు ఉద్దేశించిన సమితుల" ను "శాసన సమితులుగా" పేర్కొంది. ఈ చట్టం కింద వైస్‌రాయ్‌యొక్క శాసనసమితిలో అదనపు సభ్యులసంఖ్య — నామినేట్ అయినవారు ఎన్నికైనవారితో సహా — అరవైదాకా ఉండవచ్చు. సభ్యులను నామినేట్‌చేసే పద్ధతినీ, ఎన్నుకునే పద్ధతినీ ఇవి ఏ పరిస్థితులలో జరుగవలసినదీ నిర్దేశిస్తూ మార్గదర్శకసూత్రాలను గవర్నర్ జనరల్, ఆయన సమితీ, విదేశాంగ మంత్రీ ఆయన సమితీ ఆమోదంతో రూపొందించవలసివుంది.

అవిధంగా రూపొందించిన ఆదేశాలప్రకారం, ముప్ఫయి ముగ్గురిని నామినేట్ చేస్తారు, ఇరవైఏడుగురిని ఎన్నుకుంటారు. నామినేట్‌చేసే ముప్ఫయి ముగ్గురిలోనూ, ఇరవై ఎనమండుగురు అధికార్లు, ప్రత్యేక ప్రయోజనాల ప్రతినిధులుగా ఇద్దరు అనధికార్లు మరో ఇద్దరు ఉంటారు. ఈవిధంగా. ఒకవేళ సమితిలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటింగ్ జరిగినప్పటికీ ప్రభుత్వంలో మార్పుజరిగే అవకాశంఏమాత్రం ఉండకుండా గవర్నర్ జనరల్ యొక్క సమితిలో అధికార్లసంఖ్య ఎక్కువగా ఉండేట్టు జాగ్రత్తపడ్డారు కార్యనిర్వాహక ప్రభుత్వం ప్రతిపాదించే చర్యలను త్రోసిపుచ్చే అవకాశంకూడా లేకుండా వాటికి రక్షణ ఏర్పడింది. రాష్ట్ర సమితుల్లో మాత్రం, అధికారేతరులు ఎక్కువమంది ఉండాలన్న అభ్యర్దనకు అంగీకరించారు.

ఇరవై ఏడుగురు సభ్యుల ఎన్నికకోసం, సాధారణ నియోజకవర్గాలకుగాని ప్రాంతీయ ప్రాతినిధ్య పద్ధతికి గాని అంగీకరించలేదు సరికదా, సభ్యులను 'వర్గాలవారూ' 'మతాల వారు' ఎన్నుకొన్నారు కొంతమందితమ ప్రయోజనాలదృష్ట్యా కొంతమందిని ఎన్నుకున్నారు, రాష్ట్ర శాసన సమితులు కొందరిని ఎన్నుకొన్నాయి. ఇరవైఏడుగురు ఎన్నికైన సభ్యుల్లోనూ అయిదుగురిని ముస్లింలూ ఆరుగురిని భూస్వాములూ ఒకరిని ముస్లిం భూస్వాములూ ఒకరిని బెంగాల్ వాణిజ్యమండలులూ, బొంబాయి వాణిజ్య మండలులు ఒకరినీ, మిగిలిన పదముగ్గురినీ రాష్ట్రశాసనసమితుల్లోని అధికారేతరసభ్యులూ ఎన్నుకున్నారు. ముస్లింలు ఓటర్లలో ఒక ప్రత్యేక నియోజక వర్గంగా తయారైనట్లు దీనివల్ల స్పష్టంగా తేలిపోయింది. ముస్లింలను ఇతరనియోజకవర్గాలుకూడా ఎన్నుకోవచ్చు. సమితిలో ముస్లింల సంఖ్య అప్పటికీ తగినంత లేక పోయినట్లయితే నామినేషన్లద్వారా భర్తీచేయవలసిన ప్రత్యేక స్థానాలనుంచి వారికి మరికొన్ని కేటాయిస్తారు. 24

1909 వ సంవత్సరపు చట్టంక్రింద రూపొందించిన నిబంధనల ప్రకారం శాసన సమితుల విధులను ఎక్కువచేశారు. సభ్యులకు అనుబంధ ప్రశ్నలడిగే హక్కు సంక్రమించింది. ప్రజాబాహుళ్యానికి సంబంధించిన విషయాలనుగురించి కొన్ని నిబంధనలకు లోబడి సభ్యులు తీర్మానాలను ప్రతిపాదించవచ్చు, వాటిమీద ఓటింగ్‌కూడా జరుపవచ్చు. బడ్జెట్టు గురించి చర్చ జరిపే హక్కుకూడా ఎక్కువైంది. అంటే తీర్మానాలను ప్రతిపాదించవచ్చు. అదాయము — ఖర్చు వీటి మీద ఓటింగు జరుపవచ్చు. కొన్ని విషయాలమీదమాత్రం ఓటింగ్ జరుగడానికి వీలులేదని ప్రకటించారు. అంతేకాక గవర్నర్ — జనరల్ ప్రజా సంక్షేమం దృష్ట్యా ఏదైనాతీర్మానానికి అనుమతి నిరాకరించవచ్చు. శాసనసమితి తీసుకునే ఏనిర్ణయాన్నయినా వీటోచేసే హక్కుకూడా గవర్నర్ జనరల్ కుంది. ఉన్నత శాసన నిర్మాణసమితికి ఎన్నికైన సభ్యుల్లో ఎవరినైనా నియమించడానికి నిరాకరించే అధికారంకూడా గవర్నర్ జనరల్‌కు సంక్రమించింది.

ఒక మాటలో చెప్పాలంటే శాసనసమితి, పరిమాణంలోనూ విధులకు సంబంధించే విస్తృతమైంది. ఎన్నికల సిద్ధాంతాన్ని పరిమితంగా ప్రవేశపెట్టారు. ఈ సంస్కరణల మాటున ఉన్న ఉద్దేశ్యాన్ని మార్లే ఈ విధంగా వివరించారు.

" గవర్నర్ జనరల్ యొక్క సమితి శాసనాలను రూపొందించే సంస్థగానూ పాలనా నిర్వహణ సంస్థగానూ ప్రభుత్వం పట్లా సార్వభౌమ్య పార్లమెంటుపట్లా తనకున్న రాజ్యాంగ పరమైన విధులను నిరాటంకంగా నిర్వర్తించేందుకు వీలుగా ఏర్పాటవుతూ వుంటుంది, " 25.

## కాంగ్రెసు అభిప్రాయం

1907 లో సూరత్‌లో చీలికతర్వాత మితవాదులు పైచేయిగానున్న కాంగ్రెస్, 1908 లో సంస్కరణల ప్రతిపాదనపట్ల హృదయపూర్వకంగా సంతోషం వ్యక్తపరిచారు. కాని, చట్టం అమల్లోకివచ్చి నిబంధనలను రూపొందించిన తర్వాత కాంగ్రెస్ నాయకులు నిరుత్సాహం చెందారు. మతం ప్రాతిపదికగా ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటు చేయడాన్నీ, ఎన్నికలకు సంబంధించి ముస్లింలకూ ముస్లిమేతరులకూ మధ్యన అవమానకరమైన భేదం చూపించడాన్నీ ఎన్నికల్లో పోటీచేసే వ్యక్తిని అనర్హుడిగా ప్రకటించేనిరంకుశ అధికారం ప్రభుత్వానికి సంక్రమింపచేయడాన్నీ సంస్కరణల్లో అంతటా విద్యావంతులైన భారతీయులపట్ల అవిశ్వాసం ప్రస్ఫుటం కావటాన్ని నిరసిస్తూ కాంగ్రెసు 1909లో తీర్మానాలను ఆమోదించింది.(ఇంగ్లీషుభాషరాని వారిని సభ్యత్వానికి అనర్హులుగా చేయాలని కాంగ్రెసు 1922 లో ఆమోదించిన తీర్మానంలో కోరింది.) 27.

పండిత మదన్ మోహన్ మాలవ్యా 1909 లో లాహోర్ కాంగ్రెసులో అధ్యక్షోపన్యాసమిస్తూ సంస్కరణలను ముఖ్యంగా మత ప్రాతిపదికగా నియోజకవర్గాలను ఏర్పాటు చేయడాన్ని గట్టిగా విమర్శించారు. తిలక్‌కూడా 1916 లో బెల్‌గామ్‌లో తమ ఉపన్యాసంలో సంస్కరణలను అపహాస్యం చేశారు.

## గోఖలే వైఖరి

సంస్కరణలపట్ల గోఖలే వైఖరిలో ముఖ్యంగా ప్రత్యేక నియోజకవర్గాల విషయంలో కొంత గందరగోళం కనిపించింది. చట్టాన్ని ఆమోదించే ముందు ఆయన మార్లేను చాలాసార్లు కలుసుకున్నారు. ఆయనకు ఒక పత్రాన్నికూడా సమర్పించారు. అందువల్ల సంస్కరణలకు, ప్రత్యేక నియోజక వర్గానికి కూడా ఆయన కారణమని ఒక అభిప్రాయం ఏర్పడింది.

ముఖ్యమైన అల్పసంఖ్యాకవర్గాల వారందరికీ ప్రత్యేక నియోజకవర్గాలుండాలని గోఖలే కోరినమాట వాస్తవమే. అయితే ఒక్క ముస్లింలకేకాక అటువంటి అల్పసంఖ్యాకు లందరికీ ప్రత్యేక నియోజక వర్గాలుండాలని ఆయనకోరారు. అదీకాక ప్రాంతాలు ప్రాతిపదికగా సాధారణ ప్రాతినిధ్యం ఉండాలని కోరుతున్నపుడు ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పాటు చేయడంలో అర్థంలేదని ఆయన అన్నారు. ప్రత్యేకంగా విడి నియోజకవర్గాలు అంటే తమ అభిప్రాయం సాధారణ ఎన్నికల్లో తమకు తగిన ప్రాతినిధ్యం లభించలేదనిభావించే అల్పసంఖ్యాకులకు అనుబంధ ఎన్నికలను ఏర్పాటు చేయడమని గోఖలే వివరించారు. 1909 మార్చి 29 వ తేదీన ఉన్నత శాసన నిర్మాణ సమితిలో మాట్లాడుతూ గోఖలే తన అభిప్రాయాలను ఈ విధంగా వివరించారు.

"ప్రాంతాలు ప్రాతిపదికగా తగినన్ని స్థానాలకు ఎన్నికలు జరిపించడం సరైన మార్గమని నేను భావిస్తున్నాను. ఓటువేసే అర్హత వున్నవారందరూ కులమత భేదాలు లేకుండా ఈ ఎన్నికల్లో పాల్గొనే వీలు కల్పించాలి. ఆతర్వాత సంఖ్యా బలంవల్లగాని ఇతర త్రాగాని ముఖ్యమైన అల్పసంఖ్యాక వర్గాలవారికి అనుబంధ ఎన్నికలు జరిపించాలి. ఈఎన్నికలు. అల్పసంఖ్యాక వర్గాలకు చెందిన వారికి మాత్రమే పరిమితమై వుండాలి." 27

మార్లేసంస్కరణల ప్రతిపాదనలను ప్రకటించినపుడు గోఖలే ఎంతో ఉత్సాహపడ్డారు "ఇంతవరకు మనం బయటినుంచే ఆందోళన జరుపుతూ వచ్చాం. ఇకమీద పాలనావ్యవస్థతో సంబంధకలిగి బాధ్యతాయుతంగావ్యవహరించ వలసివుంటుంది." అనుకున్నారు. ఆయన. 28 కాని అసలుచట్టం అమల్లోకివచ్చి నిబంధనలను రూపొందించినప్పుడు గోఖలే కొద్దిగా విమర్శించారు. ఎన్నికల విషయంలో వివిధమతాల మధ్య చూపిన అన్యాయమైన వివక్షను తొలగించేందుకూ, అభ్యర్థులను అనర్హులను చేసే షరతులను తొలగించేదుకూ రాష్ట్రశాసనసమితులలో అనధికారసభ్యుల మెజారిటీ మరింత పటిష్ఠంగావుండేందుకూ నిబంధనల్లో చేయవలసిన మార్పులగురించి పరిశీలించి సూచించేందుకు ఒక సంఘాన్ని నియమించాలని సిఫార్సుచేస్తూ మాలవ్యా సార్వభౌమ్య శాసనసమితిలో ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టినప్పుడు తమ వైఖరిని స్పష్టం చేసేందుకు గోఖలేకు అవకాశం లభించింది. ఈసందర్భంగా మాట్లాడినపుడు గోఖలే భూస్వాములకూ ముస్లింలకూ ప్రత్యేక ప్రాతినిధ్యం ఇవ్వడాన్ని సమర్థించారు. 1892వ సంవత్సరపు భారతీయసమితుల చట్టప్రకారం సాధారణ నియోజకవర్గాలు మాత్రమే ఉండేవి. ఈ చట్టం అమలుజరిగినపుడు సమితుల్లోని హిందూసభ్యులకు మంచి బలం వచ్చింది "....ఇది మహమ్మదీయులకు బాధ కలిగించింది. ఏ జాతీయతకోసం అందరూ కృషిచేస్తున్నారో దానిదృష్ట్యా వారు అటువంటిస్థితిలో ఉండడం మంచిదని వారికి చెప్పినందువల్ల ఉపయోగం లేదు" ఇదంతా

ఆలోచించిన మీదట, ముస్లింలకు ప్రత్యేక ప్రాతినిధ్యమివ్వడం అవసరమూ మంచిదీ అని గోఖలే అభిప్రాయ పడ్డారు. కాని నిబంధనల ప్రకారం, సమితుల్లో ముస్లింలకు అవసరమైన దానికంటే ఎక్కువ ప్రాతినిధ్యం లభించింది. దీన్ని సరిదిద్దాలని గోఖలే అభిప్రాయపడ్డారు. ఓటుచేసేహక్కులోనూ అభ్యర్థుల అర్హతల్లోనూ ఉన్న భేదాల్లో చాలా అనవసరమైనవి. వీటన్నిటినీ తొలగించవలసివుంది. రాష్ట్ర శాసనసమితుల్లో ఎన్నికైన సభ్యులు ఎక్కువ సంఖ్యలో వున్నందువల్ల ప్రమాదమేమీ లేదనికూడా గోఖలే అభిప్రాయపడ్డారు. బెంగాలులో అది ప్రమాదకరం కానప్పుడు మిగతా రాష్ట్రాల్లో ఎందుకు కాదు ?

ఈ లోపాలన్నిటినీ ఎత్తిచూపినతర్వాత గోఖలే తమ తీర్మానం విషయమై పట్టు పట్టవద్దనీ, సమితిలో ముస్లింలకు ప్రత్యేక ప్రాతినిధ్యంగురించి ప్రశ్నించవద్దనీ, మాలవ్యాకు విజ్ఞప్తి చేశారు. ఆయన ఈవిధంగా అన్నారు.

"ఇక్కడ ఈ ప్రశ్నను లేవనెత్తినట్టయితే మరొకచోట మరొకరు గోవధగురించి, హిందూ - ముస్లింల కొట్లాటలగురించి అటువంటి ఇతర విషయాలను గురించి ప్రస్తావించవచ్చు. ఈ సమితిద్వారా రెండు మతాలమధ్యా మనం పెంపొందించాలని ఆశిస్తున్న సామరస్య పూరితమైన సహకారం, దేశమంతా వ్యాపించాలని ఆశిస్తున్న ఆ సహకారం అప్పుడు దురదృష్టవశాత్తు చెదిరిపోతుంది. గౌరవనీయులైన నామిత్రులు పండిత మదన మోహన మాలవ్యా కాంక్షిస్తున్న దానికికూడా ప్రమాదం సంభవిస్తుంది."29

తమ సహచరుల విమర్శకు గురవుతూ రాజ్యాంగ సంస్కరణ పట్ల అనుకూలంగానూ అవగాహనతోనూ ప్రవర్తించి నప్పటికీ గోఖలే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల విశ్వాసాన్ని చూరగొనలేక పోయారు. ఇంగ్లండులో ఆయన్ను కన్‌జర్‌వేటివ్‌లు ( సంప్రదాయ పాలకులు) 'హిందూకు ద్రోహి' అని వర్ణించేవారు. మింటో, మార్లేకు రాష్ట్ర అధికారులు సంస్కరణలను హర్షిస్తారని తాము ఎదురు చూడనే లేదని పేర్కొన్నారు. "గోఖలే ఇంత తెలివితక్కువగా ప్రవర్తిస్తాడనికూడా నేను అనుకోలేదు. అధికారుల్ని కాంగ్రెసును అణచి వేయడానికి తమనూ తమ మిత్రులనూ ప్రక్కకునెట్టి వేసేందుకు ప్రయత్నిస్తున్నారని గోఖలే మాట్లాడ్డంలో అర్థంలేదు". గోఖలే మాటలను అంతగా పట్టించుకోవద్దని మింటో హెచ్చరిక చేయడం మార్లేకు నవ్వుపుట్టించింది. ఈ విషయంలో భయపడవద్దని ఆయన మింటోకు హామీ ఇచ్చారు. "నేనెప్పుడూ జాగ్రత్తగానే ఉంటాను. జన్మతః స్కాట్‌లు ఎవరినీ సులభంగా నమ్మరు" అని ఆయన మింటోకు సమాధానం చెప్పారు. 30

## తుఫానుకు ముందు ప్రశాంతత ( 1910 - 1917 )

1909 వ సంవత్సరపు భారతీయ సమితుల చట్టం అమలు జరిగిన కాలంలో అంటే

1910 నుంచి 1920 వరకూ అనేక పరిణామాలు జరిగాయి. జాతీయ ఉద్యమంలో 1916 వరకూ అతివాదులూ మితవాదులమధ్య చీలిక ఏర్పడింది. అందువల్ల రాజకీయరంగం కొంతమేరకు మందకొడిగా వుంది. సార్వభౌమ్య శాసన నిర్మాణసమితి కార్యకలాపాల్లోకూడా దీనిప్రభావం కానవచ్చింది. 1910 – 1917 సంవత్సరాలమధ్య భారతీయ శాసననిర్మాణసమితి 131 బిల్లులను ఆమోదించినట్లు మాంటేగు – ఛెమ్స్‌ఫర్డ్ నివేదిక (1918) లో పేర్కొన్నారు. వీటిలో 77, అంటే 59 శాతం, ఎటువంటి చర్చా జరగకుండానే ఆమోదం పొందాయి. ఒకవైపున ప్రభుత్వమూ మరొకవైపున సమితిలో మితవాదులూ, ఉదారవాదులూ కూడా కొంతమేరకు రాజీధోరణిలో వ్యవహరించడం వల్లనే ఇది సాధ్యమై వుంటుంది.

అయితే సమితిలో ప్రభుత్వచర్యలను ఎవరూ వ్యతిరేకించ లేదనీ గట్టిగా విమర్శించ లేదనీ అర్థంకాదు. సవరించిన సమితి మొదటిసారి సామావేశమైనప్పుడే ప్రభుత్వం రాజద్రోహానికి దారితీసే సమావేశాలను అరికట్టేందుకుద్దేశించిన 1907 వ సంవత్సరపు చట్టాన్ని మరో అయిదునెలలు పొడిగించేందుకు ఒక బిల్లును ప్రవేశపెట్టింది. గోఖలే మరి కొందరూ బిల్లును వ్యతిరేకించారు. 1910 వ సంవత్సరం ఆగస్టు ఆరవతేదీన మాట్లాడుతూ గోఖలే, దేశం ప్రశాంతంగా వున్నపుడు ప్రస్తుత బిల్లువంటి కఠినమైన బిల్లును ఆమోదించడం మంచిదికాదని పేర్కొన్నారు. ప్రభుత్వమూ – ప్రజలమధ్య మామూలు సంబంధాలు నెలకొనేందుకు కూడా ఈ బిల్లు సహాయపడదని ఆయన చెప్పారు. ఈ చట్టంవల్ల ప్రభుత్వానికి విస్తృతమైన అధికారాలు లభిస్తాయి. వీటిని ఉపయోగించిన పక్షంలో అవి తప్పకుండా దుర్వినియోగమై దేశంలో అన్ని కార్యకలాపాలూ స్తంభించిపోతాయి. ఈచర్య అసాధారణమైనదని వర్ణిస్తూ సచ్చిదానందసిన్హా, చర్చ జరిపే స్వేచ్ఛ తగ్గిపోతుందనీ పోలీసులకు ప్రజల కార్యకలాపాల్లో జోక్యంచేసుకునే అధికారం లభిస్తుందనీ తత్ఫలితంగా ప్రజల్లో చికాకూ విసుగూ ఏర్పడతాయని చెప్పారు. జాతీయవాద ముస్లిం అయిన మజహరుల్ హక్, మదన్‌మోహన్‌మాలవ్యా, బి. యస్. బసు, ఆర్. యస్. మధోల్కర్ కూడా బిల్లును వ్యతిరేకించారు. జాతీయవాదులు వ్యతిరేకించినప్పటికీ బిల్లును ఆమోదించారు.

బడ్జెట్టుమీద జరిగిన చర్చలో సమితిలోని అధికారేతర సభ్యులు ప్రభుత్వ ఆర్థిక విధానాన్ని విమర్శిస్తూనే వచ్చారు. 1910 వ సంవత్సరంలో బడ్జెటు చర్చలో పాల్గొంటూ సచ్చిదానంద సిన్హా, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజలకు సంబంధించిన కార్యకలాపాలకు ఇంకా ఎక్కువ ఖర్చు చేసేందుకు వీలుగా భారత ప్రభుత్వమూ రాష్ట్ర ప్రభుత్వాలమధ్య మెరుగైన ఆర్థిక ఏర్పాటు ఉండడం చాలా అవసరమని చెప్పారు. అప్పటి ఏర్పాట్ల ప్రకారం

"సార్వభౌమ్య ప్రభుత్వం రాష్ట్రీపు గొఱ్ఱెలను పూర్తిగా బోడిచేసి అవిచలిలో ఒణికి పోతున్నా పట్టించుకునేదికాదు.31" పిస్తా 1911 వ సంవత్సరం బడ్జెటు ఉపన్యాసమిస్తూ, భారతదేశంలో వుంచిన బ్రిటిష్ సైన్యాధికయే ఖర్చును బ్రిటిష్-ప్రభుత్వమూ భారతప్రభుత్వమూ న్యాయమైన పద్ధతిలో పంచుకోవాలని గట్టిగా కోరారు. దానిమూలంగా మిగిలే ధనాన్ని భారతదేశంలో విద్యాభివృద్ధికి వెచ్చించాలని అర్థించారు. అంతకు ముందు పన్నెండు సంవత్సరాలలో సైన్యమూ పోలీసుశాఖా విద్యకంటె ఇరవై అయిదింతలు నిధులను పొందినందుకు ఆయన విచారం వ్యక్తపరిచారు.32

మార్లే-మింటో సంస్కరణల మూలంగా, సమితి సభ్యులకు వార్షిక బడ్జెటు సమయంలో తీర్మానాలను ప్రతిపాదించే హక్కు సంక్రమించింది. వాటిమీద ఓటుచేసే హక్కు కూడా కలిగింది. సమితిలోని అధికారేతర సభ్యులు ఈ హక్కును బాగావినియోగించుకున్నారు. మిగులు నిధులను విద్య - వైద్యసహాయం - పరిశుభ్రత మొదలైన ప్రజాసంక్షేమ కార్య కలాపాలకు వినియోగించాలన్న తమకు అతిప్రియమైన కోరికను పదేపదే వెలిబుచ్చడానికి గోఖలే ఈ హక్కును వినియోగించుకున్నారు. కాగితాలూ మొదలైనవీ - ముద్రణ - రైల్వేలు - ముద్రణ యంత్రాలు - ఉప్పు - పోలీసుశాఖ మొదలైన వాటిమీద ఖర్చు తగ్గించాలని కోరుతూకూడా ఆయన అనేక తీర్మానాలను ప్రతిపాదించారు. దేశవాళీ పరిశ్రమలను అభివృద్ధి పరచాలని కూడా అధికారేతర సభ్యులు ఎంతో ఆశించారు. ఉదాహరణకు మాలవ్యా 1911 మార్చి 9 వ తేదీన దిగుమతి చేసుకుంటున్న పంచదార మీద సుంకాన్ని ఎక్కువ చేయవలసిందని కోరుతూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఆ విధంగా చేసినపుడు దేశంలోని పంచదార పరిశ్రమపోటీకి తట్టుకోగలుగుతుందని ఆయన వాదించారు. గోఖలే దీనికి ఒక సవరణను ప్రతిపాదించారు. దేశంలోని పంచదార పరిశ్రమ పూర్తిగా నాశనమైపోకుండా కాపాడేందుకు తీసుకోవలసిన చర్యలను సూచించేందుకు తగిన సంఘంచేత దర్యాప్తు జరిపించవలసిందని ఈ సవరణలో ప్రభుత్వాన్ని కోరారు.

సురేంద్రనాథ్ బెనర్జీ 1913లో సార్వభౌమ్య శాసన నిర్మాణ సమితిలో సభ్యులయారు. సభ్యులైన మరుసటి నెలలోనే నేర విచారణలో న్యాయశాఖనూ, పాలనా నిర్వహణశాఖనూ వేరు చేయాలని సిఫార్సుచేస్తూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఆ తర్వాత, పత్రికలచట్టాన్ని సవరించాలని కోరారు. 1910లో ఈ చట్టాన్ని ఆమోదించినపుడు సమితిలోనూ, బయటా వివాదాలకు దారితీసింది. ఈ చట్టంవల్ల పోలీసు శాఖకు చాలా అధికారాలు లభించాయనీ వీటిని నిరంకుశంగా ఉపయోగిస్తున్నారనీ ఆయన ఫిర్యాదు.33 1915 మార్చి 18వ తేదీన సమితిలో ప్రవేశపెటిన నేరాల చట్టం సవరణ బిల్లునుకూడా ఆయన ఇదే దృష్టితో విమర్శించారు.

సైన్యంలోనూ సర్వీసుల్లోనూ భారతీయులను నియమించాలన్న విషయమై సమితిలోని భారతీయులు ఎప్పుడూ శ్రద్ధవహిస్తూ వచ్చారు. భారత పౌరసర్వీసులకు పరీక్షలు ఇంగ్లాండులోనూ భారతదేశంలోనూ ఒకేసారి జరగాలనీ, సర్వీసులలో భారతీయులకు యాభైశాతం ప్రాతినిధ్యం ఉండాలనీ సిఫార్సుచేస్తూ 1917 సెప్టెంబరు 21వ తేదీన సమితిలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఈ తీర్మానాన్ని సమర్థిస్తూ డి. యి. వాచా, భారతదేశంలో అశాంతికి మూలకారణాల్లో ఒకటి, పౌర సర్వీసుల్లో బ్రిటిషువారి ప్రాబల్యం ఎక్కువగా ఉండడమేననీ దీన్ని సరిదిద్దవలసివుందనీ చెప్పారు. ఈ తీర్మానంవల్ల సర్వీసుల్లో బ్రిటిషువారి ప్రాబల్యం ఇప్పటి మోస్తరుగా ఉండదనీ దానివల్ల ఇబ్బందులు తలఎత్తుతాయనీ బ్రిటిష్ సభ్యుడు పేర్కొన్నారు. సర్వీసుల్లో బ్రిటిష్‌వారు అసలు ఎక్కువమంది ఎందుకు ఉండాలని ఎమ్. ఎ. జిన్నా బ్రిటిష్ సభ్యుడిని ప్రశ్నించారు. 34 ఆ తర్వాత (1918 ఫిబ్రవరి 27) వి. ఎస్. శ్రీనివాసశాస్త్రి ఒక తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ రాయల్ ఇంజనీర్లకు కొన్ని ఉద్యోగాలను కేటాయించడంతప్ప పబ్లిక్‌వర్క్స్ శాఖలోనూ, రైల్వేల్లోనూ భారతీయ ఇంజనీర్లనే నియమించాలని కోరారు. భారతీయ ఇంజనీర్లు, భారతీయులైన కారణాన బ్రిటిష్ ఇంజనీర్లకు ఏమాత్రం తీసిపోరని ఆయన గట్టిగా చెప్పారు. ఆయన యీ తీర్మానం వీగిపోయినప్పుడు, రైల్వేలు, టంతి-తపాలా సర్వీసుల్లో భారతీయులకంటె ఆంగ్లో ఇండియన్లకు ప్రాముఖ్యమివ్వరాదని సూచించారు. ఈ తీర్మానంకూడా వీగిపోయింది. ఆతర్వాత ఆయన, పబ్లిక్ సర్వీస్ కమీషన్ చేసిన సిఫార్సుల దృష్ట్యా సాంకేతిక - శాస్త్రీయ సర్వీసుల్లోకి పూర్తిగా భారతీయులనే తీసుకోవాలని ప్రతిపాదించారు. ఇదికూడా కష్టతరమేనని ప్రభుత్వం మొరపెట్టుకోవడంతో శాస్త్రి తమ తీర్మానాన్ని ఉపసంహరించుకున్నారు.

## రౌలట్ చట్టాల ప్రతిఘటన (1918-1919)

రెండవ ప్రపంచయుద్ధం ముగియబోతూవుండగా భారతదేశంలో విప్లవ జాతీయ ఉద్యమాన్ని అణచివేసేందుకు ప్రభుత్వానికి విస్తృతమైన అధికారాలు అవసరమౌతాయని బ్రిటిష్‌వారు గుర్తించారు. భారతదేశంలో వాతావరణం అప్పటికే ఉద్రిక్తంగా వుంది. 1916 వ సంవత్సరపు లక్నో ఒప్పందం తర్వాత హిందువులూ - ముస్లింల మధ్య పరస్పర అవగాహన పెంపొందింది. భారత ప్రభుత్వం జాగ్రత్త పడదలచింది. 1917 డిశంబరు 10వ తేదీన రాజద్రోహ విషయాల సంఘం ఒకదాన్ని నియమించింది. దీనికి, జస్టిస్ సిడ్నీ రౌలట్ అధ్యక్షులు. భారతదేశంలో విప్లవ ఉద్యమం (విప్లవ ఉద్యమాన్ని రాజద్రోహ ఉద్యమమని వర్ణించారు) గురించి దర్యాప్తు జరిపి, పటిష్ఠమైన

విధంగా చర్య తీసుకునేందుకు ఈ సంఘం సిఫార్సులు చేస్తుంది. దేశంలో అప్పుడు అమల్లోవున్న సాధారణచట్టం, సమస్యను పరిష్కరించజాలదనీ యుద్ధం ముగిసిన తర్వాత అంతమయే భారత రక్షణ చట్టానికి చెందిన కొన్ని ప్రత్యేక అధికారాలు సాధారణ చట్టానికి శాశ్వతంగా బదలాయించాలనీ రౌలట్ సంఘం తన నివేదికలో సిఫార్సు చేసింది.

ఈ సంఘం చేసిన సిఫార్సులపట్ల భారతదేశంలో తీవ్ర నిరసన వ్యక్తమైంది. సార్వభౌమ్య శాసననిర్మాణ సమితిలో ఈ నివేదికమీద చర్చ జరిగేముందు 1918 సెప్టెంబరు 19వ తేదీన జి. యస్. ఖపర్డే ఒక అధికారేతర తీర్మానాన్ని ప్రతిపాదించారు. నిర్బంధాలను విధించే చట్టాలను ఆమోదించడమూ అమలు పరచడమూ అసలు అవసరమా అన్న విషయమై దర్యాప్తుజరిపేందుకు ఒక సంఘాన్ని నియమించాలని తీర్మానంలో కోరారు. ప్రభుత్వంమాత్రం వెనుకాడలేదు. రౌలట్ సంఘం చేసిన సిఫార్సులను అమలుపరచాలని తలపెట్టినట్టు ప్రకటించింది. 1919 ఫిబ్రవరిలో దీనికిగాను సార్వభౌమ్య శాసననిర్మాణ సమితిలో రెండు బిల్లులను ప్రవేశపెట్టారు. ఇందులో ఒకటి, భారతీయ నేరాల చట్టం సవరణ బిల్లు, రెండవది నేరాల చట్టం (అత్యవసర అధికారాల) బిల్లు. వీటిని మామూలుగా రౌలట్ బిల్లులు అని వ్యవహరించేవారు.

భారతదేశమంతా ఈ బిల్లులను వ్యతిరేకించింది. అప్పటికే రంగంలోకి ప్రవేశించిన గాంధీజీ ఈ బిల్లులు చట్టాలయినట్లయితే తాము సత్యాగ్రహ ఉద్యమాన్ని ప్రారంభిస్తామనీ ఈ చట్టాలను పాటించబోమనీ ప్రకటించారు. దేశవ్యాప్తంగా పర్యటన ప్రారంభించారు. ప్రభుత్వం తలపెట్టిన ఈ నిరంకుశచట్టాలను ప్రతిఘటిస్తామనీ ప్రతిజ్ఞాపూనవలసిందని ఆయన ప్రజలకు ఉద్బోధించారు.

దేశమంతా ఒక్కుమ్మడిగా ఈ విధంగా ప్రతిఘటిస్తున్నప్పటికీ దేశ వ్యవహారాల సభ్యుడు నేరచట్టపు (అత్యవసర అధికారాలు) బిల్లును సార్వభౌమ్య శాసన నిర్మాణ సమితిలో 1919 ఫిబ్రవరి 9వ తేదీన ప్రవేశపెట్టారు. ఈ బిల్లును ఒక సిఫార్సుల సంఘానికి నివేదించాలనీ ఆ సంఘం తన అభిప్రాయాలను 1919 మార్చి 6వ తేదీకి తెలియచేయాలనీ ప్రతిపాదించారు. ఆయన ఉపన్యాసం ముగిసిన వెంటనే విఠల్‌భాయ్ పటేల్ మాట్లాడుతూ, శాసననిర్మాణసమితి పదవీకాలం ముగిసినతర్వాత ఆరునెలలదాకా ఈ బిల్లును తలపెట్టరాదని కోరుతూ ఒక సవరణను ప్రవేశపెట్టారు. అరాచకవాదుల పట్ల తమకేమీ సానుభూతిలేదని అంటూ పటేల్ విప్లవనేరం ఏదైనా జరిగిందీ అంటే అది రాజకీయ పాలనా నిర్వహణ స్తబ్దత వల్లనేనని పేర్కొన్నారు. దానికి పరిష్కార మార్గం పాతుకుపోయిన కష్టనిష్ఠూరాలను తొలగించడమే గాని, రాజకీయ కార్యకలా

పాలను అణిచివేయడం కాదని చెప్పారు. మాంటేగు — చెమ్స్‌ఫర్డు సంస్కరణలు రాబోతున్నాయనీ అవి అమల్లోకి వచ్చినప్పుడు అదీ ప్రజానాయకులు సూచించిన సవరణలతోపాటు అవి అమల్లోకి వచ్చినప్పుడు విప్లవ నేరాలుకూడా అదృశ్యమౌతాయని చెప్పారు. 35

సత్యాగ్రహమూ - సహాయ నిరాకరణ విషయాల్లో మితవాదులూ ఉదార వాదులూ గాంధీజీతో ఏకీభవించనమాటమాత్రం వాస్తవమే. ప్రజల రాజకీయ కార్య కలాపాలను ప్రభుత్వం అణిచివేయడాన్నికూడా వారు ఆమోదించలేదు. శాసన నిర్మాణ సమితిలో రౌలట్ బిల్లులను ప్రతిఘట్టంలోనూ వీరు వ్యతిరేకించారు. అత్యవసర అధి కారాల బిల్లులో ప్రభుత్వం తలపెట్టిన చర్యలు స్వాతంత్ర్యాన్ని అతితేలికగా నిర్లక్ష్యం చేశాయని శ్రీనివాసశాస్త్రి పేర్కొన్నారు. నిజమైన భారతీయుడెవడికీ ఈ సందర్భంలో భిన్నాభిప్రాయముండదని చెబుతూ తేజ్ బహదుర్‌సప్రూ విద్యుక్తధర్మం పాటిస్తూ తాను బిల్లును వ్యతిరేకిస్తున్నాననీ పటేల్ ప్రతిపాదించిన సవరణను బలపరుస్తున్నాననీ ఉద్ఘాటించారు. కె. వి. రంగసామి అయ్యంగార్ బిల్లును వ్యతిరేకిస్తూ ఈ విధంగా అన్నారు: "ప్రాచీనరాజులు ఎదురుచూసినట్టు మనం సలహా ఇచ్చేందుకు ఏమాత్రం వీలులేదు." భారతదేశంలో విప్లవ హింసాకాండ చరిత్రను తిరగవేస్తూ మాలవ్యా, దీనికి బాధ్యత ప్రభుత్వానిదేనని చెప్పారు. రాజా రామ్‌పాల్‌సింగ్, సతీనాథ్‌రాయ్, పటేల్‌ను సమర్థించారు. ఈ బిల్లు ఆమోదం పొందినట్టయితే దేశంలో రాజకీయ కార్య కలాపాలు కుంటుపడి ప్రజాజీవితంలో స్తబ్దత ఏర్పడుతుందని సురేంద్రనాథ్ బెనర్జీ చెప్పారు.

మహమూదాబాద్ రాజా బిల్లును వ్యతిరేకిస్తూ అసందర్భంగావుందనీ సరిగాలేదనీ అనవసరమైనదనీ బ్రిటిష్‌వారికి తగినదికాదనీ చెప్పారు. ప్రభుత్వం ఏక్షణములోనైనా పదవిపోయేస్థితిలో వుందని మజహరుల్ హక్ హెచ్చరించారు. అంతకుముందు, అంటే 1918 సెప్టెంబరు 23వ తేదీన రౌలట్ సంఘం నివేదిక పరిశీలనను కొంతకాలం ఆపి వుంచాలని ఖపర్డే ఒక తీర్మానాన్ని ప్రతిపాదించినపుడు ఎమ్. ఎ. జిన్నా మాట్లాడుతూ స్పష్టంగా పేర్కొన్న విప్లవనేరాలను అరికట్టాలని మిగతా అందరికంటే భారతీయ సభ్యులకే ఎక్కువ ఆదుర్దాగా వుందని చెప్పారు. "నేరాలను అరికట్టేందుకు అనుస రించవలసిన విధానాన్ని మాతో సంప్రతించకుండా మీరే నిర్ణయించినపుడు మా సహా యాన్ని కోరడానికి వీలులేదు" అనికూడా జిన్నా అన్నారు. "మేము మీతో సహ కరించాలని మీరు కోరుతున్నట్లయితే, దేశపాలనకు మీరు విధిస్తున్న విధానాల్లో మాకు కూడా కొంత బాధ్యతా కొంత అధికారమూ ఇవ్వండి" అని జిన్నా అడిగారు. 1919

ఫిబ్రవరి 6వ తేదీన బ్రిటిషు సభ్యుడు బిల్లును ప్రతిపాదించినపుడు జిన్నా బిల్లును వ్యతిరేకిస్తూ పెద్ద ఉపన్యాసం చేశారు. 36

ఇంత ప్రతిఘటన ఉన్నప్పటికీ ప్రభుత్వపు బిల్లు 1919 మార్చి 18వ తేదీన ఆమోదింపబడింది. జిన్నా ఎంతో వీభ్రాంతి చెందారు. మార్చి 28వ తేదీన వైస్రాయ్‌కి ఆయన ఈవిధంగా వ్రాశారు :

"భారత ప్రభుత్వం రౌలట్ బిల్లును ఆమోదించడమూ దానికి గవర్నర్ జనరగా మీరు, ప్రజల అభిప్రాయాన్ని ఖాతరు చేయకుండా అనుమతినివ్వడమూ — వీటితో బ్రిటిషు న్యాయంపట్ల ప్రజలకున్న విశ్వాసం బాగా చెదిరిపోయింది. అంతే కాకుండా సార్వభౌమ్య శాసననిర్మాణసమితి వ్యవస్థీకరణ ఎటువంటిదో కూడా స్పష్టంగా తెలిపోయింది. నామమాత్రంగానే ఇది శాసనసభ. నిజానికి విదేశ అధికార్లు ఎటు తిప్పితే అటు తిరిగే యంత్రం మాత్రమే ఇది. అధికారేతర భారతీయ సభ్యుల ఏక గ్రీవ అభిప్రాయాన్ని గాని, మొత్తంప్రజల అభిప్రాయాన్నిగాని, ఏమాత్రం లెఖ్ఖచేయ లేదు. శాంతి సమయాలలో ఇటువంటి చట్టాలను చేసే ప్రభుత్వం పౌర ప్రభుత్వం అనిపించుకోజాలదని నా అభిప్రాయం." 37

చివరకు ఆయన సార్వభౌమ్య శాసననిర్మాణసమితిలో సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు.

మార్లే – మింటో సంస్కరణలు : కొత్త విధానమేదీలేదు

అప్పటి ఉత్సాహంలో మార్లే — మింటో సంస్కరణలు చాలాగొప్పవని అను కున్న మాటనిజమేనని అయితే వీటిలో కొత్త ఏమీలేదనీ విదేశాంగ మంత్రి ఎడ్విన్ మాంటేగు, భారత వైస్‌రాయ్ లార్డ్ ఛెమ్స్‌ఫర్డ్ ఒప్పుకున్నారు. అన్ని విషయా ల్లోనూ ప్రభుత్వానిదే తుది నిర్ణయంగా ఉండాలన్న మూలసూత్రంమీద ఆధారపడినవని కూడా వారు అంగీకరించారు.38

1918 తర్వాత, తెలమరుగునపడి ఆదరిమిలా భారతీయ ఉదారవాదుల పార్టీని ఏర్పాటుచేసుకున్న మితవాద - జాతీయవాదులు కూడా దీన్ని గుర్తించారు. ఉదార వాదుల పితామహులైన ఎస్. ఎన్. బెనర్జీ ఈ విధంగా అన్నారు : "మార్లే-మింటో సంస్కరణలకింద ఏర్పాటైన సమితులు కేవలం సలహాలిచ్చే సమితులు మాత్రమే. భారతీయులు ఏకగ్రీవమైన అభిప్రాయాన్ని స్పష్టంగా వెల్లడిచేసినపుడుకూడా ఇవి అదే విధంగా పనిచేశాయి. అఖరువరకు దీనిలో మార్పులేదు."39 లండన్‌లోని భారతీయసమితిలో కొంతకాలం సభ్యుడుగా పనిచేసిన సర్ సి. శంకరన్ నాయర్ సమి-

తుల గురించి తన అభిప్రాయాన్ని ఇంకా కటువుగా చెప్పాడు. ఆయన తమ పత్రాల్లో ఇలా వ్రాసుకున్నారు :

"శాసన నిర్మాణ సమితులూ అవసరమైన శాసన సంస్కరణలకు సంబంధించి నంతవరకు ఈ సంస్కరణలు నిర్వీర్యమైనవిగా ఋజువయ్యాయి. ఇబ్బందులను తొలగించడంలో నిరుపయోగమయాయి. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకునేందుకు ప్రభుత్వానికి ఈ సంస్కరణలవల్ల అదనపు అధికారాలు లభిస్తాయని ఈ సంస్కరణలకు బాధ్యులైనవారు ఆశించారు. భారతీయ నాయకులకు ప్రభుత్వానికి కొంతమేరకు నచ్చ చెప్పే వీలుకలుగుతుందనీ దానిమీదట ప్రభుత్వం ప్రజల నిజమైన ఇక్కట్లను తొలగిస్తుందనీ కూడా ఆశించారు. ఇవేవీ ఫలించలేదు. విద్య – స్థానిక స్వయంపాలన – పరిశ్రమలూ–సర్వీసులు – రెవిన్యూ ఆర్థిక విషయాలు – వీటికి సంబంధించిన తీర్మానాలన్నిటినీ త్రోసిపుచ్చారు. ఒకవేళ కొన్నిటిని ఆమోదించినా అవి చాలా స్వల్పమైనవి."40

శాసననిర్మాణ సమితుల్లో భారతీయులు పాల్గొనడంవల్ల భారత జాతీయతకు హాని కలుగుతుందని అప్పట్లో తీవ్రవాదులు అని పిలువబడుతున్న లాలా లజపత్‌రాయ్ మొదలైన ఉగ్రజాతీయవాదులు అభిప్రాయపడ్డారు. 1920 జూలై మూడవ తేదీన లజపత్ రాయ్ 'ది ట్రైబ్యూన్' లో ఈ విధంగా వ్రాశారు.

"1910 వ సంవత్సరపు పత్రికల చట్టాన్ని ఆమోదించడంలో గోఖలే సహకరించారు. 1915 వ సంవత్సరపు భారత రక్షణ చట్టాన్ని ఆమోదించడంలో పండిత మాలవ్యా సహకరించారు. 1917-18 మధ్య జరిగిన గొప్పయుద్ధపు ఖర్చులకు గాను పదికోట్ల పౌండ్లు (దాదాపు రెండువందల కోట్ల రూపాయలు) కానుకగా ఇవ్వడంలో జాతీయవాదులు సహకరించారు. గత పన్నెండేండ్లలో శాసన సమితుల్లో సభ్యులుగా వున్న భారతీయులందరూ కలిసి చేసినసేవకంటె, పైన పేర్కొన్నవారూ మరికొందరూ దేశానికి ఎక్కువ హాని కలిగించారు. ప్రభుత్వ విధానపు మూలసిద్ధాంతాలకు సంబంధించి భారతీయ సభ్యులు శాసన సమితులను ప్రభావితం చేయలేకపోయారు."41

సమితిలోని భారతీయ సభ్యులు పటిష్ఠమైన ప్రతిపక్షంగా పనిచేయలేకపోయిన సంగతి నిజమే. 'భారత రాజ్యాంగ సవరణలను గురించిన నివేదిక'లో పేర్కొన్నట్లు 1909 తర్వాత ఎనిమిది బిల్లులు మాత్రమే తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కోవలసి వచ్చింది. ప్రయివేటు బిల్లులు అయిదుమాత్రమే ఆమోదంపొందాయి. కాని, 1911 లో అడిగిన ప్రశ్నలకు రెండింతల ప్రశ్నలను 1917లో అడిగారు. అంటే ప్రశ్నించే హక్కుకు విలువ ఏర్పడిందన్నమాట. 42 ప్రజలకు సంబంధించిన విషయాలను గురించీ ఆర్థిక విషయాలను గురించీ తీర్మానాలను ప్రతిపాదించేందుకు కొత్తగా సంక్రమించిన

హస్కులను భారతీయ సభ్యులు బాగా వినియోగించుకున్నారు. తమ తీర్మానాల ద్వారా వీరు ప్రజల ఇబ్బందులను వెల్లడిచేయగలిగారు. ముఖ్య విషయాలగురించి ప్రస్తావించి, ప్రభుత్వం తన విధానాన్ని, చర్యలనూ వివరించేట్టు చేశారు. దీనివల్ల ప్రభుత్వంకూడా జాగ్రత్తగా వుండేది. "అధికారులు ఎక్కువసంఖ్యలో ఉన్నప్పటికీ వారు (అధికారేతర సభ్యులు) చాలా సందర్భాల్లో పటిష్ఠంగా పనిచేశారని మాంటేగు, ఛెమ్స్‌ఫర్డ్, తమ నివేదికలో ఒప్పుకున్నారు.43

శాసనసమితులు సలహాలిచ్చే సమితులు మాత్రమేనని మితవాదులు గుర్తించి నప్పటికీ సమితుల్లో వారు ఆసక్తితోనే పాల్గొనేవారు. వీరివల్ల చర్చలు ఎంతో బాగుం డేవి. చాలా సందర్భాల్లో ప్రభుత్వ విధానాలనూ ప్రతిపాదనలనూ విమర్శించేవారూ, వ్యతిరేకించేవారుకూడా. సర్వీసుల్లోనూ సైన్యంలోనూ భారతీయులనే నియమించాలనీ దేశవాళీ పరిశ్రమలకు రక్షణ కల్పించాలనీ పన్నుల రేట్లను తగ్గించాలనీ పేదరికాన్ని తొలగించాలనీ విద్యను అభివృద్ధిచేయాలని వీరు ప్రత్యేకంగా కోరుతుండేవారు.

బహిష్కరణ - స్వదేశీ ఉద్యమాలవెంబడే స్వయంపాలనకోసం దేశవ్యాప్తంగా ఆందోళన జరుగుతున్న సమయంలో మార్లే - మింటో సంస్కరణలను రూపొందిం చారు. ఆ రోజుల్లో భారతదేశంలోని వివిధ రాజకీయవర్గాల వైఖరిని మార్లే వర్ణించారు. సంస్కరణలను ప్రవేశపెట్టడంలోని ఉద్దేశాలను వెల్లడిచేశారు. 1909 ఫిబ్రవరి 23వ తేదీన లార్డ్స్ సభలో మాట్లాడుతూ ఆయన ఈ మాటలన్నారు.

"ఇటువంటి పథకం విషయంలో మనం మూడురకాల ప్రజలను దృష్టిలో పెట్టుకోవలసివుంది. ఎప్పటికైనా మనలను భారతదేశంనుంచి తరిమివేయగలమని వెర్రి కలలుకంటున్న తీవ్రవాదులున్నారు ... ... రెండవ వర్గానికి అటువంటి ఆశలులేవు గాని వలసదేశాల మోస్తరుగా స్వయంపాలనా వ్యవస్థకోసం వీరు కలలుగంటున్నారు. మూడవవర్గం వారికి పాలనా నిర్వహణలో సహకరించేందుకు అనుమతిఇస్తేచాలు.

స్వయంపాలన ప్రతిపత్తికోసం ఆశలు పెట్టుకున్న రెండవవర్గపు వారిని, పాలనా నిర్వహణలో సహకరించేందుకు అనుమతికోసరం ఎదురుచూస్తున్న మూడవ వర్గంతో చేరేట్టు సంస్కరణలు పనిచేశాయి, చేస్తున్నాయి, ముందుకూడా చేస్తాయనే నానమ్మకం."

సంస్కరణల్లో కొత్త ఏమీలేకపోగ స్వయం పాలనకోసం జరుగుతున్న ఉద్యమాన్ని విఫలం చేసేందుకూ, ప్రజల్లో చీలికలేర్పరచేందుకూ వీటిని ఉద్దేశించినట్టు గొప్ప ఉదారవాది అయిన మార్లే దాపరికంలేకుండా చేసిన ప్రకటనవల్ల స్పష్టంగా తెలిసి పోయింది. అయితే, భారతీయులలో చైతన్యాన్ని తీసుకువస్తున్న కొత్తశక్తుల పురోగ

మనన్ని ఆవశ్యమని ఆయన తెలుసుకోలేకపోయారు. వీరు ప్రజలకొరకలనూ జాతీయ పోరాటాన్ని ఇంకా ముందుకు తీసుకుపోగలరనికూడా ఆయన గుర్తించలేదు. మితవాద-జాతీయవాదులు వీటిని పట్టించుకోకుండా ఉండలేకపోయారు.

## రెఫరెన్సులు


1. యస్. ఆర్. మెహరోత్రా, ది ఎమర్జన్స్ ఆఫ్ ది ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (ఢిల్లీ, 1971) పేజీలు 61-67
2. పరమాత్మ సారన్, ది ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా (కొత్త ఢిల్లీ, 1961) పే 28
3. సి. యం. పి. క్రాస్, ది డెవలప్‌మెంట్ ఆఫ్ సెల్ఫ్ గవర్నమెంట్ ఆఫ్ ఇండియా. 1858-1914 (చికాగో, 1922) పేజీలు 32-39
4. తారాచంద్, హిస్టరీ ఆఫ్ ది ఫ్రీడమ్ మూవ్‌మెంట్ ఇన్ ఇండియా (కొత్త ఢిల్లీ) వాల్యూమ్. 1, పే 505
5. బి. బి. మజుంమ్దార్, ఇండియన్ పొలిటికల్ అసోసియేషన్స్ అండ్ రిఫార్మ్స్ ఆఫ్ లెజిస్లేచర్స్; 1818-1917 (కలకత్తా, 1965) పేజీ 331-2.
6. ఇబిడ్., పే, 334.
7. మజుందార్, యస్. 5, పే 321.
8. రఫీక్ జకరియా, రైజ్ ఆఫ్ ముస్లిమ్స్ ఇన్ ఇండియన్ పాలిటిక్స్ (బొంబాయి, 1970) పేజీ 120-1.
9. రిపోర్ట్ ఆఫ్ ఇండియన్ కాన్‌స్టిట్యూషనల్ రెఫార్మ్స్, 1918 పే. 40-41
10. హోమీ మోడి, సర్ ఫిరోజ్‌షా మెహతా: ఎ పొలిటికల్ బయోగ్రఫీ (బొంబాయి, 1963) పే 184-5.
11. ఇబిడ్., పే, 186.
12. రాష్ బిహారీ ఘోష్, స్పీచెస్ డెలివర్డ్ ఆన్ వేరియస్ అకేషన్స్ (కలకత్తా, 1915) పే. 123.
13. ఇబిడ్., పే. 75
14. ఆర్. పి. పట్వర్ధన్ అండ్ డి. వి. అంబేద్కర్, స్పీచెస్ అండ్ రైటింగ్స్ ఆఫ్ గోపాలకృష్ణ గోఖలే (పూనా, 1962) వాల్యూమ్ 1 పే. 38

15. ఇబిడ్., బడ్జెట్ స్పీచ్ ఆఫ్ 1904, పే. 55.
16. ఇబిడ్., పే. 321
17. ఇబిడ్., పే. 84
18. ఇబిడ్., వాల్యూమ్ 2, పే. 6-7
19. ఇబిడ్., వాల్యూమ్ 1: పే. 147.
20. మార్లే టు మింటో, 2 అగస్టు 1906, మేరీ, కౌన్టెస్ ఆఫ్ మింటో, ఇండియా, మింటో అండ్ మార్లే (లండన్, 1935) పే. 99.
21. మార్లే, ఇండియన్ స్పీచెస్ (మాక్మిలన్) పే18, 96.
22. యమ్. యన్. దాస్, ఇండియా అండర్ మార్లే అండ్ మింటో (లండన్ 1964) పే. 171 ఈ చర్చలన్నిటికీ 5వ అధ్యాయం చూడుడు.
23. ఇబిడ్., పే, 172.
24. బి. బి. మిశ్ర, ది అడ్మినిస్ట్రేటివ్ హిస్టరీ ఆఫ్ ఇండియా 1834-1947, (బొంబాయి, 1970) 54-55
25. బి. పట్టాభి సీతారామయ్య, హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ నేషనల్ కాంగ్రెసు (బొంబాయి, 1946) వాల్యూమ్ 1, పే. 26.
26. ఇబిడ్., పే. 27–28.
27. పట్వర్ధన్, యన్. 14, పే 148—9
28. ఇబిడ్., వాల్యూమ్ 2, పే 297
29. స్పీచెస్ అండ్ రైటింగ్స్ ఆఫ్ గోపాల కృష్ణ గోఖలే (మద్రాసు, నటేశన్ అండ్ కంపెనీ. 1916) పే 369-74
30. టి. ఆర్ దేవగిరికర్, గోపాల కృష్ణ గోఖలే (క్రొత్త ఢిల్లీ, 1964) పే 134-5
31. సచ్చిదానందసిన్హా, ఎ సెలెక్షన్ ఫ్రం ది స్పీచెస్ అండ్ రైటింగ్స్ (అలహాబాదు, 1935) పే. 302-03.
32. ఇబిడ్., పే. 307-08
33. సురేంద్ర నాథ్ బెనర్జీ, సీచ్చెస్ అండ్ రైటింగ్స్ (మద్రాసు, యన్, డి) పే. 163
34. యమ్. హెచ్. సయీద్, మహమ్మదాలీ జిన్నా (లహోర్, 1945) పే.149-50
35. వివరాలకు జి. ఐ. పటేల్, విఠల్భాయ్ పటేల్, లైఫ్ అండ్ టైమ్స్ (బొంబాయి, యన్. డి ) బుక్ 1, చాప్టర్ 16.

36. రఫీక్ అఫ్‌జల్, కంపెనీ., సెలెక్టెడ్ స్పీచెస్ అండ్ స్టేట్‌మెంట్స్ అఫ్ ది క్వదె - ఇ - ఇజామ్ మహమ్మదాలీ జిన్నా (లహోర్, 1966) పే. 79-83; 84-112.

37. ఇబిడ్., పే 112-113

38. రిపోర్ట్ ఆన్ ఇండియన్ కాన్‌స్టిట్యూషనల్ రెఫార్మ్స్ (కలకత్తా, 1918)పే. 2

39. ఎస్. ఎన్ బెనర్జీ, ఏ నేషన్ ఇన్ ది మేకింగ్ (కలకత్తా, 1963) రీప్రింట్ పే, 273

40. ఆటో బయాగ్రఫీ ఆఫ్.సర్. సి. శంకరన్ నాయర్ (మద్రాసు, 1966)పే 112

41 వి. సి. జోషి, ఎడి., లాలా లజ్‌పత్‌రామ్. రైటింగ్స్ అండ్ స్పీచెస్ (ఢిల్లీ, 1966) పే. 12.

42. రిపోర్ట్, ఎన్. 38, పే. 60

43. ఇబిడ్., పేజీ 58-59.

## రెండవ అధ్యాయం

# 1919వ సంవత్సరపు సంస్కరణలచట్టము - ఉదారవాదులు

### మొదటి ప్రపంచయుద్ధం - భారత దేశంలో కొత్త పరిస్థితి

1914లో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభం కావడంతో వరుసగా కొన్ని సంఘటనలు జరిగాయి. ప్రారంభంలో. రాజకీయ నాయకుల వైఖరి మెచ్చుకోదగినదని బ్రిటిష్ ప్రభుత్వం భావించింది. దేశంలో వివాదాలను అంతమొందించ వలసిందని లార్డ్ హార్డింజ్ చేసిన విజ్ఞప్తిని వారు మన్నించారు. ప్రభుత్వానికి అంతరాయం కలిగించకుండా సహకరించాలన్న కోరిక మొత్తంమీద వ్యక్తమైంది. కాని కొన్ని తిరుగుబాటు బృందాలు భారతదేశంలో చురుకుగా పనిచేస్తుండేవి. ముఖ్యంగా బెంగాల్ పంజాబ్‌లో యుద్ధసమయంలో ఇవి విదేశాల్లో శాఖలను ఏర్పరచుకోవడంతో భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వానికి చికాకు కలిగింది. భారతరక్షణ చట్టంక్రింద లభించిన విస్తృత అధికారాలతో వారిమీద విరుచుకుపడింది.

### సంస్కరణలకు కాంగ్రెస్ లీగ్ పథకం

భారతదేశ మంతటా అన్ని వర్గాల ప్రజల్లోనూ అవిథంగా అసంతృప్తి వ్యాప్తిచెందింది. దీనిలో రాజకీయ నాయకులందరూ ఒకటై. తమ రాజకీయ హక్కులకోసం తీవ్రంగా ఆందోళన చేయడం ప్రారంభించారు. రాజ్యాంగ సవరణలకు సంబంధించి కాంగ్రెస్-లీగ్ సంయుక్తంగా తయారుచేసిన పథకంలో ఇది ప్రస్ఫుటమైంది. భారత జాతీయ కాంగ్రెసూ అఖిలభారత ముస్లింలీగూ 1916 లో లక్నోలో ఈపథకాన్ని బలపరచింది. ఈ కాంగ్రెసు మహాసభ మరొక విధంగాకూడా ప్రాముఖ్యాన్ని కలిగివుంది. 1907 నుంచీ విడిపోయివున్న మితవాదులూ అతివాదులూ మళ్ళీ ఏకమయారు.

ప్రస్తుత పాలనా వ్యవస్థ "ప్రజల న్యాయమైన ఆశయాలను సంతృప్తి పరచడం లేదని" ఏ "భారతదేశానికి త్వరలో స్వయంపాలనా ప్రతిపత్తి కల్పించాలని బ్రిటిష్ ప్రభుత్వం తలపెట్టుకోందని" అదే దాని లక్ష్యమని కూడా బ్రిటిష్ సార్వభౌములవారు

ఒక ప్రకటన చేయాలని" కాంగ్రెస్ - లీగ్ పథకంలో ప్రధానంగా కోరారు. సామ్రాజ్యాన్ని పునర్ వ్యవస్థీకరించే సమయంలో "భారతదేశాన్ని పరాధీన పరిస్థితినుంచి తొలగించి స్వయంపాలనా ప్రతిపత్తిగల దేశాలతో సమానం చేయాలని" కోరారు.

కేంద్రమూ రాష్ట్రాల్లో రాజ్యాంగ వ్యవస్థలను, పథకంలో విపులీకరించారు. వైస్రాయ్ కార్యనిర్వాహక సమితిలో సగం మంది భారతీయులు వుండాలని రాష్ట్రాల్లో శాసన సమితుల్లో ఎన్నికయే సభ్యుల సంఖ్య ఎక్కువగా వుండాలని శాసన సమితుల అధికారాలను ఎక్కువచేయాలని పథకంలో కోరారు. ఉదాహరణకు, శాసన సమితులు ఏదైనా ఒక తీర్మానాన్ని ఆమోదించి నట్లయితే, దానికి కార్య నిర్వాహక ప్రభుత్వం కట్టుబడి ఉండాలి. గవర్నర్ జనరల్ గాని గవర్నర్ గాని వీటోచేయవచ్చు. అయితే ఒక సంవత్సరం తర్వాత శాసన సమితులు ఆ తీర్మానాన్ని మళ్ళీ ఆమోదించి నట్లయితే దాన్ని అమలు పరచవలసిందే. మరోమాటలో చెప్పాలంటే నిర్ణీతమైన బాధ్యతాయుతమైన కార్య నిర్వాహక ప్రభుత్వం ఏర్పడాలని పథకంలో ఆశించారన్నమాట. రాష్ట్ర సమితుల్లోని సభ్యుల్లో అయిదింట నాలుగువంతుల మందిని ఎన్నికల ద్వారా ఎన్నుకోవాలన్నది పథకంలోని మరొక ప్రధానాంశం ముఖ్యమైన అల్ప సంఖ్యాక వర్గాలకు, తగిన ప్రాతినిధ్యముంటుందని. ముస్లింలకు, పథకంలో నిర్ణయించిన నిష్పత్తిలో ప్రత్యేక నియోజకవర్గాలద్వారా ఎన్నికయే వసతి ఉంటుందని పేర్కొన్నారు. (ఉదాహరణకు పంజాబులో ఎన్నికయే భారతీయ సభ్యుల్లో యాభైశాతమూ బెంగాల్‌లో నలభైశాతము) సార్వ భౌమ్య శాసన సమితికి సంబంధించి నంతవరకు, ఎన్నికయే భారతీయ సభ్యుల్లో మూడవ వంతుమంది వివిధరాష్ట్రాల్లోని ప్రత్యేక ముస్లిం నియోజకవర్గాలనుంచి ఎన్నిక కావాలని పథకంలో కోరారు. ప్రత్యేక ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించేనియోజక వర్గాలనుంచి తప్ప ముస్లింలు సార్వభౌమ్య - రాష్ట్రశాసన సమితులకు జరిగే ఎన్నికల్లో ఇతరత్రా పాల్గొనరాదు.[2]

మాంటేగు - ఛేమ్స్‌ఫర్డ్‌కు ఈపథకం "అత్యంత సమగ్రమైనదిగానూ ప్రముఖ భారతరాజకీయ సంస్థలు కోరుతున్నవాటిలో ఎక్కువ అంశాలను పొందుపరచినది" గానూ కనిపించింది. చాలామంది దీన్ని సమర్థిస్తున్నందువల్ల వారు తమ దేశయాత్ర సందర్భంగా మొట్టమొదట ఈపథకాన్ని శ్రద్ధగా పరిశీలించారు.[3]

ఈలోగా సార్వభౌమ్య శాసన నిర్మాణ సమితిలోని పంధొమ్మండుగురు సభ్యులు, ప్రముఖ మితవాదులందరితో సహా, వైస్రాయ్‌కి ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు. కార్యనిర్వాహక సమితుల్లో సగంమంది భారతీయులుండాలని. శాసనసమితులూ సార్వభౌమ్య శాసనసమితుల్లో ఎన్నికైన సభ్యుల్లో ఎక్కువమందికి అన్ని విషయాలగురించి

ఎటువంటి నిర్బంధమూ లేకుండా చట్టాలనుచేసే అధికారం వుండాలనీ భారతదేశానికి సంబంధించిన మంత్రియొక్క సమితిని రద్దు చేయాలనీ వీరు తమ వినతి పత్రంలో కోరారు. స్థూలంగా వీరి ప్రతిపాదనలుకూడా కాంగ్రెసు లీగ్ పథకం మోస్తరుగానే వున్నాయి.

## జాతీయభావం తీక్షణత 1917

1917లో భారతదేశంలో జాతీయభావం తీక్షణమైంది. స్వదేశపాలన ఉద్యమందేశమంతా విస్తృతంగా వ్యాపించింది. బీహార్‌లోని చంపారన్ జిల్లాలో నీలిమందుతోటల యజమానుల (యూరోపియన్లు) కర్కశప్రవర్తనకు నిరసనగా గాంధీజీనాయకత్వంలో కర్షక ఉద్యమం ఒకటి ప్రారంభమైంది. దేశంలోని అనేక ప్రాంతాల్లో కుట్రలూ తిరుగుబాట్లూ జరుగ వచ్చునన్న భయంతో ప్రభుత్వం తల్లడిల్లిపోయింది. ఇవన్నీగాలక అప్పుడు రష్యాలో తిరుగుబాటు జరుగుతూవుంది. ఈ తిరుగుబాటు, భారతరాజకీయ ఆశయాలకు ప్రేరణగా పనిచేసిందని మాంటేగు — చెమ్స్‌ఫర్డ్ పేర్కొన్నారు.[4] అమెరికా అధ్యక్షుడు విల్సన్ కూడా అన్ని దేశాలవారికీ స్వయం నిర్ణయహక్కు ఉండాలని మాట్లాడ్డం ప్రారంభించారు. భారతదేశంలోని అభ్యుదయ వర్గాల్లో అప్పట్లో విస్తృతంగా వినపస్తున్న స్వయంపాలనా వ్యవస్థ అన్న ఆకాంక్షకు ఇవన్నీ కొత్తశక్తిని ఇచ్చాయి.[5]

## 1917 ఆగస్టు 20వ తేదీ మాంటేగు చేసిన ప్రకటన.

భారతదేశంలో అంతకంతకు ఎక్కువవుతున్న జాతీయ ఆందోళనను ఎదుర్కొనేం దుకు ప్రభుత్వం ఎప్పటిమోస్తరుగానే మొదట, కఠినంగా అణిచివేసే విధానాన్ని ప్రారంభించింది. అయితే "పాలనావ్యవస్థ ఇబ్బందులుకూడా విపరీతంగా పెరుగుతూ వచ్చాయి." పరిస్థితిని ఎదుర్కోవడంలో కొత్త పద్ధతిని అనుసరించాలని ఎక్కువమంది అభిప్రాయపడ్డారు. భారతదేశంలో బ్రిటిష్‌విధాన లక్ష్యాన్ని ప్రకటించకుండా ఆదేశాల ప్రకారం పటిష్ఠంగా పనిచేయడం అసాధ్యమని లార్డ్ చెమ్స్‌ఫర్డ్ ప్రభుత్వం అభిప్రాయ పడింది[6] కొత్తగా భారతదేశానికి సంబంధించిన మంత్రిగా నియమితులైన ఎడ్విన్ మాంటేగు 1917 ఆగస్టు 20వ తేదీ ఒక ప్రకటన చేశారు. కొద్ది ఓదార్చినట్లయింది.

భారత దేశానికి చెందిన మంత్రి కామన్సు సభలో చేసిన ప్రకటనలో "పాలనా వ్యవస్థలోని ప్రతి శాఖలోనూ భారతీయులకు ఇంకా ఎక్కువ పాత్ర ఉండేట్టు చేయడమూ, బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగంగావుండే భారత దేశంలో బాధ్యతాయుతమైన ప్రభు త్వాన్ని ఏర్పాటుకు దారితీసే విధంగా స్వయంపాలనా వ్యవస్థను క్రమేపీ అభివృద్ధి చేయడమూ సార్వభౌముల ప్రభుత్వ విధానమ" ని పేర్కొన్నారు. పట్టాల వారీగా

మాత్రమే ఈ విధానం అమలు జరుగగలదని ఆయన కామన్సు సభలో చెప్పారు. ఒక్కొక్క ముందడుగు ఎప్పుడు వేసేదీ బ్రిటిష్ ప్రభుత్వమూ భారత ప్రభుత్వమూ నిర్ణయిస్తామని కూడా చెప్పారు.7

ఈ విషయాల గురించి వైస్రాయ్‌తో చర్చించేందుకూ ప్రాతినిధ్య సంస్థల అభిప్రాయాలనూ ఇతరుల అభిప్రాయాలనూ తెలుసుకునేందుకు విదేశాంగ మంత్రి భారత దేశం వెళతారని ప్రకటించారు. ఈ ప్రకటన ప్రకారం మాంటేగు 1917 నవంబరులో భారతదేశం వచ్చారు. అఫీసర్లతో సంప్రదింపులు జరిపారు. భారతీయులను కలుసుకున్నారు. ఆయనా, ఛెమ్స్‌ఫర్డ్ కలసి ఒక సంయుక్త నివేదికను సమర్పించారు. దీన్ని 1918 జూలైలో ప్రకటించారు. నివేదికలో పేర్కొన్న అంశాలకు సంబంధించిన వివరాలను తయారు చేసేందుకు కొన్ని సంఘాలను నియమించారు. బ్రిటిష్ పార్లమెంటు ఈ శిఫార్సులను పరిశీలించి చివరకు 1919 డిసెంబరు 23వ తేదీన, 1919వ సంవత్సరపు భారత ప్రభుత్వ బిల్లును ఆమోదించింది.

## భారత ప్రభుత్వ బిల్లు, 1919.

1919వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టం కింద, గవర్నర్ల రాష్ట్రాలు అని వ్యవహరిస్తున్న స్థానిక ప్రభుత్వాలకు అధికారాన్ని అప్పచెప్పే వీలు కలిగింది. ఆ దరిమిలా రూపొందించిన నిబంధనలకింద, స్థానిక స్వపరిపాలన, ప్రజారోగ్యం, విద్య, పోలీసుశాఖ మొదలైన స్థానిక ప్రాముఖ్యంగల శాఖలను రాష్ట్రాల ఆధీనంలో ఉంచారు. అఖిలభారత ప్రాముఖ్యంగల రక్షణ విదేశ సంబంధాలు, సుంకాలు, రైల్వేలు, తంతి తపాలశాఖ, ఆదాయపు పన్ను మొదలైన శాఖలను కేంద్ర ప్రభుత్వం కింద ఉంచాలి రాష్ట్రాలకు అప్పగించిన శాఖలను 'బదలాయించినవి' 'కేటాయించినవి' అన్న రెండు విభాగాలు చేశారు. మొదటివి, రాష్ట్ర శాసన సభల్లోని ఎన్నికైన సభ్యులనుంచి గవర్నరు నియమించే మంత్రుల పాలనలో ఉంటాయి. రెండవభాగం, గవర్నరు ఆయన కార్య నిర్వాహక సమితి నిర్వహణలో వుంటాయి. గవర్నరు కార్యనిర్వాహక సమితిలోని నలుగురు సభ్యుల్లోనూ ఇద్దరు భారతీయులుండేవారు. రాష్ట్ర ప్రభుత్వ శాఖలను ఈ విధంగా 'బదలాయించినవి' 'కేటాయించినవి' అని విభజించడం అన్న పేరిట ఖ్యాతి పొందింది. రాష్ట్ర శాసన సమితుల పరిమాణమూ విధులూ విస్తృతమయాయి. ప్రాతినిధ్యానికి సంబంధించినంతవరకు ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలను కొనసాగించడమే కాక, ఈ సూత్రాన్ని పంజాబులోని శిఖ్ఖులకూ ఇతర మతాలకు కూడా వర్తింపచేశారు

కేంద్రంలో గవర్నర్ జనరల్‌యొక్క కార్యనిర్వాహక సమితిలో ఆరుగురు సాధారణ సభ్యులుండేవారు. వీరిలో ముగ్గురు భారతీయులు. గవర్నర్ జనరల్ ఇదివరకటి మోస్తరుగానే విదేశాంగ మంత్రిద్వారా బ్రిటిష్ పార్లమెంటుకే బాధ్యులుగాని భారత శాసన సభ్యులకుకాదు.

చట్టం ప్రకారం కేంద్రంలో రెండు శాసనసభలు ఏర్పాటయేందుకు వీలుకలిగింది. రాజ్యసమితి—శాసనసభ అన్న ఈరెండు ఒకదాని కార్యకలాపాలను మరొకటి కనిపెట్టి వుండేది. రాజ్యసమితిలోని మొత్తం 60 మంది సభ్యుల్లోనూ 33 మందిని ఎన్నుకునే వారు. మిగతావారిని నామినేట్ చేసేవారు. వీరిలో 20కి మించకుండా అధికార్లు ఉండ వచ్చు. శాసన సభలో 145 మంది సభ్యులుంటారు. వీరిలో 104 మందిని ఎన్నుకుం టారు. మిగతావారిలో ఇరవైఆరుగురు అధికార్లనూ 15గురు అధికారేతరులనూ నామినేట్ చేస్తారు. భూస్వాములూ, వాణిజ్యవేత్తలూ మొదలైన ప్రత్యేక వర్గాల ప్రతి నిధులను ప్రత్యేక నియోజక వర్గాలనుంచి ఎన్నుకునే ఏర్పాటుకూడా కల్పించారు. ఎన్నికయే ఎక్కువమంది సభ్యులకు, ప్రాంతీయ నియోజక వర్గాలద్వారా సరాసరి ఎన్నికలు జరిగేవి: రాజ్యసమితికి జరిగే ఎన్నికల్లో పాల్గొనే ఓటర్లకు శాసన సభకు జరిగే ఎన్నికల్లో పాల్గొనే ఓటర్లకంటే ఎక్కువ అర్హతలు అవసర మవుతాయి. శాసన సభ పదవీకాలం మూడేండ్లు సమితిపదవీకాలం అయిదేండ్లు.

మొదటి నాలుగు సంవత్సరాలూ శాసనసభ అధ్యక్షులను గవర్నర్ జనరల్ నియ మిస్తారు. ఆతర్వాత శాసనసభే అధ్యక్షుణ్ణి ఎన్నుకుంటుంది. శాసనసభ ఉపాధ్యక్షుణ్ణి మాత్రం, మొదటినుంచీ శాసనసభ ఎన్నుకుంటుంది. రాజ్యసమితికి గవర్నర్ జనరల్ స్వయంగా అధ్యక్షత వహించేవారు. భారతదేశంలోని ప్రతి ఒక్కరికీ, ప్రతి విషయా నికీ సంబంధించి కొన్ని అర్హతలకు లోబడి శాసనాలుచేసే అధికారం, భారతీయ శాసన సభకు ఈచట్టంవల్ల లభించింది. భారతదేశపు ఆదాయం—ఋణాలకు సంబంధించిన చర్యలు; మతమూ, మతపరమైన కార్యకలాపాలు—భారతదేశంలోని బ్రిటిషు పాలితుల్లో ఏదో ఒక వర్గంవారిని వివియోగించుకోవడం—వీటికి సంబంధించిన చర్యలు; సైనిక-నౌకా-విమాన దళాల క్రమశిక్షణ - నిర్వహణ, విదేశ రాజులతో ప్రభుత్వాలతో ప్రభుత్వ సంబంధాలు—వీటికి సంబంధించిన చర్యలను ప్రవేశపెట్టేముందు, గవర్నర్ జనరల్ అనుమతి తీసుకోవలని వుంటుంది. ఇదేవిధంగా శాసనసభకు. వార్షిక బడ్జెటుగురించి చర్చించేహక్కు లభించింది. అయితే కొన్నిఅంశాలమీద ఓటింగ్ జరిగే వీలులేదు. సైనికఖర్చు ఇందులో ఒకటి. ఈ నిబంధనకు లోబడి శాసనసభ, పద్దులను త్రోసిపుచ్చ వచ్చు లేదా తగ్గించవచ్చు. ఆర్థిక విషయాల్లోతప్ప రాజ్యసమితికి శాసనసభతోపాటు సమానహక్కులున్నాయి.

భారతశాసనసభ ఆమోదించే ఏబిల్లునైనా వీటోచేసే హక్కు మాత్రమేకాక గవర్నర్ జనరల్‌కు ఆయన అవసరమని భావించినట్లయితే శాసనసభ విధించిన కోతను మళ్లీ భర్తీ చేసే అధికారంకూడా వుంది. సాధారణ శాసనాల విషయంలోకూడా ఆయనకు ఇటువంటి అధికారాలున్నాయి. ఉదాహరణకు భారతశాసనసభ ఏదైనా ఒకబిల్లును తిరస్కరించినట్లయితే దాన్ని ఆయన ఆమోదించవచ్చు. బ్రిటిష్ ఇండియా ప్రయోజనాల దృష్ట్యాశాంతి భద్రతలదృష్ట్యా దేశంలోని ఏదైనా ఒకభాగం ప్రయోజనాలదృష్ట్యా శాంతి భద్రతల దృష్ట్యా అటువంటి బిల్లు అవసరం అని పేర్కొని ఆయన ఆ బిల్లును ఆమోదించవచ్చు. 8

శాసనసభలో ప్రశ్నోత్తరాలకూ చర్చలకూ అవకాశాలు ఎక్కువయ్యాయి. అనుబంధ ప్రశ్నలడిగే హక్కు మూలప్రశ్న అడిగిన సభ్యుడికేకాక మిగతా సభ్యులకుకూడా ఏర్పడింది. సభ్యులు తీర్మానాలను ప్రతిపాదించవచ్చు. అవి ఆమోదం పొందినట్లయితే వాటిని పాలనా యంత్రాంగానికి శిఫార్సులుగా పరిగణిస్తారు.

ఈవిధంగా కేంద్రంనుంచి స్థానిక ప్రభుత్వాలకు కొంత అధికారం సంక్రమించి నప్పటికీ, శాసనసభల ఏర్పాటుకు విస్తృతమైన ఎన్నికల సూత్రాన్ని అనుసరించి నప్పటికీ, శాసన సభలకు బడ్జెటు - శాసనాలు మొదలైన విషయాల్లో అంతకుముందు కంటె ఎక్కువ అధికారాలు లభించినప్పటికీ ప్రభుత్వ విధానమూ పాలనాయంత్రాంగమూ స్థిరంగా కొనసాగేందుకు పూర్తి జాగ్రత్త తీసుకున్నారు.

సంస్కరణలు, భారతీయుల వైఖరి

1917 ఆగస్టు 20వ తేదీన చేసిన మాంటేగు ప్రకటనపట్ల భారతీయులు మొత్తంమీద సంతోషం వ్యక్తపరిచారు. భారతదేశంలో బ్రిటిష్ విధానంయొక్క లక్షణం, భారత దేశంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడమేనని చేసిన ప్రకటనపట్ల 1917 వ సంవత్సరం కలకత్తాలో జరిగిన సమావేశంలో భారత జాతీయ కాంగ్రెసు కృతజ్ఞతా పూర్వకమైన సంతృప్తి వ్యక్తపరిచింది. భారతదేశంలో బాధ్యతాయుత మైన ప్రభుత్వం ఏర్పాటుకు వీలు కల్పించే పార్లమెంటరీ చట్టాన్ని ఆమోదించాలని కాంగ్రెసు గట్టిగా కోరింది. బాధ్యతాయుతమైన ప్రభుత్వ ఏర్పాటు త్వరలో పూర్తి కావడానికి ఈ చట్టంలోనే కాల వ్యవధిని నిర్దేశించాలని సూచించారు. కాంగ్రెసు-లీగ్ సూచించిన సంస్కరణల పథకాన్ని వెంటనే ప్రవేశపెట్టాలని కోరుతూ 1917 నవంబరులో కాంగ్రెసూ ముస్లిం లీగూ కలిసి విదేశాంగ మంత్రికి వైస్రాయికి ఒకసంయుక్త వినతి పత్రాన్ని సమర్పించాయి. 1917లో కలకత్తాలో జరిగిన ముస్లిం లీగ్ వార్షిక సమావేశంలో ఈ కోరికలను పునరుద్ఘాటించారు.

మాంటేగు-ఛెమ్స్‌ఫర్డ్ నివేదిక విడుదలైనపుడు 1918 ఆగస్టులో కాంగ్రెసు, బొంబాయిలో ప్రత్యేక సమావేశం జరిపింది. నివేదికలోని కొన్ని ప్రతిపాదనలు పురోభివృద్ధికి తోడ్పడేవిగా ఉన్నప్పటికీ మొత్తంమీద "నిరాశాజనకంగానూ అసంతృప్తికరం" గానూ వున్నాయని సమావేశంలో అభిప్రాయ పడ్డారు. రాష్ట్రాల్లో మోస్తరుగానే కేంద్రంలో కూడా కేటాయించినవి బదలాయించినవి అన్న విభజనను అనుసరించాలన్నది వీరు కోరిన వాటిలో ప్రధానమైనది.

జిన్నాకూడా ఇదేమోస్తరు అభిప్రాయాలను వ్యక్తం చేశారు. 1918 సెప్టెంబరు 7వ తేదీన సార్వభౌమ్య శాసన నిర్మాణ సమితిలో, సురేంద్రనాథ్ బెనర్జీ ప్రతిపాదించిన తీర్మానం మీద మాట్లాడుతూ జిన్నా బ్రిటిష్ ప్రభుత్వం సంస్కరణల విషయమై చిత్తశుద్ధితో ప్రయత్నం చేసిందని గుర్తించారు. కాని ఇటువంటి చర్యతీసుకొనేందుకు విచారం వ్యక్తపరిచారు. కొన్నిరాష్ట్రాలు బాగా సమర్ధమైనవనీ ఈ రాష్ట్రాల్లో పోలీసు-న్యాయ శాఖలు తప్ప మిగతావాటిని బదలాయించిన వర్గంలో చేర్చాలని జిన్నాకోరారు. కేంద్రప్రభుత్వానికి సంబంధించినంతవరకూ, గవర్నర్ జనరల్‌కు ఎక్కువ అధికారాలిచ్చారనీ శాసనసభలోని ఎన్నికైన సభ్యులకు ప్రభుత్వాన్ని ప్రభావితంచేసే అవకాశాలు తప్ప ఏమీమిగలలేదనీ జిన్నా పేర్కొన్నారు. గవర్నర్ జనరల్‌కు వీటోచేసే హక్కు, శాసనాలను ఆమోదించే హక్కు ఏర్పడిన దృష్ట్యా ఎన్నికైన సభ్యులు బాధ్యతారహితమైన విమర్శకులుగా మాత్రమే మిగిలిపోయారని జిన్నా అభిప్రాయపడ్డారు.[9]
1919లో భారతదేశంలో రాజకీయవాతావరణం పూర్తిగా మారిపోయింది. భారతీయులు ఒక్కుమ్మడిగా ప్రతిఘటించి నప్పటికీ రౌలట్ బిల్లులు ఆమోదించబడ్డాయి. ఇవి చాలదన్నట్లు ఏప్రిల్ 13న జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ జరిగింది. దేశప్రజలంతా బ్రిటిష్‌వాలను పట్ల నిరసన తెలియజేశారు. 1919లో అమృతసర్‌లో జరిగిన భారత జాతీయ కాంగ్రెసు మహాసభలో దేశప్రజల కోపోద్రేకాలు ప్రతిబింబించాయి. వైస్‌రాయ్‌ని వెనక్కు పిలిపించవలసిందని కాంగ్రెసు కోరింది. సంస్కరణలచట్టం అసంతృప్తికరంగానూ నిరాశాజనకంగానూ వుందనీ చాలదనీ కాంగ్రెసు ప్రకటించింది. భారత దేశం, పూర్తిబాధ్యతాయుతమైన ప్రభుత్వానికి తగివుందని అంటూ కాంగ్రెసు దానికి వ్యతిరేకంగా వ్యక్తమైన ఊహలనూ అభిప్రాయాల నన్నింటిని ఖండించింది. అప్పటికీ బ్రిటిష్‌వారి సదభిప్రాయంలో భారతీయుల నమ్మకం సడలలేదు. '' వీలైనంత వరకు సంస్కరణలను అమలు జరిపేందుకే " కాంగ్రెసు నిశ్చయించుకుంది. ఆ విధంగానైనా త్వరగా బాధ్యతాయుతమైన ప్రభుత్వాంగఏర్పాటుకు ప్రయత్నించవచ్చునని ఆశించింది. సంస్కరణలకోసం పాటుబడినందుకు కాంగ్రెసు మాంటేగుకు కృతజ్ఞత తెలియచేసింది. రౌలట్ చట్టాలు, జలియన్‌వాలా బాగ్ హత్యాకాండా తర్వాత, గాంధీజీకి బ్రిటిష్ ప్రభుత్వం

"పైశాచిక ప్రభుత్వమని" నమ్మకమేర్పడింది. 1919 డిశంబరు 31 వ తేదీ యంగ్ యిండియాలో ఆయన ఈ విధంగా వ్రాశారు.

"భారతదేశానికి న్యాయం చేకూర్చాలని బ్రిటిష్ ప్రజలు చిత్తశుద్ధితో తలపెట్టడం వల్లనే సంస్కరణల చట్టమూ ప్రకటనా అమల్లోకివచ్చాయి. ఆవిషయంలో ఎవరికీ ఎటువంటి సందేహాలు ఉండనక్కరలేదు. అందువల్ల సంస్కరణలను తప్పులెంచుతూ విమర్శించకుండా అవి విజయవంతంగా అమలు జరిగేట్లు కృషిచేసి పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వంకోసం ఎదిరిశించడం మన విద్యుక్తధర్మం"10

సహాయ నిరాకరణ – సంస్కరణల నిషేధం :

కాని అప్పటి యదార్ధ పరిస్థితుల బట్టి, ప్రజా బాహుళ్యంతో సన్నిహిత సంబంధం వున్న ఏ సంస్థ అయినా విదేశాల్లోని ప్రతిఘటన భావంవల్ల కలిగే ఫలితాలకు గురికాక తప్పదు. పంజాబ్‌లో జరిగిన అకృత్యాలు దేశప్రజలందరినీ గాయపరిచాయి. బొంబాయిలో లక్షమంది ఫ్యాక్టరీ పనివారు 1919 జనవరిలో సమ్మె జరిపారు. 1919 ఏప్రిల్ 6 వ తేదీన హర్తాళ్ జరుపవలసిందని గాంధీజీ కోరగా అతి విజయవంతంగా జరిగింది సెవ్రస్ ఒప్పందం మూలంగా టర్కీపట్ల వెల్లడైన బ్రిటిష్ వైఖరి, ముస్లింలను పూర్తిగా నిరాశ పరచింది. ఖిలాఫత్ ఉద్యమం అప్పటికే ప్రారంభమైంది. హిందువులు ముస్లింలమధ్య అంతకుమునుపెన్నడులేనంత సుహృద్భావం ఏర్పడిందని అధికారరీత్యా ఒప్పుకున్నారు. "రాజకీయ పరిజ్ఞానం వున్నవారిలో అశాంతి, పై తరగతి మహ్మదీయుల్లో ఆందోళన, ప్రజలఇక్కట్లూ ఇవన్నీ కలసి దేశంలో కల్లోలానికి దారితీసే ప్రమాదం ఎంతైనా వుందని అధికార పత్రాల్లో పేర్కొన్నారు. 11పరిస్థితి ఎంతతీవ్రంగా ఉందో కాంగ్రెసు అధ్యక్షుడైన లాలాలజపత్‌రాయ్ ప్రకటనవల్ల తెలుస్తువుంది. 1920 సెప్టెంబరులో కాంగ్రెసు జరిపిన ప్రత్యేక సమావేశంలో ఆయన ఈ విధంగా అన్నారు. " ప్రస్తుతం దేశంలో తిరుగుబాటు జరుగుతూ వుంది, దీన్ని గుర్తించక పోయినంత మాత్రాన లాభంలేదు. "12 పోరాటాన్ని ప్రారంభించేందుకు గాంధీజీ సిద్ధంగావున్నారు. అందువల్ల "పొరపాట్లను సరిదిద్దే వరకూ (పంజాబ్‌ఖిలాఫత్) స్వరాజ్యం లభించేవరకూ శ్రీ గాంధీ ప్రారంభించిన (లాంఛనంగా 1920అగస్టు 1న) అభ్యుదయకరమూఅహింసాయుతమూ సహాయనిరాకరణమూ అయిన విధానాన్ని ఆమోదించి అమలు జరపడం తప్ప భారతీయులకు మరొకమార్గం లేదని" కాంగ్రెస్ నిశ్చయించింది.13

దేశమంతటా సహాయనిరాకరణ ఉద్యమానికి ఈ విధంగా అంతా సిద్ధమైంది. దీక్షతోపాటు సంస్కరణలను నిషేధించడం, కొత్తశాసన సభలకు ఎన్నికలు కూడా ప్రారంభమయ్యాయి.

## ఉదారవాదుల వైఖరి

భారత జాతీయ కాంగ్రెసు 1916లో లక్నోలో జరిపిన సమావేశంలో మితవాదులూ అతి వాదులూ మళ్ళీ ఏకమయ్యారు. కాంగ్రెసూ-లీగ్ సంయుక్తంగా సూచించిన సంస్కరణల పథకాన్ని మితవాదులు సమర్థించారు. కాని 1917లో లోకమాన్యతిలక్ అనీబిసెంట్ నాయకత్వంలో జరిగిన స్వదేశపాలన ఉద్యమంతో మితవాదులూ అతివాదులమధ్య మళ్ళీ చీలిక ఏర్పడింది.

మాంటేగు చెమ్స్‌ఫర్డ్ నివేదిక 1918 జూలైలో విడుదలైనపుడు, అప్పట్లో అతివాదిగా వ్యవహరింప బడుతున్న శ్రీమతి బిసెంట్ నివేదికను "ఇంగ్లాండు ప్రవేశపెట్టవలసినదీ కాదు భారతదేశం అంగీకరించవలసినదికూడా కాద"ని నిరసించారు. ఈ పథకం పూర్తిగా, సూత్రరీత్యా సవివరంగాకూడా లోపభూయిష్ఠమైనదని పేర్కొంటూ చర్చకు గాని రాజీకిగాని ఇది ప్రాతిపదిక కాజాలదనీ దీన్ని పూర్తిగా మానుకొని మరొక కొత్తదాన్ని ప్రవేశ పెట్టాలని కోరుతూ మద్రాసుకు చెందిన పదిహేనుగురు కాంగ్రెసునాయకులు ఒక ప్రకటన విడుదల చేశారు. బెంగాల్‌లోని తీవ్రవాద-కాంగ్రెసు సభ్యుల అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ బెంగాల్‌రాష్ట్ర మహాసభకు చెందిన సంఘం, ఒక కరపత్రాన్ని విడుదల చేసింది. ఉలపెట్టిన సంస్కరణల్లో పెద్ద మార్పులు చేయాలని వీరు కోరారు. పథకం "ఏ మాత్రమూ ఆమోదయోగ్యం కాదని" తిలక్ గర్జించారు.[12]

కాంగ్రెసు సభ్యులు కొంతమంది చేసిన ఈ ప్రకటనలతో మితవాదులు భయపడి నట్లు తెలుస్తూవుంది. (1919 వరకూ కాంగ్రెసు ఆమోదించిన తీర్మానాల దృష్ట్యా ఈ భయం అనవసరమేమో అని పిస్తుంది.) సంస్కరణల ప్రతిపాదనలు అప్పటి పరిస్థితులకంటె ఎంతో మెరుగ్గా వున్నాయనీ అందువల్ల వాటిని తీవ్రంగా విమర్శించకుండా వాటిలో వెల్లడైన సద్భావాన్ని అర్థంచేసుకోవాలనీ మితవాదులు అభిప్రాయపడ్డారు. భారతదేశంలో ఈ పథకాన్ని వ్యతిరేకించి నట్లయితే ఇంగ్లండులోని కఠినులకు మరింత బలం చేకూరుతుందనీ ఇది, భారతదేశానికి మంచిదికాదనీ వీరు వాదించారు.

ఈలోగా జాతీయపోరాటం ప్రధానస్రవంతినుంచి ముస్లిం మతవాదులను, మితవాదులను వేరు చేసేందుకు ప్రయత్నాలు కొనసాగుతూనే వున్నాయి. భారతదేశంలో తమ పథకాన్ని సమర్థించే వారు కొంతమంది అయినా వుండరా అని మాంటేగు మొదటినుంచీ ఆశిస్తూ వున్నారు. 1917 డిశంబరు 22న ఆయన తమ డైరీలో ఈ విధంగా వ్రాసుకున్నారు.

"మన పథకం కొన్ని సూత్రాలకు అనుగుణంగా వున్న పక్షంలో (వీటిని మనం ప్రకటించవలసివుంది) ప్రజల్లో మనలను సమర్థించేవారు కొంతమంది అయినా

వుండడం అవసరం. లేక పోయినట్లయితే, మనపథకాన్ని భారతీయుల్లో ఎవరైనా అమలు పరుస్తారని మంత్రిమండలికి నేను ఏ విధంగా హామీ ఇవ్వగలనో తెలియడం లేదు."13

"మనలను సమర్థించేందుకు కొంతమందిని పోగుచేసుకుంటే తప్ప ఈ పథకాన్ని మనం ఎన్నటికీ అమలు జరుపలేం"14 అని మాంటేగుకు బాగా తెలిసివచ్చింది. 1918 జనవరి 21 న ఆయన ఈ విషయమై మితవాద నాయకులతో సంభాషించారు. ఈ సంభాషణలు ఆయనకు సంతృప్తినికలిగించాయి. ఆయన తమ డైరీలో ఈ విధంగా వ్రాసుకున్నారు.

"మితవాద పార్టీని ఏర్పాటు చేయాలని మేము అనుకున్నాము. వీరు ఎంతో ఆసక్తి కనబరిచారు. వార్తా పత్రికలను ఎడిట్ చేయడం మొదలైన వాటిని గురించి వారుమాట్లాడారు. వీరు కార్యశీలురనే అనుకుంటున్నాను."15

"ప్రభుత్వం ఒక విధానం ప్రాతిపదికగా తనను తాను సమర్థించుకున్నట్లయితే. మితవాదులు త్వరలో ప్రభుత్వానికి అనుకూలంగా తయారవుతార"ని మాంటెగుకు నమ్మకం కుదిరింది. ఒకవేళ ఆవిధంగా జరగనిపక్షంలో లోపం ప్రభుత్వానిదే అవుతుందికాని మితవాదులది కాదని ఆయన అభిప్రాయపడ్డారు. వారికి కావలసినది అధికార్ల అండ అనుకున్నారాయన.

"ప్రభుత్వ రాజకీయ పార్టీకి చెందిన నిజమైన నాయకులైన అధికార్ల అండగాని బలంగానీ సహాయంగాని లేకుండా చేయడంతో వారిలో వారికే నమ్మకంలేకుండాపోయింది."16

ఈ పొరపాటును దిద్దుకోవలసి వచ్చింది. 1917 డిశంబరు 12వ తేదీన, మాంటెగు తమ పథకాన్ని తయారు చేసుకుంటూ, తమ ప్రతిపాదనలో ఈ క్రింది ప్రతిపాదనను పొందుపరిచారు:

"భారతీయులతో ఒక కొత్త సంస్థను ఏర్పాటు చేయాలి. మన ప్రతి పాదనలకు అనుకూలంగా ప్రచారం చేసేందుకూ మనకు సహాయంగా ఉండేందుకు ఇంగ్లాండుకు ఒక ప్రతినిధివర్గాన్ని పంపేందుకూ ప్రభుత్వం దీనికి అన్ని విధాలా సహాయంచేయాలి."17

దీని కంతటికీ ఫలిత మేమిటంటే, కాంగ్రెసు, 1918 అగస్టులో సంస్కరణలను గురించి చర్చించేందుకు బొంబాయిలో ప్రత్యేక సమావేశం జరిపినపుడు మితవాదులు హాజరుకాలేదు. ఆ తర్వాత కొంతకాలనికే అంటే 1918 నవంబరులో, అదేనగరంలో, విడిగా అఖిలభారత మహాసభ జరుపుకున్నారు.

"లిబరల్ పార్టీ అయినమేము, అభ్యున్నతికి మిత్రులం, తిరుగుబాటుకు శత్రువులం" అని బాహాటంగా ప్రకటించారు. "వీలున్నపుడు సహకరించు, అవసరమైనపుడు

విమర్శించు" అన్నది వారి ఆదర్శమైంది. 'రాజకీయాల్లో రాజ్యాంగ అభివృద్ధికి అద్భుతాలు ఏవీ లేవని" వారు విశ్వసించారు.[18]

అయితే మితవాదుల్లోని చాలామందినాయకులూ సాధారణ సభ్యులుకూడా పోరాటం జరపాలని కృత నిశ్చయంతో వున్న కాంగ్రెస్ వైపుకు మళ్ళారు. మిగిలిన మితవాదులు విడిగా ఒక రాజకీయ పార్టీని ఏర్పాటు చేసుకున్నారు. దీనిపేరు : అఖిల భారత జాతీయ లిబరల్ ఫెడరేషన్. సంస్కరణల పథకాన్ని సవరించాలనీ విస్తృతపరచాలనీ వీరు సూచించారు. కాని సంస్కరణలను అమలుపరచడంలో ప్రభుత్వంతో సహకరించాలన్నదే వారి విధానం. ప్రభుత్వానికి అవరోధంగా ఉండడం కన్నా ఇదే మేలని వారు భావించారు.

## సవరణల చట్టం మొదటి మూడు సంవత్సరాలు

1919వ సంవత్సరపు భారతప్రభుత్వ చట్టంకింద రాష్ట్రశాసన సమితులకూ కేంద్రంలో ఉభయసభలకూ మొదటిసారి ఎన్నికలు 1920 నవంబరులో జరిగాయి. ఈ ఎన్నికలను కాంగ్రెసు బహిష్కరించడంచేత, మితవాదులు మాత్రమే రంగంలో అభ్యర్థులుగా మిగిలారు. విభిన్న రాజకీయ విధానాలూ పథకాలూ కలిగిన వివిధ రాజకీయ పార్టీలమధ్య నిజమైన పోటీలేకపోవడంతో ఎన్నికల వాతావరణం అవాస్తవికంగా కనిపించింది.

నిర్బంధాలకింద ఓటుహక్కు పరిమితమైంది. స్త్రీలకు ఓటుచేసేహక్కులేదు. 6,200,000 మంది ఓటర్లపేర్లుమాత్రమే నమోదయాయి. అంటే బ్రిటిష్ ఇండియాలోని మొత్తం జనాభాలో నూటికి 2, 3/4 వంతులమంది మాత్రమేనన్నమాట. కాంగ్రెసు, ఎన్నికలను నిషేధించడంవల్లకూడా కొంత ఫలితం కనిపించింది. అధికార సంఖ్యావివరాల ప్రకారం ఓటర్లలో నూటికి ఇరవైవంతుకంటె ఎక్కువమంది, శాసన సభకు జరిగిన ఎన్నికల్లో పాల్గొనలేదు.

కాంగ్రెసు అభ్యర్థి ఎవరూ ఎన్నికల్లో పోటీచేయకపోవడంవల్ల మితవాదులు సులభంగా గెల్చారు. సంస్కరణలు అమల్లోకి వచ్చినతరువాత మొదటి మూడు సంవత్సరాలు భారత శాసనసభ, ఉదారవాది శాసనసభ అనివర్ణించవచ్చు.

సమితులవెలుపల దేశవ్యాప్తంగా ఉద్యమం జరుగుతూవుందనీ బ్రిటిష్‌పాలన చేస్తున్న అకృత్యాలకు ప్రజలు ఉడికిపోతున్నారనీ ఉదారవాదులకు తెలుసు. అందువల్ల వారిపని కష్టతరమైంది. బ్రిటిష్ ప్రభుత్వం తరఫున క్షమాపణ వేడుకుంటున్న వారము కామని వారు నిరూపించు కోవలసివుంది. ఆదేసమయంలో సంస్కరణల అమలుకు అవరోధంగా వుండేవీలుకూడాలేదు. సంస్కరణలు ఉత్తబూటకమన్న జాతీయవాదుల

ఆరోపణలనుకూడా ప్రభుత్వం ఖండించవలసి వుంది. ప్రభుత్వ ప్రయోజనాలకు భంగం కలుగని విధంగా సభ్యుల అభిప్రాయాలను లెఖ్ఖలోకి తీసుకోవడం అవసరమైంది.

శాసన సభ మొదటిసారి సమావేశమైనప్పుడే పరిస్థితి ఎంత ఇబ్బందికరంగా వున్నదీ తెలిసింది. 1921 ఫిబ్రవరి 15 వ తేదీన బొంబాయికి చెందిన జమునాదాస్ ద్వారకదాస్ బ్రిటిష్ సామ్రాజ్యమూ భారతదేశము మధ్య సంబంధాలు, అన్ని జాతులు సమానమన్న సిద్ధాంతం ఆధారంగా ఉండేట్టు చూస్తామని భారతప్రభుత్వం ప్రకటించాలని కోరుతూ సభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. పంజాబులో సైనిక శాసనం ఈ సిద్ధాంతాన్ని ఉల్లంఘించినందుకు ప్రభుత్వం విచారాన్ని వ్యక్తపరచాలని కూడ తీర్మానంలో కోరారు. తమ అధికారాన్ని దుర్వినియోగం చేసిన అధికార్ల మీద, వారు మళ్ళీ ఆవిధంగా ప్రవర్తించకుండా చర్య తీసుకోవాలనీ చనిపోయిన గాయపడిన వారి కుటుంబాలకు తగిన పరిహారాన్ని అందచేసేట్టు చూడాలనికూడా తీర్మానంలో కోరారు. దీనిమీద చర్చ ఉద్రిక్తంగానే జరిగినా సుహృద్భావ వాతావరణంలో జరిగింది. రాజకీయ పరిజ్ఞానం వున్న ప్రతి భారతీయుడి మనస్సులోనూ ఆ సమయంలో మెదులుతూన్న విషయానికి సంబంధించినది ఈ తీర్మానమని అందరికీ తెలుసు. దేశ వ్యవహారాల సభ్యుడు సర్ విలియమ్ విన్సెంట్ ప్రభుత్వ పరిస్థితిని వివరించలేక చాలా అవస్థ పడ్డారు. ఆయన సానుభూతిని వ్యక్తపరిచారు కాని, అధికార్లను శిక్షించే విషయానికి సంబంధించిన భాగాన్ని మాత్రం ప్రభుత్వం ఆమోదించ జాలదని తెలియ చేశారు. తీర్మానాన్ని ప్రతిపాదించిన సభ్యుడు, ప్రభుత్వం సానుభూతిని అర్థం చేసుకుని ఈ భాగాన్ని ఉపసంహరించు కున్నారు. అతర్వాత తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు.

గోఖలే మరణం తర్వాత మితవాదులకు నాయకత్వం వహించిన శ్రీనివాస శాస్త్రి రాజ్య సమితికి సభ్యులుగా ఎన్నికయ్యారు. కాలయాపన చేయకుండా ఆయన, (1921 ఫిబ్రవరి 14) సమితిలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. ప్రజలను అణచివేసేందు కుద్దేశించిన చట్టాలను పరిశీలించి వాటన్నిటినీ రద్దు చేయాలా లేక కొన్నిటిని రద్దు చేయాలా రద్దు చేయడం వాంఛనీయం కాని పక్షంలో అటువంటి చట్టాలను సవరించాలా, సవరించవలసిన పక్షంలో ఏవిధంగా సవరించాలి అన్న విషయమై నివేదించేందుకు ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించాలని ఈ తీర్మానంలో శిఫార్సు చేశారు.

తమ తీర్మానం గురించి మాట్లాడుతూ శాస్త్రి, సభ చర్చనీయాంశావళిలో సభా కార్యక్రమాల మొదటి రోజునే తమ తీర్మానాన్ని చేర్చినందుకు ప్రభుత్వానికి తమ

కృతజ్ఞత తెలియచేశారు. ప్రభుత్వం సుహృద్భావంతోనూ మైత్రీభావంతోనూ వ్యవహరించినందుకు ఆయన సంతృప్తి వ్యక్తపరిచారు. దేశంలో గొడవలూ తీవ్రమైన అశాంతీ ఉన్నసంగతి నిజమేనని ఆయన ఒప్పుకున్నారు. అయినా ప్రజలను అణిచివేసేందు కుద్దేశించిన చట్టాలను పరిశీలించాలని ఆయన శిఫార్సు చేశారు. ఈ చట్టాలు అమల్లో వుండడమే అశాంతికి కొంత కారణమని ఆయన చెప్పారు. అప్పట్లో అమల్లో వున్న ఇటువంటి చట్టాలను వివరిస్తూ వీటిని రద్దు చేయడంగాని సవరించడంగాని అవసరమని చెప్పారు. అహింసాయుత సహాయ నిరాకరణ అన్న సిద్ధాంతం స్థానే అహింసాయుత సహకారం అన్నసిద్ధాంతాన్ని అవలంబించాలని విజ్ఞప్తి చేస్తూ తమ ఉపన్యాసాన్ని ముగించారు.[19]

ప్రజలను అణిచివేసే చట్టాలను వెంటనే పూర్తిగా రద్దు చేయాలని ప్రజలు కోరుతున్నపుడు ఒక సంఘాన్ని నియమించడం వల్ల అంత ఫలితం వుండబోదని రంగస్వామి అయ్యంగార్ అనుమానం వ్యక్తపరిచారు. ఇపర్దే ఒక సవరణ ప్రతిపాదిస్తూ, కొన్ని చట్టాలను రద్దు చేయాలని కోరారు. అటువంటి చట్టాలను ఆయన పేర్కొన్నారు కాని సవరణ వీగిపోయింది. శాస్త్రి తీర్మానం ఆమోదం పొందింది.

1921మార్చి 3వ తేదీన శాస్త్రిసమితిలోమారొక్తీర్మానాన్ని ప్రతిపాదించారు. అల్లర్లనూ చట్ట వ్యతిరేక సమావేశాలనూ అణిచివేసే సమయంలో తుపాకులు మొదలైన వాటిని ఎటువంటి పరిస్థితుల్లో ఉపయోగించాలో ఖచ్చితంగా పేర్కొంటూ శిక్షా స్మృతినీ ఇతర చట్టాలనూ సవరించాలని ఈ తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు శిఫార్సు చేశారు. భారతీయ చట్టాన్ని ఇంగ్లీషు చట్టంతో సమానం చేయాలని గట్టిగా కోరారు. తుపాకులు మొదలైన మందుగుండు సామాగ్రిని ఉపయోగించడానికి కారకులైన అధికార్ల మీద ప్రభుత్వం అనుమతి లేకుండానే చట్టరీత్యా చర్యతీసుకునే వీలుండాలనీ ఆయన సూచించారు. ప్రజలమీద కాల్పులు జరిగిన ప్రతి సందర్భంలోనూ దర్యాప్తు జరిపించాలని కోరారు. ఈ శిఫార్సులు పాలనా వ్యవస్థ విధానానికి పనిచేస్తున్న తీరుకూ వ్యతిరేకంగా ఉండడంచేత ప్రభుత్వం వీటిని ఆమోదించ లేదు. ఈ శిఫార్సులను అమలు పరచినట్టయితే అల్లర్లను అణిచివేసే అధికార్ల పని దాదాపు అసాధ్యమే అవుతుందని ప్రభుత్వం మొర పెట్టుకుంది. అందువల్ల తీర్మానాన్ని ఆమోదించలేదు.

ప్రజలను అణిచివేసేందు కుద్దేశించిన చట్టాలను పరిశీలించేందుకు ఒక సంఘాన్ని ఏర్పాటు చేయాలన్న శాస్త్రి తీర్మానాన్ని మాత్రం ప్రభుత్వం ఆమోదించింది. ఆ సమయంలో తేజ్ బహాదుర్ సప్రు భారత ప్రభుత్వంలో న్యాయశాఖ సభ్యులుగా వుండేవారు. అందువల్ల ప్రజలను అణిచివేసేందు కుద్దేశించిన చట్టాల్లో కొన్నిటిని ఆఖరుకు 1922 లో

రద్దు చేసేందుకు వీలుపడింది. (ఉదాహరణకు, 1910 వ సంవత్సరపు పత్రికల చట్టం 1908 వ సంవత్సరపు రెచ్చగొట్టే నేరానికి సంబంధించిన పత్రికల చట్టం, 1908 వ. సంవత్సరపు భారతీయ నేరాల శాసనం సవరణ చట్టం)

కాని, ప్రభుత్వం, అణిచివేసే విధానాన్ని మొత్తం విడనాడే విషయమై శాసన సభ్యుల్లో విభేదాలేర్పడ్డాయి. మున్షీ ఈశ్వర్ సరన్ 1922 జనవరి 18 వ తేదీన శాసన సభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. "దేశంలో ప్రారంభించిన దమనవిధానాన్ని వెంటనే ఒదులుకోవాలని" అయన తమ తీర్మానంలో గవర్నర్ జనరల్‌ను కోరారు. తీర్మానంగురించి మాట్లాడుతూ, సహాయనిరాకరణ ఉద్యమాన్ని నిర్వహించేందుకుగాను ఏర్పాటైన "జాతీయ వలంటీర్లు" హింసాకాండకు పూనుకునే సంస్థ ఏమీకాదని ఉద్ఘాటించారు. "వలంటీర్లలో ఎవరైనా ఎక్కడైనా హింసాకాండకు పూనుకోవచ్చు కాని సంస్థ లక్షణం మాత్రం అహింస. సహాయనిరాకరణకు కారణాలైన వాటి గురించి ఆలోచించకుండా దాన్ని ప్రతిఘటించి నట్టయితే ప్రభుత్వం దాన్ని ఎప్పటికీ నాశనం చేయజాలదు."20

రాయ్ బహదుర్ బిషంబర నాథ్, తీర్మానాన్ని గట్టిగా బలపరిచారు. "ఏమాత్రమూ క్లిష్టంగాలేని పరిస్థితి క్లిష్టంగా చేశారనీ ఆశతో భయంతో ప్రభుత్వం దీన్ని మరింత అధ్వాన్నం చేస్తూవుందని" ఆయన చెప్పారు.21

తీర్మానాన్ని ఇంతగట్టిగానూ వ్యతిరేకించిన వారుకూడా లేక పోలేదు. సహాయ విరాకరణ ఉద్యమంలో ఏం జరుగుతున్నదీ గమనించి నట్టయితే గాంధీజీ మెట్టు మెట్టుగా పాలనాయంత్రాంగాన్ని పూర్తిగా అస్తవ్యస్తం చేయాలన్న తమలక్ష్యాన్ని చేరుకుంటున్నట్టు తెలిసిపోతుందని బొంబాయికి చెందిన ఎన్. యమ్. సమర్థ్ చెప్పారు. మరొకవైపున ప్రభుత్వం ఎంతో ఓర్పుతోనూ సహనంతోనూ వ్యవహరిస్తూవుందనీ "అందోళనను ఆదిలోనే తుంచివేయలేదనీ రెండేండ్ల క్రితమే అపనిచేసి వుండవలసిందనీ ..."22 చెప్పారు. తీర్మానం వీగిపోయింది.

తీర్మానం గురించి మాట్లాడుతూ అప్పటి ప్రధాన మితవాదుల్లో ఒకరైన పి. ఎస్. శివస్వామి అయ్యర్, ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం పూర్తిగా అణిచి వేసే విధానం కాదని అభిప్రాయ పడ్డారు. విభిన్న అభిప్రాయాలు కలవారితో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేయాలన్న సూచనకు ఆయన ఈ విధంగా సమాధానమిచ్చారు.

"సహాయాన్ని విరాకరిస్తున్న వారికి నియంతగా గాంధీజీ వున్నంతకాలం, స్వరాజ్యాన్ని వీలైనంత త్వరగా సంపాదించేందుకు ప్రయత్నిస్తూ ఒక ప్రవక్తగా తమ పేరు ప్రఖ్యా

తులను కాపాడుకోవాలని ఆయన ఆదుర్దాగా వున్నంతకాలం... ... ... సంతృప్తి కరమైన ఫలితాలను సాధించడం అసాధ్యం."23

నేరవిచారణ శాసనం సవరణ చట్టాన్ని మరీ విస్తృతంగా అమలు పరచారనీ చాలా మందిని అరెస్టుచేశారనీ అయ్యర్ ఒప్పుకున్నారు. అందువల్ల పరిస్థితిని కొంత సడలింప చేసేందుకుగాను రాష్ట్రప్రభుత్వాలకు ఆదేశాలివ్వ వలసిందని భారత ప్రభుత్వాన్ని కోరుతూ ఆయన సరన్ తీర్మానానికి సవరణ ప్రతిపాదించారు.

సైన్యంగురించి ప్రస్తావించినపుడు మాత్రం శివస్వామి అయ్యర్ అస్పష్టంగా మాట్లాడారు. అంతకుముందు భారతీయ సైన్యం పాలనా నిర్వహణ వ్యవస్థీకరణ గురించి దర్యాప్తు జరిపేందుకు బ్రిటిష్ ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. దీనికి లార్డ్ ఏషర్ అధ్యక్షులు. ఈ సంఘం తన నివేదికలో ఈ విధంగా పేర్కొంది. "సైనిక కార్య కలాపాలకు కేంద్రం పశ్చిమం నుంచి తూర్పుకు మారిపోయింది. భవిష్యత్తులో మనసైన్యాలు మధ్య ప్రాచ్యంలో సైనికకార్యకలాపాలు సాగించే అవసరం రావచ్చు. సైన్యంలో కొంతభాగం భారత దేశంలోను కొంతభాగం స్వదేశాల్లోనూ ఉండవచ్చు. భారతీయ సైన్యం. సామ్రాజ్యంలోని ఇతర సైనికులతో కలిసి ప్రతి యుద్ధరంగంలోనూ పోరాడింది. ఈ విధంగా దాని బాధ్యతలు ఎక్కువయాయి. స్థానిక శక్తి అని ఇక మీద అనుకునేందుకు లేదు. ప్రపంచంలో ఎక్కడైనా పోరాడేందుకు సిద్ధంగావుండే సామ్రాజ్య సైన్యంలో ఒక భాగంగా మాత్రమే దీన్ని చూడాలి ".24

ఏషర్ నివేదికలో పేర్కొన్న ఈ అంశాలతో దేశవ్యాప్తంగా భయాందోళనలు వ్యాపించాయి. విస్తృత పరచిన సైన్యానికయే విపరీతమైనఖర్చును భరించవలసి వుంటుం దని భయపడ్డారు. సామ్రాజ్యసైన్యంలో భాగంగా బ్రిటిష్ సామ్రాజ్యం సరిహద్దులను రక్షించవలసి వుంటుందని కూడా భయపడ్డారు.

అయ్యర్, ఏషర్ నివేదికకు సంబంధించి శాసన సభలో 1921 మార్చి 28 వతేదీన వరుసగా 13 తీర్మానాలను చేశారు.

భారతసైన్యాన్ని భారతసరిహద్దుల వెలుపల ఉపయోగించ రాదన్నది ఆయన చేసిన శిఫార్సులలో ప్రధానమైనది. విదేశంలోవున్న సైనికదుర్గాల్లో పనిచేయడానికి, గవర్నర్ జనరల్ అనుమతితో పంపించవచ్చు, అదికూడా, ఖర్చును భారతదేశం భరించనక్కర లేనట్టయితే, విధానమూ వ్యవస్థీకరణ విషయాల్లో భారతసైన్యం ఇంగ్లండులోని యుద్ధ విషయాల కార్యాలయం ఆధీనంలో వుండరాదు. భారతదేశంలోని సైనిక - నౌక - విమానదళాలకు చెందిన అన్ని శాఖల్లోకి భారతీయులను తీసుకోవాలని ఆయన ఒక తీర్మానంలో శిఫార్సు చేశారు. రాజుప్రతి ఏటా మంజూరుచేసే కమీషన్లో ప్రారంభంలో

నూటికి ఇరవై అయిదువంతులకు తక్కువ కాకుండా భారతీయుల కివ్వాలని మరొక తీర్మానంలో శిఫార్సు చేశారు.

అయ్యర్ తీర్మానాల్లో చాలావాటిని శాసనసభ ఆమోదించింది. వీటిని అతర్వాత భారత ప్రభుత్వం విదేశాంగ మంత్రికి తెలియ పరచింది. నిజానికి వీటి ప్రభావం ప్రభుత్వ సైనిక విధానం మీద కొంత పడింది. డెహరాడూన్‌లో రాయల్ సైనిక కళాశాల నొకదాన్ని ఏర్పాటు చేసేందుకు అంగీకరించారు. 1923లో సైన్యంలో ఎని మిది విభాగాల్లోకి పూర్తిగా భారతీయులనే తీసుకుంటారని ప్రకటించారు.26

నామినేటెడ్ సభ్యులైన ఎన్. ఎమ్. జోషి కార్మిక శాసనాల విషయంలో ఎంతో శ్రద్ధ వహించారు. అధికార్లు, తమహోదాను ఉపయోగించి ఉచితంగా సేవపొందడం ఉచితంగా వస్తుసామాగ్రి పొందడం అరికట్టేందుకు ఆయన శాసన సభలో ఒక తీర్మా నాన్ని ప్రవేశపెట్టారు. అధికార్లు పనిమీద గ్రామాంతరం వెళ్ళినప్పుడు గ్రామ పెద్దను బలవంతపెట్టి గ్రామపెద్దకింది వున్న గ్రామస్తులచేత పని చేయించుకుంటున్నారనీ తమకు కావలసిన వంట సామాగ్రిని గ్రామంలోని వర్తకుడినుంచి ఉచితంగా పొందుతున్నారనీ దీన్ని ఆపి వేయాలనీ ఆయన తమ తీర్మానంలో పేర్కొన్నారు. 27

జోషి కృషివల్లనే కొన్ని కార్మిక చట్టాలను ఆమోదించడమూ కొన్నిటిని సవరిం చడమూ జరిగింది. భారత ఫ్యాక్టరీల చట్టాన్ని సవరించి కర్మాగారంలో వారానికి పనిగంటలను అరవైకి పరిమితం చేశారు. పనివారి నష్ట పరిహారం చట్టం వల్ల కార్మికుడికి ప్రమాదాలనుంచి రక్షణ కలిగింది. భారతీయ గనుల చట్టంవల్ల గనులకు సంబంధించి ఒక బోర్డును ఏర్పాటు చేసేందుకు వీలుఏర్పడింది. బోర్డులో కార్మికులకు కూడా ప్రాతినిధ్యం వుండేది.

## ప్రభుత్వానికీ శాసనసభకూ మధ్య విభేదాలు

మామూలుగా పాలనా యంత్రాంగానికీ శాసనసభకూ మధ్య సంబంధాలు స్నేహ సుహృద్భావాలతో కూడివుండేవి. కాని ఉద్రిక్తత లేకపోలేదు. 1922 సెప్టెంబరులో ప్రభుత్వానికీ శాసనసభకూ మధ్య తీవ్రమైన భేదాభిప్రాయం ఏర్పడింది. ప్రభుత్వం శాసన సభలో ఒక బిల్లును ప్రవేశ పెట్టాలని తలపెట్టింది. సంస్థానాధీశులపట్ల ద్వేషాన్నీ జుగుప్సనూ విరోధభావాన్ని పురికొల్పేందుకుద్దేశించిన రచనలను పుస్తకాల ద్వారాగాని పత్రికలద్వారాగాని వ్యాపింప చేయకుండా అరికట్టేందుకు ఈ బిల్లును తలపెట్టిన. దీనివల్ల, సంస్థానాధీశులను న్యాయసమ్మతంగా విమర్శించే అవకాశం పూర్తిగా పోతుందని పేర్కొంటూ మున్షీ ఈశ్వర్ సరన్ దీన్ని ప్రతిఘటించారు. అవరిమిలా శాసనసభ ఆ బిల్లును ప్రవేశ పెట్టేందుకు అనుమతి నిరాకరించింది. భారత బ్రిటిష్ ప్రభుత్వానికి

సంస్థానాధీశులు ప్రధానమైన అండకావడంతో గవర్నర్ జనరల్ తన ప్రత్యేక అధికారులను వినియోగించి మొదటిసారిగా, ఈ బిల్లు అవసరమని పేర్కొనడంతో రాజ్యసమితి ఆమోదించింది. గవర్నర్ జనరల్ ఆమోదంపొంది బిల్లు చట్టమైంది.

1923 లో శాసన సభలో 1923-24 వ సంవత్సరానికి బడ్జెటును ప్రవేశ పెట్టి నపుడు ఇంతకంటే తీవ్రమైన రాజ్యాంగ సమస్య తలఎత్తింది. లోటును భర్తీ చేసేం దుకు గాను ప్రభుత్వం ఉప్పుమీద పన్నును రెండింతలు చేయాలని తలపెట్టింది. సైన్యము-సర్వీసులవంటి వాటికి విపరీతమైన ఖర్చుపెడుతూ దానివల్ల కలిగేలోటును భర్తీ చేసేందుకు పేదవారిమీద పన్నుల భారాన్ని పడవేస్తున్నారని సింధ్‌కు చెందిన ఎస్. సి. సహాని, ఢాకాకు చెందిన మౌల్వీ అబుల్ కాసిం, సేలంకు చెందిన ఎస్. ముదలియార్ ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించారు. ఉప్పుమీద పన్నును రెండింతలు చేసే బదులు లోటును భర్తీ చేసేందుకు పెట్రోలుమీద పన్ను విధించాలని ఆగ్రాకు చెందిన లాలా గిరిధారీలాల్ సూచించారు. జె. ఎల్. భార్గవ, చాలామంది అభిప్రాయాలను ఈ విధంగా పేర్కొన్నారు:

"ప్రస్తుత పాలనా వ్యవస్థ కొనసాగినంతకాలం, దేశానికి పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వానికి మంజూరు చేయనంత కాలం సర్వీసుల్లో పూర్తిగా భారతీయులను నియ మించనంత కాలం భారతదేశంలో పాలనానిర్వహణకు ఖర్చు విపరీతంగా ఉంటూనే వుంటుంది. నిధుల్లో సగందాకా సైనిక ఖర్చుకే సరిపోతున్నాయి. పౌర పాలనలో కూడా భారతేతరులు విధిగా అవసరం అని అనుకోవడంచేత, విదేశ ఉద్యోగులకు పెద్ద జీతాలు ఇస్తున్నారు. అయినప్పటికీ శాసనసభ అభీష్టానికి వ్యతిరేకంగా ఉన్నత సర్వీసులపై రాయల్ కమీషన్‌ను కూడా భారతదేశం మీద రుద్దుతున్నారు."[29]

తత్ఫలితంగా, ఆర్థిక బిల్లులోని, ఉప్పుమీద పన్నును రెండింతలు చేయాలన్న ప్రతి పాదన శాసనసభలో చిత్తుగా ఓడి పోయింది. సమితిలో కూడా, గవర్నర్ జనరల్ శిఫార్సుగా ప్రవేశ పెట్టబడినపుడు శ్రీనివాసశాస్త్రి ఇతరులూ విమర్శించారు. అయినా, సమితి, గవర్నర్ జనరల్ శిఫార్సును ఆమోదించింది. కాని శాసనసభ మాత్రం తన మొదటి ధోరణిలోనే, దాన్ని మళ్ళీ కొట్టివేసింది. అప్పుడు గవర్నర్ జనరల్, ఇది అవసరమని పేర్కొంటూ (ఆయన ఈ విధంగా పేర్కొనడం ఇది రెండవసారి) శాసన సభ అభీష్టానికి వ్యతిరేకంగా ఉప్పుమీద పన్ను విధించడాన్ని చట్టబద్ధం చేశారు.

పద్దులలో కోత విధించడానికి తనకున్న అధికారాన్ని ఉపయోగించడంలో శాసనసభ వెనుకాడ లేదు. 1921–23 లో ఖర్చు మీద కోటి 29 లక్షల రూపాయల కోత విధించింది.[30]

## మరికొన్ని సంస్కరణలకోసం ఆందోళన

మాంటేగు - ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు పొందుపరచిన 1919 వ సంవత్సరపు భారత ప్రభుత్వ బిల్లును బ్రిటిషు పార్లమెంటు ఆమోదించిన తర్వాత రాజు తమ ఆమోదం తెల్పి ప్రకటించిన తర్వాత భారత దేశంలో అప్పటి సార్వ భౌమ్య శాసన నిర్మాణ సమితి. సచ్చిదానంద సిన్హా ప్రతిపాదించిన తీర్మానం ద్వారా బ్రిటిషు చక్రవర్తికి తమ విధేయతను విన్నవించు కున్నారు. "భారతదేశపు రాజకీయ మోక్షానికి మా చక్రవర్తి పాలన ఒక గొప్ప సాధనమ"ని పేర్కొన్నారు. 31 ఆ సందర్భంగా శ్రీ ఎస్. ఎన్. బెనర్జీ ఈమాటలన్నారు.

"తుది ప్రకటన వెలువడే సమయం త్వరలోనే వస్తుంది. పదేండ్లు పట్టవచ్చు పదేండ్లలో పరిశీలిస్తామని చేసిన వాగ్దానాన్ని ప్రస్తావిస్తూ ఒక జాతి జీవితకాలంలో పదేండ్లు ఎంత? ఆ సమయం ఆసన్నమై భారతీయులందరి సమక్షంలో సకల నాగరిక ప్రపంచం సమక్షంలో తీర్పును ప్రకటించినప్పుడు, మేమింకా అర్హులము కాలేదని చెప్పలేరనే నేను విశ్వసిస్తున్నాను. "32

ఉదారవాదులు ఆ సమయంలో రాజ్యాంగ సంస్కరణల సమీక్షకు పదేండ్లు వేచి వుంటామని ఎంతో గొప్పగా ప్రకటించారు. కాని భారతదేశంలో పరిస్థితి అతి త్వరగా మారిపోయింది. శాసనసభా భవనాల వెలుపల స్వాతంత్ర్య పోరాటం పూర్తి స్థాయినందుకుంది. శాసనసభ ద్వారా స్వాతంత్ర్య పోరాటానికి దోహదం చేయగలమని గట్టిగా విశ్వసించిన ఉదారవాదులు, తమకు పరీక్షసమయం అనుకున్న దానికంటే త్వరలోనే వస్తుందని తెలుసుకుని తామేమీ తప్పుచేయలేదని నిరూపించడానికి తాము ఏదో ఒకటి చేసి చూపించాలని అనుకున్నారు. అందువల్లనే కొత్త శాసన సభ సమావేశమైన మొదటి సంవత్సరం నుంచీ, మరికొన్ని రాజ్యాంగ సవరణల గురించి ప్రస్తావిస్తూ వచ్చారు.

భారతశానికి పూర్తి డొమినియన్ ప్రతిపత్తి ఇచ్చేందుకు కాల వ్యవధిని నిర్ణయించి అంటే, శాసనసభ నాల్గవ పదవీకాలం ఆరంభంనుంచే, దానికి అవసరమైన చర్యలను ప్రభుత్వం తీసుకోవాలని శిఫార్సుచేస్తూ జె. ఎన్. మజుందార్ 1921 సెప్టెంబరు 23వ తేదీన శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. బ్రిటిషు ప్రభుత్వం నిజం గానే ఈవిధంగా కోరుతూ వుందని భారతీయులకు విశ్వాసం కలిగేందుకు గాను ఖచ్చితంగా ఒకతేదీని ప్రకటించడం అవసరమని ఆయన పేర్కొన్నారు.

"సోదరులారా, స్వరాజ్యం మా జన్మహక్కు అని విశ్వసిస్తూ దాన్ని పొందేందుకు కృతనిశ్చయులమయ్యాము. దాన్ని సంపాదించడంలో మాకు సహాయపడడం మీకు

ఒక అవకాశమే కాక అది మీగొప్పతనం కూడా అవుతుంది. మాకూ మాలక్ష్యానికి మధ్య అవరోధంగా ఇక ఉండకండి." బ్రిటిష్ ప్రజలకూ ప్రజానాయకులకూ ఆయన ఈ విధంగా విజ్ఞప్తి చేశారు.[33]

సెంట్రల్ ప్రావిన్సిస్‌కు చెందిన శ్రీ. కె. బి. ఎల్. అగ్నిహోత్రి తీర్మానాన్ని సమర్థిస్తూ, తమ అభిప్రాయాలను స్పష్టంగా వెల్లడి చేయలేరని అనుకున్న లక్షలాది భారతీయులు కూడా తమకు త్వరలో పూర్ణ స్వరాజ్యం కావాలని ఖచ్చితంగా కోరుతున్నట్లు చెప్పారు. జె. యన్. భార్గవ మాట్లాడుతూ, సహాయనిరాకరణ ఉద్యమం లాభ నష్టాలు ఎటువంటివైనా, దేశప్రజలందరూ కుతకుతలాడిపోతున్నారన్నది నిర్వివాదాంశం అన్నారు. అందువల్ల రాష్ట్రాల్లో పూర్తి స్వయంపాలనా ప్రతిపత్తికి అవసరమైన చర్యలు తీసుకుని కేంద్రంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టాలని కోరారు. టి. వి. శేషగిరి అయ్యర్, మున్షీ ఈశ్వర్ దాస్ ఈ వాదనలను సమర్థించారు.[34] జమునాదాస్ ద్వారకా దాస్ మాత్రం కాల నిర్ణయానికి అంగీకరించలేదు. ఒక నిర్ణీతమైన కాలానికి ప్రభుత్వం చేతులను కట్టివేయడం భావ్యం కాదని ఆయన అభిప్రాయపడ్డారు.[35]

భారతదేశం సాధించిన అభివృద్ధి దృష్ట్యా రాజ్యాంగాన్ని పూర్వం అనుకున్న 1929 కంటే ముందుగానే సమీక్షించాలని భారతదేశానికి సంబంధించిన మంత్రికి తెలియచేయ వలసిందిగా భారత ప్రభుత్వాన్ని కోరుతూ కొన్ని సవరణలతో తీర్మానాన్ని ఆమోదించారు.

శాసనసభల్లో తమ నడవడిద్వారా భారతదేశం పూర్తి స్వయంపాలనకు తగివుందని ఇంగ్లీషువారికి ముఖ్యంగా ఇంగ్లీషు ఉదారవాదులకు ఋజువు చేస్తున్నామని ఉదారవాదులు ఆశిస్తూ వుండివుండవచ్చు. ఈ దురభిప్రాయాన్ని తొలగించే సమయం వచ్చిందని బ్రిటిష్ ప్రధానమంత్రి అభిప్రాయ పడ్డారు. సర్వీసుల్లోనూ సైన్యంలోనూ పూర్తిగా భారతీయులనే నియమించాలని భారతీయ ఉదారవాదులు అదేపనిగా ఉద్ఘాటిస్తున్నారు. రాజ్యాంగాన్ని అనుకున్న దానికంటె ముందుగానే పునః పరిశీలించాలని కోరుకున్నారు. ప్రధానమంత్రి లాయడ్ జార్జ్, 1922 ఆగష్టు 2వ తేదీన అతితిరస్కార భావంతోనే అయినా ఖచ్చితంగా ఈ విధంగా చెప్పారు.

" నేను ఇది చెప్పాలను కుంటున్నాను. భారతీయులను సర్వీసుల్లో నియమించేందుకు మనం చేస్తున్న కృషి ఫలితం, భారతీయులు శాసన సభల్లోచేసే ఉపన్యాసాల నాణ్యత మీద ఆధారపడివుండదు (నేను దీన్ని ఏ మాత్రమూ ద్వేషించడంలేదు) పౌరసర్వీసు ల్లోనూ ఇతర సర్వీసుల్లోనూ వారు తమ మామూలు విధులను నైపుణ్యంతో నిర్వర్తిం

చడంమీద ఇది ఆధార పడివుంటుంది. భారతీయులు ఇది గుర్తించడం ముఖ్యమని నేను భావిస్తున్నాను."

ప్రధానమంత్రి ఇంతటితో ఊరుకోలేదు.

"నేను ముఖ్యంగా చెప్పదలచుకున్నది ఇది, పార్లమెంటు సభ్యులుగాగాని పాలనానిర్వాహకులుగాగాని వారు ఎంత విజయవంతంగా పనిచేసినా భారతదేశంలో బ్రిటిష్ పౌర అధికార్ల సహాయమూ మార్గదర్శకత్వమూ లేకుండా ఎప్పటికైనా వ్యవహరించగలరా అన్నది సందేహమే.

"మొత్తం స్వరూపానికి వారు ఉక్కుచట్రంవంటి వారు. ఒకటి మాత్రం మనం స్పష్టం చేయవలసి వుంది. ఎటువంటి పరిస్థితుల్లోనూ బ్రిటన్ భారతదేశం పట్ల తనకున్న బాధ్యతను వదులుకోబోదు. 36

ప్రధానమంత్రి చేసిన ఈ ఉపన్యాసం వల్ల భారతీయ ఉదారవాదుల్లోనూ మితవాదుల్లోనూ కూడా తీవ్రమైన భావాలు తల ఎత్తాయి. ఆగష్టు రెండవ తేదీన లాయడ్ జార్జ్ చేసిన ప్రకటనను ఖండించవలసిందని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరుతూ అగ్నిహోత్రి శాసన సభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఆయన కోపంగా ఈమాటలన్నారు:

"పూర్తి బాధ్యతాయుతమైన స్వయంపాలన కావాలని కోరుతున్నాము. మేము సమర్థులమనేకాదు; మాకిచ్చిన వాగ్దానాలు ప్రతిజ్ఞలు ఆధారంగా కూడాకాదు; మా జన్మ హక్కుగా కోరుతున్నాము: పూర్తి డొమినియన్ స్వయంపాలనా వ్యవస్థను మంజూరు చేయడంలో బ్రిటిష్ జాతి ఇకమీదనైనా మమ్మల్ను నిరాశపరచదనే ఆశిస్తున్నాము." 37

ప్రధానమంత్రి ఉపన్యాసంతో రావు బహదూర్ టి. రంగాచారి ఎంతో కలత చెందారు. "ఉక్కుచట్రం" అన్న పదాలను నేను మర్చిపోలేను. బ్రిటిష్ రాజ్ అన్న పదాలను కూడా మరచిపోలేను. ఈ దేశాన్ని పాలించడంలో సహాయం చేస్తామని అనడం పోయింది పైపెచ్చు ఈ దేశాన్ని పరిపాలించడంలో సహాయం చేయవలసిందని లాయడ్ జార్జ్ భారతీయులను అడగడాన్ని విస్మరించలేను. ఆయన ఎంతో బాధతో ఈమాటలన్నారు:

"సవరించిన రాజ్యాంగం అంటేవారి ఉద్దేశ్యం ఇదేనా? అదే అయితే న్యాయంగానూ సక్రమంగానూ ఉండడం అవసరం. ఏషరతులమీద సహకరించాలో స్పష్టంగా తెల్లియచేయడం అవసరం. ఈ షరతులమీద మేము సహకరించాలని

కోరుతున్నట్లయితే, నాకు సంబంధించినంత వరకు సహకరించేందుకు నేను నిరాక రిస్తున్నాను. 38

ద్వారకాదాస్ కూడా ప్రధానమంత్రి వ్యాఖ్యలకు తీవ్రమైన అభ్యంతరం తెలిపారు. పాలనా నిర్వహణతో భారతీయులకు ఇంకా ఎక్కువ సంబంధం ఉండాలన్న విధానాన్ని గుర్తించాలని ఆయన ఉద్ఘాటించారు. ఉద్యోగాల్లో నియామకం వీలైనంత వరకు భారత దేశంలోనే జరగాలని కూడా కోరారు. "మా అల్ప సంఖ్యాకత్వం ఎప్పుడు ముగుస్తుందో" ప్రకటించ వలసిందని మున్షీ ఈశ్వర్ సరన్ ప్రభుత్వాన్ని అడిగాడు "ప్రళయం వచ్చేదాకా ఇది కొనసాగుతుందా" అని ఆయన ప్రశ్నించారు.39

ఈలోగా శాసన సభ 1921 సెప్టెంబరులో ఆమోదించిన తీర్మానాన్ని లండన్ లోని భారతదేశానికి సంబంధించిన మంత్రికి నివేదించారు. ఈ తీర్మానం, రాజ్యాంగాన్ని పునఃపరిశీలించడానికి సంబంధించినది. మంత్రి, అగస్టు 2 వ ప్రధానమంత్రి చేసిన ప్రకటన దృష్ట్యా 1922 నవంబరు 2 వ తేదీ సమాధానం చెబుతూ 1919 వ సంవత్సరపు రాజ్యాంగం అమలుపరచి ఎంతోకాలం కాలేదనీ అందువల్ల మరికొన్ని మార్పులు చేసే సమయం ఆసన్నమైందని అనుకోరాదనీ చెప్పారు.40 శాసన సభ లోని ఉదారవాదులను ఇది మరింత గాయపరచింది.

మంత్రి సమాధానం పట్ల ప్రజలకు కలిగిన తీవ్రమైన అసంతృప్తిని గవర్నర్ జనరల్‌కు తెలియచేయ వలసిందని కోరుతూ రంగాచారియార్ 1923 ఫిబ్రవ/ 22వ తేదీన శాసన సభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు.

"ధైర్యంచేసి ఇక్కడికి వచ్చి సంస్కరణలను అమలు జరుపుతున్న మేము కొంతమంది, దేశప్రజల ఆగ్రహానికి గురి కావలసి వచ్చింది. దేశప్రజలు కోపం తోనూ రోషంతోనూ ఉడికిపోతున్నారు." అని ఆయన ప్రభుత్వానికి చెప్పారు. 41 మున్షీ ఈశ్వర్ సరన్, రంగాచారియార్ చెప్పినదాన్ని సమర్థించారు. సంస్కరణలు తగినంతగా లేవని భారతీయుల్లో అధిక సంఖ్యాకులు గట్టిగా అభిప్రాయ పడుతున్నట్లు ఆయన ప్రభుత్వానికి గుర్తుచేశారు. అటువంటి క్లిష్ట పరిస్థితిలో సభలోని ప్రస్తుత సభ్యులు సంస్కరణలను అమలు జరిపేందుకు అంగీకరించారు. "ఈ విషయమై తాము పంపిన వర్తమానం తిరుగులేనిదని మంత్రి భావించినట్లయితే ఆయన చాలా పొరపాటు పడుతున్నారు"42 అని మున్షీ ఈశ్వర్ సరన్ ప్రభుత్వానికి చెప్పారు. "ఈ వర్తమానం నాకు, సభలోని ఇతర సభ్యులకూ అవమానమ"ని ధాకాకు చెందిన మౌల్వీ అబుల్ కాసిం చెప్పారు. "మా అందరి అభిప్రాయాన్ని మొత్తం తుడిచి పెట్టార"ని ఆయన పేర్కొన్నారు. 43

ఇంత జరిగినా శాసన సభ్యులు చర్చమీద ఓటింగ్ జరగాలని కోరలేదు. అయితే అది, శాసనసభ ఆఖరి సమావేశమనీ త్వరలో మళ్ళీ ఎన్నికలు జరుగ నున్నాయనీ వారికి తెలుసు. ఈ లోగా సహాయ నిరాకరణ దారులు తమ విధానాన్ని పునఃపరిశీలించు కున్నారు. ఉదారవాదులు ఈసారి వీరి సవాలును ఎదుర్కోవలసి వుంటుందని స్పష్టమైంది. "ఇదివరకంటె ప్రతిపక్షాన్ని పటిష్ఠం చేసి ఈ సవాలును ఎదుర్కో వచ్చునని వారు భావించారు. తాముకూడా సహాయ నిరాకరణ చేయగల మని శాసన సభలో ప్రదర్శించి, తమకంటె చురుకుగా వున్నవారి వ్యవస్థీకృతమైన ప్రచారానికి ఎదురు ప్రచారం చేయడం మొదలుపెట్టారు. వారు చేసిన మొట్ట మొదటి పని, ఉన్నత సర్వీసులమీద కొత్త రాయల్ కమిషన్‌కు పద్దులను నిరాకరించడం. 1923 లో ఉప్పుపన్నును ఎక్కువ చేసేందు కుద్దేశించిన ప్రతిపాదనను శాసన సభ త్రోసిపుచ్చడానికి కూడా ఇదే కారణం.[44] భారతీయ చట్టాల సంఘం కూడా ఈ విషయంలో మాత్రం ఇదే విధంగా అభిప్రాయ పడింది. సంస్కరణలు ప్రవేశ పెట్టిన తర్వాత మొదటి మూడు సంవత్సరాలు మాత్రం ఈ సంఘం భారతీయ శాసన సభ పనిచేసిన తీరును ప్రశంసిస్తూనే వచ్చింది. "1922 వ సంవత్సరపు క్లిష్టమైన రోజుల్లో సహాయ నిరాకరణ ఉద్యమానికి వ్యతిరేకంగా ప్రభుత్వం తీసుకున్న చర్యలన్నిటినీ శాసనసభ — సమితి రెండూ బలపరచాయ"ని ఈ సంఘం పేర్కొంది.[45]

కాని ఖిలాఫత్ యోధుల్లో ప్రముఖులైన మొహమ్మదలీ, షౌకతలీలను విడుదల చేయాలని కోరిన తీర్మానాన్ని శాసన సభ ఏకగ్రీవంగా త్రోసిపుచ్చడం ప్రభుత్వానికి ఎంతో సంతృప్తి కలిగించింది. గాంధీజీ సహాయ నిరాకరణ ఉద్యమాన్ని సమర్థిం చిన వారిల్లో వీరుభయులూ ముఖ్యులు కూడా.[46]

## రెఫరెన్సులు


1. రిపోర్ట్ ఆన్ ఇండియన్ కాన్‌స్టిట్యూషనల్ రెఫార్మ్స్ (1918). పే. 13.
2. బి. పట్టాభి సీతారామయ్య హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (బొంబాయి, 1944) పునర్ ముద్రణం వాల్యూమ్ పే. 623 - 6.
3. రిపోర్ట్, ఎస్ . 1, పే. 102.
4. ఇబిడ్., పే. 14.
5. ఇబిడ్.,
6. ఇబిడ్., పే. 16.

7. ఇబిడ్., పే. 1.
8. బి-బి. మిశ్ర. ది అడ్మినిస్ట్రేటివ్ హిస్టరీ ఆఫ్ ఇండియా: 1834-1947 (బొంబాయి, 1970) పే. 70-77
9. యం. రఫీక్ అఫ్జల్. కంపే., సెలెక్టెడ్ స్పీచెస్ అండ్ స్టేట్‌మెంట్స్ ఆఫ్ క్వాది అజం జిన్నా (లహోర్, 1966) పే. 70-75.
10. యంగ్ఇండియా: 1919-1922 (మద్రాసు, 1922) పే. 392-3.
11. యల్. యఫ్. రష్బ్రూక్ విలియమ్స్, ఇండియా ఇన్ 1919. పే. 23-33.
12. బి. డి. శుక్ల. ఎ హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ లిబరల్ పార్టీ (అలహాబాదు, 1960) పే. 198-9.
13. ఎడ్విన్ యస్. మాంటేగు. ఎన్ ఇండియన్ డైరీ (లండన్ 1930) పే. 134.
14. ఇబిడ్., పే 133.
15. ఇబిడ్., పే. 217.
16. ఇబిడ్., 216.
17. ఇబిడ్., పే. 104.
18. శుక్ల యన్. 12, పే. 203-04.
19. స్పీచెస్ అండ్ రైటింగ్స్ ఆఫ్ ది రైట్ ఆనరబుల్. వి. యన్ శ్రీనివాస శాస్త్రి (మద్రాసు యన్. డి) పే. 165-72
20. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వాల్యూమ్ 2, 1922, పే. 1657-61
21. ఇబిడ్., పే. 1674.
22. ఇబిడ్.,1720-21
23. కె. ఎ. నీలకంఠ శాస్త్రి, ఎ. డి, ఎ. గ్రేట్ లిబరల్: స్పీచెస్ అండ్ రైటింగ్స్ ఆఫ్ సర్ పి. యస్. శివస్వామి అయ్యర్ (బొంబాయి, 1965) పే.. 353.
24. చిరోల్, యన్. 20 వేలంటీన్ చిరోల్, ఇండియా : ఓల్డ్ అండ్ న్యూ (లండన్, 1921) పే. 230-1
25. శాస్త్రి, యన్. 23, పే. 327-43
26. వి. యన్. నాయక్, ఇండియన్ లిబరలిజమ్ ; ఎ స్టడీ (బొంబాయి. 1945) పే. 110-11.
27. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వాల్యూమ్ 2, 1922 పే. 1869-71.

28. నాయక్, యన్. 26, పే. 114-15.

29. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వాల్యూమ్ 3, 1923, పే. 3004-05.

30. నాయక్, యన్. 26, పే. 112-113.

31. ప్రొసీడింగ్స్ ఆఫ్ ది ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్, వాల్యూమ్. 43, 1920 పే. 608-613.

32. ఇబిడ్., పే. 613-15.

33. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్. వాల్యూమ్ 2, 1921, పే. 956-60.

34. ఇబిడ్., పే. 964-71.

35. ఇబిడ్., పే. 1229.

36. మాడరన్ రెవ్యూ (కలకత్తా) 32 (సెప్టెంబరు 1922) పే. 408-09.

37. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వాల్యూమ్ 3, 1922, పే. 279-85

38. ఇబిడ్., పే. 317-18.

39. ఇబిడ్., పే. 330.

40. రిపోర్ట్ ఆఫ్ ది ఇండియన్ స్టాట్యూటరీ కమిషన్ (లండన్, 1930) వా. 1, పే. 251-2.

41. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వాల్యూమ్ 3, 1923, పే. 2715-18.

42. ఇబిడ్., పే. 2722.

43. ఇబిడ్., 2729.

44. వేలంటీన్ చిరోల్, ఇండియా (లండన్. 1926) పే. 250-2.

45. రిపోర్ట్, యన్. 40, పే. 251-2.

46. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వాల్యూమ్ 2, 1922, పే. 2918-33.

## మూడవ అధ్యాయం

# శాసనసభలో స్వరాజ్యవాదులు

## ( 1924 – 1926 )

### సహాయనిరాకరణ ముగింపు

భారతదేశంలోని "పైశాచిక ప్రభుత్వం"తో సహకరించరాదంటూ గాంధీజీ ఎలుగెత్తిచాటిన ఫలితంగా దేశప్రజల్లో కలిగిన చైతన్యం, అధికారవర్గాలవారికి "చాలా ఆందోళన" కలిగించింది. సహాయనిరాకరణ ఉద్యమంవల్ల పట్టణాల్లోని తక్కువ తరగతి ప్రజలకు బాగా ఇబ్బంది కలుగుతూ వుందనీ, కొన్నిప్రాంతాల్లో రైతాంగానికి ఇబ్బందిగా వుందనీ. దేశమంతటా చాలా మంది ముస్లింలలో అసూయ నిరాశ వ్యాపించాయనీ తీవ్రమైన పరిణామాలు సంభవించే అవకాశాలున్నాయనీ పేర్కొంటూ వైస్‌రాయ్, 1922 ఫిబ్రవరి 9వ తేదీ, భారతదేశానికి చెందినమంత్రికి టెలిగ్రామ్ పంపారు. అయితే, భద్రతకు ముప్పు ఏర్పడినట్లయితే ఎదుర్కొనేందుకు ప్రభుత్వం అంతకుముందుకంటె బాగాసన్నద్ధంగావుందని వైస్‌రాయ్, మంత్రికి హామీ ఇచ్చారు. "పరిస్థితిమాత్రం బాగా ఆందోళనకరంగానే వుంద"ని ఆయన పేర్కొన్నారు. 1

దురదృష్టవశాత్తూ అంతకు నాలుగురోజుల ముందరే ఒక సంఘటన జరిగింది. యునైటెడ్ ప్రావిన్స్‌లోని చౌరిచౌరా గ్రామంలో కోపోద్రిక్తులైన కొంతమంది ఒకపోలీసు స్టేషనుకు నిప్పంటించారు. అగ్నిప్రమాదంలో కొంతమంది పోలీసులు మరణించారు. ఈ సంఘటనతో సహాయ నిరాకరణ ఉద్యమానికి తీక్షణత కలిగింది. ఇతర చోట్ల కూడా హింసాకాండ జరిగింది. గాంధీజీ సిద్ధాంతానికీ అహింసా విధానానికీ ఇది విరుద్ధం. కాంగ్రెస్ కార్యవర్గం ఫిబ్రవరి 17 న సమావేశం కావాలని ఆయన అత్యవసరంగా కోరారు. సామూహిక పౌర ఉల్లంఘనను రద్దు చేయాలనీ, అరెస్టయేందు కుద్దేశించిన అన్ని కార్య కలాపాలనూ ఆపివేయాలనీ కేవలం ఉత్తర్వులను ఉల్లంఘించే ఉద్దేశ్యంతో సమావేశాలూ ఊరేగింపులూ జరుప రాదనీ సమావేశంలో కాంగ్రెసు సభ్యులను కోరారు. నిర్మాణాత్మకమైన ఒక పథకాన్ని ప్రజలకు అందచేశారు. చరఖాను ప్రజామోదం చేయడం, జాతీయ పాఠశాలలను ఏర్పాటు చేయడం, విగ్రహంతో వ్యవహరించాలని ప్రజలకుద్బోధించేందుకు ఉద్యమాలు నిర్వ

హించడం, ఈ పథకంలోని కొన్ని భాగాలు. ఫిబ్రవరి 24 న ఢిల్లీలో సమావేశమైన అఖిల భారత కాంగ్రెసు సంఘం ఈ ప్రతిపాదన లన్నిటినీ బలపరిచింది. కాని రాష్ట్ర కాంగ్రెస్ సంఘాల ఆధ్వర్యంలో వ్యక్తిగత పౌర ఉల్లంఘనకు అనుమతి ఇచ్చింది.

కాంగ్రెసు పార్టీ అధికార చరిత్రలో ఈ విధంగా పేర్కొన్నారు: "ఉద్యమాన్నంతటినీ గాంధీజీ ఆపివేసి వుండవలసింగని గోల పెట్టారు."[2] జైళ్ళల్లో వున్న నాయకులకు గాంధీజీ పట్ల కోపం వచ్చింది. కాంగ్రెసు సభ్యుల్లో అధైర్యం ఏర్పడింది. "దేశ వ్యాప్తంగా విపత్తు" ఏర్పడింది.[3] కాని ప్రభుత్వానికి మాత్రం సంతోషంగా వుండి వుంటుంది. గాంధీజీని అరెస్టు చేసే అవకాశం దొరికింది. మార్చి 10 వ తేదీన అరెస్టు చేసింది.

## స్వరాజ్యపార్టీ అవతరణ

కొత్త పద్ధతుల్లో, కాంగ్రెసుకు రెండు ప్రధాన సమస్యలు ఏర్పడ్డాయి. సహాయ నిరాకరణ ఉద్యమాన్ని కొనసాగించడమా మానుకోవడమా, కొనసాగించి నట్టయితే ఏ రూపంలో కొనసాగించడమన్నది ఒకటి. 1923 లో శాసన సభలకు జరిగే ఎన్నికల్లో కాంగ్రెసు పోటీ చేయాలా లేదా అన్నది రెండవది.

ఏ. ఐ. సి. సి (అఖిల భారత కాంగ్రెసు సంఘం) జూన్‌లో లక్నోలో సమావేశమై, దేశంలో పరిస్థితిని అంచనా వేసి, కాంగ్రెసు తీసుకోవలసిన చర్యల గురించి శిఫార్సు చేసేందుకు ఒక సంఘాన్ని నియమించింది. సమితిలో కాంగ్రెసు ప్రవేశించే విషయమై ఎ. ఐ. సి. సి లో తీవ్రమైన భేదాభిప్రాయాలు వెల్లడయాయి. సమితుల్లో ప్రవేశించరాదన్న కాంగ్రెసు విధానంలో ఎటువంటి మార్పునూ కొంతమంది సూచించలేదు. వీరు: సి. రాజగోపాలాచారి, ఎం. ఏ. అన్సారి, ఎస్. కస్తూరిరంగ అయ్యంగార్ (మార్పు అవసరం లేదు అన్నవారు), మోతీలాల్ నెహ్రూ, హకీమ్ అజామల్ ఖాన్, విఠల్‌భాయ్ పటేల్ మాత్రం, సహాయ నిరాకరణ పాటిస్తున్నారు. ఎన్నికల్లో పోటీచేసి సమితులలో ప్రవేశించి, ప్రభుత్వంతోనూ అధికార యంత్రాంగంతోనూ పోరాటం జరపాలని అభిప్రాయ పడ్డారు (మార్పు కావాలని కోరిన వారు). ఇరు పక్షాలూ ఈ భేదాభిప్రాయాల కారణంగా చాలా కాలం ఘర్షణ పడుతూ వచ్చారు. దీని వల్ల భారత రాజకీయాలు కొన్ని సంవత్సరాలు దెబ్బతిన్నాయి.[4]

## దేశబంధు చిత్తరంజనదాసు

చౌరిచౌర సంఘటన తర్వాత గాంధీజీ పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ఆపివేసినపుడు,

దేశబంధు చిత్తరంజనదాసు ఎంతో వ్యాకులపడ్డారు. "మహాత్ముడు ఒకటి తర్వాత ఒకటిగా తప్పటడుగులు వేస్తున్నందుకు దేశబంధుకు విపరీతమైన దుఃఖమూ ఆగ్రహమూ కలిగాయి. బార్డోలి ఉప సంహరణ పెద్దదెబ్బే అయింది" అని సుభాష్ చంద్రబోస్ వ్రాశారు.5 సమితిలో ప్రవేశించే విషయమై మాత్రం దాస్ అభిప్రాయాల్లో కొంత మార్పు వచ్చింది. (1919) అమృతసర్ కాంగ్రెస్‌లో సంస్కరణల చట్టాన్ని అమలు పరచడంలో సహకరించాలన్న గాంధీజీ విధానానికి దాసు తీవ్ర అభ్యంతరం తెల్పారు. కాని ఇప్పుడు, మారిన పరిస్థితుల్లో కాంగ్రెసు సమితుల్లో ప్రవేశించాలనీ, సమితుల్లోనే సహాయ నిరాకరణ అమలు జరుపాలనీ ఆయన అభిప్రాయ పడ్డారు.

దాసు ఆరోగ్యం అంత బాగుండక పోవడం చేత, 1922 ఆగస్టులో ఆయన్ను విడుదల చేశారు. 1922 డిశంబరులో గయలో జరుగనున్న కాంగ్రెసుకు ఆయన్ను అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. చిక్కు సమస్యగా తయారైన సమితుల్లో ప్రవేశించే విషయం గురించి ఈ మహా సభలో చర్చింప వలసి వుంది గనుక దేశ ప్రజలందరూ ఈ మహాసభ కోసం ఎంతో ఆసక్తితోనూ ఆదుర్దాతోనూ ఎదురు చూశారు. మార్పు రావాలని కోరుతున్నవారు దాసు, మోతీలాల్ నాయకత్వంలోనూ మార్పు అవసరం లేదంటున్నవారు రాజగోపాలాచారి - రాజేంద్రప్రసాద్ నాయకత్వంలోనూ తమ తమ బలాలను పుంజుకున్నారు. మహాసభ జరిగింది. అధ్యక్షులైన దేశబంధు చిత్తరంజనదాసు సుదీర్ఘంగా కూలంకషంగా ఉపన్యసించారు.

రెండుపక్షాల మధ్య వివాదమంతా తప్పు అభిప్రాయం మీద ఆధారపడి వుందని చెప్పారు దాసు. "కార్యక్రమంలో మార్పు అవసరమా లేదా అన్నది కాదు అసలు ప్రశ్న: మనకు అతిప్రియమైన ఉద్యమం విజయవంత మయేందుకు, కొన్ని విషయాల్లో మన కార్య కలాపాల పోకడను మార్చుకోవలసిన అవసరం ఇప్పుడు రాలేదా అన్నది అసలు ప్రశ్న" అన్నారు దాసు. వాటిని అంతమొందించడానికి లేదా మెరుగు పరచడానికి అన్న లక్ష్యంతో సమితుల్లోకి ప్రవేశించడం, అప్పటి పరిస్థితుల్లో సహాయ నిరాకరణ ఉద్యమాన్ని నడిపేందుకు మరొక, మరింత పటిష్టమైన మార్గమని ఆయన వాదించారు.6

సమితుల్లో చేరాలన్న విధానాన్ని దాసు గట్టిగా బలపరిచారు. అవతలి పక్షంలో కూడా ఇంత తీవ్రంగా వాదించినవారూ లేకపోలేదు. అధ్యక్షులైన దాసు బలపరిచిన తీర్మానం మీద ఓటుజరగ్గా తీర్మానం, అనుకూలంగా 890 ఓట్లూ ప్రతికూలంగా 1,748 ఓట్లూ పడడంతో వీగిపోయింది. దాసు వెంటనే కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. మోతీలాల్ నెహ్రూకూడా కాంగ్రెసు పార్టీ కార్యదర్శి పదవికి

రాజీనామా చేశారు. తమ విధానం సరైనదన్న విశ్వాసంతో వీరు, కొత్తపార్టీని ఏర్పాటు చేస్తున్నట్లు 1923 జనవరి ఒకటవ తేదీన ప్రకటించారు. - అదే స్వరాజ్య పార్టీ.

స్వరాజ్యవాదులు, కాంగ్రెసులో తమ విధానంకోసం పోరాటం కొనసాగించారు. 1923 సెప్టెంబరులో కాంగ్రెసు ప్రత్యేక మహాసభ, ఢిల్లీలో, మౌలానా అబ్దుల్ కలామ్ ఆజాద్ అధ్యక్షతన జరిగింది. ఈ మహాసభలో రెండు పక్షాలకూ రాజీ కుదిరింది. శాసన సమితుల్లో సభ్యులు కావడం ధర్మవిరుద్ధమనిగాని తమ అంతఃకరణకు వ్యతిరేకమని గాని భావించని కాంగ్రెసు సభ్యులందరూ ఎన్నికల్లో పోటీ చేయవచ్చు ఓటు చేయవచ్చునని తీర్మానించారు. దానితో కాంగ్రెసు, సమితులకు విరుద్ధంగా చేసే ప్రచారాన్నంతటినీ ఆపి వేసింది. కాంగ్రెసు కార్యకర్తలందరూ నిర్మాణాత్మకమైన కార్యక్రమాన్ని కొనసాగించ వలసిందని విజ్ఞప్తి కూడా చేసింది.

స్వరాజ్యవాదులు: ఎన్నికలు

ఎన్నికలు దగ్గర పడ్డాయి. నవంబరులో జరుగనున్నాయి. ఎన్నికల్లో పోటీ చేసేందుకు స్వరాజ్య పార్టీ సర్వసన్నద్ధమైంది. మోతీలాల్ నెహ్రూ సంతకంతో ఎన్నికల ప్రణాళిక ఒకటి అక్టోబరు 14 వ తేదీన వెలువడింది. స్వరాజ్యవాదుల పార్టీ కాంగ్రెసులో భాగమనీ, పార్టీని ఏర్పాటు చేసుకున్నారు. అహింస మూల సిద్ధాంతాలను ఎప్పుడూ విస్మరించలేదనీ ప్రణాళికలో పేర్కొన్నారు. భారత దేశంలో బ్రిటిషు ప్రభుత్వం, తమ దేశాల స్వప్రయోజనాలకోసమే పాలిస్తూ వుందనీ, సంస్కరణలు అని చెప్పబడుతున్నవి, వారి ప్రయోజనాలను మరింత పెంపొందించుకునేందుకు ఒక తెర అనీ స్వరాజ్యపార్టీ విశ్వసిస్తున్నట్లు ప్రణాళికలో తెలియ చేశారు. "భారత దేశానికి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని మంజూరు చేసే ఉద్దేశ్యంతో సంస్కరణలు ప్రవేశ పెట్టినట్లు చెబుతూ మభ్యపెడుతున్నారు. భారతీయులను శాశ్వతంగా తమ అడుపాజల్లో పెట్టుకుని దేశంలోని అపారమైన వనరులను ఉపయోగించుకునే ఉద్దేశంతో వీటిని ప్రవేశ పెట్టారు —" అని ఎన్నికల ప్రణాళికలో పేర్కొన్నారు.

పార్టీ సభ్యులు శాసన సభలో సభ్యులైన తర్వాత, పాలనా వ్యవస్థనూ పాలనా యంత్రాంగాన్నీ, నిర్వహించే హక్కు భారతీయులదనీ, బ్రిటిష్ ప్రభుత్వం వెంటనే దీనికి ఏర్పాటు చేయాలనీ కోరుతారని కూడా ప్రకటించారు. భారతీయ హక్కులను మొదట గుర్తించి వట్టయితే, ఈ హక్కును వారికి ఏ విధంగా సంక్రమింప చేసేదీ ఆ తర్వాత ప్రభుత్వమూ జాతీయవాదులూ సంప్రదింపులు జరిపి నిశ్చయించ వచ్చుననీ పేర్కొన్నారు. ప్రణాళికలో ఇంకా ఈవిధంగా అన్నారు:

"ప్రభుత్వం ఒకవేళ మా ఈ కోరికను అంగీకరించని పక్షంలో లేదా అంగీక రించిన తర్వాత మాకు ఆమోదయోగ్యంకాని షరతులు విధించినపక్షంలో శాసన సభకూ రాష్ట్ర సమితులకు ఎన్నికయే పార్టీసభ్యులు వారికి మెజారిటీ ఉన్నట్లయితే శాసనసభద్వారానూ సమితులద్వారానూ పాలనా నిర్వహణ అసాధ్యమయేట్లు ఒకే మోస్తరుగా అదేపనిగా నిలుపులేకుండా అవరోధం కల్పిస్తూవుంటారు."7

"శాసనసభల్లోఉంటూ సంస్కరణలను నాశనం చేయాల"న్న స్వరాజ్యవాదుల వినా దంతో ప్రజల్లో అధైర్యం తొలగిపోయింది. రాజకీయ రంగంలో కొంత పురోగతి కనిపించింది. 1920 - 22 మధ్య విప్లవాత్మక పరిస్థితిలో "విప్లవవ్యతిరేకంగానూ ప్రభుత్వంలో ఒకభాగం"8 గానూ తయారైన మితవాదులు లేక ఉదారవాదులు, ఎన్ని కల్లో చిత్తుగా ఓడిపోయారు. బెంగాల్‌లో సురేంద్రనాథ బెనర్జీ, బొంబాయిలో ఎస్. ఎమ్.పరాంజపే, మద్రాసులో శేషగిరి అయ్యర్, యునైటెడ్ ప్రావిన్సెస్‌లో సి. వై. చింతామణి వంటి ఉద్దండ ఉదారవాదులు ఎన్నికల్లో ఓడిపోయారు.

శాసనసభకు జరిగిన ఎన్నికల్లో స్వరాజ్య వాదులు ఘన విజయం పొందారు. సభలోని మొత్తం 145 స్థానాల్లో ఎన్నికయే స్థానాలు 104 లోనూ వీరు 45 గెల్చు కున్నారు. వీటిలో ఎక్కువస్థానాలు అదివరలో ఉదారవాదులకు చెందినవి. రాష్ట్రాల్లో వీరు సాధించిన విజయాలు రకరకాలుగా ఉన్నాయి. సెంట్రల్ ప్రావిన్సెస్‌లో స్వరాజ్యవాదులకు పూర్తి మెజారిటీ లభించింది. బెంగాల్‌లో వీరికి లభించినన్ని స్థానాలు మిగతా ఏ పార్టీకి లభించలేదు. బొంబాయి - యునైటెడ్ ప్రావిన్సెస్‌లో ఎక్కువమందే గెల్చారు. మద్రాసు - బీహార్ - పంజాబుల్లో మాత్రం చాలా తక్కువ మంది గెల్చారు. ఫలితాలు రకరకాలుగా వున్నప్పటికీ స్వరాజ్యవాదుల విజయం మాత్రం నిజమైనది. అదికూడా మితవాద ప్రత్యర్థులను వారి స్థానాలనుంచి తొల గించడంలో వీరి విజయానికి ప్రాముఖ్యం ఏర్పడింది.

## జాతీయవాద పార్టీ : సంకీర్ణ బృందం

శాసనసభలో స్వరాజ్యవాదులది అతి పెద్ద పార్టీ అయినప్పటికీ పూర్తి మెజారిటీ లభించలేదు. జిన్నా నాయకత్వానికి అంగీకరించిన ఇండిపెండెంట్ల మద్దతు లభించి నప్పుడే స్వరాజ్యవాదులు ప్రభుత్వంమీద విరుచుకుపడే వీలుంటుందని స్పష్టంగా తేలి పోయింది. ఇండిపెండెంట్లు 24 మంది ఉన్నారు. దేశ సంక్షేమానికి కృషి చేయ డంలో తోడ్పడేందుకు సిద్ధంగా వున్న ఎవరి సహకారాన్నయినా పొందడానికి తాము వెను కాడబోమని స్వరాజ్యవాదులు తమ ఎన్నికల ప్రణాళికలో స్పష్టంచేశారు. ఐతేకా

ఈ దృష్టితోనే, బొంబాయిలో జిన్నాకు ప్రత్యర్థిగా నిలబెట్టిన స్వరాజ్యవాదిని ఉపసంహరించుకున్నారు.

నాగపూర్ మహాసభ (1920) తర్వాత జిన్నా కాంగ్రెసునుంచి ఉపసంహరించుకున్నమాట నిజమే. నాగపూర్ కాంగ్రెసుతో గాంధీజీ రాజకీయనాయకుడుగా పైకి వచ్చారు. భారతదేశంలోని బ్రిటిషు ప్రభుత్వంతో సహకరించవద్దని ప్రజలకు ఉద్బోధచేసింది నాగపూర్ కాంగ్రెసు. కాంగ్రెసు పార్టీ రాజ్యాంగానికీ విధానానికీ గాంధీజీ మామూలు ప్రజానీకాన్ని ప్రాతిపదికచేయడం జిన్నాకు నచ్చలేదు. కాని ఆయన, "హిందూముస్లిం ఐకమత్యానికి మధ్యవర్తి"గా వ్యవహరించడం మానలేదు.[9] కాంగ్రెసు – లీగ్ మధ్య 1916లో కుదిరిన లక్నో ఒప్పందాన్ని తయారుచేసిన ప్రముఖుల్లో ఆయన ఒకరు. దీనినంతా గుర్తుచేస్తూ, ఆ రోజుల్లో భారత జాతీయ ప్రతినిధిగా వ్యవహరిస్తూ వచ్చిన బాంబే క్రానికల్, జిన్నాకు ఓటు వేయవలసిందని బొంబాయి ప్రజలకు శిఫార్సు చేసింది. ఈ పత్రిక తన సంపాదకీయంలో ఈ విధంగా రాసింది.

"ఉజ్వలమైన నిజమైన దేశభక్తి కలవాడు. ఒకరి దయాదాక్షిణ్యాలకు గాని కోపతాపాలకుగాని చలించని అసాధారణమైన స్వతంత్రుడు. అన్నిటికీమించి దేనికీ తలఒగ్గని యోధుడు. ఈ అన్ని గుణాలవల్ల, బొంబాయి పౌరుల్లో బొంబాయి ప్రతినిధిగా వుండే అర్హత మిగతా అందరికంటే ఆయనకే ఎక్కువగా వుంది."[10]

జిన్నా పోటీలేకుండా శాసనసభకు ఎన్నికయారు. స్వరాజ్యవాదులు శాసనసభలో ఆయన సహకారాన్ని కోరినప్పుడు ఆయన అంగీకరించారు. ఈ విధంగా స్వరాజ్యవాదులూ, మితవాదులు, ఇండిపెండెంట్లు సంకీర్ణబృందంగా ఏర్పడ్డారు. రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించి దేశప్రజలందరి అభ్యర్థనమూ రూపొందించి శాసనసభద్వారా ప్రభుత్వానికి నివేదించాలన్న ఒప్పందం ప్రాతిపదికగా సంకీర్ణబృందం ఏర్పడింది. ప్రభుత్వం, తమ అభ్యర్థనకు సంతృప్తికరమైన సమాధానమివ్వని పక్షంలో అవరోధం కల్పించడం – సప్లయిలను నిరాకరించడం అన్న విధానాన్ని అవలంభించాలని తీర్మానించుకున్నారు. "జాతీయవాద పార్టీ" అన్న పేరుతో ఈ సంకీర్ణ బృందం ఏర్పాటైంది. దీనికి విడిగా నియమ నిబంధనలు రూపొందించుకున్నారు. మోతీలాల్ నెహ్రూ దీనికి నాయకులయ్యారు. శాసనసభలో రంగంలో దూకడానికి అంతా సిద్ధమైంది.

శాసనసభలో కృషి

1919వ సంవత్సరపు సంస్కరణలచట్టంకింద మొట్టమొదటి శాసనసభ నిజానికి

ఉదారవాది శాసనసభ. సంస్కరణలు ఎటువంటివైనా వాటిని అమలుజరపడంలో ప్రభుత్వంతో సహకరించాలన్న ఉదారవాదుల విధానం అందరికీ తెలిసినదే కనుక, మొదటి శాసనసభ కార్యకలాపాల్లో అందోళనగాని, ఉత్సుకతగాని లేకపోయింది. కాని రెండవశాసనసభ మొదటిదానికంటె భిన్నమైనది. శాసనసభలో స్వరాజ్యవాదులది అతిపెద్ద పార్టి. శాసన సభలో వుంటూనే సంస్కరణలను మట్టుపెట్టాలన్నది వారి లక్ష్యం, అంటే సహాయనిరాకరణ ఉద్యమాన్ని విస్తరింపచేశారన్నమాట. నాశనం చేసే రాజకీయాలకూ రాజ్యాంగపరమైన రాజకీయాలకూ పొత్తు ఏ విధంగా కుదురుతుందో చూడవలసివుంది. ఈ రెండూ ఒకదానికి మరొకటి హానికలిగించకుండా కలిసి ఎంత బాగాపనిచేయగలవు అన్న సందేహం దేశ ప్రజల్లో కలుగక పోలేదు. ఈ రెంటికీ ఒకదానితో మరొకదానికి కుదరదని అగ్రజాతీయవాది అయిన గాంధీజీ మొదటి నుంచీ అభిప్రాయపడ్డారు. అందువల్ల క్రొత్తగా ఎన్నికైన శాసనసభ మొదటిసారి సమావేశ మయే సమయం వచ్చినప్పుడు అందరూ ఏం జరుగుతుందన్న ఆదుర్దాతో ఎదురు చూడ సాగారు.

సభ్యుల వ్యక్తిత్వాల విషయంలోకూడా రెండవ శాసనసభ మొదటి దానికంటె విభిన్నమైనదీ, ఆకర్షణీయమైనది కూడా. భారత రాజకీయాలూ ప్రజాజీవితంలో ప్రముఖులు అనేకులు శాసనసభలో సభ్యులయారు. వీరు : పండిత మోతీలాల్ నెహ్రూ, ఎం. ఎ. జిన్నా, పండిత మదనమోహన మాలవ్యా, విఠల్‌భాయ్ పటేల్, లాలాలజపత్‌రాయ్, (1926లో ఎన్నికయారు) బిపిన్ చంద్రపాల్, సర్ శివస్వామి అయ్యర్, సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాస్, సర్ చిమన్‌లాల్ సితల్‌వాద్, సర్ హెచ్. ఎస్. గౌర్ మొదలైనవారు. యంగ్ ఇండియా తరపున శ్రీ టి. సి. గోస్వామి, దివాన్ చమన్‌లాల్, షణ్ముఖం చెట్టి, కె. సి. నియోగి, యన్. యమ్. జోషి, భారతదేశంలో అప్పుడే అవతరిస్తున్న కార్మిక ఉద్యమం తరపున ఎన్ని కయారు.

దేశప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలుకూడా బృహత్తరమైనవే. స్వరాజ్యానికి దారితీసేవిధంగా రాజ్యాంగపరమైన పురోగతి అన్నిటికంటె ప్రముఖమైనది రెండవది : దౌర్జన్యకాండకు దిగే జాతీయవాదుల ఉద్యమాన్నీ, విప్లవ ఉద్యమాన్నీ అణిచివేసేందుకు భారతప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేసే విధానాలూ చర్యలూ దేశప్రజలను కలవరపెడుతున్నాయి. మూడవది : విద్యావంతులు రాజకీయ చైతన్యం పొందినవారూ, పెట్టుబడిదార్లూ దేశవాళీ పరిశ్రమల అభివృద్ధి సర్వీసుల్లో భారతీయులను మార్చుకోవడం వంటి విషయాలలో ఎక్కువ శ్రద్ధ కనపరుస్తున్నారు.

రాజ్యాంగ పురోగతికి ఒత్తిడి

శాసనసభ మొట్టమొదటి సమావేశంలో రాజ్యాంగ సంస్కరణలు కావాలన్న జాతీయవాదుల కోరిక వ్యక్తమైంది. 1924 ఫిబ్రవరి 5వ తేదీన టి. రంగాచారియార్ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగంగావుంటూ డొమినియన్ ప్రతిపత్తి కలిగివుండేందుకూ రాష్ట్రాల్లో రాష్ట్రీయ స్వయంపాలనా వ్యవస్థ ఏర్పడేందుకూ వీలుగా 1919వ సంవత్సరపు భారతప్రభుత్వ చట్టాన్ని సవరించడానికి తగిన చర్యలను వీలైనంత త్వరగా తీసుకోవలసిందని ఈ తీర్మానంలో గవర్నర్ జనరల్‌నూ అయన సమితినీ కోరారు. అవసరమైనట్టయితే దీనికిగాను రాయల్ కమీషన్ నొకదాన్ని నియమించవచ్చుననికూడా తీర్మానంలో సూచించారు. ప్రతిపక్ష నాయకులైన మోతీలాల్ నెహ్రూ ఈ తీర్మానానికి ఈ క్రింది సవరణను ప్రతిపాదించారు.

"భారతదేశంలో పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఏర్పాటుకు వీలుకల్పించే విధంగా భారతప్రభుత్వ చట్టాన్ని సవరించేందుకు తగిన చర్యలు తీసుకోవలసిందని శాసనసభ్యులు గవర్నర్ జనరల్‌కూ అయన సమితికి శిఫార్సు చేస్తున్నారు. దానికి గాను :

a) భారతదేశంలోని ముఖ్యమైన అల్పసంఖ్యాకవర్గాల ప్రయోజనాలనూ, హక్కులనూ దృష్టిలో వుంచుకుని దేశానికి రాజ్యాంగ పథకం ఒకదాన్ని శిఫార్సు చేసేందుకు త్వరలో అన్ని వర్గాలకూ ప్రాతినిధ్యముండే రౌండ్ టేబుల్ మహాసభను ఏర్పాటుచేయాలి.

b) కేంద్ర శాసననిర్మాణ సమితిని రద్దుచేసి పైన పేర్కొన్న పథకాన్ని కొత్తగా ఎన్నికయే శాసనసభకు నివేదించి, దాని ఆమోదం పొందిన తర్వాత, చట్టంగా రూపొందించేందుకు బ్రిటిషు పార్లమెంటుకు సమర్పించాలి."

రంగాచారి తీర్మానం మీద మాట్లాడుతూ బ్రిటిషుసభ్యుడు సర్ మాల్కమ్ హెయిలీ ముఖ్యమైన విషయాల్లో ఈ తీర్మానం, 1919వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టానికి వ్యతిరేకంగా వుందని చెప్పారు. భారతదేశంలో "బాధ్యతాయుత ప్రభుత్వాన్ని క్రమేణా ఏర్పాటుచేయా"లన్నది చట్టం లక్ష్యంకాగా "బ్రిటిష్ ప్రభుత్వంలో భాగంగా పూర్తిస్వయం పాలన కలిగిన డొమినియన్ ప్రతిపత్తి" కావాలని తీర్మానంలో కోరారని సర్ హెయిలీ పేర్కొన్నారు. రెండవది : ఈ లక్ష్యసాధనకు ఘట్టాలవారీగా చర్యలు తీసుకోవాలని చట్టంలో ఉద్దేశించినట్టు ఆయన గుర్తు చేశారు. మూడవది; ఈ చర్యలను ఎప్పుడు ఏ విధంగా తీసుకునేదీ బ్రిటిషు పార్లమెంటు మాత్రమే నిర్ణయించగలదని ఆయన

చెప్పారు. డొమినియన్ ప్రతిపత్తిని మంజూరు చేసేందుకు కొన్ని అవరోధాలున్నాయని అంటూ వాటిని పేర్కొన్నారు కూడా. భారతదేశం ఇతరుల సహాయలేకుండా తననుతాను రక్షించుకోజాలక పోవడం, భారతదేశంలోని సంస్థానాల రాజ్యాంగపరమైన ప్రతిపత్తి, భారతీయ సమాజంలోనితీవ్రమైన విభేదాలు - ఇవీ ఆయన పేర్కొన్న అవరోధాలు. భారతదేశంలోని రాజకీయ పరిస్థితుల దృష్ట్యా ఈ విషయమై వెంటనే ఏదో ఒక చర్యతీసుకోలేక పోయినప్పటికీ చట్టం అమలు జరుగుతున్న తీరును పరిశీలించేందుకు అధికార దర్యాప్తు జరిపించవచ్చునని ఆయన సూచించారు.

బ్రిటిషు సభ్యుడి వాదనను మోతీలాల్ నెహ్రూ తీవ్రంగా ఖండించారు. 1919వ సంవత్సరపు చట్టం చెడ్డ చట్టమని ఫిబ్రవరి 8వ తేదీన ఆయన బ్రిటిషు సభ్యుడికి కుండబగులగొట్టినట్టు చెప్పారు. భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలన్న అంశాన్ని చట్టం ఉపోద్ఘాతంలోగాని చట్టంలోగాని పొందుపరచకుండా ఈ చట్టం భారతదేశానికి పెద్ద అన్యాయం చేసిందని ఆయన అన్నారు. అందువల్ల "భారత ప్రభుత్వ చట్టంలో సమూలమైన మార్పులు చేయడం అవసరం." "పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని పళ్లెంలోపెట్టి ఇవ్వమనడంలేదు." అని ఆయన స్పష్టం చేశారు. మొదట ఈ సూత్రాన్ని, హక్కును, గుర్తించాలి. ఆ తర్వాత ప్రతినిధులతో కూడిన రౌండ్‌టేబుల్ సమావేశాన్ని ఏర్పాటుచేయాలి. అంతేగాని రాయల్ కమీషన్ ఒకదాన్ని ఏర్పాటుచేసి దానిచేత మొత్తం వ్యవహారాన్ని పరిశీలింపచేయడంకాదు చేయవలసినది. తమ సవరణలోని 3వ క్లాజు గురించి ప్రస్తావిస్తూ ఆయన అది స్వయంనిర్ణయ హక్కుకు అనుగుణంగావుందని అన్నారు. బ్రిటిషు పార్లమెంటూ ప్రభుత్వమూ దీనికి అంగీకరించాలన్నారు. ఆయన ప్రభుత్వాన్ని ఈ విధంగా హెచ్చరించారు:

> "అయ్యా, సహాయనిరాకరణదారులమే అయినా మేము, సహకరించేందుకే ఇక్కడికి వచ్చాము, అదీ మీరు మాతో సహకరిస్తేనే సాధ్యమౌతుంది. మీరు దానికి అంగీకరించినట్టయితే మేము మీ మనుషులం. లేనట్టయితే మానవుల సహజ రీతిలో మేము మా హక్కులకోసం పోరాడుతాం, సహాయనిరాకరణదారులంగా కొనసాగుతాం."11

మదన్‌మోహన్ మాలవ్యా, మోతీలాల్ నెహ్రూ సవరణను గట్టిగా బలపరచారు. డొమినియన్ ప్రతిపత్తి కావాలని కోరడం కొత్తగావుందని బ్రిటిషు సభ్యుడు పేర్కొనడాన్ని ఆయన మొదట ఖండించారు. అప్పుడు అమల్లో వున్న చట్టంవల్ల పరిస్థితులు ఏ విధంగా ఉన్నదీ ఆయన వివరించారు. రాష్ట్ర ప్రభుత్వాలకు కేటాయిం

చిన శాంతిభద్రతలు, భారతప్రభుత్వ అజమాయిషీలో కూడా ఉంటున్నా గత రెండేళ్లలో ఉన్నంత అధ్వాన్నంగా ఇదివరకెప్పుడూ లేవని ఆయన అన్నారు. భారతీయ పరిశ్రమలు గాని, సైన్యంలోకి, సర్వీసుల్లోకి భారతీయులను తీసుకోవడంగాని ఏ విధంగానూ మెరుగు పడలేదని కూడా ఆయన చెప్పారు. ఇంకా ఈవిధంగా పేర్కొన్నారు.

"పరిశ్రమల విషయంలో, దేశవాళీ పరిశ్రమలను భారీగా అభివృద్ధి పరచేందుకు ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకోలేదు, గత మూడేండ్లలో మేము తెలుసుకున్నది ఇదే. ప్రభుత్వం అనుసరిస్తూన్న విధానం ప్రకారం, భారతీయసైన్యంలో పూర్తిగా భారతీయులే ఉండే సమయం, షుమారు వందఏండ్లకు రావచ్చునని సంఖ్యా వివరాలవల్ల తెలుస్తూవుంది. దీనివల్ల అభివృద్ధిని సాధించే గమనం విషయంలో మేము చాలా మందిమి మా అభిప్రాయాలను సవరించుకోవలసి వచ్చింది. మాదేశంలోని బ్రిటిషు అధికార్లు అధికారంలో ఉన్నంతకాలం, భారతీయబాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడేందుకు అవసరమైన చర్యలనుకూడా తీసుకోరని మాకు గట్టి నమ్మకం ఏర్పడింది. అందుకని వారు పదవినుంచి వైదొలగాలని కోరుతున్నాము....[12]

జిన్నా, మోతీలాల్ నెహ్రూ ప్రతిపాదించిన సవరణను సమర్థించారు. కాని బ్రిటిషు సభ్యుడితో ముఖ్యంగా, దర్యాప్తు విధానానికి సంబంధించిన విషయంలో ఏకీభవించారు. రౌండ్‌టేబుల్ సమావేశం జరగాలని మోతీలాల్ నెహ్రూ కోరగా, ప్రభుత్వండిపార్ట్‌మెంటల్ ఎన్‌క్వయిరీకి మాత్రమే అంగీకరించింది. జిన్నా బ్రిటిషు సభ్యుడిని ఈ విధంగా ప్రశ్నించారు.

"తలుపులు బిగించుకుని మీ కార్యాలయల్లో ఎందుకు కూచుంటారు? మాకు తెలియకుండా ఉత్తరప్రత్యుత్తరాలను జరుపుతారెందుకు. నిర్ణయాలు తీసుకుని ప్రతిపాదనలను రూపొందించిన తర్వాత మాదగ్గరకువచ్చి పరిస్థితి ఇబ్బందిగావుందని ఎందుకు చెస్తారు. మీరు ప్రజలను సంప్రదించాలన్నది మా అభిమతం ప్రజల మద్దతు లభించేవిధంగా మీరు పనిచేయాలని మేము కోరుతున్నాం."[13]

విఠల్‌భాయ్ పటేల్ మాట్లాడుతూ, రాజ్యాంగ పురోభివృద్ధి కాంగ్రెసు ఎప్పటినుంచి కోరుతూ వచ్చినదీ దీనికి బ్రిటీష్ ప్రభుత్వ వైఖరి ఏవిధంగా వున్నదీ వివరంగా తెలియచేశారు. తప్పో ఒప్పో భారతజాతీయ కాంగ్రెసు ఇంతవరకు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనికోరలేదని ఆయన చెప్పారు. అయినా బ్రిటిష్‌ప్రభుత్వమూ ప్రజానాయకులూ భయపడుతున్నారు. ఘట్టాల వారిగా అభివృద్ధి జరిగేవరకు భారతీయులికి వేచివుండలేరు. "ఘట్టాలవారీగా స్వరాజ్యం సంపాదించేందుకు మేం పోరాడుతున్నామని అనుకోవద్దు. నాకు ఏం కావాలో భారత జాతీయ కాంగ్రెసుకు ఏం కావాలో నాకు స్పష్టంగా తెలుసు.

మాకు వెంటనే పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వం కావాలి. అందులో ఏమాత్రం సందేహంలేదు " అన్నారాయన. 14

ఆర్. కె. షణ్ముగం మాట్లాడుతూ, రాజకీయంగా పరాయివారి పాలనలోవుండే ఏ ప్రజ అయినా సాంఘికంగా పురోగమింపజాలరన్నది తమ అభిప్రాయమని చెప్పారు. "భారతీయులు సాంఘికంగా ఉన్నత స్థాయికి చేరుకునే వరకూ స్వాతంత్ర్యం కోసం వేచి వుండాలని ప్రభుత్వం భావించి నట్లయితే, కలకాలం ఆ విధంగా వేచివుండ వలసిందే, ఎందువల్లననగా ప్రస్తుతం వున్న పరిస్థితుల్లో ఆరోజు ఎప్పటికీ రాదు. భారత ప్రజానీకం మార్పును కోరుతున్నా దనడంలో సందేహంలేదు.'' అంటూ షణ్ముగం. ప్రభుత్వాన్ని ఈ విధంగా హెచ్చరించారు. "ప్రజాభిప్రాయపు ఒత్తుడులకు లొంగ రాదన్నది ప్రభుత్వ విధానమైతే, భారతీయులుకూడా దమన విధానానికి లొంగరాదని కృత నిశ్చయంతో వున్నారని భారతీయులందరి తరపున చెబుతున్నారు.''15

భారత ప్రభుత్వానికి పూర్తి డొమినియను ప్రతిపత్తి నిచ్చేసమయం వచ్చిందని చమన్‌లాల్ గట్టిగా చెప్పారు. భారతదేశాన్ని పాలించేందుకు ఫిరంగులు విమానాలు తప్ప, ఇతరమైన అధికారమేదీ లేదని ఆయన అన్నారు. ''భారతదేశం తిరుగుబాటు జరిపే పరిస్థితిలో వుందనడంలో సందేహంలేదు. డొమినియన్ ప్రతిపత్తి ఇచ్చినట్లయితే అరాచక మేర్పడుతుందని బ్రిటిషుసభ్యులు భయపడుతున్నారు. అరాచకం ఇప్పుడే ఏర్పడుతుంది. దేశం క్రమేపీ దారిద్ర్యం పొందటానికి కారకులైన వారే అరాచక వాదులు'' 16

భారతీయ వాణిజ్య వేత్తలమండలి ప్రతినిధిఅయిన పురుషోత్తమ దాస్ ఠాకుర్ దాసు మోతీలాల్ నెహ్రూ సవరణను సమర్థిస్తూ ప్రస్తుతం నెలకొనివున్న పరిస్థితి ప్రజ లందరికీ అసంతృప్తికరంగానే వుందని చెప్పారు. ప్రజా ప్రతినిధుల కోరికకు అను గుణంగా పరిపాలించే బాధ్యత ప్రభుత్వానికుండేట్లు చూసేందుకూ శాసన సభలకు ఇంకా ఎక్కువ ఆర్థిక – ఇతర అధికారాలు కల్పించేందుకు శాసనసభకు జాప్యంలేకుండా అవ రోధాలు కల్పించకుండా సర్వంసహాధికారాన్ని సంక్రమింపచేసేందుకూ యంత్రాంగం ఒకటి ప్రస్తుతం అవసరమని ఆయన పేర్కొన్నారు."17

సి. దొరైస్వామి, మోతీలాల్ నెహ్రూ సవరణను సమర్ధిస్తూ, " భారతదేశంలో బాధ్యతాయుతమైన ప్రభుత్వం నెలకొన్నట్టయితే, దేశంలో యూరోపియన్ల, ప్రయోజనాలు భద్రంగా ఉంటాయనీ, నిజానికి, ప్రస్తుత ప్రభుత్వం కింద భారతీయ పెట్టుబడులకంటే ఇంకా ఎక్కువ భద్రంగానే వుంటాయ"ని సభవారికి హామీ ఇచ్చారు.18

శివస్వామి అయ్యర్, రంగాచారియార్ ప్రతిపాదించిన తీర్మానాన్ని సమర్థించారు. సంస్కరణల్లో మొదటి ఘట్టాన్ని ఇంకా అమలుపరచి చూడనేలేదన్న ప్రభుత్వ పక్షపు వాదన గురించి ఆయన ప్రస్తావించారు. ఈ వాదనతో ఆయన ఏకీభవించలేదు. మొదటి శాసనసభ చెప్పుకోతగిన కృషి చేసిందని తాము అభిప్రాయపడుతున్నామనీ అధికారవర్గాలు కూడా దీన్ని అంగీకరించాయనీ శివస్వామి అయ్యర్ చెప్పారు. బ్రిటిషు సభ్యుడు మాట్లాడుతూ భారతీయుల్లో చాలామంది సమికులకు దూరంగా వున్నారనీ సంస్కరణలను అమలు జరపడంలో ఎటువంటి ఆసక్తి కనబరచలేదనీ చెప్పారు. సంస్కరణలను అమలు జరుపడం కొంతమందికి ఇష్టంలేదని దీనివల్ల తెలుస్తూందనీ ఆయన వాదించారు. ఈ వర్గపుప్రజలకున్న అభ్యంతరాన్ని తొలగించినట్లయితే ఇంతవరకు సహాయ నిరాకరణ అపలు జరుపుతున్నవారు ముందుకు వచ్చి ఇకమీద ప్రభుత్వంతో బహుశ సహకరించవచ్చు. అయినా, రౌండ్ టేబుల్ సమావేశంకంటె రాయల్‌కమిషన్‌ను ఏర్పాటుచేయడమే మర్యాదని ఆయన అభిప్రాయపడ్డారు. ప్రభుత్వం ప్రతిపాదించిన డిపార్ట్‌మెంటల్ ఎన్‌క్వయిరీని కూడా ఆయన వ్యతిరేకించారు.[19]

ప్రభుత్వమూ జాతీయవాదులూ ఒక రాజీమార్గాన్ని అనుసరించి దీనివిషయమై పరిశీలించేందుకు ఒక సంఘాన్నికాని సమావేశాన్నికాని ఏర్పాటు చేసుకున్నట్లయితే బాగుంటుందని కొంతమంది ఇండిపెండెంటు సభ్యులు ముఖ్యంగా ఎచ్. ఎస్. గౌర్, బిపిన్ చంద్రపాల్, ఇరుపక్షాలవారినీ కోరారు. కాని ఫలితం లేకపోయింది. ఆఖరకు మోతీలాల్‌నెహూ్రు సవరణను 64 ఓట్లతో ఆమోదించారు. వ్యతిరేకంగా 48 ఓట్లు పడ్డాయి. సభలోఎన్నికైన సభ్యులు దాదాపు అందరూ సవరణను సమర్థించారు. ఇది జాతీయవాదులకు ఘనవిజయమే. శాసనసభ దీనిమీద తనముద్ర వేసింది. ఇదే ఆ దరిమిలా 'దేశప్రజల కోరిక' (నేషనల్ డిమాండ్) అన్న పేరుతో ప్రఖ్యాతి గాంచింది.

## ముద్దిమన్ సంఘం నివేదిక

భారత ప్రభుత్వ చట్టాన్ని పునఃపరిశీలించేందుకు సంబంధించి శాసనసభ ఆమోదించిన తీర్మానానికి బ్రిటిషు ప్రభుత్వం అంగీకరిస్తుందని ఎవరూ అనుకోలేదు. అయినా చట్టం ఏవిధంగా అమలుజరుగుతున్నదీ దర్యాప్తు జరిపేందుకు భారత ప్రభుత్వం, దేశ వ్యవహారాల కొత్త సభ్యుడైన సర్ అలెగ్జాండర్ ముద్దిమన్ అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించింది. సంఘం ఏఅంశాలను పరిశీలించాలో స్పష్టంగా తెలుపలేదు. 1919 వ సంవత్సరపు భారత ప్రభుత్వపు చట్టాన్ని అమలుపరచినందువల్ల తలఎత్తిన

ఇబ్బందులను ఈ సంఘం పరిశీలిస్తుంది. అటువంటి ఇబ్బందులు లేదా లోటుపాట్లను చట్ట స్వరూపమూ – విధానమూ – ఉద్దేశ్యానికి అనుగుణంగా, చట్టరీత్యా అవసరమైతే చట్టాన్ని సవరించిగాని, సరిదిద్దేందుకు అవకాశాలను పరిశీలించి పాలనా నిర్వహణ లోని లొసుగులను ఈసంఘం సరిచేస్తుంది.

సంఘం ఏకగ్రీవంగా ఎటువంటి నిర్ణయాలూ తీసుకోలేక పోయింది. ఫలితంగా రెండు నివేదికలు వెలువడ్డాయి. అయిదుగురు సభ్యులు సంతకాలు చేసిన మెజారిటీ నివేదిక ఒకటి, నలుగురు సంతకాలు చేసిన మైనారిటీ నివేదిక ఒకటి, (ఎం. ఎ. జిన్నా. టి. బి. సప్రు. శివస్వామిఅయ్యర్. పరాంజేపే) రెండు నివేదికలమధ్యా మూలవిభేదా లున్నాయి. చట్టాన్ని అమలుపరచడంలోని ఇబ్బందులనూ చట్టంకింద రూపొందిం చిన నిబంధనలనూ పేర్కొంటూ మెజారిటీ నివేదికలో, చట్టం మూలస్వరూపం చెదరకుండా కొన్ని సవరణలనుసూచించారు. అప్పట్లో అమల్లోవున్న రాజ్యాంగ యంత్రాంగాన్ని సమూలంగా మార్చాలనీ, దాన్ని సవరించేందుకు వీలుకాదనీ మైనారిటీ నివేదికలో పేర్కొన్నారు. ద్వంద్వ ప్రభుత్వం విఫలమైందని అంటూ మైనారిటీ నివేదికలో, దీనిస్థానే, ఒకేఒక బాధ్యతాయుతమైన రాష్ట్రీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని కోరారు.[20]

1925 సెప్టెంబరు 7వ తేదీన బ్రిటిషు సభ్యుడు శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. మెజారిటీ నివేదికలోని సూత్రాన్ని ఆమోదించి గవర్నర్ జనరల్ ఆయన సమితీ, నివేదికలోని సవివరమైన శిఫార్సులను వీలైనంత త్వరగా పరిశీలించి ప్రభుత్వ యంత్రాంగాన్ని మెరుగుపరచాలని తీర్మానంలో కోరారు.

మోతీలాల్ నెహ్రూ ఈ తీర్మానానికి ఒక సవరణను ప్రతిపాదించారు. భారత దేశపు పాలనా నిర్వహణలోనూ రాజ్యాంగపరమైన యంత్రాంగంలోనూ సమూలమైన మార్పులు చేయాలని ఈ తీర్మానంలో కోరారు. 1924 ఫిబ్రవరి 18వ తేదీన శాసన సభ ఆమోదించిన సవరించిన తీర్మానంలో కోరినవిధంగా, గవర్నర్‌జనరల్ ఆయన సమితీ భారత శాసనసభకు బాధ్యులుగా ఉండాలని పునరుద్ఘాటించారు. భారతదేశానికి సంబంధించిన మంత్రియొక్క సమితిని రద్దుచేయాలనీ, భారతసైన్యాన్ని వీలైనంత త్వరలో జాతీయం చేయాలనీ, దానికిగాను గడువు నిర్ణయించాలనికూడా కోరారు. వివిధ రకాల ఓటర్లతో కూడిన నియోజకవర్గాలను ఏర్పాటుచేసి ఆ నియోజకవర్గాలు ఎన్నుకునే సభ్యులు మాత్రమే కేంద్ర – రాష్ట్ర శాసనసభలో సభ్యులుగా వుండాలనీ, ప్రస్తుతం రాష్ట్రాల్లోవున్న ద్వంద్వ విధానాన్ని రద్దు చేయాలనీ, దాని స్థానే ఏకైక, స్వయం పాలనాధికారంగల బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలనీ మోతీలాల్ తమ సవరణలో కోరారు.

గవర్నర్ జనరల్ శాసనసభతో సంప్రదించి. ఒక మహాసభను, ఒక రౌండ్ టేబుల్ సమావేశాన్ని లేదా మరేదైనా తగిన ఏజన్సీని ఏర్పాటు చేయాలని అటువంటి దానిలో, భారతీయులందరికీ యూరోపియన్, ఆంగ్లోఇండియన్ ప్రయోజనాలకూ ప్రాతినిధ్యముండాలనీకూడా సవరణలో శిఫార్సు చేశారు. అటువంటి సభ, అల్ప సంఖ్యాకవర్గాలను దృష్టిలో పెట్టుకుని పైన పేర్కొన్న సూత్రాలు ఆధారంగా, అవసర మైన దర్యాప్తు జరిపి సవివరమైన పథకాన్ని తయారుచేయాలని సూచించారు. ఈ పథకాన్ని శాసనసభ ఆమోదించిన తర్వాత శాసనంలో పొందుపరచేందుకు బ్రిటిషు పార్ల మెంటుకు నివేదించవలసి వుంటుంది.21

ఇంతకుముందు సూచించిన విధంగా 1924 ఫిబ్రవరి 18వ తేదీన ఆమోదించిన 'దేశ ప్రజల కోరిక'కు విశదీకరణే. ప్రజానీకం దీన్ని సమర్థించేందుకుగాను, ఇదివర కటి వైఖరిని కొంత సడలించారు. అంటే సవివరమైన పథకాన్ని తయారుచేసేందుకు రౌండ్ టేబుల్ సమావేశాన్ని ఏర్పాటు చేయాలని కోరలేదు ; ఒక మహాసభగాని, మరేదైనా ఏజన్సీగాని చాలునని అన్నారు.

మోతీలాల్ నెహ్రూ తమ తీర్మానం గురించి మాట్లాడుతూ సైనిక సర్వీసులకు ఒక పరిమితిదాకా ఖర్చు, రాజకీయవిదేశ ఖర్చు, ఋణాల చెల్లింపు, వంటి కొన్ని విషయాలు తప్ప మిగతా వాటికి సంబంధించి ప్రభుత్వం శాసనసభకు బాధ్యతవహించేట్టు ఉండాలన్నదే తాము కోరుతున్న దానిలో ప్రధాన అంశమని చెప్పారు. నెహ్రూ సూచిం చిన పథకంలో సైనిక సర్వీసులు మొత్తంమీద గవర్నర్ జనరల్ - ఆయన సమితి ఆధ్వర్యంలో వుంటాయని పేర్కొన్నారు. పరిష్కారం కుదరాలన్న దృష్టితో తాము తమ కోరికను ప్రతిపాదన రూపంలో సమర్పిస్తున్నామనీ అందుకే ఇటువంటి కొన్ని అంశాల విషయంలో ఉదార వైఖరి అవలంబించామనీ మోతీలాల్ నెహ్రూ వివరించారు. ఆయన ఈ విధంగా హెచ్చరించారు కూడా :

"ఈ ప్రతిపాదనకు జాతీయవాదులందరూ అంగీకరించారు. పరిష్కారం కుదరా లన్న ఉద్దేశ్యంతో మాత్రమే దీన్ని ఆమోదించాలన్న సంగతి నేను స్పష్టం చేయ వలసి వుంది. స్వరాజ్యపార్టీ మొత్తం, ఈ ప్రతిపాదనకు కట్టుబడి వుంటుంది. ఇతర జాతీయవాదులందరూ శాసనసభ్యులైనా లేకపోయినా దీనికి కట్టుబడివుంటారు. కాని పరిష్కారంకోసం తలపెట్టిన ప్రతిపాదనగా దీన్ని స్వీకరించకపోయినట్లయితే మాత్రం ఎవరూ దీనికి కట్టుబడి వుండరు. కనీసం స్వరాజ్యవాదులు దీనికి కట్టు బడి వుండరు."22

జిన్నా అదివరకటి మోస్తరుగానే ఇప్పుడుకూడా మోతీలాల్ నెహ్రూ సవరణను సమర్థించారు. ఆయన ఎంతో కూలంకషంగా ఘాటుగా మాట్లాడారు. బ్రిటిషు అధి కార్లూ ప్రజానాయకులూ పదేపదే పేర్కొంటున్న 'ఇబ్బందుల' గురించి ప్రస్తావిస్తూ ఆయన వ్యంగ్యంగా ఇలా అన్నారు :

"అయ్యా! భారతదేశం ఒకజాతికాదు అని మాకు చెబుతున్నారు. గొప్ప యుద్ధం జరుగుతుండగా మేము ఒక జాతిగా వున్నాం. మనిషి సహాయానికీ ధన సహాయా నికి మమ్మల్ని అర్థించారు అప్పుడు. ఫ్రాన్సులో శాంతి ఒప్పందంమీద సంతకం చేయమని మమ్మల్ని అడిగినప్పుడుకూడా మేము ఒక జాతిగావున్నాం. లీగ్ ఆఫ్ నేషన్స్‌లో మాకు సభ్యత్వం వచ్చినపుడుకూడా మేము ఒక ప్రజ. లీగ్ ఆఫ్ నేషన్స్‌కు మేము బాగానే సహాయం చేస్తున్నాం. పోతే సార్వభౌమ్య మహాసభకు ఒక జాతిగా లేదా ఒక ప్రజగానేకదా ప్రతినిధులను పంపుతున్నాము. మేముమీ భాగస్థులం కాని ఒక ప్రజకాము. మా దేశంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పా టుకూ పార్లమెంటరీ వ్యవస్థల ఏర్పాటుకూదారితీసే చర్యలను తీసుకోవలసిందని మేము మిమ్ములను అడిగినపుడు మాత్రం మేము ఒక ప్రజకాము. ఒక జాతీ కాము"23

రోహిల్‌కుండ్‌కు చెందిన మౌల్వి మహమ్మద్ యాకుబ్, మోతీలాల్ నెహ్రూ సవరణను సమర్థిస్తూ సర్వజనకు సంబంధించి, భవిష్యత్తులో అమలుజరిపే ఎటువంటి పథకంలోనైనా ముస్లింలహక్కులకూ ప్రయోజనాలకూ రక్షణ కల్పించడం గురించి అఖిలభారత ముస్లింలీగ్ 1924 మేలో ఆమోదించిన తీర్మానం గురించి ప్రస్తావించారు. ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలను కొనసాగిస్తూ స్వరాజ్యకు అంటే పూర్తి బాధ్యతా యుతమైన ప్రభుత్వం ఏర్పాటుకు వెంటనే చర్యలు తీసుకోవాలని ఆయన పునరుద్ఘా టించారు. 1919 వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టాన్ని సమూలంగా సవరించి నపుడే ఇది సాధ్యమౌతుంది కాని. చట్టంలోని లోపాలను సరిదిద్దే ఉద్దేశ్యంతో దర్యాప్తు జరిపినంతమాత్రాన కాదని ఆయన స్పష్టంచేశారు. 24

సెంట్రల్ ప్రావిన్స్‌సెస్‌కు చెందిన భూస్వాముల ప్రతినిధి అయిన సేట్ గోవిందదాసు కూడా మోతీలాల్‌నెహ్రూ సవరణను సమర్థించారు. భూస్వాములు ప్రభుత్వాన్ని గుడ్డిగా సమర్థిస్తున్నారన్న సాధారణ ఆరోపణ గురించి ప్రస్తావిస్తూ భూస్వాముల ప్రతినిధిగా ఆయన ఈ ఆరోపణను ఈవిధంగా ఖండించారు.

"తమ ప్రయోజనాలు, మిగతా దేశప్రజల ప్రయోజనాలకు భిన్నమైనవి కావని భూస్వాములు ఇప్పుడు గ్రహించారు. కౌలుదార్లు సంతృప్తితో వున్నపుడు, వ్యవసాయంమీద ఆధారపడిన వారందరూ సంపన్నంగా వున్నపుడు వాణిజ్యం

మూడుపువ్వులూ ఆరుకాయలుగా వున్నపుడే ఈ దేశంలోని భూస్వాములు సిరి సంపదలతో తులతూగగలరు. అయ్యా అందువల్ల నేను, మానాయకులైన మోతీలాల్‌నెహ్రూ సవరణను నాతరపునా ఇతర భూస్వాములతరపునా మనస్ఫూర్తిగా సమర్థిస్తున్నాను."25

బీహార్‌లోని ఛోటానాగపూర్ డివిజన్‌కు చెందిన దేవకీప్రసాద్‌సిన్హా ఆర్థిక సమస్య గురించి మాట్లాడారు. భారతదేశాన్ని సంపన్నం చేయడమే తమపాలన లక్ష్యమన్న బ్రిటన్‌వాదనను బట్టబయలుచేస్తూ ఆయన భారతప్రజానీకం స్వయంపాలనా ఉద్యమాన్ని ఎందుకు సమర్థిస్తూ వుందో వివరించారు:

"అయ్యా భారతీయులకు స్వయంపాలన అంటే, ఈదేశంలో లాభాలను భారతీయ పెట్టుబడిదార్లూ యూరోపియన్ పెట్టుబడిదార్లూ సరిసమానంగా న్యాయంగా పంచుకోవడంలేదు. స్వయంపాలన అన్న ఆదర్శం ప్రజా బాహుళ్యానికి ఆశాజ్యోతి వంటిది. స్వయంపాలన ఏర్పడినపుడు తమ ఆర్థికపరిస్థితి మెరుగుపడుతుందనీ ప్రస్తుతం అనుదినమూ తాము గురవుతున్న ప్రమాదాలనుంచి బయటపడతామనీ మామూలుప్రజ ఆశపడుతూవుంది."26

ప్రజానీకం ప్రయోజనాలకు తాము ట్రస్టీలమన్న బ్రిటిషుప్రభుత్వ వాదనను ఎన్. ఎమ్. జోషి బట్టబయలు చేశారు. చట్టాల పుస్తకంలో కొన్ని కార్మికశాసనాలు వున్నమాట వాస్తవమే. అయితే ఇవి లాంకషైర్ ప్రయోజనాలకోసమైనా చేసి వుండాలి, లేదా, అంతర్జాతీయశక్తులూ సంస్థల ఒత్తిడివల్లనైనా చేసి వుండాలి. మోతీలాల్‌నెహ్రూ సవరణను ఆయన సమర్థించారు, కాని ఓటుహక్కు విషయంలో వాడిన మాటలపట్ల నిరాశ వ్యక్తపరిచారు. భారతదేశంలో ప్రతి ఒక్కరు, పురుషుడుగాని స్త్రీగాని ఓటుచేసేహక్కు కలిగివుండాలనీ ఆస్తి అర్హతగా ఉండరాదనీ స్పష్టంగా పేర్కొనాలని ఆయన కోరారు. యజమానులకు ప్రత్యేకస్థానాలూ వారిని ఎన్నుకునేందుకు వారి వారి సంస్థలూ ఉన్నంతకాలం, కార్మికులకు కూడా ప్రత్యేక స్థానాలూవారిని ఎన్నుకునేందుకు వారి వారి సంస్థలూ ఉండవలసిందే."27

రంగస్వామి అయ్యంగార్, 1919 వ సంవత్సరపు సంస్కరణల చట్టంకింద భారత ప్రభుత్వ పరిస్థితిని నిశితంగా విమర్శించారు. "భారత ప్రభుత్వం ఒక కార్పొరేషన్ ప్రభుత్వమనీ, ఈ కార్పొరేషన్ భారతదేశాన్ని తమ స్వంత ఆస్తిగా భావించి పాతరోజులో కంపెనీ లాభాలకూ భాగస్వాముల లాభాలకూ ఉపయోగించుకునేదనీ ప్రస్తుతం బ్రిటిషు పెట్టుబడిదార్ల ప్రయోజనాలకోసమూ, సర్వీసులకోసమూ ఉపయోగించుకుంటూ వుంద"నీ ఆయన వాదించారు. ఈ స్వంతదారీ ఉద్దేశ్యాలు

కొనసాగినంతకాలం స్వప్రయోజనాలను రక్షించుకునే ప్రయత్నాలు కొనసాగినంతకాలం. వీలైనంత త్వరలో భారతదేశంలో స్వయంపాలన ఏర్పాటుకు ఎంతో శ్రద్ధగా కృషి చేస్తున్నామని భారత ప్రభుత్వం చెప్పుకోవడం శుద్ధ దండుగఅని ఆయన ప్రభుత్వానికి చెప్పారు. "కార్పొరేషన్ కొనసాగడాన్నీ, స్వప్రయోజనహక్కుల కొనసాగింపునూ, బ్రిటిషుసర్వీసులు—బ్రిటిషు పెట్టుబడిదార్ల ప్రయోజనాలకోసం భారతదేశాన్ని వినియోగించుకోవడాన్ని ఇక సహించం" 27a అని ఆయన హెచ్చరించారు.

టి. సి. గోస్వామి, మోతీలాల్‌నెహ్రూ సవరణను గట్టిగా సమర్థిస్తూ తమ దేశప్రజలను ఈవిధంగా హెచ్చరించారు:

"నెహ్రూ తీర్మానాన్ని అందరూ అమలుజరిపేట్టు కృషిచేసేందుకు మీరు సిద్ధంగా వున్నట్టయితేనే దీన్ని సమర్థించండి (వినండి వినండి అని హర్షధ్వానాలు) దీనికి అనుకూలంగా ఓటుచేసే ప్రతిఒక్కరూ దీన్ని బ్రతికివున్నంతకాలం అమలుజరుపుతామని ప్రతిజ్ఞ చేసినప్పుడే దీన్ని ఆమోదించాలని నా అభిమతం (వినండి వినండి అని హర్షధ్వానాలు)".[1]

స్వరాజ్యపార్టీ, శాంతియుత పద్ధతులు అన్న సిద్ధాంతానికే కట్టుబడి వుంటుందని గోస్వామి వివరించారు. "కాని అన్ని విధేయతలనూ మించిన విధేయత ఒకటి వుంది. అది జన్మహక్కు. స్వరాజ్యపార్టీ, ప్రభుత్వానికి చిన్న ప్రతిపాదన ఒకటి నివేదించుకుంది. రాజీపడదామని విన్నవించుకుంది. కాని ఒకటిమాత్రం స్పష్టం. బ్రిటిషు సామ్రాజ్యంలో మాకు స్వరాజ్యం లభించినట్టయితే, సామ్రాజ్యానికి వెలుపలే తెచ్చుకుంటాం " అని ఆయన గర్జించారు.[28]

సవరణమీద చర్చకు ఈవిధంగా సమాధానవైఖరీ – ఎదిరింపులతోకూడి జరిగింది. చివరకు ఓటింగ్ జరిగినప్పుడు 72 ఓట్లతో ఆమోదం పొందింది. వ్యతిరేకంగా 45 ఓట్లు పడ్డాయి. ప్రభుత్వం మళ్ళీ ఓడిపోయింది.

రాజ్యసమితిలో ఫిరోజ్ సేత్నా, ప్రభుత్వపక్షం ప్రవేశపెట్టిన తీర్మానానికి సవరణనొకదాన్ని ప్రతిపాదించారు. సేత్నా సవరణ అంతా మోతీలాల్‌నెహ్రూ సవరణ మోస్తరుగానే వుంది. మెజారిటీ నివేదికమీద సంతకాలు చేసినవారిలో ఒకరు మైనారిటీ నివేదికమీద సంతకం చేసి, దాన్ని మెజారిటీ నివేదిక చేసివున్నట్టయితే ప్రభుత్వం వైఖరి ఏవిధంగా ఉండేదని ఆయన ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. జాతీయ వాద పార్టీ కోరుతున్నదానికి అంగీకరించని పక్షంలో ఫలితాలకు ప్రభుత్వం బాధ్యత వహించవలసి వుంటుందని ఆయన చెప్పారు. కాని సేత్నా సవరణ వీగిపోయింది,

ప్రతికూలంగా 29, అనుకూలంగా 10 ఓట్లు పడ్డంతో, ప్రభుత్వ తీర్మానం 28 ఓట్లతో ఆమోదం పొందింది. వ్యతిరేకంగా 7 ఓట్లు పడ్డాయి.

బడ్జెటు త్రోసివేత – సర్టిఫికేషన్‌ద్వారా పాలన :

బడ్జెటుమీదా దానికి సంబంధించినఆర్థిక చర్యలమీదా శాసనసభలో చర్చ జరిగినపుడు, జాతీయవాద పార్టీ ప్రభుత్వాన్ని చాలాసార్లు ఓడించింది. 1924 మార్చి 10 వ తేదీన ప్రభుత్వం, కస్టమ్స్‌కు సంబంధించిన పద్దులకోసర్కం గ్రాంటు కోరింది. దీన్ని తొలగించవలసిందని మోతీలాల్‌నెహ్రూకోరారు.

తమవైఖరిని విశదపరుస్తూ మోతీలాల్‌నెహ్రూ, కస్టమ్స్ శాఖకు సంబంధించిన ఏదైన ఫిర్యాదుకారణంగా తాము గ్రాంటుకు అభ్యంతరం తెలుపడంలేదనీ, భారత ప్రభుత్వ అవసరాలకు నిధులను మంజూరు చేయరాదన్న ఉద్దేశ్యంతోనే ఈవిధంగా అభ్యంతరపెడుతున్నామనీ చెప్పారు. అంతకుముందునెల శాసనసభ అధిక మెజారిటీతో రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించిన ఒక తీర్మానాన్ని ఆమోదించింది. కాని ప్రభుత్వం దీనికి తగినవిధంగా వ్యవహరించలేదు. ఆయన ప్రభుత్వానికి ఈ విధంగా చెప్పారు:

> ... ... లేబర్‌ప్రభుత్వం ఏదైనా చేయదలచినట్లయితే ఇదే సమయం. మేము కోరుతున్నవి మాకు లభించేవరకూ నిధులను సమకూర్చకుండాఉండే హక్కు మాకు వుంది. ఈ తీర్మానాన్ని ఆమోదించడంలో మా ఉద్దేశ్యం ఇంకేదీకాదు. సప్లయిలనునిజంగా నిరాకరించడం కాదు ఇది, ఈ నకలు పార్లమెంటులో, ప్రజాప్రతినిధుల నిజమైన హక్కులకు నకలుగా వ్యవహరిస్తున్నాం. మాకు సంబంధించినంతవరకు మాకు చేతనైనంత మేరకు చర్య తీసుకున్నామని ప్రభుత్వ దృష్టికి తీసుకురావడమే దీని ఫలితం. అది పనిచేయక పోయినట్లయితే అది మా దురదృష్టంకాని మా తప్పుకాదు, స్వతంత్రమైన దేశాల్లోని నిబంధనలకు అనుగుణంగా పనిచేసినట్లు ఈ తీర్మానం పనిచేసేట్లు మేము చేయలేము, " 29

అన్నా, మోతీలాల్‌నెహ్రూ వైఖరిని సమర్థిస్తూ, స్వరాజ్యవాదుల మొత్తరుగా నాశనం చేసే విధానాన్ని అవలంబిస్తూ జాతీయవాద పార్టీ పద్దులకు అభ్యంతరం తెల్పడం లేదనీ, పూర్తిగా రాజ్యాంగ బద్ధమైన విధానాన్ని అవలంబించి ఒక సిద్ధాంతాన్ని ఏర్పాటుచేయాలని కోరుతూ వుందనీ వివరించారు. ఆయన ఈవిధంగా పేర్కొన్నారు:

> పౌర ఉల్లంఘన ప్రారంభించాలని జాతీయవాదులపార్టీ అనుకోవడంలేదు. తిరుగుబాటు కావాలనికూడా అనుకోవడంలేదు, భారత ప్రభుత్వాన్ని భారతదేశానికి



ఫిరోజ్ షా మెహతా



గోపాలకృష్ణ గోఖలే



రాచ బిహారీ ఘోష్



విఠల్ భాయ్ పటేల్



మోతీలాల్ నెహ్రూ



మదన మోహన మాలవ్యా



ఎస్. సత్యమూర్తి



భులాభాయ్ దేశాయ్

సంబంధించిన మంత్రినీ గర్హించే హక్కు మాకువుంది. ఎందువల్లనంటే 76 ఓట్లు అత్యధిక మెజారిటీతో, సంస్కరణలు కావాలని కోరుతూ మేము ఆమోదించిన తీర్మానం విషయంలో మీరు మాకు సంతృప్తికరంగా వ్యవహరించలేదు........"30

నాగ్‌పూర్‌కు చెందిన ఎం. వి. అభయంకర్ మాట్లాడుతూ భారత ప్రభుత్వ చట్టం ఏవిధంగా అమలు జరుగుతున్నదీ ఎవరైనా పరిశీలిస్తే, భారతదేశాన్ని ఎక్టేటు మోస్తరుగా పాలిస్తున్నారనీ, తెలిసిపోతుందని, బడ్జెటు విధానాన్ని పరిశీలించినట్లయితే అధికారులకు పట్టంకట్టడం తప్ప ఇంకేమీ కాదని స్పష్టమవుతుందనీ అదికూడా భారతీయుల పేరున ఇవి జరుగుతున్నాయనీ అందువల్లనే తాము పద్దులను వ్యతిరేకిస్తున్నామనీ చెప్పారు. 31

విఠల్‌భాయ్ పటేల్ మాట్లాడుతూ బ్రిటిషు ప్రభుత్వం భారతదేశాన్ని గత 150 ఏండ్లుగా ఏవిధంగా తమ స్వప్రయోజనానికి వినియోగించుకుంటున్నదీ పేర్కొన్నారు. 150 ఏండ్లు బ్రిటిషుపాలన తర్వాత దేశ జనాభాలో నూటికి 5 వంతులమంది మాత్రమే అక్షరాస్యులనీ మొత్తం జనాభా నిరాయుధులనీ చెప్పారు. ప్రభుత్వానికి ఆయన నదురూ బెదురూ లేకుండా ఈ సంగతి చెప్పారు.

"అసలు విషయం, సమస్యలు నిరాకరించే సమయం వచ్చిందని మేము అనుకుంటున్నాము. దేశపాలనా నిర్వహణతో ఆవిధంగా సంబంధాలను ఒదులుకోవాలనుకుంటున్నాము. దీనికి ఫలితాలు ఏవిధంగా వుంటాయో మాకుతెలుసు. వైస్‌రాయ్ సర్టిఫై చేస్తారని విన్నాం, మాకు తెలుసు. ఈ దేశంలో పాలనా నిర్వహణను వీరు వీటోలతోనూ సర్టిఫికేషన్‌లతోనూ సాగించాలనే మేము కోరుతున్నాము. భారతప్రభుత్వ చట్టాన్ని చిత్తుకాగితం మోస్తరుగా చూడాలని కోరుతున్నాము. అది అలాటిదని ఋజువైంది. మేము కోరుతున్నదానికి అంగీకరించండి. లేదా ప్రజాఉద్యమానికి మమ్మలను పురికొల్పండి. ఏదిఅయినా బాధ్యత మీదే అవుతుంది"32

ఉద్రిక్త వాతావరణంలో జరిగిన ఇటువంటి చర్చ తర్వాత మోతీలాల్‌నెహ్రూ సవరణను ఓటింగ్‌కు పెట్టారు. అనుకూలంగా 63 ఓట్లు పడటంతో తీర్మానం ఆమోదం పొందింది. ప్రతికూలంగా 56 ఓట్లు పడ్డాయి. తీర్మానం ఆమోదం పొందడంతో ప్రభుత్వాన్ని ఇరుకున పెట్టినట్లయింది. అయినా గవర్నర్ జనరల్ చట్టంకింద తమకున్న ప్రత్యేక అధికారాలనుపయోగిస్తూ, సర్టిఫికేషన్ ద్వారా కోతలను మళ్ళీ భర్తీ చేశారు. తర్వాత ఆర్థికబిల్లు వంతు వచ్చింది. మార్చి 17 వ ఆర్థిక

సభ్యుడు సర్ బెసిల్ బ్లాకెట్. ఆర్థిక బిల్లుమీద చర్చను ప్రతిపాదించారు. వెంటనే పండిత మదనమోహన మాలవ్యా లేచి తీర్మానాన్ని వ్యతిరేకించారు.

పూర్తి బాధ్యతతో తాము బిల్లును వ్యతిరేకిస్తున్నామని మాలవ్యా సభవారికి తెలియ చేశారు. ఆర్థిక సభ్యుడు చెప్పినదాన్ని విన్న తర్వాత తమ పరిస్థితిలో తమకు మిగిలిన మార్గమల్లా బిల్లుమీద చర్చను వ్యతిరేకించడమేనని చెప్పారు. రాజ్యాంగ సంస్కరణలకోసం భారతదేశం ఎప్పటినుంచీ కోరుతున్నదీ దానిపట్ల బ్రిటిష వైఖరినీ ఆయన వివరించారు. రాజ్యాంగ వ్యవస్థలో ముఖ్యంగా కేంద్రస్థాయిలో వున్న పెద్ద పొరపాటును ఆయన ఎత్తి చూపారు. ఆయన ఈ మాటలన్నారు :

"కేంద్రప్రభుత్వానికి కాలదోషం పట్టింది. ఇకమీద దానివల్ల వుపయోగం లేదు. ఇంగితజ్ఞానం వున్న వాళ్లందరూ ఈ వ్యవస్థను గర్హిస్తున్నారు. ఈ వ్యవస్థ అతి ప్రత్యేకమైనది, విచిత్రమైనది, ఇటువంటిది మరెక్కడా లేదు. పెద్ద సంఖ్యలో ఓటర్లను సృష్టించారు. శాసనసభ్యులు కూర్చునేందుకు వీరిచేత సభ్యులను ఎన్నిక చేయించారు. శాసనసభలో ఎక్కువమంది ఆ విధంగా ఎన్నికైనవారు. పన్నులను వీరు ఓటు చేయాలికాని ఆటువంటి పన్నుల మూలంగా వచ్చే ఆదాయాన్ని వాడే విషయంలో మాత్రం వారి అధికారం చాలా పరిమితం. శాసనసభ ఏర్పడిన తర్వాత గత మూడేండ్లలోనూ, శాసనసభ సహాయంతో 41 కోట్ల మేరకు కొత్తపన్నులను విధించారు. కాని ఈ పన్నులను వేటికోసమైతే విధించారో వాటి ఖర్చులో చాలామేరకు సంబంధించి శాసనసభకు ఎటువంటి అధికారము లేదు. ఇటువంటి పై తరగతి వ్యవస్థ మరెక్కడా లేదని సునవి చేసుకుంటున్నాను. దురదృష్టవశాత్తూ మేము ఈ వ్యవస్థకు ఇప్పుడు సాధనాలుగా ఉన్నాం. ఇది నాదొక్కడి అభిప్రాయము కాదు. దేశప్రజల్లో చాలామంది ఇదేవిధంగా అభిప్రాయపడుతున్నారని నా నమ్మకం."33

మరికొంత చర్చజరిగిన తర్వాత, ఆర్థిక బిల్లును ప్రవేశపెట్టేందుకు అనుమతికోరుతూ ఆర్థికసభ్యుడు ప్రతిపాదించిన తీర్మానాన్ని త్రోసి పుచ్చారు. తీర్మానానికి ప్రతికూలంగా 60 ఓట్లూ అనుకూలంగా 57 ఓట్లూ పడాయి. రాజ్యసమితిమాత్రం ఓటింగ్ లేకుండా బిల్లును ఆమోదించింది. గవర్నర్ జనరల్ ఆర్థికబిల్లును సవరించినరూపంలో శాసనసభకు శిపార్సుచేశారుకాని, శాసనసభ మళ్లీ అనుమతి నిరాకరించింది. అప్పుడు, బిల్లులోనిఅంశాలు బ్రిటిష్ ఇండియా ప్రయోజనాలకు అవసరమని గవర్నర్ జనరల్ ఇచ్చిన సర్టిఫికేటుతో బిల్లును రాజ్యసమితికి సమర్పించారు. సమితి సవరణలేవీలేకుండానే ఆమోదించింది. సమితి ఆమోదించిన రూపంలో బిల్లుకు గవర్నర్ జనరల్ తమ

అనుమతినిచ్చారు. శాసనసభ వ్యవహరించిన తీరుపట్ల విచారం వ్యక్తపరుస్తూ[34] గవర్నర్ జనరల్, 1924 మార్చి 28 వ తేదీన ఒక ప్రకటన జారీచేశారు. ప్రభుత్వ ఆగ్రహానికి కారణంలేకపోలేదు. భారతదేశాన్ని అరాచకమైన చట్టాలు పాలిస్తున్నాయని దేశమంతా అపహాస్యం చేయడం ప్రారంభించింది.

**అణచివేసే శాసనాలమీద దాడి**

రెండవ శాసనసభ కాలంలో (1924–26) ప్రభుత్వం అమలుపరుస్తున్న అణిచివేసే విధానాన్ని సభ్యులు చాలాసార్లు ఖండించారు. అటువంటి చట్టాలనూ నిబంధనలను తొలగించేందుకు కృషిచేశారు. ఈ చట్టాలకు సంబంధించినంత వరకు వివిధ రాజకీయ పక్షాలమధ్య భేదాభిప్రాయలు లేవు.

1924 మార్చిలో, అమర్‌నాథ్‌దత్తా శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. 1918 వ సంవత్సరపు బెంగాల్ రెగ్యులేషన్ 111 ను వెంటనే రద్దు చేసేందుకు చర్యలు తీసుకోవాలని ఈ తీర్మానంలో గవర్నర్ జనరల్‌నూ ఆయనసమితినీ కోరారు. ఈ రెగ్యులెషన్ కింద ప్రభుత్వం ప్రజలు లొంగిపోయేట్టు బలవంత పెడుతూ వుందని ఈ ప్రయత్నంలో అశ్వని కుమార్‌దత్ వంటి ఋషిపుంగవులనూ కృష్ణకుమార్ మిత్ర, సుబోద్ చంద్ర మల్లిక్, మనోరంజన్ గుహవంటి దేశభక్తులనూ దేశం నుంచిబహిష్కరిస్తున్నారనీ ఆయన కోరుతున్నారు. ఈ రెగ్యులేషన్ అమల్లో వుండీ అంటే సక్రమమైన చట్టాల్లోనూ న్యాయవాదుల్లోనూ, భారతప్రభుత్వం కార్యనిర్వాహక శాఖకు విశ్వాసం లేదన్నమాట.[35]

బెంగాల్‌లో విప్లవ ఉద్యమానికి భారత ప్రభుత్వపు హ్రస్వదృష్టికారణమని బిపిన్ చంద్రపాల్ వాదించారు. భారతీయుల ఆత్మగౌరవానికి బెంగాల్ రెగ్యులేషన్ అవమానకరమని[36] ఆయన అన్నారు. అణిచివేసే చట్టాలకు సంబంధించిన సంఘం చేసిన శిఫార్సులను భారత ప్రభుత్వం ఆమోదించిందనీ అయినా "ఈ తుప్పుపట్టిన ఆయుధాలు" ప్రభుత్వ ఆయుధాగారంనుంచి తొలగలేదనీ ఎచ్. ఎస్. గౌర్ పేర్కొన్నారు[37]

ప్రభుత్వపక్షం గట్టిగా వ్యతిరేకించినప్పటికీ తీర్మానాన్ని శాసనసభ ఆమోదించింది. 1908 వ సంవత్సరపు భారత నేర శాసనపు సవరణచట్టంలోని కొన్ని అంశాలను రద్దుచేయవలసిందని కోరుతూ ఎచ్. ఎస్. గౌర్ 1924 సెప్టెంబరు 16 వ తేదీన ప్రవేశపెట్టిన తీర్మానాన్నికూడా, ప్రభుత్వం వ్యతిరేకించినప్పటికీ శాసనసభ 71 ఓట్లతో ఆమోదించింది. ప్రతికూలంగా 39 ఓట్లు పడ్డాయి. గవర్నర్ జనరల్ 1924 అక్టోబరు 25 వ తేదీన బెంగాల్ క్రిమినల్ లా సవరణ ఉత్తర్వును జారీ చేసినపుడు కూడా స్వరాజ్యవాదులూ ఇండిపెండెంట్లూ కలసి ప్రభుత్వపు అణచివేసే విధానంమీద

విరుచుకు పడ్డారు. ఈ ఉత్తర్వుకింద చాలామందిని అరెస్టు చేశారు. ఇండ్లను సోదా చేశారు. కలకత్తా కార్పొరేషన్ ప్రధాన కార్యాధికారి అయిన సుభాష్ చంద్రబోసునూ (సి. ఆర్. దాసుకు సన్నిహితుడు) బెంగాల్ శాసన సమితిలో స్వరాజ్యవాది సభ్యులైన అనిల్‌బరన్ రాయ్, యస్. సి. మిత్ర లనూ అరెస్టు చేశారు. ఈ ఉత్తర్వును జారీచేసి అమలుపరచినందుకు దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తమైంది.

భారత శాసనసభ ఒక చట్టంద్వారా ఈ ఉత్తర్వు అమలు జరుగకుండా చేయాలని కోరుతూ దురైస్వామి అయ్యంగార్ 1925 జనవరి 28న శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. దేశ వ్యవహారాల సభ్యుడు ప్రభుత్వాన్ని సమర్ధిస్తూ ఎంత కట్టుదిట్టంగా వాదించినప్పటికీ స్వరాజ్యవాదులూ ఇండిపెండెంట్లూ కలసి ఉత్తర్వును జారీ చేసినందుకు ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు.

విప్లవబృందాల కార్య కలాపాలు తీవ్రతరమైనట్లూ యువజనుల్లో ఎఱ్ఱకరపత్రాలను పంచిపెడుతున్నట్టూ బెంగాల్ గవర్నర్ లార్డ్ లిట్టన్ ప్రాణానికి ముప్పు ఏర్పడినట్టూ ప్రభుత్వపక్షం వాదించింది. టి. సి. గోస్వామి నదురు బెదురు లేకుండా ప్రభుత్వాన్ని ఈ విధంగా ఖండించారు:

> లార్డ్ లిట్టన్ ప్రాణానికి ముప్పు ఏర్పడిందని అంటున్నారు. పోలీసుదళమంతా ఆయనకు రక్షణ కల్పించవచ్చు. అయినా ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకంటె ఒక ఉన్నతోద్యోగి ప్రాణం అంత పవిత్రమైనదేమీ కాదు. ఇదే నా దృఢమైన సమాధానం ".38

ఉత్తర్వుపట్ల నిరసన ఎంత విస్తృతంగా వ్యాపించిందంటే, సభలోని యూరోపియన్లు మాత్రమే సమర్ధించారు. తీర్మానం, 58 ఓట్లతో ఆమోదించబడింది. వ్యతిరేకంగా 45 ఓట్లు పడ్డాయి.

విఠల్‌భాయ్ పటేల్ 1925 ఫిబ్రవరి 3 వ తేదీన శాసనసభలో ఒక బిల్లును ప్రతిపాదించారు. సాధారణ నేరచట్టాలకు అనుబంధంగా వున్నా కొన్ని ప్రత్యేక శాసనాలను రద్దు చేసేందు దీన్ని ఉద్దేశించారు: 1818వ సంవత్సరపు బెంగాల్ రాష్ట్ర బెంగాల్ ఖైదీల రెగ్యులేషన్, 1911వ సంవత్సరపు రాజద్రోహ సమావేశాలను అరికట్టేందుకుద్దేశించిన చట్టమూ మొదలైనవి. అణిచివేసేందుకుద్దేశించిన చట్టాలను రద్దు చేసేందుకు చర్యలు తీసుకో వలసిందని గవర్నర్ జనరల్‌కు శిఫార్సుచేస్తూ అంతకుముందు సంవత్సరం శాసనసభ ఒక తీర్మానాన్ని ఆమోదించినట్టు పటేల్ వాదించారు. అయినా ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకోలేదనీ అందువల్ల ఈ బిల్లును ప్రవేశపెటవలసి వచ్చిందనీ ఆయన చెప్పారు.39

పటేల్ బిల్లును, ఇండిపెండెంటు పార్టీలోని ప్రముఖులు చాలామంది జిన్నాతోసహా సమర్థించారు. కొన్ని సవరణలతో బిల్లును 71 ఓట్లతో ఆమోదించారు. ప్రతికూలంగా 40 ఓట్లు పడ్డాయి.

1926 పొడవునా శాసనసభలో ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేసే విధానాన్నీ చర్యలనూ ఖండిస్తూనే వచ్చారు. వివిధ వర్గాలకు చెందిన రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని కోరుతూ బీహార్‌లోని తిర్‌హుట్ డివిజన్‌కు చెందిన మౌల్వీ మొహమ్మద్ షఫీ 1926 జనవరి 29 న శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు.

రాజకీయ ఖైదీలు మామూలు నేరస్తులు కారనీ షఫీ, తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ పేర్కొన్నారు. వారు దేశంకోసం, మతంకోసం పోరాడినవారని చెప్పారు. ఆమరణాంతం వారు జైళ్ళల్లోగాని వారి మాతృభూమి వెలుపలగాని మ్రగ్గడానికి వీలులేదని ఆయన వాదించారు. 40

సి. ఎస్. రంగఅయ్యర్ తీర్మానాన్ని సమర్థిస్తూ. "స్వేచ్ఛా కాముక ప్రజల స్వాతంత్ర్యాన్ని కబళించి ప్రభుత్వం, తక్కువరకపు నేరస్తులుగానూ నికృష్టపు హంతకులుగానూ తయారైంద"ని వర్ణించారు. ప్రభుత్వం విప్లవ ఉద్యమాన్ని రూపుమాపదలచుకున్నట్టయితే స్వేచ్ఛా ప్రేమికులూ విశాల హృదయులూ అయిన వారిని మంచి చేసుకోవాలని, బర్ద్వాన్‌కు చెందిన సయ్యద్ మజీద్ బక్షీ, ప్రభుత్వాన్ని కోరారు. స్వేచ్ఛగా వుండాలన్న కోరిక ఏ బ్రిటిష్ చట్టంకింద నేరమవుతుందో చెప్పవలసిందని ఆయన అడిగారు. స్వరాజ్యపార్టీ, స్థానిక స్వపరిపాలనా సంస్థల్లోనూ రాష్ట్ర సమితుల్లోనూ ఎక్కువ స్థానాలను సంపాదించుకున్న సమయంలో ఈ అరెస్టులు జరుగుతున్నాయని చిట్‌గ్రామ్‌కు చెందిన కుమార్ శంకర్ రాయ్ ఫిర్యాదు చేశారు. ఈ ఖైదీలపట్ల ప్రభుత్వ వైఖరి, పగతీర్చుకునే విధంగానూ విచక్షణ రహితంగానూ ఉందని ఒరిస్సాకు చెందిన పండిత నీలకంఠదాస్ పేర్కొన్నారు. 41

లాలా లజపతిరాయ్ తీర్మానాన్ని గట్టిగా సమర్థించారు. విప్లవ ఉద్యమాలు ప్రపంచంలో ఎప్పుడూ వున్నవేనని ఆయన చెప్పారు. "ఏదైనా ఒకదేశంలో విప్లవ ఉద్యమం ఉందీ అంటే ఆ దేశ ప్రభుత్వ విధానంలో ఏదో పెద్దలోపం వుందన్నమాట. అటువంటప్పుడే ప్రజలు విప్లవపద్ధతులకు దిగుతారు" అంటూ ఆయన వీరులైన దేశభక్తులపట్ల దయాదాక్షిణ్యాలు చూపించమనిగాని వారికి క్షమాభిక్ష పెట్టవలసిందనిగాని కోరడంలేదనీ ఆ విధంగా కోరనట్టయితే వారిని అవమానించినట్టే అవుతుందనీ చెప్పారు. ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధుల కోరికను ఈ తీర్మానం ప్రతిబింబిస్తూ వుందనీ దానిని మన్నించేదీ లేనిదీ ప్రభుత్వం నిర్ణయించుకోవలసిందేననీ రాయ్ అన్నారు.

తీర్మానాన్ని సవరించిన రూపంలో శాసనసభ ఆమోదించింది.

1818 వ సంవత్సరపు బెంగాల్ రెగ్యులేషన్‌ను రద్దు చేయాలని కోరుతూ అమర్ నాథ్ దత్తా 1926 ఫిబ్రవరి 12 వ తేదీన శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. పైన పేర్కొన్న రెగ్యులేషన్ రద్దుకు చర్యలు తీసుకోవలసిందని గవర్నర్ జనరల్‌కూ సిఫార్సుచేస్తూ తాము 1924 మార్చిలో శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టినట్టు పేర్కొన్నారు. తీర్మానం ఆమోదించబడినా రెగ్యులేషన్ రద్దు కాలేదని ఆయన తెలియ చేశారు. దీనికిగాను ప్రభుత్వమే ఒక బిల్లు ప్రవేశపెట్టగలదని తాము ఎదురు చూచినట్టూ ప్రభుత్వం ఆవిధంగా చేయనట్టూ ఆయన వివరించారు. అందువల్లనే ఈ బిల్లును ప్రవేశ పెట్ట వలసి వచ్చిందని చెప్పారు.

టి. సి. గోస్వామి బిల్లును సమర్థిస్తూ బెంగాల్‌లోని విప్లవ ఉద్యమాల చరిత్రను వివరించారు. బెంగాల్ విప్లవ భావాలతో ఎందుకు నిండిపోయిందో ఆయన ఈ విధంగా తెలియచేశారు :

"తమదేశాన్ని విదేశీయులకు అమ్ముకుని ఓమీచంద్ మీర్‌జఫర్‌లు చేసిన పాపాన్ని కడిగివేసేందుకు, మీ వారన్‌హేస్టింగ్స్‌యొక్క ఉజ్వలమైన పాలనను బెంగాల్ ఇంకా గుర్తుంచుకుందికనుక : నీలిమందు తోటలవారి విషయంలో ప్రభుత్వం వ్యవహరించిన తీరును బెంగాల్ మర్చిపోలేదు కనుక : 'వందేమాతరం' గానం చేయడమే నేరంగా పేర్కొన్న రిస్లే ప్రకటనను బెంగాల్ ఇంకా గుర్తుంచుకుంది కనుక : బెంగాల్ విప్లవ భావోద్వేగంతో నిండిపోయింది. నాగరికమైన ఏ ప్రభుత్వమైనా. చరిత్ర న్యాయ స్థానంలో ఇటువంటి చర్యలను సమర్థించుకో గలదా? మీ జాతీయగీతాన్ని ఆలాపించుకోవడమే ఒకనేరమా? అందువల్లనే బెంగాల్ జాతీయఉద్యమాన్ని నడిపిస్తూవుంది"43 అన్నారాయన.

బిల్లుమీదచర్చ ఎంతో కోలాహలంగా జరిగింది. చర్చ ముగిసిన తర్వాత ఓటింగ్ జరిగింది, అనుకోకుండా ప్రభుత్వం, మూడుఓట్ల మెజారిటీతో గెల్చింది.

స్వరాజ్యవాదుల్లో అప్పటికిని చీలిక ఏర్పడడంతో వారిలోకొంతమంది ఓటింగ్‌లో పాల్గొనలేదు.

## ఇతర రంగాల్లో ఆసక్తి

మొదటిశాసనసభలో మోస్తరుగానే రెండవ శాసనసభలోని ఎన్నికైన సభ్యులుకూడా సర్వీసుల్లో భారతీయులను చేర్చుకోవాలనీ దేశవాళీ పరిశ్రమలను అభివృద్ధి చేయాలనీ

సాంఘిక-కార్మిక చట్టాలను చేయాలనీ ప్రభుత్వాన్ని కోరుతూవచ్చారు. వీటిలో కొన్నిటిని ఇక్కడ పరిశీలిద్దాం :

1924 సెప్టెంబరు 10వ తేదీన దేశవ్యవహారాల సభ్యుడు శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. భారతదేశంలోని ఉన్నత పౌరసర్వీసులకు సంబంధించి రాయల్ కమిషన్ చేసిన శిఫార్సులను గవర్నర్ జనరల్ - అయన సమితీ సూత్రరీత్యా ఆమోదించాలని ఈ తీర్మానంలో కోరారు. లీ కమిషన్ అని వ్యవహరించిన ఈ కమిషన్ చేసిన శిఫార్సులో కొన్నిటిని ముఖ్యంగా వేతనం-నౌకాయాన ఖర్చులూ-పించను-ఇతర సౌకర్యాలకు సంబంధించిన వాటినీ రాష్ట్రవైద్య సర్వీసుల ఏర్పాటుకు సంబంధించిన వాటినీ అమలుపరచాలని తీర్మానంలో గవర్నర్ జనరల్‌ను కోరారు.[44]

మోతీలాల్‌నెహ్రూ ఈ తీర్మానానికి ఒక జాతీయవాద సవరణను ప్రతిపాదించారు. మొదటి శాసనసభ ఆమోదించిన తీర్మానాలను ఏమాత్రం లెఖ్ఖచేయకుండా లీ సంఘాన్ని నియమించినట్టూ ; పౌరసర్వీసులకు సంబంధించిన విషయాలు భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వం మంజూరుతో ముడిపడిపోతున్నట్టూ అందువల్ల 1924 ఫిబ్రవరి 18వ తేదీన ప్రస్తుత శాసనసభ ఆమోదించిన తీర్మానాన్ని అమలుపరిస్తేతప్ప దానివిషయం ఆలోచించే వీలులేనట్టూ ; కొన్ని శిఫార్సులు శాసనసభకు ప్రస్తుతంవున్న అధికారాలను తొలగించేందుకు ఉద్దేశించినట్టూ, ఈ శిఫార్సులవల్ల అఖిలభారత సర్వీసుల్లో జాతి విచక్షణను ప్రవేశపెట్టినట్టూ సవరణలో వివరించారు.

అమలుకు సంబంధించినంతవరకు భారతదేశంలోని పౌరసర్వీసులకు ఉద్యోగులను ఇకముందు ఇంగ్లండులో తీసుకోరాదనీ ; భారతదేశంలో ఒక పబ్లిక్‌సర్వీస్ కమిషన్‌ను ఏర్పాటు చేయాలనీ; సర్వీసుల్లో నియామకాలతో సర్వీసుల నిర్వహణకూ సంబంధించి భారతదేశానికి సంబంధించిన బ్రిటిషుమంత్రి ప్రస్తుతంవున్న అధికారాలను భారతప్రభుత్వానికి బదలాయించాలనీ, భారతప్రభుత్వం ఈ అధికారాలను కేంద్రరాష్ట్ర శాసనసభలు ఆమోదించే చట్టాలకు లోబడి వినియోగిస్తుందనీ సవరణలో శిఫార్సు చేశారు. ఒక్కముక్కలో ఈ సవరణ లీ సంఘం చేసిన శిఫార్సులను పూర్తిగా త్రోసిపుచ్చడమేకాక బ్రిటిషుసభ్యుడు ప్రతిపాదించిన తీర్మానాన్నికూడా ఖండించింది.[45]

చర్చజరిగినపుడు జిన్నా, మాలవ్యా, వి. జె. పటేల్, ఎచ్. ఎస్. గౌడ్, సేఠ్ గోవిందదాసు, షన్ముఖంచెట్టి, ఇతరులు చాలామంది లీ సంఘం నియామకానికి సంబంధించి మొదటిశాసనసభ తీసుకున్న నిర్ణయాలను త్రోసిపుచ్చనందుకు బ్రిటిషు ప్రభుత్వాన్ని విమర్శించారు. సర్వీసుల్లో విచక్షణ కల్పించినందుకూ ఆర్థిక పరిస్థితి ఇబ్బందికరంగావున్న సమయంలో వేతనాలు మొదలైన వాటిని పెంచినందుకూ సంఘాన్ని

దుయ్యబట్టారు. సంస్కరణల సమస్య పరిష్కారమయేవరకు సర్వీసుల విషయాన్ని సంతృప్తికరంగా పరిష్కరించే వీలులేదనీ ఈరెండూ ఒకదానితో మరొకటి ముడిపడి వున్నాయనీకూడా వీరు ఉద్ఘాటించారు.

సర్వీసు వేతనాలను నౌకాయాన–విదేశ అలవెన్సుల పేరిట పంచడం గురించి ప్రస్తావిస్తూ రంగస్వామి అయ్యంగార్ 1919లో మోస్తరుగానే మూల వేతనం పెరిగేందుకు అనుమతించడంతో మొత్తంగొడవ ప్రారంభమైందని చెప్పారు. "వీరి వేతనాలను ఇప్పటి మోస్తరుగానే పెంచేందుకు, సర్వీసులను వేతనాలకు టైమ్‌స్కేల్ పద్ధతిని అవలంబించే సాకు చాలునవి ఆయన అన్నారు.

యూరోపియన్లు – భారతీయులిద్దరితో కూడిన సమర్ధమైన సర్వీసును ఏర్పాటు చేసేందుకు షరతులనూ అర్హతలనూ ప్రతిఘట్టంలోనూ భారతీయులే శాసనసభలద్వారా నిర్ణయించాలిగాని, కొన్ని వేలమైళ్ళ అవతలవున్న కొంతమంది అధికార్లుకాదని చమన్ లాల్ సీతల్‌వాడ్ వాదించారు. సర్వీసులు అన్నవి నిజంగా ఆమాటకు తగినట్టు సేవ చేసేవిగా ఉండాలికాని, యజమానులుగానూ విధానాన్ని నిర్దేశించేవిగానూ ఉండరాదని కూడా ఆయన చెప్పారు. 46

శివస్వామి అయ్యర్, సంఘం శిఫార్సులను పూర్తిగా తిరస్కరించలేదు, అయితే సర్వీసుల వ్యవస్థీకరణకూ రాజ్యాంగ సంస్కరణకూ సన్నిహిత సంబంధంవుందని వాదించారు.

సుదీర్ఘమైన చర్చతర్వాత మోతీలాల్ నెహ్రూ సవరణను సభవారు 68 ఓట్లతో ఆమోదించారు. అటవీ సర్వీసుల్లో భారతీయులను నియమించాలనికోరుతూ (1925 మార్చి 18) ఒరిస్సాకు చెందిన బి. దాస్ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టినపుడూ, భారతీయ వైద్య సర్వీసుల్లో భవిష్యత్తులో నియామకం గురించి బొంబాయికి చెందిన కె జి. లోహకారె ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టినపుడూ(1925 సెప్టెంబరు 2) శాసనసభలో. సర్వీసులో భారతీయులను చేర్చుకోవడం మళ్లీ ప్రస్తావనకు వచ్చింది. బ్రిటీషురాజు ప్రీవీ కౌన్సిల్ తన న్యాయనిర్వహణను భారతదేశంలో జరుపాలని కోరుతూ ఎచ్. ఎస్.గౌడ్ 1926 ఫిబ్రవరి 3 వ తేదీన ఒక అధికార తీర్మానానికి సవరణను ప్రతిపాదించినపుడు సభలో రసవత్తమైన చర్చ జరిగింది.

శాసన సభ్యులు శ్రద్ధ వహించిన మరొక ముఖ్య విషయం, దేశవాళీ పరిశ్రమల అభివృద్ధి. కాని ఈ విషయమై భారతీయ సభ్యులు రెండురకాల అభిప్రాయాలు వెలిబుచ్చారు. అందులో ఒకటి ముఖ్యంగా భారతీయ పరిశ్రమలనూ, పెట్టుబడినీ అభివృద్ధి చేయాలన్నది, దీనికి గాను ప్రభుత్వం తల పెట్టిన రక్షణకు సంబంధించిన చర్చలన్నిటినీ

వీరు ఆమోదించారు. రెండవది, పరిశ్రమలకు రక్షణకల్పిస్తూనే కార్మికుల సామాన్య ప్రజానీకపు ప్రయోజనాలను కాపాడాలన్నది. ఉక్కు రక్షణబిల్లు మీదా కాగితం పరిశ్రమ రక్షణకు గ్రాంట్లకు సంబంధించిన తీర్మానం మీదా చర్చ జరిగినపుడు ఈ రెండురకాల అభిప్రాయాలూ వెల్లడయాయి. ఈ రెండింటినీ వరుసగా ప్రభుత్వం తరపున 1929 మే 27న, 1925 సెప్టెంబరు 10వ తేదీనా ప్రతిపాదించారు.

వాణిజ్య విషయాలసభ్యుడు ఉక్కు రక్షణ బిల్లును ప్రతిపాదించినపుడు భారతీయవాణిజ్య ప్రతినిధి అయిన పురుషోత్తమదాసు ఠాకుర్ దాసు, ఇది భారతదేశంలోని బ్రిటిషు ప్రభుత్వ విధానంలో కొత్తమార్పు అని పేర్కొంటూ హర్షం వ్యక్తపరిచారు. భారత దేశంలోని ఉక్కుపరిశ్రమకు విదేశ పరిశ్రమల తాకిడినుంచి రక్షణ కల్పించడం చాలా అవసరమని ఆయన వాదించారు.[47] ప్రభుత్వం, రక్షణకల్పించే విధానానికి కట్టుబడి వుండాలనీ, ఇటువంటి రక్షణను ఇతర పరిశ్రమలకు కూడా కల్పించాలనీ ఎచ్. ఎస్. గౌర్ ఆదుర్దాతో కోరారు.[48] జిన్నా-మాలవ్యా కూడా రక్షణ కల్పించే విధానాన్ని కొనియాడారు.

కాని చమన్ లాల్ మాత్రం విమర్శించారు. ఉక్కుమీద రక్షణ పన్ను విధించి ప్రభుత్వం భారతీయ పెట్టుబడి దార్లకు ఒక బహుమతిని అందించి నట్టయిందనీ మామూలు మానవుడిమీద పరోక్ష భారాన్ని పడవేసినట్టయిందనీ ఆయన వాదించాడు. "......సంపన్నుల రక్షకులుగానూ, బీదవారిని అణచివేసిన ప్రభుత్వంగాను మీరు చరిత్రలో చిరస్థాయిగా వుంటారు," అని ఆయన పేర్కొన్నారు.[49]

ఎన్. ఎమ్. జోషి కూడా ఇదే మోస్తరుగా వాదించారు. పరిశ్రమలను జాతీయం చేయాలని కోరారు. ఎవరి రక్షణ కోసమై ఈ బిల్లును తలపెట్టారో ఆ టాటాస్ సంస్థ, కార్మికుల విషయాల్లో న్యాయంగా వ్యవహరించడంలేదని ఆయన పేర్కొన్నారు. 1926 ఫిబ్రవరి 17 వ తేదిన వాణిజ్య సభ్యుడు ఉక్కుపరిశ్రమలకు చెల్లిస్తున్న ప్రోత్సాహక మొత్తాన్ని పెంచాలని కోరుతూ 1924 వ సంవత్సరపు ఉక్కు ఉత్పత్తి చట్టానికి సవరణను ప్రతిపాదించినపుడు జోషి మాట్లాడుతూ, రక్షణ కల్పించబడిన పరిశ్రమలో కార్మికులను సరిగా చూసుకోవడం, ప్రోత్సాహక మొత్తాల చెల్లింపుకు ఒక షరతుగా వుండాలని దీనికిగాను ప్రభుత్వ ఏజెన్సీ నుంచి ఒక సర్టిఫికేట్ ను సంపాదించలనీ ఉద్ఘాటించారు.[50] బిహార్‌కు చెందిన దేవకీప్రసాద్ సిన్హా కూడా ఏటికేడు అనుసరిస్తున్న విధ్వంసక విధానాన్ని విమర్శించారు. దేశంలోని పన్నులు కట్టే బీదవారు ఈ విధానంవల్ల నాశనమై పోతున్నారని ఆయన చెప్పారు.[51]

అంతకు ముందు 1925 సెప్టెంబరులో కాగితం పరిశ్రమకు రక్షణ కల్పించేందుకు

గ్రాంట్లు ఇవ్వాలని సూచించే తీర్మానం మీద చర్చ జరిగినపుడు కూడా సిన్హా ఇదేవిధంగా వాదించారు. ఆ సమయంలో ఆయన ఈ మాటలన్నారు :

"ఈ దేశంలో, రక్షణ కల్పించాలని కోరడాన్ని చాలా మంది విద్యావంతులు సమర్థిస్తున్నారు. వీరు దేశభక్తితో ఈవిధంగా సమర్థిస్తున్నారు. నేను అంగీకరిస్తాను... కాని ప్రస్తుతం విద్యావంతులైన భారతీయుల్లో చాలామంది, రక్షణకల్పించే విధానాన్ని సమర్థిస్తున్నారూ. అంటే దానికి, దేశంలోని మంచి చెడ్డాలేని పెట్టుబడిదార్లు చేస్తున్న ప్రచారమే కారణం. మన దేశానికి బ్రిటిషు ప్రభుత్వం ఎంత ప్రమాదకరమో భారతీయ పెట్టుబడిదార్లు కూడా అంత ప్రమాదకరమని మనం ఒకనాటికైనా గుర్తించగలమని నేను ఆశిస్తున్నాను." 52

శాసనసభలోని భారతీయ సభ్యుల్లో కొంతమంది కార్మిక శాసనాల్లో ఆసక్తి కలిగినవారు, కార్మికులకూ, ఇండ్లలో పనిచేసే వారికి ఇతర చిన్న ఉద్యోగులకు ప్రతి వారం వేతనాలు చెల్లించేందుకు వీలు కల్పించే బిల్లు నొకదాన్ని చమన్‌లాల్ 1924 సెప్టెంబరు 23 వ తేదీన శాసన సభలో ప్రవేశపెట్టారు. వారం వారం వేతనాలు చెల్లించక పోవడంవల్ల కార్మికులు వడ్డీ వ్యాపారుల మీద ఆధారపడవలసి వస్తూవుందనీ బొంబాయిలోని మిల్లుల్లో కార్మికులను ఇటీవల పనిలో నుంచి తొలగించినపుడు, చాలా కాలం వారికి వేతనాలు ముట్టలేదనీ ఆయన చెప్పారు. ఈ బిల్లు ద్వారా వేతనాలు చెల్లించకుండా వుండడాన్ని నేరంగా పరగణించేట్టు తాము కోరుతున్నామని ఆయన వెల్లడి చేశారు. 53 అదే రోజున ఎన్. ఎమ్. జోషి, ప్రసూతిసహాయ బిల్లును సభలో ప్రవేశపెట్టారు. ప్రసవించిన తరువాత కొంతకాలం స్త్రీలను ఉద్యోగంలో నియమించడం ఈ బిల్లు నిషేధిస్తుంది. పనిలోకి రాని కాలానికి ప్రసూతి సహాయాన్ని కూడా ఏర్పాటు చేస్తుంది.

1926 జనవరి 25 వ తేదీన, ప్రభుత్వం శాసన సభలో ట్రేడ్ యూనియన్ల బిల్లును ప్రవేశపెట్టింది. దీనివల్ల ట్రేడ్ యూనియన్లను రిజిస్టర్ చేసుకునేందుకు వీలు ఏర్పడింది. ట్రేడ్ యూనియన్లు, తమ ఉద్యోగుల జీతాల స్కేళ్లను స్పష్టంగా పేర్కొనాలన్న బిల్లులోని క్లాజుకు ఎన్. ఎమ్. జోషి తీవ్ర అభ్యంతరం తెల్పారు.54 ఈ క్లాజును తొలగించాలని కోరుతూ చమన్‌లాల్ ఒక సవరణను ప్రవేశపెట్టారు. చాలామంది సభ్యులు జోషినీ చమన్‌లాల్‌నూ సమర్థించారు. ఈవిధంగా సమర్థించిన వారిలో జిన్నా, షణ్ముగం చెట్టి, లజపత్‌రాయ్ వున్నారు. దేశంలో కార్మిక సంస్థలు ఏర్పడి అభివృద్ధి చెందాలంటే, వాటి విధుల విషయంలో ఎటువంటి నిర్బంధాలనూ విధించరాదని రాయ్ వాదించారు. ఒక ట్రేడ్ యూనియన్, ఇబ్బందిలో వున్న మరొక ట్రేడ్ యూనియన్‌కు సహాయం చేసేందుకు అనుమతించక పోయినట్టయితే, ట్రేడ్ యూనియన్ ఉద్యమం-మూల లక్ష్యమే నెరవేరదని షణ్ముగంచెట్టి పేర్కొన్నారు. 55

## స్వరాజ్యవాదుల ఇబ్బందులు

### సంకీర్ణ పార్టీలో చీలిక

"సంస్కరణలను లోపలనుంచే నాశనం చేయాలన్న పాలిసీతో స్వరాజ్యవాదులు సమితుల్లో ప్రవేశించారు. మాలవ్యావంటి మితవాదులనూ జిన్నావంటి ఇండిపెండెంట్లనూ కూడగట్టుకుని సంకీర్ణ పార్టీ అయిన జాతీయవాద పార్టీని ఏర్పాటు చేసుకోవడంలో కృతకృత్యులు కావడంతో మరింత ధైర్యం వచ్చింది. సమైక్యంగా వ్యవహరిస్తూ వీరు, 1924 లో శాసనసభ బడ్జెటు సమావేశంలో భారత ప్రభుత్వాన్ని ఎన్నోసార్లు ఓడించారు. ప్రభుత్వం ఏకాకి అయింది. స్వరాజ్యవాదుల నినాదం, సంస్కరణలను నాశనం చేయడమే అయినా ప్రభుత్వంతో ఒకప్పుడు కాకపోయినా మరొకప్పుడైనా సహకరించక తప్పదని త్వరలోనే తేటతెల్లమైంది. మితవాదులనూ ఇండిపెండెంట్లనూ కూడగట్టుకోవడంలో అర్థం అదే. నిజానికి శాసనసభలో స్వరాజ్యవాదుల నాయకులైన మోతీలాల్ నెహ్రూ ఇది గుర్తించారు. శాసనసభలో రంగాచారియార్ తీర్మానానికి ఒక సవరణ ప్రతిపాదిస్తూ (1924 ఫిబ్రవరి 8.) మొదటిసారి ఉపన్యసించినపుడు, సభలోని, స్వరాజ్యవాదులుకాని మిత్రులకు నచ్చేట్టు తమ సవరణను బాగా సౌమ్యం చేసినట్టు ఒప్పుకున్నారు. 56

మార్చి 11 వ తేదీన కస్టమ్సుకు సంబంధించిన గ్రాంట్లను మోతీలాల్ నెహ్రూ త్రోసిపుచ్చినపుడు జిన్నా ఆయనను సమర్థించినవుడు కూడా, ఇండిపెండెంట్లు సంస్కరణలను నాశనం చేసే విధానాన్ని అనుసరించబోరని స్పష్టమైంది. 57 జిన్నా, 1924 మే 24 న అఖిల భారత ముస్లింలీగ్ పదిహేనవ సమావేశంలో అధ్యక్షోపన్యాసమిస్తూ ఈ సంగతి స్పష్టంచేశారు. ఆయన ఆ సందర్భంలో ఈ మాటలన్నారు.

> "సంస్కరణల కోసం ఆందోళనను మేము నిర్భయంగా శక్తివంచనలేకుండా సమర్థిస్తాం. అయితే ఎటువంటి వ్యవస్థలోనైనా అభ్యున్నతికి ఉద్దేశించిన ఎటువంటి పథకంలోనైనా అల్ప సంఖ్యాక వర్గాల హక్కులూ ప్రయోజనాలకు తగిన రక్షణ కల్పించవలసి వుంటుంది. అయినా బుద్ధి పూర్వకంగా కావాలని నాశనంచేసే విధానంతో మాత్రం మేము ఏప్పుడూ సంబంధం పెట్టుకోజాలం" 58 .

ఈ ధోరణి ఫలితంగా 1924 లో సెప్టెంబరు సమావేశంలో శాసనసభలో జిన్నా నాయకత్వంలో, విడి నిబంధనలూ విప్ లతో ఇండిపెండేంట్ పార్టీ ఏర్పాటయింది. ఆ దరిమిలా ఇండిపెండెంట్లు సంస్కరణల విషయంలో అణిచివేసే విధానం విషయంలో స్వరాజ్యవాదులను సమర్థిస్తూనే, అనేక యితర విషయాల్లో ప్రభుత్వంతో సహకరించేందుకు వెనుకాడలేదు. "ఈ మార్పువల్ల ఓటింగ్ మీద వెంటనే యెటువంటి ప్రభావమూ

కనిపించలేదు. కాని ఆ తర్వాత జరిగిన సంఘటనలవల్ల మాత్రం, కేంద్ర శాసన సభలో అవరోధం కల్పించే విధానానికి ఇది ఉరితాడువంటిదని ఋజువైంది." అని ప్రభుత్వ రికార్డుల్లో సంతోషంగా వ్రాసుకున్నారు 59 1925 ఫిబ్రవరిలో రైల్వేబడ్జెట్టును శాసనసభలో ప్రవేశపెట్టినపుడు, దాన్ని పూర్తిగా తిరస్కరించవలసిందనీ లేదా రైల్వే బోర్డు కావాలన్న కోరికను త్రోసిపుచ్చవలసిందనీ స్వరాజ్యవాదులు ఇండిపెండెంట్లను అధికారరీత్యా కోరినప్పటికీ ఇండిపెండెంట్లు ప్రభుత్వానికి అనుకూలంగా ఓటు చేశారు. ఫలితంగా ప్రభుత్వ అభ్యర్థనను త్రోసిపుచ్చవలసిందంటూ మోతీలాల్ నెహ్రూ ప్రవేశపెట్టిన తీర్మానం వీగిపోయింది.

హిందూ ముస్లింల మధ్య విభేదాలు:

దరిమిలా, 1926 ఫిబ్రవరిలో నార్తు-వెస్టు ఫ్రాంటియర్ సరిహద్దు రాష్ట్రానికి సంబంధించిన తీర్మానం మీద చర్చ జరిగినపుడు స్వరాజ్యావాదులూ - ఇండిపెండెట్ల మధ్య భేదాభిప్రాయాలు బాగా వెల్లడయాయి.

1926 ఫిబ్రవరి 16 వ తేదీన, దక్షిణమద్రాసుకు చెందిన మౌల్వి సయ్యద్ ముర్తుజా సాహెబ్ బహదూర్ శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. భారత ప్రభుత్వ చట్టంలోని శాసన సమితులూ-మంత్రుల నియామకం-మొదలైన అంశాలను అల్పసంఖ్యాక వర్గాలకు రక్షణతో, వాయవ్య సరిహద్దు రాష్ట్రానికి కూడా వర్తింపచేయాలని గవర్నర్ జనరల్‌నూ ఆయన సమితినీ ఇందులో కోరారు.

తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ముర్తుజాసాహెబ్, తాము స్వరాజ్యవాదులమేననీ అయితే అఖిల భారత ముస్లింలీగ్‌లోను, దాని సమితిలోనూ కూడా సభ్యులమనీ వివరించారు. ఈ విషయానికి సంబంధించి ముస్లింలీగ్ ఆమోదించిన తీర్మానం గురించి ఆయన ప్రస్తావించారు. తాము కూడా దానికి కట్టుబడి వుంటామని చెప్పారు. 1922 లో శాసన సభలో ఆమోదించిన తీర్మానానికి అనుగుణంగా ప్రభుత్వం నియమించిన సరిహద్దు దర్యాప్తు సంఘపు మెజారిటీ నివేదిక ఆధారంగా ఆయన వాదించారు. ఏ విధంగా చూసినా సరిహద్దు ప్రజలు, సంస్కరణల ఫలితాలను అనుభవించేందుకు అర్హులని ఆయన చెప్పారు. దేశ సంక్షేమం దృష్ట్యా కూడా అది మంచిదని ఆయన అభిప్రాయపడ్డారు. "సరిహద్దు రాష్ట్రానికి సంస్కరణలు లభించని పక్షంలో యితర సంస్కరణల కోసం ఏవిధంగా ఎదురు చూడగలం?" అని ఆయన పేర్కొన్నారు.60

జిన్నా, అస్సాంకు చెందిన అహ్మద్ అలీ ఖాన్, ఆగ్రాకు చెందిన ఎల్. కె. హైదర్, రోహిల్ ఖండ్‌కు చెందిన మౌల్వి మహమ్మద్ యాకుబ్, ఇతర ముస్లిం సభ్యులూ ముర్తుజా సాహెబ్ తీర్మానాన్ని గట్టిగా సమర్థించారు. ఈ విషయమై పండిత మదన

మోహన్ మలవ్యా అభిప్రాయాలు ఏవిధంగా ఉంటాయోనని సభ్యులు ఎంతో ఆస క్తితో ఎదురు చూశారు. ఆయన లేచి నిల్చుని, తీర్మానానికి తాము వ్యతిరేకులమని వెంటనే చెప్పారు. తమ అభిప్రాయాన్ని వివరిస్తూ ఆయన, సంస్కరణలను సరి హద్దు రాష్ట్రానికి వర్తింపచేయడం తమ కెటువంటి అభ్యంతరమూ లేదని చెప్పారు. సంస్కరణలను దేశంలోని అన్ని ప్రాంతలకూ వర్తింపచేయాలని తాము సూత్రరీత్యా అంగీకరిస్తున్నామని అన్నారు. కాని నిజంగాచూస్తే, సరిహద్దు రాష్ట్రంలోని జనాభా ఒక రకమైనవారుకాదనీ, రాష్ట్రంలోని ప్రధాన మతవర్గాలైన హిందువులు ముస్లింల మధ్య సఖ్యంలేదనీ; గత కొన్ని సంవత్సరాలుగా అల్ప సంఖ్యాకుల ఆస్తిపాస్తులను దోచు కోవడం తగులబెట్టడం జరిగిందనీ; దాని ఉనికి దృష్ట్యా కూడా సరిహద్దు రాష్ట్రం పాలనా నిర్వహణ, దేశమంతటికీ చాలా ముఖ్యమైనదనీ చెప్పారు అందువల్ల అప్పటి పరి స్థితుల్లో, సరిహద్దు రాష్ట్రంలో సంస్కరణలు ప్రవేశపెట్టే సమయం రాలేదని తాము అభిప్రాయ పడుతున్నట్లు ఆయన అన్నారు. భారతదేశంలో మరికొన్ని సంస్కరణల గురించి ఆలోచించేవరకు వేచి వుండడం మంచిదని ఆయన అభిప్రాయ పడ్డారు. అప్పుడు సంఘం, అన్ని విషయాలనూ పరిశీలించి సరిహద్దు రాష్ట్రానికి ఎంతమేరకు స్వయం పాలన, ఏ రూపంతో ఉండాలో శిఫార్సు చేయాలని ఆయన సూచించారు. 61

ఒక్క బిపిన్‌చంద్రపాల్ తప్ప హిందూ సభ్యులు దాదాపు అందరూ తీర్మానాన్ని ఏదో ఒక రూపంలో విమర్శించారు. ముస్లిం సభ్యులు సమర్థించారు. ఎచ్. ఎస్. గౌర్, నవాబ్ అబ్దుల్ కయ్యూమ్, ఈ సందర్భంగా తీవ్రంగా ఘర్షణ పడ్డారు ముర్తుజా సాహెబ్, మార్చి 8 వ తేదీన సభనుంచి బయటికి వెళ్లి పోయారు. కాని కొన్ని రోజుల తర్వాత చర్చలో పాల్గొనేందుకు మళ్ళీ వచ్చారు. అంటే స్వరాజ్యపార్టీలోని ముస్లిం సభ్యులందరూ, ముస్లింలీగ్ వైఖరికి అనుగుణంగా. పార్టీ క్రమ శిక్షణను ఉల్లంఘిస్తూ వచ్చారన్నమాట.

శాసనసభలోని అధికార సభ్యులకు ఇది ఆహ్లాదాన్ని కలిగించింది. ప్రభుత్వ ప్రతి నిధి తటస్థ వైఖరిని అవలంభిస్తూ వచ్చారు. తీర్మానం మీద ఓటు జరిగింది, అమో దించబడేవరకూ ముస్లిం సభ్యుల సంతోషానికి మేరలేక పోయింది.

1924 లో ఏర్పాటు చేసుకున్న సంకీర్ణ పార్టీ చీలిపోయినట్టు స్పష్టమైంది. భారత రాజకీయాల్లో మతపరమైన ధోరణి పుంజుకోవడంతో ప్రభుత్వానికి మరింత బలం చేకూరింది.

## సహకారాన్ని ఇచ్చిపుచ్చుకోవడం

నిజానికి, ప్రభుత్వంతో సహకరించాలన్న ధోరణి స్వరాజ్య పార్టీలోనే పెరిగింది.

1924 ఫిబ్రవరి 8 వ తేదీన మోతీలాల్‌నెహ్రూ శాసనసభలో మొదటిసారి మాట్లాడుతూ ప్రభుత్వం తమ సహకారం కోరినట్లయితే స్వరాజ్యవాదులు సహకరిస్తారని చెప్పారు. కొన్ని నెలల తర్వాత, ప్రభుత్వం, భారత ఉక్కు పరిశ్రమ రక్షణనూ సాహాయాన్నీ అందచేసేందుకు ఒక బిల్లును ప్రవేశపెట్టింది. పైతరగతి ప్రజల ప్రతినిధులైన స్వరాజ్యవాదులు ఈ అవకాశాన్ని వినియోగించుకొని, బిల్లును ఆమోదించడంలో ప్రభుత్వానికి సహాయం చేశారు. సభకు చెందిన శిఫార్సుల సంఘంలోనూ స్థాయి సంఘంలోనూ పనిచేసేందుకు అంగీకరించారు కూడా. రాజ్యాంగ రాజకీయల్లోపు అర్ధమే అది. మోతీలాల్‌నెహ్రూ స్కీన్ సంఘంలో సభ్యునిగా వుండేందుకు అంగీకరించారు. సైన్యంలో కింగ్స్ కమీషన్‌కు భారతీయులను ఎక్కువమందిని ఎంచుకోవడం-వారికి శిక్షణకు తగిన ఏర్పాట్లు చేయడం వీటికి సంబంధించి పరిశీలించేందుకు భారత ప్రభుత్వం 1925 లో ఈ సంఘాన్ని నియమించింది. మరొక స్వరాజ్యవాది నాయకులైన వి. జె. పటేల్. శాసనసభకు 1925 ఆగస్టు 24 నుంచి అధ్యక్షులుగా వ్యవహరించారు. తీవ్ర పోటీ జరిగిన మీదట ఆయన ఈ పదవికి ఎన్నికయ్యారు.

స్వరాజ్య పార్టీ నాయకులైన సి. ఆర్. దాస్ 1925 మార్చి మే ల మధ్య, రాజకీయ ప్రయోజనాలకోసం జరిగే హింసా కాండను గర్హిస్తూ అనేక ప్రకటనలు చేశారు. కొన్ని షరతులకు లోబడి ప్రభుత్వంతో సహకరిస్తామని కూడా ఆయన సూచించారు. నిర్మాణాత్మకమైన ప్రతిపాదన చేయవలసిందని భారత దేశానికి సంబంధించిన బ్రిటిషు మంత్రి లార్డ్ బర్కన్‌హెడ్ కోరిన మీద, దాస్, మే 2 వ తేదీన, ఫరీద్‌పుర్‌లో జరిగిన బెంగాల్ రాష్ట్ర మహాసభలో అధ్యక్షోపన్యాసమిస్తూ తమ విధనాన్ని స్థూలంగా తెలియచేశారు. స్వాతంత్ర్యంకంటె బ్రిటిషు సామ్రాజ్యంలో భాగంగా డొమినియన్ ప్రతిపత్తి కావాలని ఆయన స్పష్టంచేశారు. స్వరాజ్యం కోసం జరిపే పోరాటంలో హింసను సాధనంగా ఉపయోగించడాన్ని ఆయన గర్హించారు. ఈ విధానం అవినీతికరమైనదీ తగనిదీ అని ఆయన వర్ణించారు. సంస్కరణల గురించి ఆయన ఈ మాటలన్నారు.

"ప్రస్తుత చట్టం మూలంగా ప్రజలకు నిజంగా కొంత బాధ్యత సంక్రమించినట్లూ, ప్రజల అభివృద్ధికి అవకాశం ఏర్పడినట్లు నాకు సంతృప్తి కలిగినట్లయితే నేను ఏ మాత్రం వెనుకాడకుండా ప్రభుత్వంతో సహకరిస్తాను. సమితిలోనే నిర్మాణాత్మక కృషిని ప్రారంభిస్తాను" 62

రాజీపడుతూ ఈ విధంగా ఉపన్యసించిన వెంటనే, లండన్‌లో ఉన్నతాధికార్లు తమలో తాము సంప్రదించుకున్నారు. దాసు - ప్రభుత్వం మధ్య సంప్రదింపులు కొనసాగుతున్నాయని ఊహాగానాలు వెలువడ్డాయి. కాని దాసు హఠాత్తుగా 1925 జూన్

16న చనిపోయారు. లార్డ్ బర్కెన్‌హెడ్ ఆ తర్వాత చేసిన ఉపన్యాసంలో, సంస్కరణల విషయంలో తమ వైఖరిని సడలించే సూచన ఏదీ కనిపించలేదు.

దాసు మరణంతో స్వరాజ్యపార్టీ చిన్నాభిన్నమైంది. 1925 అక్టోబరులో పార్టీ సభ్యుల్లోనే లిరుగుబాటు జరిగే పరిస్థితి ఏర్పడింది. స్వరాజ్యవాదులకు అత్యధిక మెజారిటీ వున్న సెంట్రల్ ప్రావిన్సిస్‌లో, స్వరాజ్యవాదుల నాయకులైన ఎస్. బి. తాంబే గవర్నర్ యొక్క కార్యవర్గ సమితిలో సభ్యులుగా వుండేందుకు అంగీకరించారు. మోతీలాల్‌నెహ్రూ ఆయన్ను దుయ్యబట్టారు. కాని దీనివల్ల స్వరాజ్యవాదుల్లో చీలిక మరింత త్వరితమైంది. స్వరాజ్యవాదులు, "వినాశనకారుల పాత్ర" ను విడనాడి ప్రభుత్వంతో పరస్పరం సహకరించే వైఖరిని అవలంబించాలని మహారాష్ట్రకు చెందిన ఎన్.సి. కేల్కార్, ఎం. ఆర్. జయకర్, బహిరంగంగా ప్రచారం చేయడం ప్రారంభించారు. లాలా లజ్‌పత్‌రాయ్, మాలవ్యావంటి ప్రముఖులు వీరిని సమర్థించారు. అందరినీ కూడగట్టేందుకు జరిగిన అనేక ప్రయత్నాలు విఫలమయ్యాయి.

## గాంధీజీ వైఖరి

ఈ విషయాల్లో గాంధీజీ వైఖరి ఎటువంటిదో చూద్దాం.

1924 ఫిబ్రవరి 5 న గాంధీజీ విడుదలయిన తర్వాత దాసు — మోతీలాల్ ఆయనతో సంప్రదించారు. కౌన్సిల్లో ప్రవేశించడంతో సహాయ నిరాకరణ నాశనమైందని గాంధీజీ ఈవిధంగా విశ్వసించారు. "కౌన్సిల్లో ప్రవేశించడం" "సహాయ నిరాకరణ" యివి ప్రధానమైన విభేదాలుగా కనిపించాయి. వీటితో అభిప్రాయాల్లో ధోరణుల్లో భేదాలు పొడసూపాయి. సమితుల్లో చేరడంకంటే చేరకుండాఉండడమే దేశానికి లాభకరంగా వుండేదని గాంధీజీ విశ్వసించారు. ప్రజాదాహాళ్యంలో సంబంధించివుండే నిర్మాణాత్మకమైన కృషికి ఆయన ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారు. మరొకసారి పౌర ఉల్లంఘనకు అది సహాయంగా వుంటుందని ఆయన అభిప్రాయపడ్డారు. కాని స్వరాజ్యవాదులను ఆటంకపరచ దలచలేదు ఆయన. కొంతకాలమైన తర్వాత ఆయన స్వరాజ్యవాదులనాయకులకు తలఒగ్గి సహాయనిరాకరణను కొంతకాలం ఆపివేసేందుకు అంగీకరించారుకూడా. స్వరాజ్యపార్టీ కాంగ్రెసులో భాగంగా చేరేందుకుకూడా సమ్మతించారు. 1924 డిసెంబరులో జరిగిన బెల్గామ్ కాంగ్రెసు, గాంధీజీ - దాసుల మధ్య జరిగిన ఈ ఒప్పందాలను ధృవపరచింది.

1925లో స్వరాజ్యవాదులు తమలోతాము కీచులాడుకుంటున్నపుడు, కాస్త పరిష్కరించవలసిందని గాంధీజీకి విజ్ఞప్తి చేశారు. కాని గాంధీజీమాత్రం తటస్థంగా ఉండేందుకే

నిశ్చయించుకున్నారు. 1926 ఏప్రిల్ 27 న శ్రీనివాస అయ్యంగార్‌కు రాస్తూ ఆయన ఈవిధంగా పేర్కొన్నారు:

"సమితులు పనిచేస్తున్న తీరునూ సమితుల్లో భారతీయులు సభ్యులైనందువల్ల ప్రజా జీవితంపై కలిగిన ఫలితాలనూ హిందూముస్లింల సమస్యపై దాని ప్రభావాన్ని పరిశీలించినకొద్దీ సమితుల్లో ప్రవేశించడం నిరుపయోగమేకాక, పొరపాటన్న నా అభిప్రాయం మరింతగట్టిపడుతూ వుంది. 1920 నాటి సహచరుల్లో కొంతమంది అయినా సమితులనుంచి ఎప్పుడు బయటికి వస్తారా అని నేను ఎదురుచూస్తున్నాను."63

## దౌర్జన్యకాండ పునరుద్ధరణ

కాంగ్రెసు పార్టీలో వ్యాపించిన నిస్పృహను అరికట్టేందుకు, మరికొంత చురుకుగా వ్యవహరించడం తప్ప మరొకమార్గం లేదని మోతీలాల్‌నెహ్రూతో సహా చాలామంది కాంగ్రెసు నాయకులకు స్పష్టంగా తెలిసిపోయింది. 1924 నాటి కాన్పూరు కుట్రకేసు, బెంగాల్ ఆర్డినెన్స్‌ప్రకారం జరిగిన అరెస్టులతో, పంజాబులో అకాలి శిఖుల ఆందోళన - తీక్షణమైన వాతావరణాన్ని కల్పించాయి, 1925 డిశంబరులో కాంగ్రెసు కాన్పూర్‌లో సమావేశమైనపుడు కార్మిక ప్రదర్శన జరిగింది. జవహర్‌లాల్‌నెహ్రూ దాన్ని అదుపులో పెట్టారు.

కాంగ్రెసు చర్చలమీద వీటన్నిటి ప్రభావం పడింది. కాంగ్రెసు పౌర ఉల్లంఘనలో తన విశ్వాసాన్ని పునరుద్ఘాటించింది. రాజకీయ కృషికి సవివరమైన కార్యక్రమాన్ని తయారుచేసింది. స్వరాజ్యపార్టీకి ఒక పని అప్పగించడం పథకములోని ప్రధానమైన అంశం. 1924 ఫిబ్రవరి 18 వ తేదీన సంస్కరణలకు సంబంధించి శాసన సభ ఆమోదించిన జాతీయవాద తీర్మానం గురించి ప్రభుత్వం వీలైనంత త్వరలో తన తుదినిరయాన్ని ప్రకటించేట్టు స్వరాజ్యపార్టీ ప్రభుత్వాన్ని కోరింది. 1925 ఫిబ్రవరి ఆఖరుకు ఎటువంటి నిర్ణయాన్ని ప్రకటించకపోయినా లేదా ప్రకటించిననిర్ణయం సంతృప్తికరంగా లేకపోయినా శాసనసభ రాజ్య సమితిలోని స్వరాజ్యవాదులు, తామిక మీదట శాసనసభల్లో పనిచేయబోమని ప్రభుత్వానికి తెలియచేయాలి. స్వరాజ్యవాదులు ఆర్థికబిల్లును త్రోసి పుచ్చేందుకు ఓటుచేసి, తమస్థానాలనుంచి లేచి వెళ్ళిపోవాలి. తమ స్థానాలను ఖాళీస్థానాలుగా ప్రకటించకుండా నివారించేందుకు మాత్రమే వీరు మళ్ళీ వీరిస్థానాలకు వెళ్ళాలి.

## శాసనసభనుంచి నిష్క్రమణ

ఈ అధికారంతో స్వరాజ్యవాదులు, 1926 మార్చి 8 వ తేదీన శాసనసభకు హాజరయారు, సభలో, కష్టమ్స్ పద్దులున్నాయి. స్వరాజ్య నాయకులైన పండిత

మోతీలాల్‌నెహ్రూ, పద్దుల విషయమై తమపార్టీ వైఖరి గురించి ప్రకటన చేసేందుకు లేచి నిల్చున్నారు. ఆయన ముఖంలో ప్రసన్నత ఏ కోశానాలేదు. అయినా కృత నిశ్చయంతో వున్నట్టు కనిపించారు. పద్దుల విషయమేకాదు శాసనసభ విషయంలోనే ఆయన ఒక ప్రకటన చేయబోతున్నారు. సంస్కరణలకు సంబంధించిన శాసనసభ 1924 ఫిబ్రవరి 18 న ఆమోదించిన సవరణను ఆయన గుర్తుచేశారు. ఆసమయంలో తాము ఏమి చెప్పినదీ కూడా గుర్తుచేశారు. "ఇంతవరకు మేముచేయనిదాన్ని చేసేందుకు మేము ఇక్కడికి వచ్చాం. సహాయ నిరాకరణదారులమే అయినా మీతో సహకరిం చేందుకే వచ్చాము. అదీ, మీరు మా సహకారం కోరినట్టయితేనే. అందుకు మేము ఇక్కడ వున్నాం." ఆత్మగౌరవాన్ని చంపుకుని తాము ఈవిధంగా చెప్పామని మోతీ లాల్ నెహ్రూ ఒప్పుకున్నారు. కాని ఈమాటలను ఆయన జాగ్రత్తగా తూచి మాట్లా డారు. "కాని ఈ అవమానాన్ని నేను కోరితెచ్చుకున్నదే......అయినా దీనివల్ల అధికారుల రాళ్ళవంటి హృదయాలు మారలేదు సరికదా అది మా బలహీనత అనుకుని సంతోషించి మమ్మలను మరింత అవమానించేందుకే ప్రయత్నించారు" అని ఆయన ఎంతో బాధతో పలికారు. 64

స్వరాజ్యవాదులు సహకరిస్తామని ముందుకు వచ్చినా ప్రభుత్వం వారిని ఏవిధంగా తిరస్కార భావంతో త్రోసిపుచ్చినదీ మోతీలాల్‌నెహ్రూ వర్ణించారు. ప్రభుత్వం అణిచివేసే విధానాన్ని ఏవిధంగా ప్రారంభించినదీ ఆయన పేర్కొన్నారు. "ఇంగ్లం డులో లేబర్‌పార్టీ అధికారంలోకి వచ్చినందుకు మొదటి ఫలితం: బెంగాల్ ఆర్డినెన్స్. కన్సర్‌వేటివ్‌లు అధికారంలోకి వచ్చినపుడు, భారతదేశానికి సంబంధించిన కొత్తమంత్రి లార్డ్ బర్కన్‌హెడ్ అన్ని ఆశలనూ అడియాసలు చేశారు. ఇక మిగిలిన మార్గ మేది? " అంటూ ఆయన బాధతోకూడిన ఆగ్రహంతోనూ నిస్పృహతోనూ ఈ మాట లన్నారు:

"ఈ ప్రభుత్వం ఎంత శక్తివంతమైనదో మాకు తెలుసును. మేమెంత బలహీను లమో కూడా మాకు తెలుసును. మత విభేదాలు చీలికలతో నిండిన ప్రస్తుత పరిస్థి తిలో మాకున్న ఒక్క ఆయుధం పౌర ఉల్లంఘన మా అందుబాటులో లేదు. శాసన సభలోనూ దేశంలోని ఇతర శాసనసభల్లోనూ మేము కొనసాగడమన్నది కూడా వీలుకానిపని. ఇంత బలమైన సామ్రాజ్యాన్ని కూలద్రోయాలన్న లక్ష్యంతో మేము యీవేళ బయటికి పోవడంలేదు. మేము ఒకవేళ అనుకున్నా అటువంటిపని చేయ లేమని మాకు తెలుసు. ఈ సభలో మేము సాధించదలచుకున్న లక్ష్యాన్ని సాధించలేక పోయామన్న వినమ్ర తలంపుతోనే మేము పోతున్నాము. ఈపని

మేము ఎప్పుడో చేయవలసింది. కాని ప్రభుత్వపు రాజనీతిజ్ఞత పన్నాగాల వల్ల మేము జాప్యం చేశాము. ప్రభుత్వం చెప్పినదాన్ని మేమెప్పుడూ విశ్వసించ లేదు. అయితే తప్పుకోవ తొక్కాలని అనుకోనూలేదు. అందుకనే మేము కోరినదానికి స్పష్టమైన సమాధానం లభించేవరకూ వేచి వున్నాము. నా గౌరవ నీయ మిత్రులైన బ్రిటిషు సభ్యుడు ఇప్పుడు స్పష్టంగా చెప్పారు. ఇక ఇక్కడ మాకు పనిలేదు. మళ్ళీ ప్రజల దగ్గరికివెళ్ళి, మమ్ముల‌ను మళ్ళీ ఎన్నుకోవలసిం దని కోరుకుంటాము. మేము పోరాటాన్ని మానుకోవడంలేదు"65

ఈమాటలతో పండిత మోతీలాల్‌నెహ్రూ సభనుంచి వెళ్ళిపోయారు. ఆయనతో పాటు ఇతర స్వరాజ్యవాద సభ్యులుకూడా వెళ్ళిపోయారు. మరొకసారి పోరాటానికి దేశాన్ని సమాయత్త పరచేందుకు నడుంకట్టారు.

సభలో కలకలం

వీరి నిష్క్రమణ తర్వాత దేశ వ్యవహారాల సభ్యుడు చిన్న ప్రకటనచేస్తూ స్వరాజ్య వాదులు నిష్క్రమించడాన్ని నిరశించారు. సహాయ నిరాకరణవాదులు సభలో వున్నం దుకు మాత్రం ఆయన సంతృప్తి వ్యక్తపరిచారు.

ఇదివరకటి స్వరాజ్యవాద నాయకులూ శాసనసభ అధ్యక్షులూ అయిన వి. జె. పటేల్ లేచి ఒక ప్రకటన చేశారు. సభలోని పెద్దపార్టీ నిష్క్రమించినందువల్ల శాసనసభ యికమీద ప్రాతినిధ్యసభ కాదని పేర్కొన్నారు. శాసనసభ కొనసాగేదీలేనిదీ ప్రభుత్వం ఆలోచించవలసి వున్నదని చెప్పారు. ఆతర్వాత ఆయన సభను వాయిదా వేశారు. అధికార సభ్యులూ ఇతరులూ కూడా ఈచర్యకు ఆశ్చర్యపోయారు.

అధికారేతర సభ్యులు కొంతమంది అధ్యక్షులను కలుసుకునేందుకు వెళ్ళారు. అప్పుడు ఆయన తాము ఆమరుసటిరోజు ఒక ప్రకటన చేస్తామని వాగ్దానం చేశారు.

అదేవిధంగా 1926 మార్చి 9న అధ్యక్షులు ఒక ప్రకటన చేశారు. ప్రస్తుతం ఏర్పడివున్న పరిస్థితిలో ప్రభుత్వం, వివాదాస్పదమైన అంశాలకు సంబంధించిన బిల్లులు ప్రవేశపెట్టరాదని ప్రభుత్వానికి తెలియ చెప్పాలన్నది తమ ఉద్దేశ్యంకాని సభ లోని మిగతా సభ్యులను అవమానంచేయాలన్నది తమ ఉద్దేశ్యం కాదని ఆయన వివరిం చారు. అధ్యక్షులుగా తాము అటువంటి భాష ఉపయోగించి ఉండరాదనీ ప్రభుత్వాన్ని బెదిరించినట్టు ధ్వనించి వుండవచ్చుననీ అన్నారు.66

అధ్యక్షుడు ఈప్రకటన చేసిన తర్వాత ఊపిరాడనట్టు బాధపడుతూ వచ్చిన బ్రిటిషు సభ్యుడు హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. శాసనసభ ఆతర్వాత, గవర్నర్ జనరల్

యొక్క కార్యవర్గ సమితికి గ్రాంట్లకు సంబంధించిన అభ్యర్థన విషయమై జిన్నా ప్రతిపాదించిన తీర్మానంమీద చర్చ ప్రారంభించింది. జిన్నా. మాట్లాడానికి లేచినప్పుడు ఇండిపెండెంట్లు కరతాళధ్వనులు చేశారు. 1929 లోపున సంస్కరణలకు సంబంధించిన చట్టబద్ధమైన సంఘాన్ని నియమించాలని జిన్నా కోరారు. తమ తీర్మానాన్ని సమర్థించవలసిందని ఆయన నామినేటెడ్ సభ్యులను కోరారు. రెండురోజుల విస్తారమైన చర్చ తర్వాత శాసనసభ జిన్నా తీర్మానాన్ని 47 ఓట్లతో త్రోసిపుచ్చింది. అనుకూలంగా 31 ఓట్లు పడ్డాయి.

## రిఫరెన్సులు


1. ఆర్ పామేదత్త్-ఇండియా టుడే (బొంబాయి 1949) పే. 326, 7
2. బి. పట్టాభి సీతారామయ్య, హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ నేషనల్ కాంగ్రెసు (బొంబాయి, 1946) వా. 1. పే. 236–7
3. సుభాష్ చంద్రబోస్, ది ఇండియన్ స్ట్రగుల్; 1920 - 1942 (బొంబాయి - 1964) పే. 73
4. సీతారామయ్య n. 2. పే. 246 -9
5. హేమేంద్రనాథ్‌దాస్ గుప్త, దేశబంధు చిత్తరంజన్‌దాసు (ఢిల్లీ 1960) పే.77
6. ఉపన్యాసపాఠం యిబిద్‌లో పే. 156 - 207
7. ప్రణాళికపాఠం: కే. యం. పణిక్కర్ అండ్ ఎ. పర్షాద్, ఎడ్స్., ది వాయిస్ ఆఫ్ ఫ్రీడమ్: సెలెక్టెడ్ స్పీచెస్ ఆఫ్ పండిట్ మోతీలాల్‌నెహ్రూ (బొంబాయి, 1961) పే. 505 - 13.
8. జవహర్ లాల్‌నెహ్రూ, ఎన్ ఆటోబయాగ్రఫీ (కొత్త ఢిల్లీ 1962) పే. 68.
9. సరోజిని నాయుడు: మొహమ్మద్ అలీ జిన్నా: ఏన్ ఎంబాసిడర్ ఆఫ్ యూనిటీ (గనేష్, మద్రాసు) పి. ఎక్స్
10. యమ్. ఎచ్. సైయద్, మొహమ్మదలీ జిన్నా; ఎ పొలిటికల్ స్టడీ (లాహోర్ 1945) ఐ. 295
11. పణిక్కర్ అండ్ పర్షాద్, యన్. 7, పే. 101 - 16
12. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1924, పే. 531
13. యం. రఫీక్ అఫ్‌జల్, ఎడ్, సెలెక్టెడ్ స్పీచెస్ అండ్ స్టేట్‌మెంట్స్ ఆఫ్ ది క్వాదె - అజమ్ మొహమ్మదాలీ జిన్నా- (లాహోర్, 1966) పే. 118.

14. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, యస్. 12 పే. 564.
15. ఇబిడ్., పే. 737
16. ఇబిడ్., పే. 570
17. ఇబిడ్., పే. 519
18. ఇబిడ్., పే. 380
19. కె. ఎ. నీలకంఠశాస్త్రి అండ్ ఏచ్. ఎస్. కుంద్రా, ఎడ్. ఎ గ్రేట్ లిబరల్: స్పీచెస్ అండ్ రైటింగ్స్ ఆఫ్ సర్. పి. యస్ శివస్వామిఅయ్యర్(బొంబాయి, 1965), పే. 371 - 88.
20. ఇండియన్ క్వార్టర్లీ రిజిస్టర్, 1925 (కలకత్తా) వా. 1., పే. 42,46.
21. పణిక్కర్ అండ్ పర్షాద్ యస్. 7, పే. 253 - 5.
22. ఇబిడ్., పే. 264
23. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 6, 1925 పే. 39 - 40
24. ఇబిడ్., పే. 918 -19
25. ఇబిడ్., 945
26. ఇబిడ్., పే. 976
27. ఇబిడ్., పే. 987 - 9
27a. ఇబిడ్., 904 - 7
28. ఇబిడ్., 898 - 9
29. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ వా.4, 1924. పే. 1386
30. అఫ్జల్. యస్. 13 - పే 129 - 30
31. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, n. 29, పే. 1392
32. ఇబిడ్., పే. 1407
33. ఇబిడ్., పే. 1917
34. రష్‌బ్రూక్ విలియమ్స్, ఇండియా ఇన్ 1923 - 24, పే. 311 - 12.
35. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1924. పే.2043 - 7
36. ఇబిడ్.. పే. 2059
37. ఇబిడ్., పే.2068.

38. ఫుట్‌ప్రింట్స్ ఆఫ్ లిబర్టీ: సెలెక్షన్స్ ఫ్రమ్ స్పీచెస్ అండ్ రైటింగ్స్ ఆఫ్ తులసీ చంద్ర గోస్వామి (కలకత్తా 1971) పే. 72
39. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 5.1925. పే. 709-10
40. ఇబిడ్.. వా, 7. 1926 పే. 260
41. ఇబిడ్,, పే.. 265 - 89
42. ఇబిడ్., పే. 297 - 9.
43. ఇబిడ్., వా. 7, 1926. పే. 1508 - 09.
44. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా, 4, 1924 పే. 3131-2
45. ఇబిడ్., పే. 3147-50
45a. ఇబిడ్., పే. 3337-8.
46. ఇబిడ్.. వా. 4, 1924. పే,3300.
47. ఇబిడ్., వా. 4, 1924. పే. 2314
48. ఇబిడ్., పే. 2336
49. ఇబిడ్., పే.2335
50. ఇబిడ్., వా. 7. 1926 పే. 1363-4
51. ఇబిడ్., పే. 1362
52. ఇబిడ్., వా. 6, పే. 1089
53. ఇబిడ్., వా.4,1924 పే. 4028
54. ఇబిడ్., వా.7.1926, పే. 190—203
55. ఇబిడ్.. పే. 171—210
56. పణిక్కర్, యన్. 7, పే 107
57. అఫ్జల్. యన్. 13, పే, 129
58. ఇబిడ్., పే. 134
59. యల్. యఫ్. రష్‌బ్రూక్ విలియమ్స్, ఇండియా ఇన్ 1924—25, పే. 317
60. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 7. 1926 పే. 1296—1303
61, ఇబిడ్., పే. 1334—43
62. దాసుగుప్త, యన్. 1., పే. 224

63. కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధి, (క్రొత్తఢిల్లీ 1968) వా. 30, పే. 371

64. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 7,1926, పే. 2139.

65. ఇబిడ్., పే. 2143

66. ఇబిడ్., పే. 2168

## నాల్గవ అధ్యాయము

# ప్రతిఘటన జ్యోతి ప్రకాశిస్తూనేవుంది

## ( 1927 – 1929 )

### పంధొమ్మిదివందల ఇరవైఆరు : గడ్డు సంవత్సరం

1926 మార్చి 8 వ తేదీన స్వరాజ్యనాయకులైన మోతీలాల్ నెహ్రూ, "మేము ఇంతటితో ఊరుకోము" అంటూ శాసనసభ భవనం నుంచి నిష్క్రమించారు. కాని ఈ మాట లంటున్నపుడు కూడా జాతీయవాదుల్లోని బలహీనతలు ఆయనకు పూర్తిగాతెలుసు.

భారత జాతీయత చరిత్రలో పందొమ్మిది వందల ఇరవై ఆరవసంవత్సరము నిజంగా గడ్డు సంవత్సరం. సి. ఆర్. దాసు మరణించారు, గాంధీజీ ఇంకా రాజకీయ రంగానికి దూరంగా వున్నారు. ఆరోజుల్లో కాంగ్రెసులో ప్రధాన అంగమైన స్వరాజ్యపార్టీ ఛిన్నా భిన్నమై పోయింది. ప్రభుత్వంతో పరస్పరం సహకరించేందుకు సిద్ధపడినవారు 1926 ఫిబ్రవరిలో జయకర్ నాయకత్వంలో "ది రెస్పాన్సివ్ కొఆపరేషన్ పార్టీ" అన్న పేరుతో కొత్తపార్టీని ఏర్పాటు చేసుకున్నారు. కాన్పూర్‌కాంగ్రెసు (1925), శాసనసభ - సమితుల్లో పనికి సంబంధించి అనుసరించిన విధానం దేశ సంక్షేమానికి దోహదం చేసేదిగా లేదని ప్రకటించారు. రెస్పాన్సివిస్టులు, సమితుల్లో సభ్యులుగా వుండేందుకేకాక, అప్పటి రాజ్యాంగంకింద అందుబాటులో వున్న అవకాశాలను పూర్తిగా వినియోగించుకునేందుకు వీలుగా మరేపదవినైనా అంగీకరించేందుకు కూడా సిద్ధపడ్డారు. ఈవర్గానికీ మోతీలాల్‌నెహ్రూ నాయకత్వంలోని వర్గానికీ మధ్య విభేదాలను సర్దేందుకు ప్రయత్నాలు జరిగాయి, ఉభయుల మధ్య ఏప్రిల్‌లో ఒక ఒప్పందం కుదిరింది. దీన్ని సాబర్‌మతి ఒప్పందం అని వ్యవహరించారు. కాని, ఒప్పందంమీద సంతకాలు జరిగిన వెంటనే ఒప్పందానికి వివిధరకాల అర్థాలు చెప్పసాగారు. దానితో ఒప్పందం ముగిసింది. పండిత మదనమోహన మాలవ్యా 'ఇండిపెండెంట్‌పార్టీ' అన్నపేరుతో మరొకపార్టీ ఏర్పాటుచేశారు. ఉదారవాదులూ, ఇండిపెండెంట్లూ రెస్పాన్సివ్ కొఆపరేటర్స్, హిందూమహాసభ సభ్యులూ, అంటే డొమినియన్ ప్రతిపత్తి కావాలని

కోరుతున్నవారూ ప్రభుత్వంతో పరస్పరం సహకరించాలన్న విధానాన్ని అనుసరించే వారూ, పౌరశిల్లంఘననూ సహాయ నిరాకరణనూ పాటించనివారూ ఇందులో చేరారన్న మాట. లాలా లజ్‌పత్‌రాయ్ ఈపార్టీలో చేరారు. రెస్పాన్స్‌విస్ట్ పార్టీ మధ్య-పశ్చిమ భారతంలో వహించిన పాత్రనే ఈపార్టీ ఉత్తర భారతంలో వహించిందని సుభాష్‌చంద్ర బోస్ అన్నారు.[1] బెంగాల్‌లోకూడా స్వరాజ్యపార్టీలో అనేక బృందాలు ఏర్పడ్డాయి. మొత్తంమీద స్వరాజ్యపార్టీ ఛిన్నా భిన్నమైంది.

హిందూ ముస్లింలమధ్య విభేదాలు రాజకీయరంగానికి మాత్రమే పరిమితమై ఉండక పోవడంతో కష్టాలు మరింత ఎక్కువయాయి. టర్కీలో కమల్‌పాషా అధికారంలోకి రావడంతో భారతదేశంలో ఖిలాఫత్ ఉద్యమం సమసిపోయింది. అయినా ఖిలాఫత్ సంఘం ఒకటి అవశేషంగా మిగిలింది. 1924 లో జిన్నా అఖిలభారత ముస్లింలీగ్‌ను పునరుద్ధరించారు. మతపరమైన ధోరణిలో మాట్లాడుతూ ఆయన, భవిష్యత్తులో జరిగే ఏ రాజ్యాంగపరమైన ఏర్పాటు అయినా ముస్లింల హక్కులకూ ప్రయోజనాలకూ రక్షణ కల్పించేదిగా వుండాలని ఉద్ఘాటించారు. హిందూ - ముస్లిం సమస్య 1916లో లక్నోలో మోస్తరుగా పరిష్కరించబడగలదన్న విశ్వాసాన్ని కూడా వ్యక్తపరిచారు. అయితే ముస్లింలందరూ ఒకటిగాలేరు. ముస్లింలీగ్‌కు చెందినవారందరూ జిన్నాను తమ నాయకుడుగా గుర్తించనూ లేదు. 1925 లో ముస్లింలీగ్ మహాసభకు అధ్యక్షత వహిస్తూ సర్ అబ్దుల్‌రహీమ్. ముస్లింలు తమ భవితవ్యాన్ని హిందువులకు అప్పచెప్పజాలరని పేర్కొంటూ పూర్తిగా మతపరమైన ఉపన్యాసం చేశారు. భారత దేశం సంక్షేమానికి ఇంగ్లీషువారి సర్వీసులు ఎంతైనా అవసరమని ఆయన ప్రకటించారు. [2]

ఈలోగా హిందూ మహాసభ కూడా అంతకుముందు కంటె చురుకుగా పనిచేయడం ప్రారంభించింది. 1925 తర్వాత దేశమంతటా సంఘాలు ప్రారంభించింది. 1926 ఏప్రిల్‌లో కలకత్తాలో జరిగిన సమావేశానికి లజ్‌పత్ రాయ్ అధ్యక్షత వహిస్తూ, రాజకీయ వివాదాలన్నింటిలోనూ, మహాసభ హిందువుల మతపరమైన ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తుందని చెప్పారు. బలవంతంగా ఇస్లాం మతంలో చేర్చుకున్నవారిని మళ్ళి హిందువులను చేయడం సభ లక్ష్యాల్లో ఒకటని కూడా తెలియచేశారు. 'శుద్ధి' ఉద్యమానికి ఇది నాంది అయింది. దీనితో హిందువులు - ముస్లింలమధ్య విద్వేషం మరింత ఎక్కువైంది. 1922 లో గాంధీజీ సహాయనిరాకరణను ఆపి వేసిన తర్వాత ప్రజా ఉద్యమం ఏదీలేక పోవడంతో హిందువులూ ముస్లింలలోని మతవాదులూ పాతధోరణులను తిరుగతోడే వారూ. ఏదో ఒక సాకుతో మతపరమైన అల్లర్లను రేకెత్తించేందుకు

అవకాశం కలిగింది. ప్రజాజీవితంలో అల్లర్లు సాధారణమై పోయాయి. ఇవి ఒకొక్కప్పుడు తీవ్రంగానూ విస్తృతంగానూ ఉండేవి. 1926లో దేశంలోని చాలా ప్రాంతల్లో అల్లర్లు జరిగాయి. మే-జులై మధ్య కలకత్తాలో జరిగినది అతి తీవ్ర మైనది.

దాసు బ్రతికివుండగా చాలామంది ముస్లింలు స్వరాజ్యపార్టీలో చేరెట్టు చేశారు. వారిలో చాలామంది బెంగాల్ శాసన సమితికి స్వరాజ్య టికెట్టు మీద ఎన్నికయారుకుడా. అందరినీ కూడగట్టుకునే వ్యక్తి లేదు. అదీకాక బెంగాల్ ఒప్పందం విఫలంకావడంతో ఏర్పడిన విస్పృహ-ఆగ్రహమూ ముస్లింలను ఇంకా వదలలేదు[4]. ముఖ్యంగా బెంగాల్‌లో వీటన్నిటివల్లా చాలా మంది ముస్లిం నాయకులు స్వరాజ్యపార్టీ నుంచి బయటికి వెళ్ళారు. ప్రజా జీవితంలో ఏర్పడుతున్న చీలికలకు ఇది మరొక సమిధిగా తయారయింది.

## మూడవ శాసనసభకు ఎన్నికలు

విరాశ, నిస్పృహ - చీలికలతో కూడిన ఇటువంటి వాతావరణంలో 1926 నవంబరులో, కేంద్రశాసనసభకూ రాష్ట్ర సమితులకూ ఎన్నికలు జరిగాయి. "జాతీయవాదశక్తులకూ ధనమూ—అవినీతి-దుర్మార్గమూ అసత్యం వీటి అండదండలతో కూడిన తక్కువ తర గతికి చెందిన మతవాదశక్తులకూ మధ్య" ఈ పోటీ జరిగిందని మోతీలాల్‌నెహ్రూ ఆ తర్వాత పేర్కొన్నారు.[5]

అయితే ఎన్నికల సమయంలో స్వరాజ్యపార్టీకి అనుకూలమైన అంశం ఒకటుంది. 1923 లో స్వరాజ్యపార్టీ. తన పేరు మీదనే ఎన్నికల్లో పోటీ చేసింది. కాని 1924లో గాంధీజీ అధ్యక్షతన జరిగిన బెల్గామ్ కాంగ్రెసులో కేంద్ర రాష్ట్ర శాసనసభలకు సంబం ధించిన పనిని కాంగ్రెసు తరపున కాంగ్రెసుసంస్థలో భాగంగా స్వరాజ్యపార్టీ నిర్వహిస్తుం దని తీర్మానించారు. దీనివల్ల 1927 లో కాంగ్రెసు పేరుతో ఎన్నికల్లో పోటీ చేసేందుకు స్వరాజ్యపార్టీకి వీలుకలిగింది. ప్రారంభదశలోని నో-ఛేంజర్స్ అని పిలిచిన వారి సహకారం కూడా స్వరాజ్యపార్టీకి ఈవిధంగా లభించింది. అందువల్లనే ఎన్ని ఇబ్బం దులు ఎర్పడినప్పటికీ స్వరాజ్యపార్టీ శాసనసభలో అతి పెద్ద పార్టీగా అవతరించింది. సభలోని మొత్తం 104 ఎన్నికయే స్థానాల్లో స్వరాజ్యపార్టీ 40 స్థానాలు గెల్చుకుంది.

కాని మొత్తం మీద చూస్తే సమితుల్లో స్వరాజ్యపార్టీ బలహీనమైంది. మద్రాసులో స్వరాజ్యపార్టీ ఘనవిజయం సాధించింది, మొత్తం స్థానాల్లో దాదాపు సగం గెల్చుకుంది. బీహార్-ఒరిస్సాల్లో కూడా తన స్థానాలను నిలుపుకుంది కాని బెంగాల్-బొంబాయిల్లో చాలా స్థానాలను పోగొట్టుకుంది. సెంట్రల్ ప్రావిన్సెస్, యునైటెడ్ ప్రావిన్సెస్,

పంజాబుల్లో మాత్రం చిత్తుగా ఓడిపోయింది. ఎన్నికల చెడు ఫలితం మొత్తం మీద చూసినట్టయితే - మతవాద ముస్లింలు శాసనసభల్లో స్వరాజ్యవాద ముస్లింల స్థానాలను ఆక్రమించుకున్నారు.

శాసనసభలో. రాజకీయజీవితంలోని చీలిక ప్రస్ఫుటంగా తెలియవచ్చింది. మోతీలాల్‌నెహ్రూ శ్రీనివాస అయ్యంగారి నాయకత్వంలోని స్వరాజ్యవాదులు కాక మాలవ్యా-లాలాలజపత్‌రాయ్ నాయకత్వంలో "జాతీయవాదులు" అన్న వర్గం ఒకటి బయలు దేరింది. ఈ వర్గంలో రెస్పాన్సివిస్టులూ హిందూ మహాసభవారూ కలిసి ఇరవై మంది చేరారు. చాలా మంది ముస్లింలు ఒకటై సర్‌జుల్ఫికర్ అలీఖాన్ నాయకత్వంలో సెంట్రల్ ముస్లింపార్టీ అని ఒక పార్టీని ఏర్పాటు చేసుకున్నారు. ఎటువంటి పార్టీలోనూ చేరని ముస్లింలతో సహా వీరు పదిహేడుగురు వున్నారు. కొంతమంది ముస్లింలూ హిందువులూ కలిసి పాత ఇండిపెండెంటు పార్టీ పేరుతో జిన్నాను తమ నాయకునిగా పెట్టుకున్నారు. ఇవన్నీ కాక ఒకచిన్న యూరోపియన్ బృందం ఒకటి కూడా వుంది, యూరోపియన్ల ప్రయోజనాలను కాపాడుకునేందుకు.

కాంగ్రెసుపార్టీ చీఫ్ విప్ అయిన రఫీఅహ్మద్ కిద్వాయి తమ వర్గపు కార్యకలాపాలను మిగతావర్గాల కార్యకలాపాలతో సమన్వయం చేయలేక సతిమతమయ్యారు. ముఖ్యంగా ఆయన సామర్థ్యంవల్లనే, ఇన్ని చీలికలున్నా ప్రతిపక్షం అనేక సందర్భాల్లో ప్రభుత్వాన్ని ఓడించకలిగింది.

### కాంగ్రెసు ఆదేశం

ఎన్నికల వెంటనే కాంగ్రెసు వార్షిక సమావేశం గౌహతిలో జరిగింది. ప్రభుత్వంతో పరస్పరం సహకరించే విధానాన్ని అనుసరించాలని మాలవ్యా సూచించారు. మోతీలాల్‌నెహ్రూ మాట్లాడుతూ, స్వరాజ్యవాది కాంగ్రెసు సభ్యులకూ మాలవ్యావంటి రెస్పాన్సివిస్టులకూ మధ్యవున్న భేదాన్ని స్పష్టం చేశారు. దేశప్రజల కోరిక విషయంలో ప్రభుత్వం సంతృప్తికరంగా వ్యవహరిస్తేతప్ప, అది కూడా వారు పెట్టిన ముందు షరతుకు-అంటే బెంగాల్ డెటిన్యూలను విడుదల చేయడం-అంగీకరిస్తే తప్ప, స్వరాజ్యవాది కాంగ్రెసు సభ్యులు అధికారపదవులకు అంగీకరించబోరని ఆయన వెల్లడిచేశారు. ఆయన అభిప్రాయాలను అందరూ ఆమోదించారు. సమితుల్లో కాంగ్రెసు సభ్యులు వ్యవహరించవలసిన తీరును కాంగ్రెసు స్పష్టంగా నిర్దేశించింది. దేశ ప్రజల కోరికకు అనుగుణంగా ప్రభుత్వం వ్యవహరించే వరకూ కాంగ్రెసు సభ్యులు మంత్రుల పదవులనుగాని ప్రభుత్వం ఇచ్చే ఇతర పదవులనుగాని స్వీకరించరాదని ఆదేశించింది. పైన పేర్కొన్న విధానానికి అనుగుణంగా సప్లయిలను నిరాకరించాలని, బడ్జెటులను త్రోసి

పుచ్చాలని కూడా కాంగ్రెసు సభ్యులను ఆదేశించింది. అంతేకాక, ప్రభుత్వ అధికారాలను, పటిష్ఠం చేసేందుకుద్దేశించిన బిల్లులన్నిటినీ తిరస్కరించాలని కూడా కాంగ్రెసు కోరింది. అయితే మాలవ్యా-ఆయన సహచరులకు సంతృప్తికరంగా కాంగ్రెసు శాసన సభ్యులు ప్రజా జీవితాన్ని అభివృద్ధి పరచేందుకు అవసరమైన తీర్మానాలనూ బిల్లులనూ ప్రతిపాదించవచ్చుననీ అటువంటి వాటిని సమర్థించవచ్చుననీ పేర్కొన్నారు[6]

ఈ ఆదేశాలతో కాంగ్రెసు సభ్యులు మూడవ శాసనసభ మొదటి సమావేశానికి సమాయత్తమయారు.

## వాయిదా తీర్మానాలు

1926 ఏప్రిల్ భారతవైస్‌రాయ్‌గా లార్డ్ అర్విన్ పదవీ బాధ్యతలు స్వీకరించారు. 1927 జనవరి 18వ తేదీన భారత శాసనసభ కొత్త భవనానికి ప్రారంభోత్సవం చేశారు. 19వ తేదీన శాసనసభ మూడవ సమావేశం ప్రారంభమైంది. అందరూ, ఏం జరుగనున్నదో అన్న ఆదుర్దాతోనూ ఉత్సుకతతోనుఎదురుచూడసాగారు. జనవరి 21వ తేదీన కాంగ్రెసు (స్వరాజ్య) పార్టీ నాయకులైన పండిత మదనమోహన్ మాలవ్యా ప్రభుత్వాన్ని విమర్శిస్తూ ఒక వాయిదా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. శాసనసభకు బెంగాల్ నుంచి ఎన్నికైన ఎస్. సి. మిత్ర సమావేశానికి హాజరుకాకపోవడంగురించి చర్చించేందుకు సభ వాయిదా పడాలని తమ తీర్మానంలో కోరారు. మిత్ర ఆ సమయంలో నిర్బంధంలో వున్నారు. మోతీలాల్ నెహ్రూ, శాసనసభ హక్కులూ, ప్రత్యేక సౌకర్యాల గురించి మాట్లాడారు. మిత్రను నిర్బంధంలో వుంచడం, ఈ హక్కులను ఉల్లంఘించడమేకాక ఆయన్ని ఎన్నుకున్న నియోజకవర్గపు హక్కులనుకూడ ఉల్లంఘించడమే అవుతుందని నెహ్రూ వాదించారు. భారత శాసనసభకు కామన్సు సభకు వున్న హోదాలేదన్న సంగతి తమకు తెలుసునని చెబుతూ ఆయన 'నామమాత్రంగానైనా ఈ శాసనసభ కొనసాగినంతకాలం' ప్రతి సభ్యుడికి సమావేశానికి హాజరయే హక్కు వుందని పేర్కొన్నారు. "ఓటర్లు తమ నిర్ణయాన్ని తెలియచేశారు. ఆ నిర్ణయం వల్లనే మేమందరం ఇక్కడ వున్నాము. సభవారు ఈ నిర్ణయాన్ని నిర్లక్ష్యం చేయరనే ఆశిస్తున్నాను" అన్నారు మోతీలాల్ నెహ్రూ.[7] దేశవ్యవహారాల సభ్యుడు ప్రభుత్వాన్ని సమర్థించినపుడు మిగతా సభ్యులుకూడా ప్రభుత్వంమీద విరుచుకుపడ్డారు.

శాసనసభలో కాంగ్రెసుపార్టీ ఉపనాయకులైన ఎస్. శ్రీనివాస అయ్యంగార్ బ్రిటిషు సభ్యుడి వాదనను ఖండించారు. మిత్రను ఏ చట్టంకింద అరెస్టు చేశారో ఆ బెంగాల్ క్రిమినల్ లా సవరణ చట్టం శాసనసభ్యుడి హక్కుతో జోక్యం కల్పించుకోజాలదనీ,

ఆవిధంగా జరిగినట్లయితే పార్లమెంటు చట్టాన్నే ఉల్లంఘించినట్లవుతుందనీ ఆయన వాదించారు.8

ఉదారవాద నాయకులైన పండిత హృదయనాథ్ కుంజ్రు మోతీలాల్ నెహ్రూ తీర్మానాన్ని సమర్థిస్తూ శాసనసభకు అభ్యర్థిగా పోటీ చేసేందుకు మిత్రను అనర్హుడిగా పేర్కొన లేదనీ ఎన్నికల్లో పోటీచేసేందుకు అర్హతవున్న ఒక వ్యక్తి ఎన్నికైన తర్వాత శాసన సభకు హాజరుకాకుండా ఎందుకు ఆపారో అర్థంకావడంలేదనీ చెప్పారు.9

లజపత్‌రాయ్, మాలవ్యా, జిన్నా, టి. సి గోస్వామి, సి. ఎస్. రంగఅయ్యర్ ఇంకా చాలామందీ మోతీలాల్ నెహ్రూ తీర్మానాన్ని సమర్థించారు. 18 ఓట్ల మెజారిటీతో, ఆఖరుకు దీన్ని ఆమోదించారు. ప్రభుత్వాన్ని అభిశంసించడం ఇదే మొదటిసారి.

ఆతర్వాత కొన్ని రోజులకే సభ్యులు మరొక వాయిదా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. జనవరి 24వ తేదీన వైస్‌రాయ్, శాసనసభలో మాట్లాడుతూ, భారతీయ సైనికులను చైనాకు సైనిక కార్యకలాపాలకోసం పంపబోతున్నట్లు అంతకుముందు వెలువడిన వదంతులను ధృవపరిచారు. ఈ విషయమై భారతీయులు చాలా వ్యాకులపడ్డారు. చైనాలో ప్రజా ఉద్యమాన్ని అణచివేసేందుకు భారతీయ సైనికులను వినియోగిస్తారని వీరు అభిప్రాయపడ్డారు. చైనాపట్ల భారతీయులకు చాలా సానుభూతి ఉండేది. జనవరి 25వ తేదీన శ్రీనివాస అయ్యంగార్ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. చైనాలో సైనిక కార్యకలాపాలకు భారతీయ సైనికులతోసహా సైనికదళాన్ని పంపించేందుకు భారత ప్రభుత్వం అంగీకరించడం గురించి చర్చించేందుకు సభ వాయిదాపడాలని ఈ తీర్మానంలో కోరారు.

దేశ వ్యవహారాల సభ్యుడు ఈ తీర్మానానికి అభ్యంతరం తెలిపారు. ఈ తీర్మానం మీద చర్చ జరిగినట్లయితే ఇతర దేశాలతో భారత ప్రభుత్వ సంబంధాలూ బ్రిటిష ప్రభుత్వసంబంధాలూ దెబ్బతినిపోతాయనీ ఆయన పేర్కొన్నారు. కాని, మోతీలాల్ నెహ్రూ, మాలవ్యా, షణ్ముగం చెట్టి, జిన్నా — శాసనసభకు ఈ సంగతి తెలియచేయకుండా సైనికులను పంపేందుకు భారత ప్రభుత్వం అంగీకరించడం ఎంతవరకు సబబు అన్న విషయమై చర్చ జరగాలని కోరారు. ఆ విధంగా, అది పూర్తిగా భారతదేశానికి సంబంధించిన విషయమే అవుతుందనీ, సభ దాని గురించి చర్చించకుండా చేయరాదనీ వీరు వాదించారు. అధ్యక్షుడు, రెండు పక్షాల వాదనలూ విన్న తర్వాత వాయిదా తీర్మానం సరిగానే వున్నదనీ దానిమీద అదేరోజున కొంతసేపయినతర్వాత చర్చ జరుగ వచ్చుననీ తీర్పు ఇచ్చారు. వైస్రాయ్ తన అధికారాన్ని ఉపయోగించి, తీర్మానాన్ని తోసిపుచ్చారు.

ఈ సమావేశంలోనే మరికొన్ని వాయిదా తీర్మానాలనుకూడా ప్రవేశపెట్టారు. దీనితో వాతావరణం బాగా వేడెక్కింది. స్వరాజ్యవాదులు, జాతీయవాదులూ ప్రతిపాదించిన కొన్ని తీర్మానాలుకూడా దీనికి తోడయాయి. అందులో ఒకటి గంజాముకు చెందిన వి. వి. జోగయ్య ఫిబ్రవరి 3వ తేదీన ప్రవేశపెట్టినది. 1818వ సంవత్సరపు బెంగాల్ రెగ్యులేషన్ 111ను రద్దుచేయాలనీ రాజకీయ ఖైదీలందరినీ విడుదలచేయాలనీ లేదా తాము నిర్దోషులమని ఋజువు చేసుకునే అవకాశం వారికి కల్పించాలనీ రాజకీయ ఖైదీలందరికీ క్షమాభిక్ష పెట్టాలనీ ఈ తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు సిఫార్సుచేశారు. తమ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ఆయన, బెంగాల్ రెగ్యులేషన్‌ను అమల్లో వుంచడం పరిస్థితులకు అనుగుణంగాలేదనీ, లాలా లజపత్‌రాయ్ వంటి దేశభక్తులను దేశంనుంచి బహిష్కరించడానికి ప్రభుత్వం దీన్ని ఉపయోగిస్తూవుందనీ పేర్కొన్నారు.[10]

మోతీలాల్ నెహ్రూ ఈ తీర్మానానికి ఒక సవరణ ప్రవేశపెడుతూ, 1925 నాటి బెంగాల్ క్రిమినల్ లా సవరణచట్టంతోసహా పాత రెగ్యులేషన్లకింద నిర్బంధంలోవుంచిన వారినందరినీ విడుదల చేయాలని కోరారు. వీరందరినీ విడుదల చేసేంతవరకూ ప్రభుత్వంతో సహకరించే ప్రశ్నేలేదని మోతీలాల్ నెహ్రూ స్పష్టంచేశారు. ప్రజల ఈ కోరికను తీర్చేవరకూ భారతీయులకూ ప్రభుత్వానికీ మధ్య సమాధానం కుదిరే అవకాశమే లేదని లజపత్‌రాయ్, మాలవ్యాకూడా ఉద్ఘాటించారు.

తీర్మానాన్ని సమర్థిస్తూ కుంబ్రూ శాంతిభద్రతల పరిరక్షణ చాలావరకు ప్రజల అభిప్రాయంమీద ఆధారపడివుందనీ, రాజకీయ ఖైదీలకు న్యాయం జరగాలని ప్రజలందరూ అభిప్రాయపడుతున్నారనీ చెప్పారు. భారత రక్షణ చట్టాన్ని అమలుపరచడంపట్ల ఫిర్యాదులను ఆయన గుర్తుచేస్తూ "పాలనా నిర్వహణకోసం కల్లోల పరిస్థితిని సృష్టించి అదే శాంతియుత పరిస్థితి అని భావించే వీలున్నట్టు దీనివల్ల స్పష్టమౌతూ వుందని చెప్పారు.[11]

లక్షలాదిప్రజల ప్రేమకూ విశ్వాసానికీ పాత్రులైనవారిని నిర్బంధంలో వుంచి ప్రభుత్వం, విప్లవ కార్యకలాపాలకు అనువైన వాతావరణాన్ని సృష్టిస్తూ వుందని అస్సాంకు చెందిన మౌల్వీ అబ్దుల్ మతిన్ చౌదురీ - హెచ్చరించారు. బెంగాల్‌ను మరీ తరిమికొట్టవద్దనీ దానివల్ల తీవ్రమైన పరిణామాలుంటాయనీ ఆయన ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.[12]

ఈ దేశభక్తులను విడుదల చేయకపోయినట్టయితే అధికార్లు ప్రజాప్రతినిధుల అభిప్రాయాలను పెడచెవిన పెట్టినట్టయితే పరిణామాలు తీవ్రంగా వుంటాయని బీహార్‌కు చెందిన రామ్‌నారాయణసింగ్ హెచ్చరించారు. "ఇవేళ కాకపోయినా, త్వరలో మేము

మా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకుంటాం. అప్పుడు, ప్రస్తుత అధికారులైన మిమ్మ లను అరెస్టుచేస్తాం, శిక్షకూడా విధిస్తాం. విచారణ లేకుండానే ఈదేశంలోనే నిర్బంధం కాని, లేక ఇంగ్లాండుకు పంపించివేస్తాం" అన్నారాయన[13]

కోపోద్రేకాలతో చర్చ జరిగిన తరువాత మోతీలాల్‌నెహ్రూ తీర్మానంమీద ఓటింగ్ జరిగింది. 18 ఓట్ల మెజారిటీతో నెగ్గింది.

మొదటిఘర్షణ : ఉక్కురక్షణబిల్లు

ఇంతవరకూ పేర్కొన్న వాయిదా తీర్మానాలూ ఇతరతీర్మానాలూ, చిన్నచిన్న వాదోపవాదాలుగానే సాగాయి. ముందుముందు జరుగబోయే పెద్ద సంఘర్షణలకు ఇవి ప్రాతిపదికగా పనిచేశాయి. ప్రభుత్వ వర్గాలకూ — స్వరాజ్యవాది, కాంగ్రెసు-జాతీయవాదులతో కూడిన ప్రతిపక్షానికి మధ్య మొట్టమొదటి పెద్ద సంఘర్షణ ఉక్కు-రక్షణ బిల్లు విషయంలో జరిగినట్టు 14 అధికార పత్రాల్లో పేర్కొన్నారు. మొదటి ప్రపంచయుద్ధం తర్వాత భారతఉక్కు పరిశ్రమకు అంటే టాటా సంస్థకు కొంత రక్షణ కల్పించారు. 1924 లో శాసనసభలోని భారతీయులు దీనిని హర్షించారు. సుంకా లకు సంబంధించిన బోర్డు ఈవిషయమై మరికొంత పరిశీలన జరిపి, భారత ఉక్కుపరి శ్రమకు మరికొంత రక్షణ కల్పించాలని శిఫార్సు చేసింది.

ఈ నివేదిక ఆధారంగా ప్రభుత్వం ఏడేండ్లు అమలుజరిగే ఒక పథకాన్ని తయారు చేసింది. ఈపథకంకింద, ఉక్కు దిగుమతులమీద అదనపు సుంకాలను విధించడం ద్వారా రక్షణకల్పిస్తారు. అదివరకటి మోస్తరుగా ఉక్కుపరిశ్రమకు ప్రోత్సాహక నిధులను ఇప్పించారు. ఇందులో ఒకలోపం, ఈ సుంకం ఒకేమాదిరిగా వుండదు. బ్రిటన్ నుంచి దిగుమతి చేసుకునే ఉక్కుమీద ప్రాథమిక సుంకం విధిస్తారు. ఇతర దేశాలనుంచి దిగుమతి చేసుకునే ఉక్కుమీద అదనపుసుంకాన్ని విధిస్తారు. ఈవిధంగా విచక్షణ చూపడాన్ని భారతదేశం వ్యతిరేకించింది. భారత పరిశ్రమలకు రక్షణ అన్న పేరుతో ఎలాపెట్టి బ్రిటిషు ప్రయోజనాలను ఈవిధంగా రక్షించుకోవడానికి ఇది తెలివైన విధానమని భారతీయులు అభిప్రాయపడ్డారు.

1927 జనవరి 26 వ వాణిజ్య విషయాల సభ్యుడు సర్ ఛార్లెస్ ఇన్స్, ఉక్కు-పరిశ్రమ రక్షణ బిల్లును శిఫార్సుల సంఘానికి నివేదించాలని కోరుతూ శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఆవెంటనే ఒరిస్సాకు చెందిన బి. దాస్ చర్చకు ఉపక్రమించారు. భారత పరిశ్రమలకు రక్షణ కల్పించాలన్న ప్రభుత్వ ఉద్దేశాన్ని ఆయన ప్రశంసించారు. "దీనికి ఏర్పాట్లు ఇదివరలోకూడా జరిగాయి. కాని

భారతీయ పరిశ్రమలను మట్టుపెట్టే విధంగా ప్రభుత్వం ద్రవ్య విధానాన్ని వాడుకుంది" అన్నారాయన. ఆయనింకా ఈవిధంగా చెప్పారు :

"బ్రిటన్ విషయంలో ప్రత్యేక సౌకర్యాన్ని కల్పించడాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను. మాకు స్వరాజ్యంవచ్చి బ్రిటిషు సామ్రాజ్యంతో మేము సరిసమానంగా వున్నపుడు ఈవిధమైన సౌకర్యాల విషయమై ఆలోచించేందుకు నాకు అభ్యంతరం లేదు. లేక పోయినట్టయితే దీనిగురించి నేను ఆలోచించను. మాదేశప్రజలకు అవమానకరమైన విధంగా బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించేకంటే పరిశ్రమలు నాశనమైనా నాకు ఫరవాలేదు." 15

మోతీలాల్‌నెహ్రూ, మాలవ్యా, శ్రీనివాసఅయ్యంగార్, టి. ప్రకాశం, గయాప్రసాద్ సింగ్ కూడా ఈ విచక్షణాపూర్వకమైన సుంకాల రేట్లను వ్యతిరేకించారు. రెస్పాన్సివ్ కోఆపరేటర్ అయిన ఎం. ఆర్. జయకర్ మాట్లాడుతూ భారతీయ పరిశ్రమలకు ధరల రక్షణ తగినంత ఉన్న పక్షంలో బ్రిటిష్ సామాగ్రికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించేందుకు తమకేమీ అభ్యంతరం లేదని చెప్పారు.16 ఈరక్షణ పొందబోతున్న టాటా సంస్థ నిర్వహణను భారతదేశంలో తరిఫీదు పొందినవారికి అప్పగించాలని కుంజ్రు ఉద్ఘాటించారు. రక్షణకోసం సుంకాన్ని విధించినందువల్ల సామాన్య మానవుడిమీద భారం ఎక్కువవుతుందని ఎన్. ఎమ్. జోషి విమర్శించారు. దీనిదృష్ట్యా, ప్రోత్సాహక మొత్తాన్ని చెల్లించడమే మెరుగని ఆయన అభిప్రాయపడ్డారు.

ఈఘట్టంలో భారతీయులు గట్టిగా ప్రతిఘటించలేదు. శిఫార్సుల సంఘం బిల్లు గురించి ఏంచెబుతుందో వారు చూడదలిచారు. రక్షణ సాకుతో తమకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించుకునేందుకు బ్రిటిష్‌వారు అన్ని విధాలా ప్రయత్నిస్తారన్న అభిప్రాయం అందరిలోనూ కలిగింది.

ఫిబ్రవరి 14న బిల్లును, శిఫార్సుల సంఘం నివేదికతోపాటు సభలో ప్రవేశపెట్టినపుడు చర్చ తీవ్రతరమైంది, రాజకీయ ధోరణికూడా కనిపించింది. బిల్లును ప్రవేశపెట్టిన వెంటనే బొంబాయికి చెందిన జమునాదాస్ ఎం. మెహతా, బిల్లును మళ్ళీ శిఫార్సుల సంఘానికి నివేదించాలని కోరారు. భారత ఉక్కు పరిశ్రమకు రక్షణ కల్పించాలన్న ఇంతటి ముఖ్యమైన విషయంతో బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రత్యేకసౌకర్యాలు కల్పించడం వంటి వివాదాస్పదమైన అంశాన్ని ముడిపెట్టడం ఎందుకో తమకు అర్థంకావడంలేదని ఆయన చెప్పారు. బ్రిటిషు సామ్రాజ్యానికి ఇప్పటికే ప్రత్యేక సౌకర్యాలున్నాయని ఆయన అన్నారు. తాము అనుభవిస్తున్న ప్రత్యేక సౌకర్యాలను ప్రజాప్రతినిధుల అనుమతి పొందాలని ప్రభుత్వం ప్రస్తుతం కోరుతూవుందని మెహతా అభిప్రాయపడ్డారు.

ఈ విషయంలో ప్రభుత్వానికి సహాయంచేసే స్థితిలో తాము లేమని ఆయన స్పష్టం చేశారు. బ్రిటిష-సామ్రాజ్యానికి ప్రత్యేక సౌకర్యాలను, స్వపరిపాలన ఉద్యమంతో ముడిపెడుతూ ఆయన ఈ మాటలన్నారు:

"ఈ దేశానికి, తన జన్మహక్కు అయిన స్వపరిపాలన లేకుండా పోయింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు - పెట్టుబడిదారుల ప్రయోజనాలకోసం దీన్ని వినియోగించుకుంటున్నారు. ఇతర దేశాలను తమ వశం చేసుకునేందుకు సాధనంగా ఈ దేశాన్ని ఉపయోగించుకుంటున్నారు. చైనా ప్రజల స్వాతంత్ర్యాన్ని నాశనం చేయడంలో, తనకు ఇష్టంలేకపోయినా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి సాధనంగా పని చేసినందుకు భారతదేశం పేరు చెబితేనే ప్రపంచ దేశాల వారందరూ అసహ్యించు కుంటున్నారు. ఇదంతా, మన అంగీకారంలేకుండా, మన ఇష్టానికి వ్యతిరేకంగా జరుగుతూవుంది. బ్రిటిష సామ్రాజ్యానికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించేందుకు ఈ దేశప్రజలు ఒప్పుకునేట్టు చేయడం గగనమే అవుతుంది."[17]

భారతదేశంలో ప్రముఖ పారిశ్రామికవేత్తల్లో ఒకరైన ఘనశ్యాందాస్ బిర్లా మెహతా సవరణను సమర్థించారు. వివక్షాపూర్వకమైన సుంకం, సామాగ్రిని పంపే దేశం మీద ఆధారపడిలేదనీ, ఆ సామాగ్రి నాణ్యం మీద ఆధారపడినదనీ అందువల్ల ఇది బ్రిటిష్ సామ్రాజ్యానికి కల్పిస్తున్న ప్రత్యేక సౌకర్యం లేదని వాణిజ్య సభ్యుడు చేసిన వాదనను బిర్లా ఖండించారు. ఈ పథకం కింద ఇంగ్లండునుంచి దిగుమతి చేసుకునే అన్ని సరుకులమీదా విధించే సుంకం అవి నాణ్యమైనవైనా కాకపోయినా — యూరోపు నుంచి దిగుమతి చేసుకునే సరుకులమీద విధించే సుంకం కంటె — అవి నాణ్యమైనవే అయినా - తక్కువగా వుంటుందని బిర్లా వివరించారు. ఇది బ్రిటన్ కల్పిస్తున్న ప్రత్యేక సౌకర్యమనీ దీన్ని సభవారు గట్టిగా ప్రతిఘటించాలనీ ఆయన కోరారు. మనకుకూడా అటువంటి సౌకర్యం కలిగేపక్షంలో లేదా దానివల్ల భారతదేశంలోని వాడకందార్లకు ఇబ్బంది కలగని పక్షంలో బ్రిటన్‌కు ప్రత్యేక సౌకర్యం కల్పించేందుకూ తమకేమీ అభ్యంతరంలేదని ఆయన స్పష్టంచేశారు. బ్రిటిషు సరుకుల ధరలతో యూరోపు దేశాల సరుకుల ధరలను పోలుస్తూ ఆయన భారతీయులు ఎక్కువ ధరపెట్టి బ్రిటిష్ సామాగ్రిని కొనవలసివుంటుందని చెప్పారు. బ్రిటిష్ ఉత్పత్తిదార్లకు రక్షణ కల్పించడంకోసం, భారతీయ వాడకందార్లమీద పన్నుల భారం వేయడంతప్ప ఇది మరొకటికాదని బిర్లా అన్నారు. అందువల్ల ఆయన దాన్ని ప్రతిఘటించారు. "ఇండిపెండెంటు పార్టీ నాయకులను (జిన్నా) తమ వశం చేసుకున్నందుకు" వాణిజ్య సభ్యుడిని ఆయన అభినందించారు. "సభలోని మిగతా రెండు ముఖ్యమైనపార్టీనూ (కాంగ్రెసు,

మాలవ్యాకు చెందిన జాతీయవాదపార్టీ) వాణిజ్య సభ్యుడు తమవశం చేసుకోలేకపోవడం తమకెంతో ఊరటగావుందని"[18] బిర్లా అన్నారు.

బ్రిటిష్ సామ్రాజ్యానికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించడం గురించి జిన్నా, బిర్లాతోనూ ఇతరులతోనూ వాదానికి దిగారు. బ్రిటిష్ సరుకులమీద సుంకం నామమాత్రంగా వుంది. సుంకం చెల్లించినవిదేశ సామాగ్రి విక్రయాలకు దెబ్బతగిలే పక్షంలో మాత్రమే దీన్ని బ్రిటన్‌కు ప్రత్యేక సౌకర్యం అనవచ్చునని ఆయన వాదించారు. ప్రస్తుతం తలపెట్టిన పథకాలవల్ల అటువంటి సందర్భం ఏర్పడే అవకాశంలేదని జిన్నా అభిప్రాయపడ్డారు. ఈ విషయమై జిన్నా, మెహతాతో తీవ్రంగా వాదోపవాదాలు జరిపారు. అయినా తమ వాదనను మార్చుకోలేదు, బిల్లులో తలపెట్టిన పథకాన్ని సమర్థించారు. తమ ఉపన్యాసాన్ని ముగించేస్తూ ఆయన ప్రతిపక్షం మొండిగా వ్యవహరించినట్టయితే ప్రతిష్ఠంభన ఏర్పడి ఈ మొత్తం విషయాన్ని భారతదేశానికి చెందిన మంత్రికి అప్పచెప్పినట్టయితే ఫలితం తీవ్రంగా వుంటుందని హెచ్చరించారు. "...జాతీయ పరిశ్రమ అని మీరు చెప్పుకుంటున్న పరిశ్రమకు, దానికి మీరురక్షణ కల్పించాలని ఎంతో ఆదుర్దాగావున్నా – ప్రమాదం ఏర్పడిందన్న సంగతి గుర్తుంచుకోండి..." అని ఆయన పేర్కొన్నారు[19]

జిన్నా తర్వాత మాట్లాడుతూ మోతీలాల్‌నెహ్రూ తమ పార్టీ వైఖరిని స్పష్టంచేశారు. ప్రభుత్వం తలపెట్టిన పథకం, భారత ద్రవ్య సంఘం సూచించిన విధంగా, బ్రిటిష్ సామ్రాజ్యానికి ప్రత్యేక సౌకర్యం కల్పించేది కాకపోయినా, యూరోపు దేశాల ఉక్కుకంటె బ్రిటిష్ ఉక్కుకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలన్న సిద్ధాంతాన్ని బిల్లులో పొందుపరచకపోయినా, ప్రమాదకరమైన ఈ సిద్ధాంతాన్ని ఒకసారి అమలుపరచిన తర్వాత ముందు ముందు దాన్ని ఒదిలించుకోవడం అసాధ్యమౌతుందని ఆయన వివరించారు. దేశంలోని కొన్నిప్రాంతాలకు టాటావారి సామగ్రి చేరుకుకోలేకపోయినట్లయితే ఈ పథకం వల్ల బ్రిటిషు సామగ్రికి రక్షణ కలుగుతుంది కాని, టాటావారి సామగ్రికి కాదనీ అప్పుడు కూడా వాడకందార్లు ఎక్కువ ధర చెల్లించవలసి వుంటుందనీ ఆయన విశదీకరించారు.

"బిల్లులోని పథకంలో బ్రిటన్‌కు, ఇతర దేశాలకంటె ప్రత్యేకసౌకర్యాలు కల్పించాలన్న సిద్ధాంతాన్ని పొందుపరచిన సంగతి నిజమే అయినట్లయితే, దానివల్ల ఎటువంటి లాభం ఉన్నా, టాటాసంస్థకు గాని భారతదేశంలో ఉక్కు పరిశ్రమకుగాని దానివల్ల ఇప్పుడుకాని ముందు ముందుకాని ఉపకారం ఉన్నా నాకు ఈ బిల్లుపట్ల ఏ మాత్రం సానుభూతి లేదు మన దేశపు సుంకాలలో బ్రిటన్‌కు ప్రత్యేక సౌకర్యం కల్పించే పద్ధ

తిని ప్రవేశపెట్టటంకన్నా టాటావంటి సంస్థలు ఇరవై పోదయినా నాకు ఫరవాలేదు"20

ప్రభుత్వం తలపెట్టిన పథకం బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రత్యేక సదుపాయం కల్పించేది కాకపోవచ్చునని లజపత్‌రాయ్ ఒప్పుకున్నారు. "కాకపోవచ్చు కాని విచక్షణ మాత్రం ఉంది. అటువంటి విచక్షణ ముందు ముందు మరికొన్ని విచక్షణలకు దారి తీస్తుంది." అన్నారు లజపత్‌రాయ్. ముందు ముందు పెద్ద విచక్షణకు దారితీసే చిన్న విచక్షణ "అన్న మోతీలాల్‌నెహ్రూ మాటలను ఆయన ఉద్ఘాటించారు. సామ్రాజ్య విచక్షణను ప్రవేశపెట్టాలని ప్రభుత్వం ప్రస్తుతం అనుకోకపోవచ్చు. కాని గతంలో మనం నేర్చుకున్నదేమిటి? ఆయన ఈవిధంగా అన్నారు.

"మన దేశంలో బ్రిటిషు కార్యకలాపాల చరిత్ర అంతా, మన దేశంలో బ్రిటిష్‌పాలన చరిత్ర అంతా, వారి మంచి ఉద్దేశాల కళేబరాలతో నిండి ఉన్నాయని నేను నిర్భయంగా చెప్పగలను. వారి మంచి ఉద్దేశ్యాల మాట ఏమయినా, ఈ దేశంలో ఒకదాని తర్వాత మరొకటిగా తీసుకున్న చర్యలవల్ల పరిశ్రమలు నాశనమాయాయి; పారిశ్రామిక ఆర్థిక విషయాలకు సంబంధించినంతవరకు పూర్తిగా అసహాయస్థితికి చేరుకున్నాం. దీనివల్ల మనం పూర్తిగా విదేశాల మీద ఆధారపడే స్థితికి వచ్చాం. ఒక దేశానికి మరొక దేశానికి మధ్య సంబంధం పాలక దేశానికీ పాలిత దేశానికి మధ్య వుండే సంబంధం లేదా యజమాని-సేవకుడు మధ్య వుండే సంబంధం వంటిది అయినపుడు, రాజకీయాలకూ ఆర్థిక వ్యవహారలకూ మధ్య భేదాన్ని అన్వేషించడం శుష్క ప్రయత్నమే అవుతుంది"21

షన్ముగంచెట్టి మాట్లాడుతూ, భారత ఉక్కు పరిశ్రమలకు తగిన పటిష్టమైన రక్షణ కల్పించే విషయంలో భేదాభిప్రాయాలు లేవని చెప్పారు. కాని భారత ఉక్కు పరిశ్రమకు రక్షణ కల్పించే ప్రయత్నంలో బ్రిటిషు ఉత్పత్తి దార్లకు, వారికి యూరోపు నుంచి ఎదురవుతున్న పోటీ నుంచి రక్షణ కల్పించవలసిందేనా అని ఆయన ప్రశ్నించారు. శాసన సభ, ఆ పని తన నెత్తిన వేసుకోజాలదని ఆయన స్పష్టం చేశారు. బ్రిటిషు ఉత్పత్తి దార్లు భారత మార్కెట్టులో యూరోపు ఉత్పత్తి దార్లతో పోటీచేయలేక పోయినట్టయితే ప్రోత్సాహక మొత్తాన్ని చెల్లించిగాని లేదా ఇతర విధాల సహాయంచేసిగాని యూరోపు ఉత్పత్తి దార్ల పోటీకి తట్టుకునేట్టు చేయవలసినది బ్రిటిషు ప్రభుత్వమని ఆయన నిర్భయంగా చెప్పారు. బ్రిటిషు ఉత్పత్తిదార్ల ప్రయోజనాలను కాపాడవలసిన బాధ్యత భారత ప్రభుత్వానికిగాని శాసనసభకుగాని లేదని ఆయన స్పష్టం చేశారు.22

సెంట్రల్ ప్రావిన్సెస్‌కు చెందిన పండిత ద్వారకాప్రసాద్‌మిశ్ర బిల్లును గట్టిగా వ్యతిరేకిస్తూ సభ్యులతో ఈ మాటలన్నారు. "మన రాజకీయాలు ఇటువంటి దుర్దశలో

ఉండడానికి కారణం, దుర్దశలో వున్నమన ఆర్థిక పరిస్థితులే" భారత ఉక్కు పరిశ్రమకు రక్షణ కల్పించినట్టయితే పన్నులు కట్టేవారు తప్పకుండా ఇబ్బందిపడతా రని తమకు తెలుసునని ఆయనఅన్నారు. "కాని, ప్రభుత్వం తలపెట్టిన బిల్లువల్ల వాడకం దార్లకుగాని, భారతదేశంలోని ఉక్కు పరిశ్రమకుగాని మంచి చేకూరదు. నాణ్యం-సామర్థ్యం అన్న సాకుతో బ్రిటీషు ఉక్కును మనదేశానికి ఎగుమతి చేసేందుకు ఇది తెలివైన మార్గం. లాయిడ్ జార్జ్ వంటి ఉక్కు చట్టాలను మన దేశానికి దిగుమతి చేయడంతో వీరు తృప్తి పడలేదు"[23] అన్నారు పండిత ద్వారకా ప్రసాద్ మిశ్ర.

యునైటెడ్ ప్రావిన్సెస్‌కు చెందిన టి. ఎ. కె. షేర్వాణి. మాట్లాడుతూ, "సమయం సందర్భం లేకుండా ముస్లిం ప్రయోజనాలను రక్షించుకోవాలని అదేపనిగా మాట్లాడే తమ ముస్లిం సహచరులను హెచ్చరించారు. ఈ బిల్లును ఆమోదించినట్టయితే ఒక్క యునైటెడ్ ప్రావిన్సెస్‌లోనే, ఉక్కు తాళాలూ పెట్టెలు చేసే సుమారు పదివేల మంది పనివారు ఇక్కట్లపాలవుతారని ఆయన తెలియచేశారు.

చమన్‌లాల్, ఎన్. ఎం. జోషి, పనివారి సామాన్యమానవుడి ప్రయోజనాలను రక్షించవలసిన అవసరాన్ని ఉద్ఘాటించారు. ప్రభుత్వం తలపెట్టిన పథకం కింద, ఆదాయం పెరగడంతో ప్రభుత్వమూ అధికధరలవల్ల పెట్టుబడిదార్లు లాభం పొందు తారని వీరు చెప్పారు. "శక్తివంతమైన ఈరెండు వర్గాలూ ఏకమైనట్టయితే దేశంలోని బీదప్రజల ప్రయోజనాలను ఏవిధంగా కపాడేది?" అని జోషి ప్రశ్నించారు. అందు వల్లనే తాము ఈ బిల్లును వ్యతిరేకిస్తున్నామని ఆయన చెప్పారు.[24] బిల్లు మీద ఈ విధంగా అయిదు రోజులు చర్చ జరిగిన తర్వాత ఫిబ్రవరి 4వ తేదీన సభవారు 12 ఓట్లు మెజారిటీతో బిల్లును ఆమోదించారు. కాంగ్రెసు జాతీయవాద సభ్యులు సిగ్గు సిగ్గు అని అరిచారు.

## కరెన్సీ బిల్లు, భయంకరమైన వాదప్రతివాదాలు

1927 మార్చిలో ఆర్థిక సభ్యుడు ప్రవేశపెట్టిన కరెన్సీ బిల్లు మీద మళ్లీ ప్రభుత్వా నికీ ప్రతిపక్షానికీ మధ్య తీవ్ర వాదోపవాదులు జరిగాయి. నిజానికి 1926 ఆగష్టు 23 వ తేదీ ప్రభుత్వం, సభలో, కరెన్సీ బిల్లు మీద చర్చ జరుగాలని ప్రతిపాదించినప్పటిమంచీ ఈవివాదం జరుగుతూనే వుంది. ఆ సమయంలో కొంతసేపేఅయినా తీవ్రంగా చర్చ జరి గిన తర్వాత టి. రంగాచారియార్ ప్రతిపాదించిన సవరణను ఆమోదించారు. ప్రజాభి ప్రాయాన్ని తెలుసుకునేందుకు బిల్లుప్రతులను పంచిపెట్టాలని రంగాచారియార్ తమ సవ రణలో కోరారు.

1927 మార్చి 7 వ తేదీన మామూలుగా అందరూ కరెన్సీబిల్లు అని వ్యవహరిస్తు న్నదాని మీద చర్చ జరుగాలని ఆర్థిక సభ్యుడు ప్రతిపాదించారు. 1906 వ సంవత్సరపు భారతీయ నాణాల చట్టాన్ని 1923 వ సంవ్సతరపు భారత పేపర్ కరెన్సీ చట్టాన్నీ ఇంకా సవరించేందుకు దీన్ని ఉద్దేశించారు. బిల్లు ఉద్దేశ్యాన్ని వివరిస్తూ ఆర్థిక సభ్యుడు, రూపాయను కొంత నిర్ణీతమైన బంగారం విలువకు సమానంగా ప్రకటించవలసిన సమయం వచ్చిందనీ ఒక రూపాయకు ఒక షిల్లింగ్ 6 పెన్నీల బంగారాన్ని సమానం చేయాలనీ చెప్పారు. ధరలు, వాటంతట అవీ. ఒక షిల్లింగ్ 6 పెన్నీల నిష్పత్తికి సమానంగా స్థిరపడ్డాయనీ అందువల్ల ఈ నిష్పత్తినే చట్టబద్ధం చేయా లనీ ప్రభుత్వం వాదించింది

ఆర్థికమంత్రి ఉపన్యాసం తర్వాత శాసనసభలో మార్చి 7, 8 తేదీలలో కోపోద్రే కాలతో చర్చ జరిగింది. పండిత మదనమోహన్ మాలవ్యా చర్చ ప్రారంభిస్తూ, భారతదేశంలో కరెన్సీకి సంబంధించి బ్రిటిష్ ప్రభుత్వం అనుసరిస్తూవచ్చిన విధానం గురించి సుదీర్ఘంగా ఉపన్యసించారు. ఇటీవల ఈ విషయాన్ని పరిశీలించిన కరెన్సీకి సంబంధించిన రాయల్ సంఘం ఒక షిల్లింగ్ 6 పెన్నీలకు అనుకూలంగా తీర్పు చెప్ప డంలో ఆశ్చర్యంలేదని ఆయన అన్నారు. ఆ సంఘమే ఆ విధంగా ఏర్పాటైందని ఆయన వాదించారు. శాసనసభ్యుల విశ్వాసానికి పాత్రులైన ఒకరినైనా సంఘంలో నియమించవలసిందని ఎంత మొరపెట్టుకున్నా ప్రభుత్వం వినిపించుకోలేదు. బిల్లులో తలపెట్టిన ఒక షిల్లింగ్ 6 పెన్నీల నిష్పత్తిని ఆమోదించినట్టయితే ఇప్పటికే ఇబ్బందుల పాలవుతున్న భారతీయ పరిశ్రమలు ఇంకా ఇబ్బందులకు గురవుతూనే వుంటాయని మాలవ్యా చెప్పారు.[25]

భారత వాణిజ్య ప్రతినిధి అయిన పురుషోత్తమదాస్ ఠాకుర్‌దాసు ఈ సందర్భంగా, ప్రభుత్వ ఆర్థిక విధానాన్ని నిరాఘాటంగా ప్రతిఘటించారు. 19వ శతాబ్దం ఆఖరులో అమెరికాలో డెమొక్రాట్ సభ్యుడైన విలియమ్ జెన్నింగ్స్ బ్రయన్ మోస్తరుగా వ్యవ హరించారు.[26]

ధరలు పూర్తిగా ఒక షిల్లింగ్ 6 పెన్నీల నిష్పత్తికి స్థిరపడలేదనీ ఇప్పటికైనా సమయం మించిపోలేదనీ ఒక షిల్లింగ్ 4 పెన్నీల నిష్పత్తిని అనుసరించవచ్చుననీ ఠాకుర్‌దాసు ప్రభుత్వాన్ని కోరారు.

భారతీయ మిల్లులు, భారతీయ వాడకందార్లమీద అంటే వ్యవసాయదారులమీద ఆధార పడినవని ఠాకుర్‌దాసు వాదించారు. "బిల్లులో ప్రతిపాదించిన విధంగా అయితే బంగారం నిష్పత్తి పెరగడంతో కర్షకుడి ముడిసరుకుల ఎగుమతులు పడిపోయి, కొనుగోలుశక్తి

కూడా తగ్గిపోతుంది. దీనిఫలితంగా భారతీయ మిల్లులుకూడా దెబ్బతింటాయి. భారతదేశం లోని మిల్లు యజమానులు బిల్లును వ్యతిరేకించడం సహజం" అన్నారుఠాకుర్‌దాసు.[27]

నిష్పత్తిని ఒక షిల్లింగ్ 4 పెన్నీలుగా నిర్ణయించాలని కోరుతూ జమునాదాసు ఎం. మెహతా ఒక సవరణను ప్రతిపాదించారు. ఆయనకూడా ఠాకుర్‌దాసు మోస్తరుగానే వాదించారు. జి. డి. బిర్లా, కలకత్తాకుచెందిన భారతీయ వాణిజ్యమండలి తరఫున, కర్షకులు ఎక్కువగావున్న తమ నియోజకవర్గం తరఫున మాట్లాడుతూ, ఠాకుర్‌దాసునూ, మెహతానూ గట్టిగా సమర్థించారు. దేశంలో ఉత్పత్తి అయి దేశంలో వాడబడుతున్న ఏ సామాగ్రి, ఒక షిల్లింగ్ 6 పెన్నీల నిష్పత్తికి స్థిరపడిందో పేర్కొనవలసిందని ఆయన ఆర్థిక సభ్యుడిని సవాలు చేశారు.

శ్రీనివాస అయ్యంగార్‌కూడా, ఒక షిల్లింగ్ 4 పెన్నీల నిష్పత్తిని నిర్ధారించాలని చేసిన వాదనలను సమర్థించారు. ఈ నిష్పత్తి భారతీయ ప్రయోజనాలకు అనుకూలంగా వుందని ఆయన విశ్వసించారు. ఒక షిల్లింగ్ 6 పెన్నీల నిష్పత్తి బ్రిటిష్ ప్రయోజనాలకు అనుకూలంగా వుందని చెప్పారు.

ఉక్కు రక్షణ బిల్లు విషయంలో మోస్తారుగాకాక జిన్నా ఈసారిప్రభుత్వాన్ని గట్టిగా విమర్శించారు. ఒక నిర్ణీతమైన నిష్పత్తిని నిర్దేశించాలన్న అభిప్రాయంతో వున్న వారిని కరెన్సీ సంఘంలో నియమించినట్టు ఆయన ప్రభుత్వాన్ని దుయ్య బట్టారు[28] నిష్పత్తిని తగ్గించాలని కూడా కోరారు. ఒక షిల్లింగ్ 4 పెన్నీల నిష్పత్తి వంటి ఒక షిల్లింగ్ 6 పెన్నీల నిష్పత్తివల్ల పేదవారికి లాభకరంగా వుంటుందని పంజాబుకు చెందిన నామినేటేడ్ సభ్యులు ఖాన్ బహదూర్ మియా అబ్దుల్ అజీజ్ వాదించారు. ప్రభుత్వ బిల్లును ఆయన సమర్థించారు.

ఇటువంటి సవివరమైన చర్చ తర్వాత మెహతా సవరణ ఓటుకు పెట్టారు. సవరణ 68 ఓట్లతో వీగి పోయింది. అనుకులంగా 65 ఓట్లు మాత్రమే పడ్డాయి. శాసనసభలో ఇంతవరకు ఇంత భేదాభిప్రాయం ఎప్పుడూ వెలువడలేదు.

## రాజకీయ రంగంలో

ఆర్థిక రంగంలో ఉద్రిక్త వాతావరణంలో చర్చలు జరుగుతూవుండగా, రాజకీయ రంగం ఇంకా స్తబ్దంగానే వుంది. 1927 మార్చి 9 వ తేదీన జాతీయవాదపార్టీ ఉపనాయకులైన ఎం. ఆర్. జయకర్, కార్యవర్గ సమితిని పూర్తిగా తొలగించాలనికోరుతూ శాసన సభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. దీనిమీద రాజకీయ చర్చ జరిగింది. సి. ఆర్. దాసువంటి ప్రముఖనాయకులూ, ఆ దరిమిలా 1926 లో శాసనసభలో స్వరాజ్యవాది

నాయకులూ సహకరిస్తామని ముందుకు వచ్చినప్పటికీ ప్రభుత్వం నిర్లక్ష్యం చేసినందుకు అధికారేతర సభ్యుడు ప్రభుత్వాన్ని విమర్శించారు. జయకర్ తీర్మానం మీద నిర్ణయం ప్రతిపక్షానికి విజయంగా పరిణమించింది. ఆయన తీర్మానానికి 9 ఓట్ల మెజారిటీ లభించింది. మరికొన్ని కోత తీర్మానాల విషయంలో కూడా ప్రభుత్వం వీగిపోయింది. రైల్వే బోర్డు విషయంలో కోత విధిస్తూ పండిత హృదయనాథ కుంజ్రు ప్రవేశపెట్టిన తీర్మానం ఇందులో ఒకటి. రైల్వేలకు కావలసిన సామగ్రి కొనుగోలు విషయంలో భారతీయ స్టోర్స్ శాఖను నిర్లక్ష్యం చేసినందుకు ఆయన ప్రభుత్వాన్ని ఖండించారు. 29 కాని ఇవి స్థిరంగా ప్రవహిస్తున్న జలాల్లో చిన్న చిన్న అలలు మాత్రమే.

1927 మధ్య నాటికి రాజకీయరంగం కొంత వేడెక్కింది. బోస్ పేర్కొన్నట్టె, కొత్త చైతన్యస్రవంతిలో యువజనులపాత్ర చాలా పెద్దది. 30 కార్మికులు-కర్షకుల పార్టీ నాయకత్వంలో కార్మికులూ కర్షకుల దౌర్జన్య పూరిత ఉద్యమంతో దీనికి సంబంధం వుంది. ఖరగ్‌పూర్‌లోని బెంగాల్-నాగపూర్ రైల్వే వర్క్‌షాప్‌లో జరిగిన సమ్మె ముందు ముందు జరుగబోయే కార్మికుల దౌర్జన్యపూరితమైన పోరాటానికి సూచన మాత్రమే.

కాని రాజకీయరంగంలో స్తబ్దతను నిజంగా తొలగించినది ప్రభుత్వమనే చెప్పవచ్చు. 1919వ సంవత్సరపు చట్టం కింద, చట్టం ఏవిధంగా పనిచేస్తున్నదీ పరిశీలించి మరికొన్ని సంస్కరణలను శిఫార్సు చేసేందుకు 1929 లో ఒక సంఘాన్ని నియమించవలసి వుంది. ఇంగ్లండులో అధికారంలో వున్న కన్సర్వేటివ్ పార్టీ, 1929 లో సాధారణ ఎన్నికలు జరిగినపుడు లేబర్‌పార్టీ అధికారంలోకి వస్తుందేమోనని భయపడుతూ వుంది. ఒకవేళ అదే జరిగినట్టయితే లేబర్ ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించే లోపున 1927 లో తామే ఒక సంఘాన్ని నియమించాలని కన్సర్వేటివ్ ప్రభుత్వం నిశ్చయించుకుంది. బ్రిటిష్ లేబర్ నాయకులు గతంలో భారత జాతీయ శక్తులకు అనుకూలంగా వ్యవహరించడమే ఈ భయానికి కారణం.

## సైమన్ సంఘం నియామకం

గాంధీజీ ఇంకా రాజకీయరంగానికి దూరంగా వున్నా, ప్రభుత్వానికి ఆయన విలువా ప్రాముఖ్యమూ తెలుసు. నవంబరు 5 వ తేదీన వైస్‌రాయ్‌ని కలుసుకోవలసిందని ఆయన్ను ఆహ్వానించారు. గాంధీజీ, వైస్‌రాయ్‌ని కలుసుకున్నపుడు భారత దేశానికి సంబంధించిన బ్రిటిష్ మంత్రి నవంబరు 8 వ తేదీన సంఘం నియామకం గురించి చేయబోతున్న ప్రకటన ప్రతిని ఆయనకు అందచేశారు. దీనికి గాంధీజీ అంత సంతోషించలేదు. అయితే ఇంతకంటె పెద్దవి ముందు ముందు జరుగబోతున్నాయి.

భారతీయ భద్రపరమైన సంఘాన్ని నియమించబోతున్నట్టు నవంబర్ 8వ తేదీన లండన్‌లోనూ కొత్త ఢిల్లీలోనూ ఒకేసారి ప్రకటన జరిగింది. సర్ జాన్ సైమన్ అధ్యక్షులుగా సంఘంలో ఏడుగురు సభ్యులున్నారు. ప్రభుత్వ వ్యవస్థ పనిచేస్తున్న తీరును ఈ సంఘం పరిశీలిస్తుంది. బ్రిటిషు ఇండియాలోని ప్రాతినిధ్య సంస్థల అభివృద్ధిని గురించీ విద్య గురించీ ఇతర విషయాలను గురించీ దర్యాప్తు జరిపి బాధ్యతాయుత ప్రభుత్వ సూత్రానికి అంగీకరించవచ్చునా ఎంతమేరకు అంగీకరించవచ్చు. లేకపోయినట్టయితే బ్రిటిష్ ఇండియాలో అప్పట్లోవున్న బాధ్యతాయుత ప్రభుత్వాన్ని విస్తృతపరచడమా, సవరించడమా లేక పరిమితం చేయడమా అన్న విషయాల గురించి శిఫార్సులు చేస్తుంది. స్థానిక శాసనసభలకు రెండవసభను ఏర్పాటు చేయడం మంచిదా అన్న విషయాన్నికూడా సంఘం పరిశీలిస్తుంది.

భారతీయుల వైఖరి

ఈ ప్రకటనపట్ల భారతీయులు నిరసన తెలియచేశారు. కొన్ని సంవత్సరాలుగా భారతదేశంలో వ్యాపించివున్న స్తబ్దత పటాపంచలైంది.

ప్రకటన జరిగినపుడు లండన్‌లోవున్న మోతీలాల్ నెహ్రూ, ఇది వుత్త ఓదార్పు మాత్రమేనని అభిప్రాయపడ్డారు. సంఘంలో ఒక్క భారతీయుడు కూడా లేకపోయినందుకు ఉదారవాది నాయకులైన సర్ టి. బి. సప్రు చాలా విచారించారు. అంటే బ్రిటిషు ప్రభుత్వానికి భారతీయుల్లో విశ్వాసం లేదన్నమాట. భారతీయ ఉదారవాదులు ఇది అవమానంగా భావించారు.[31] 1886 లో పబ్లిక్ సర్వీస్ కమీషన్‌ను ఏర్పాటు చేసినప్పటి నుంచీ ఉదారవాదులు దాదాపు అన్ని కమిషన్లలోనూ సంఘాల్లోనూ పని చేశారు. పహదేశ భక్తులు తీవ్రంగా విమర్శించినప్పటికి ప్రభుత్వంతో సహకరించారు. అయినప్పటికీ ఈ ముఖ్యమైన సందర్భంలో వారిని పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. డిశంబరులో బొంబాయిలో జరిగిన ఉదారవాదుల జాతీయసమాఖ్య పదవ సమావేశంలో సప్రు మాట్లాడినపుడు ఆయన ఎంత బాధపడినదీ వ్యక్తమైంది. "పురుగు కూడా ఒక్కొక్కప్పుడు తిరగబడుతుంది" అంటూ ఆయన కమిషన్‌ను బహిష్కరించాలని చెప్పారు.[32] కమిషన్‌తో ఉదారవాదుల సమాఖ్య ఏ సందర్భంలోనూ ఏ రూపంలోనూ ఎటువంటి సంబంధమూ పెట్టుకోరాదని నిశ్చయించారు. హిందూ మహాసభ కూడా ఇదే విధంగా అభిప్రాయపడింది. కాంగ్రెసుతప్ప మిగతా అన్ని రాజకీయపార్టీల నాయకుల సంతకాలతో, కమిషన్‌ను గర్హిస్తూ ఒక ప్రకటన వెలువడింది.

డిశంబరులో కాంగ్రెసు వార్షిక సమావేశం మద్రాసులో జరిగింది. సమావేశానికి డాక్టర్ అన్సారి అధ్యక్షత వహించారు. ఈపాటికి జవహర్‌లాల్‌నెహ్రూ యూరోపు

పర్యటన ముగించుకొని తిరిగి వచ్చారు. బ్రసెల్స్‌లో అణచివేయబడిన జాతుల మహా సభకు హాజరై వచ్చారు. సోవియట్ యూనియన్ కూడా సందర్శించి వచ్చారు. సోవియట్ ప్రభుత్వం వివిధ రంగాల్లో సాధించిన అభివృద్ధి ఆయన్ను ఎంతగానో ముగ్ధులను చేసింది. భారతదేశంలోకూడా యువజనుల కార్మికుల-కర్షకుల సంస్థలు ఉద్యమాలూ ప్రగతిని సాధించాయి. మద్రాసు కాంగ్రెసు చర్చల్లో వీటన్నిటి ఫలితం కనిపించింది. ఈ కాంగ్రెసుకు గాంధీజీ హాజరుకాలేదు.

కాంగ్రెసు చరిత్రలో మొదటిసారిగా భారతీయులలక్ష్యం "పూర్తి స్వాతంత్ర్య"మని తీర్మానరూపంలో ప్రకటించారు. అంతకు ముందు అంతా తీర్మానాల్లో పేర్కొంటూ వచ్చిన "డొమినియన్ ప్రతిపత్తి" లేదా "బాధ్యతాయుత ప్రభుత్వము" లేదా అస్పష్ట మైన "స్వరాజ్ "కాకుండా ఇది కొత్త పరిణామమన్నమాట.

చట్టపరమైన సంఘం విషయంలో (సైమన్ సంఘం) భారతదేశపు స్వయం నిర్ణయ హక్కును త్రోసిరాజని ఈ సంఘాన్ని నియమించినట్లు కాంగ్రెసు ప్రకటించింది. ఆత్మాభి మానమున్న భారతీయులకు మిగిలివున్న ఏకైక మార్గం, సంఘాన్ని ప్రతిఘట్టంలోనూ ప్రతిరూపంలోనూ బహిష్కరించడమేనని తీర్మానించారు. సంఘం భారతదేశానికి చేరు కునే రోజున పెద్దపెట్టున్న ప్రదర్శనలు జరుపవలసిందని కాంగ్రెసు, ప్రజలను కోరింది.

సైమన్ సంఘం విషయంలో ముస్లిం మత వర్గాల అభిప్రాయం ఒకటిగా లేదు. 1927 డిశంబరు ఆఖరునాటికి అఖిల భారత ముస్లింలీగ్ రెండు వర్గాలుగా చీలిపోయింది. ఒక వర్గానికి సర్ మొహమ్మద్ షఫీ నాయకులు. ఈయన వైస్‌రాయ్ కార్యవర్గ సమి తిలో సభ్యులుగా పనిచేశారు. రెండవ వర్గానికి జిన్నా నాయకులు. షఫీ నాయకత్వం లోని వర్గంవారు, లీగ్ వార్షిక సమావేశాన్ని లాహోర్‌లో జరుపుతున్నారు. జిన్నా వర్గం వారు కలకత్తాలో జరుపుతున్నారు. లహోర్‌లో సమావేశం జరిపినవారు, కమిషన్‌తో సహకరించేందుకు నిశ్చయించుకున్నారు. మిగత భారతీయపార్టీలతో చర్చలకు ప్రాతిపది కగా పనిచేయగల రాజ్యాంగముసాయిదా తయారు చేసేందుకు ఒక సంఘాన్ని కూడా నియమించారు. చివరకు దీన్ని సైమన్ సంఘానికి నివేదించాలని అనుకున్నారు.

జిన్నా అధ్యక్షతన కలకత్తాలో జరిగిన సమావేశంలో భిన్నమైన మార్గాన్ని త్రొక్కారు. "జలియన్‌వాలాబాగ్ భౌతికమైన కసాయిపని. సైమన్‌సంఘం, మన ఆత్మనే కుదమట్టిస్తుంది" అని జిన్నా తమ అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు. 33 సంఘాన్ని బహిష్కరించాలని సమావేశంలో తీర్మానించారు. అంటే భారతీయ నాయ కుల్లో ప్రముఖులు చాలా మంది, సైమన్ సంఘాన్ని బహిష్కరించాలనే అభిప్రాయ పడ్డారు. ఫలితంగా దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తమైంది.

## మళ్ళీ పాత యుక్తులు

మార్లే-మింటో సంస్కరణలను ప్రవేశపెట్టే ముందూ, మాంటేగు ఛెమ్స్ఫర్డ్ సంస్కరణలను ప్రవేశ పెట్టే ముందూ. భారతీయుల్లో కొంతమందిని తమకు అనుకూలంగా చేసుకుని భారతీయుల సమగ్రతను విచ్ఛిన్నం చేసేందుకు ఎటువంటి ప్రయత్నాలు జరిగి నదీ మనం చూశాము.

మళ్ళీ అవే యుక్తులు పన్నడం ప్రారంభించారు : విభజించి పాలించు అన్న యుక్తి భారతదేశానికి సంబంధించిన మంత్రి లార్డ్ బర్కెన్ హెడ్. 1925 నుంచీ ఈవిధంగా ఆలోచిస్తూ వచ్చారు. భారతీయ రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించి లేబర్ ప్రభుత్వం రాయల్ కమిషన్‌ను ఎక్కడ నియమిస్తుందో నన్న భయంతో. లార్డ్ బర్కెన్ హెడ్ 1927 వేసవిలోగా ఒక సంఘాన్ని నియమించాలని 1925 లో నిశ్చయించు కున్నారు. కాని ఈ నిర్ణయం ఎందుకు తీసుకున్నట్టు ? కొంతమంది స్వరాజ్యవాదులను తమవైపుకు తిప్పుకోవడానికీ జాతీయవాదుల్లో చీలిక కల్పించేందుకూ. బర్కెన్ హెడ్ 1925 డిశంబరు 10 వ తేదీన వైస్‌రాయ్‌కి వ్రాస్తూ తాము ఏమనుకుంటున్నదీ వెల్లడి చేశారు: 1927 వేసవిలోపున సంఘాన్ని నియమించడం అవసరమని నేను గట్టిగా భావిస్తు న్నాను. ఏ సందర్భంలోనైనా దీన్ని బేరసారాలకు ఉపయోగించదలచుకున్నా లేదా స్వరాజ్య పార్టీని మరింత విచ్ఛిన్నం చేయడానికి ఉపయోగించదలచుకున్నా నాకు సలహా ఇవ్వండి ...[34]

ఈ సమయంలోనూ ఆ తర్వాతా స్వరాజ్యపార్టీలో చీలిక పెద్దదై ఆఖరుకు రెస్పాన్సివ్ కో ఆపరేషన్ పార్టీ ఏర్పాటుకు దారితీసిందన్న సంగతి విస్మరించడానికి లేదు.

బ్రిటిష్‌వారు తమ ప్రయత్నాలను కొనసాగిస్తూనే వచ్చారు. సైమన్ సంఘం నియమితమైనపుడు, సంఘం భారతదేశానికి మొదట వచ్చినపుడు ఎంచుకున్న కొంత మందినీ కొన్ని బృందాలనూ మాత్రమే కలుసుకోవాలని భారతదేశానికి సంబంధించిన మంత్రి చాలా ఆదుర్దాపడ్డారు. ఈ సందర్భంలోకూడా వారి ఉద్దేశ్యం స్పష్టంగా తెలిసి పోయింది. 1928 వ జనవరి 19 వ తేదీన, సంఘానికి వీడ్కోలు చెప్పేముందు బర్కెన్ హెడ్ కొత్త వైస్‌రాయ్ అర్విన్‌కు ఈ విధంగా వ్రాశారు:

> బహిష్కరించే విధానాన్ని పడగొట్టేందుకు, ఈ విధానాన్ని అనుసరించని ముస్లింల మీద ఎప్పుడూ ఆధారపడ్డాం. అణగారివున్న ప్రజలమీదా వాణిజ్య వర్గాలమీదా ఇత రులు చాలామంది మీదా ఆధారపడ్డాం. ప్రతిఘటన ఉద్యమంలో చీలిక ఏర్పర చేందుకు ప్రస్తుత సమయంలో ప్రయత్నించడమన్నది మీరూ సైమన్ నిర్ణయించు కోవలసిందే."[35]

సైమన్ సంఘం భారతదేశం చేరుకున్నపుడు వెనక్కు వెళ్ళిపోవలసిందని కోరుతున్న పోస్టర్లు, నల్లజెండాలు చూచి, భారతదేశానికి సంబంధించిన మంత్రి నిరాశ చెందారు. మామూలు ప్రజానీకమేకాక చాలా మంది రాజకీయ నాయకులుకూడా మామూలుగా వ్యవహరించడంలేదు. ముఖ్యంగా జిన్నాకు గుణపాఠం నేర్పవలసివుంది. ఆయన 1928 ఫిబ్రవరిలో వైస్‌రాయ్‌కి ఈ విధంగా వ్రాశారు

సంఘంతో తమకేమీ సంబంధంలేదన్న తమ నిర్ణయంలో మార్పులేదని భారత రాజకీయ పార్టీలు మూడింటికీ చెందిన ప్రముఖులు చేసిన ప్రకటన నిజంగా నిరాశాజనకంగా వుంది. సైమన్, సంఘాన్ని బహిష్కరించని ప్రముఖులందరినీ ముఖ్యంగా ముస్లింలూ అణగారివున్నవర్గాల వారినీ ప్రతిఘట్టంలోనూ కలుసుకోవడం మంచిది. ముస్లింల ప్రతినిధులతో ఆయన జరిపే ఇంటర్వ్యూలను నేను బాగా ప్రచారం చేస్తాను. విధానం ఇప్పుడు స్పష్టంగా తేలిపోయింది : కమిషన్‌ను ముస్లింలు వశపరచుకున్నారనీ, హిందూవులకు పూర్తిగా వ్యతిరేకమైన నివేదిక సమర్పించవచ్చుననీ హిందువుల్లో భయాందోళనలు కల్పించి ముస్లింల మద్దతును సంపాదించి జిన్నాను ఏకాకిని చేయడం."36

భారతదేశానికి సంబంధించిన మంత్రి ఊహలు వృధాపోలేదని. ఆ తరాతి సంఘటనలవల్ల తెలిసింది.

## సైమన్ సంఘాన్ని బహిష్కరించండి : శాసనసభ తీర్మానం

సైమన్ సంఘం, 1928 ఫిబ్రవరి 3వ తేదీన బొంబాయి చేరుకుంది. దేశమంతా వేడెక్కింది. దేశమంతటా హర్తాళ్‌లూ, ప్రదర్శనలూ జరిగాయి. బొంబాయిలో కార్మికులు సమ్మె జరిపి, తాముకూడా రాజకీయశక్తిగా పనిచేయగలమని నిరూపించారు. "సైమన్ వెనక్కు వెళ్లు" అన్న నినాదంతో కమిషన్‌కు స్వాగతం చెప్పారు. దేశమంతటా ఈనినాదంతో ప్రతిధ్వనించింది. శాసనసభలో కూడా దీని ప్రతిధ్వని వినిపించింది.

ఫిబ్రవరి 16వ తేదీన జాతీయవాదపార్టీ నాయకుల్లో ఒకరైన లాలా లజపత్‌రాయ్ శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. ప్రస్తుత రాజ్యాంగమూ, చట్టబద్ధమైన సంఘమూ సభవారికి ఏమాత్రం ఆమోదయోగ్యంకాదనీ అందువల్ల సభవారు సంఘంతో ఏ ఘట్టంలోనూ ఎటువంటి సంబంధమూ పెట్టుకోబోరనీ బ్రిటిషు ప్రభుత్వానికి తెలియచేయవలసిందని ఈ తీర్మానంలో గవర్నర్ జనరల్‌నూ ఆయన సమితినీ కోరారు.

తమ అభిప్రాయాలను వివరిస్తూ లజపత్‌రాయ్, సంఘాన్ని నియమించిన ప్రజలలో గాని, ప్రభుత్వంలోగాని తమకు విశ్వాసం లేదనీ, అందువల్ల ఈ సంఘపు ఔచిత్యంలో

కూడా తమకు విశ్వాసం లేదనీ చెప్పారు. "ఈ సంఘం చేయకలిగినదంతా, ఇక్కడి అధికార్లు ఏం చేస్తారో దాన్ని రికార్డు చేసుకోవడంతప్ప ఇంకేమీ ఉండబోదు. ఆ తర్వాత ఇంగ్లండు వెళ్ళి అక్కడ మరికొందరి సలహాతో తమ శిఫార్సులను రికార్డు చేస్తారు" అన్నారాయన. ఏ దేశ ప్రజలైనా తమను తాము పరిపాలించుకుంటామని కోరుతున్నపుడు ఆ వివాదాన్ని పరిష్కరించేందుకు ఏదైనా ఒక సంఘం అర్హత ఏ విధంగా కలిగివుంటుందని ఆయన ప్రశ్నించారు.

అయితే ఈ విషయంలో బ్రిటిషు పార్లమెంటు బాధ్యతను ఆయన నిరాకరించలేదు. అయినా ఆయన పార్టీ కోరినదల్లా, భారతదేశపు సమస్యను రెండు దేశాలూ సామరస్యంతో, అవగాహనతో రెండు దేశాల ప్రయోజనాలకు అనుగుణంగా, రెండు పక్షాలకు ఆమోదయోగ్యమైన ఒక అంగీకారం ప్రాతిపదికగా పరిష్కరించాలనే. అటువంటి పరిష్కార మార్గానికి పార్లమెంటు ఆమోదం ఎప్పుకుండా లభిస్తుందని ఆయన అన్నారు.

బ్రిటిషువారిని విశ్వసించవద్దని లజపత్‌రాయ్ ముస్లింలను కోరారు. "బెంగాల్ విభజన మరిచిపోవద్దు సెవ్రెస్ ఒప్పందం గుర్తుంచుకోండి. ఈ ప్రభుత్వంచేసే వాగ్దానాలు మీకు సహాయపడవు. అణగారిపోయి బానిసలుగా బతుకమని ఇస్లాం బోధించడం లేదు. మీరుకూడా పోరాటంలో పాల్గొనండి.[37] అని ఆయన ఉద్బోధించారు.

ముస్లింసభ్యుల నాయకులైన నవాబ్ సర్ జుల్ఫికర్ అలీఖాన్ దీనికి భిన్నంగా వ్యవహరించారు. లజపత్‌రాయ్ తీర్మానానికి ఒక సవరణను ప్రతిపాదించారు. సవరణలో ఈ విధంగా వుంది :

> "భారతీయ చట్టబద్ధమైన సంఘం సూచించే పథకాన్ని ఈ శాసనసభ పరిశీలిస్తుందని గవర్నర్ జనరల్ ఆయన సమితీ బ్రిటిష్ ప్రభుత్వానికి తెలియచేయగలరని ఈ శాసనసభ శిఫార్సుచేస్తూవుంది."

చాలామంది సభ్యులు అంతరాయం కలిగిస్తూవుండగా, సంఘాన్ని తాము ఎందుకు సమర్థిస్తున్నామో, జుల్ఫికర్ అలీఖాన్ వివరించారు. భారతదేశంలోని అధిక సంఖ్యాకులు అల్పసంఖ్యాకులకు వారి హక్కులను నిరాకరించారన్నది ఆయన పేర్కొన్న ముఖ్య అంశాల్లో ఒకటి. సభ్యులు వాగ్వివాదాలకు దిగారు. కొంతమంది ఒక తీర్మానాన్ని మరికొందరు మరొక తీర్మానాన్ని సమర్థించారు.

కాంగ్రెసుపార్టీ (స్వరాజ్య) ఉపనాయకులైన శ్రీనివాసయ్యంగార్ లజపత్‌రాయ్ తీర్మానాన్ని సమర్థిస్తూ, తమ రాజ్యాంగాన్ని తామే నిర్ణయించుకునే హక్కు భారతీయులకుందని ఉద్ఘాటించారు. భారతదేశానికి సంబంధించిన మంత్రి ప్రతిపాదనలోని భావం,

భారతీయులకు స్వరాజ్యాన్ని నిరాకరించడమేనని చెప్పారు. "భారతీయుల్లో విశ్వాసం లేకపోవడమే ఈ సంఘం ఏర్పాటుకు కారణం. నిజానికి ఇది, భారతీయులను అవమానించడమే" అంటూ శ్రీనివాసయ్యంగార్ లజపత్‌రాయ్ తీర్మానానికి అనుకూలంగా ఓటు చేయవలసిందని, సభ్యులను కోరారు.39

భారతీయనాయకులు సహకరిస్తామన్నా ప్రభుత్వం ఏవిధంగా త్రోసిపుచ్చినదీ ఎం. ఆర్. జయకర్ పేర్కొన్నారు. సంఘంలో భారతీయులను సభ్యులుగా నియమించేందుకు 1919 వ సంవత్సరపు చట్టం కింద తమకు అధికారంలేదన్న ప్రభుత్వవాదనను ఆయన అంగీకరించలేదు. లజపత్‌రాయ్ తీర్మానాన్ని సమర్థిస్తూనే కాంగ్రెసుపార్టీ వైఖరికి కొంచెం భిన్నంగా మాట్లాడారు. ప్రభుత్వంతో పూర్తిగా సహకరించబోమని ఆయన అనలేదు. అప్పుడు ఏర్పాటైన సంఘంతోనూ, అది పనిచేస్తున్న తీరుకు ప్రాతిపదికగా వున్న పథకంతోనూ మాత్రమే తాము సహకరించబోమని ఆయన స్పష్టం చేశారు. 40

ప్రభుత్వం పిటిషనర్లను మాత్రమే తృప్తిపరచాలని కోరుతూ వుందని జిన్నా వెటకారంగా మాట్లాడారు. (పంజాబు భూస్వాముల ప్రతినిధి అయిన మహమ్మద్ నవాజ్ ఖాన్‌ను కూడా వీరిలో చేర్చారు జిన్నా) పిటిషనర్లు ప్రభుత్వంతో ఈవిధంగా అన్నారని జిన్నా హేళన చేశారు."మీరు ఏం చేసినా అది సబబుగానే వుంటుంది. మీరు చివరకు ఏం నిర్ణయించుకున్నా నాకు కొంత ముట్ట చెప్పండి. నేను మీ మనిషిని. నేను ఇంకేమీ చేయలేను" (కొంతమంది ముస్లిం సభ్యులు దీనికి అభ్యంతరం చెప్పారు.) 41

జిన్నా ఆ తర్వాత, జుల్ఫికర్ అలీఖాన్ ప్రాతినిధ్యం వహిస్తున్న బృందం గురించి ప్రస్తావించారు. ముస్లింలకు ఈ సందర్భంలో పెద్ద మూట లభించబోతూవుందని ఈ బృందం అభిప్రాయపడుతున్నట్టు జిన్నా అన్నారు. ఆయన వారిని ఈవిధంగా ప్రశ్నించారు "గత మూటయాభై సంవత్సరాల అనుభవం వల్ల మీరు మోసపోయినట్టు తెలుసుకోలేక పోయారా? " 42

దర్యాప్తు విషయంలో భారతీయ ప్రతినిధులకు సమానహోదా అధికారాలూ ఉంటే తప్ప ఎటువంటి సంఘాన్ని తాము ఆమోదించేదిలేదని జిన్నా స్పష్టంగా చెప్పారు.

అణగారిపోయివున్న వర్గాల ప్రతినిధిగా ఎన్నిక అయిన రావు బహదూర్ ఎం. సి. రాజా, లజపత్‌రాయ్‌ని వ్యతిరేకించారు. జుల్ఫికర్ అలీఖాన్ సవరణను సమర్థించారు. అణగారి వున్న ప్రజల అభివృద్ధికి పై తరగతివారు అవరోధంగా వున్నందువల్ల ప్రభుత్వం అణగారి వున్న ప్రజలకు ఎక్కువ చేయలేకపోతున్నదని ఆయన వాదించారు. 43

ఫిబ్రవరి 18వ, మోతీలాల్‌నెహ్రూ, మదనమోహన్ మాలవ్యా, టి. సి. గోస్వామి, పురుషోత్తమదాసు ఠాకుర్‌దాసు, సి. యస్. రంగఅయ్యర్ ఇతరులు చాలామంది లజపత్

రాయ్ తీర్మానాన్ని సమర్థించారు. అవతలిపక్షంవారికి కూడా మంచి మద్దతు లభించింది. ఎ. సుహ్రావర్దీ, మొహమ్మద్ నవాబ్ ఖాన్‌వంటివారు వారిని సమర్థించారు.

మోతీలాల్‌నెహ్రూ మాట్లాడుతూ, 1924, 1925 లో ప్రభుత్వంతో సహకరించేందుకు తాము సిద్ధపడి, రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించి రాజీ ప్రతిపాదనలను సమర్పించిన సంగతి గుర్తుచేశారు. కాని ప్రభుత్వం వాటిని త్రోసిపుచ్చింది. ప్రస్తుతం కాంగ్రెసు పూర్తి స్వాతంత్ర్యం కావాలని కోరుతూవుంది. కాని దానికిముందు కొన్ని మార్పులు జరుగవలసి వుంది. ఈ ఉద్దేశ్యంతోనే ప్రభుత్వం రాజ్యాంగం విషయమై సంయుక్త నిర్ణయాలు తీసుకునేందుకు సిద్ధంగావుంది. ఆయన ఆతర్వాత ఈమాటలన్నారు:

"అందువల్ల రాజ్యాగంగురించి బయటివారితోకూడిన సంఘంతో సంప్రదించాలని మా పార్టీ అనుకోవడంలేదు, ఆసంఘం ప్రయోజనాలకు సంబధించితప్ప దానికి మేము సిద్ధంసే. బ్రిటిషువారి ప్రయోజనాల రక్షణకు సంబంధించిగాని దేశంలోని ఇతర ప్రయోజనాలకు సంబంధించిగాని ఏర్పాట్లు చేసుకోవడానికి మాకు అభ్యంతరంలేదు. దానికిమించి, పూర్తి స్వాతంత్ర్యం మాహక్కు[44]"

భారతీయుల అభిప్రాయాలకూ బ్రిటిషువారి అభిప్రాయాలకూ పొత్తుకుదిర్చేందుకు ప్రయత్నించడం వృథాప్రయాస అని మోతీలాల్‌నెహ్రూ ముగించారు. భారతదేశం, బ్రిటిషు ప్రభుత్వ సహాయంతోగాని పార్లమెంటుద్వారాగాని స్వాతంత్ర్యాన్ని సంపాదించలేదనీ తన స్వశక్తితో కృతనిశ్చయంతో మాత్రమే సాధించుకుంటుందనీ ఆయన పేర్కొన్నారు.

చర్చసందర్భంగా ప్రభుత్వానికిచెందిన ప్రముఖులు కొందరు ఇండిపెండెంట్లను మంచిచేసునేందుకు అన్నివిధాలా ప్రయత్నించారు. ఆర్థిక సభ్యుడు ముఖ్యంగా జిన్నాను మంచిచేసుకుందామని ప్రయత్నించారు. జిన్నా, పండిత మోతీలాల్ వలలో పడటమేకాక పూర్తిగా ఆయనవశమై పోయారని ఆర్థిక సభ్యుడు వెటకారంగా అన్నాడు. "జిన్నా. పాలెగూడులో చిక్కుకున్నారు.[45] సాలెపురుగు (కాంగ్రెసు) ఆకలిగానే వుండవచ్చు కాని ఈగ (జిన్నా) అంత అవసరపడటమెందుకు?"[46] అని ఆయన ప్రశ్నించారు.

కాని ఈపాచిక పారలేదు. జిన్నా సరసంగా సమాధానం చెప్పారు: "మీతో చేరినదానికంటే వీరితో (ప్రతిపక్షం) చేరినందువల్ల నష్టం తక్కువ కనుక"[47]

రెండురోజుల చర్చతర్వాత సభలో ఓటింగ్ జరిగింది. రెండుపక్షాలమధ్యా పోటీ తీవ్రంగా జరిగింది. తీర్మానంపట్ల సభ్యులు ఎంత ఉత్సాహం కనబరిచారంటే, ఒక సభ్యుడు

అనారోగ్యంగావున్నా, ఓటుచేయడానికి కరాచినుంచి వచ్చాడు. ఓటుచేసేలోపున దురదృష్ట వశాత్తూ మరణించాడు. లెఖ్ఖపెట్టినంతసేపూ అందరూ ఎంతో ఆదుర్దాతో ఎదురు చూశారు. లజపత్‌రాయ్‌తీర్మానం 68 ఓట్లతో నెగ్గినట్లు ప్రకటించారు. ప్రతికూలంగా 62 ఓట్లు పడ్డాయి. సభలో ఇంత పెద్ద విభజన జరగడం ఇది రెండవసారి. సభ అంతా 'వందే మాతరం' అన్న నినాదంతో ప్రతిధ్వనించింది.

సైమన్‌సంఘ ప్రతిఘటన అంతటితో ముగియలేదు. 1928 మార్చి 13 వ తేదీన సాధారణ బడ్జెటుకింద, వివిధ రకాల పద్దులను ఆర్థిక సభ్యుడు ప్రతిపాదించినపుడు. మొత్తాన్ని కొంత తగ్గించవలసిందని మోతీలాల్‌నెహ్రూ ప్రతిపాదించారు. సభవారు ఫిబ్రవరి 18 వ తేదీన ఆమోదించిన తీర్మానానికి తమ తీర్మానం అనుగుణంగా వుందని ఆయన పేర్కొన్నారు. మాలవ్యా, ఎం. కె. ఆచార్య, మున్షి ఈశ్వర్‌సరన్, జిన్నా. ఇతరులు చాలామంది, నెహ్రూ తీర్మానాన్ని బలపరిచారు. సంఘాన్ని నియమించినవారే అనగా బ్రిటిష్‌ప్రభుత్వం సంఘం ఖర్చు భరించాలని మాలవ్యా అన్నారు. చివరకు ఓటింగ్ జరిగింది. నెహ్రూతీర్మానం 66 ఓట్లతో నెగ్గింది. తీర్మానానికి ప్రతికూలంగా 59 ఓట్లు పడ్డాయి. ప్రభుత్వం ఈవిధంగా చిత్తుగా ఓడిపోవడం భారతీయులకు ఎంతో ఆనందాన్ని కలిగించింది.

లాలాలజపత్‌రాయ్ మరణం : శాసనసభలో ప్రతిధ్వని

1928 పొడవునా సైమన్ సంఘం ప్రతిఘటన, దానికి సంబంధించిన ఇతర విషయాలూ భారతరాజకీయ ఉద్యమంలో ప్రధానపాత్ర వహించాయి. సంఘం, అక్టోబరులో భారతదేశానికి తిరిగి వచ్చింది. దీనితో ప్రతిఘటన ఉద్యమం మరింత తీవ్రమైంది. ప్రదర్శకులను అణిచివేయడంలో పోలీసులు కఠినతరమైన చర్యలకు దిగారు. సంఘం అక్టోబరు 30 వ తేదీన లాహోర్ చేరుకున్నపుడు. లజపత్‌రాయ్ నాయకత్వంలో నల్ల జెండా ప్రదర్శన ఒకటి జరిగింది. పోలీసులు లాఠీచార్జి చేశారు, లజపత్‌రాయ్‌కి ఛాతీమీద తీవ్రమైన గాయాలు తగిలాయి, ఆయన నవంబరు 17 వ తేదీన పరమపదించారు. దేశమంతటా కోపోద్రేకాలు మిన్నుముట్టాయి. "సంఘం రక్తవర్షంతో ముందుకు సాగుతోంద"ని గాంధీజీ ఆ తర్వాత వర్ణించారు. 48

1929 లో శాసనసభ బడ్జెట సమావేశం ప్రారంభమైనపుడు ఫిబ్రవరి 15 న, లజపత్‌రాయ్ మరణానికి సంబంధించి పండిత ద్వారకాప్రసాద్ మిశ్ర శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. లజపత్‌రాయ్ మరణానికి దారితీసిన పరిస్థితుల గురించి లేబర్‌పార్టీ సభ్యులొకరు అడిగిన ప్రశ్నలకు భారతదేశానికి సంబంధించిన ఉపమంత్రి ఎర్ల్ వింటర్‌టన్ ఇచ్చిన అవమానకరమైన సమాధానానికి తీర్మానంలో తీవ్ర నిర

సన తెలియచేశారు. పోలీసుల దెబ్బలవల్ల తగిలిన గాయలతో లజపత్‌రాయ్ మరణించా రని పంజాబు ప్రభుత్వం నియమించిన బాయడ్ సంఘం జరిపిన దర్యాప్తు ఉత్త బూటక మనీ తీర్మానంలో పేర్కొన్నారు. ఈ సంగతినంతా భారతదేశానికి సంబంధించిన మంత్రికి తెలియాచేయవలసిందని తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు శిఫార్సు చేశారు.

లజపత్‌రాయ్ మీద దాడిగురించీ ఆయన మరణం గురించీ వచ్చిన ఆరోపణల గురించి దర్యాప్తు జరిపేందుకు శాసనసభ్యులు కొంతమందితో ఒక సంఘాన్ని నియ మించవలసిందని గవర్నర్ జనరల్‌కు శిఫార్సుచేస్తూ మున్షి ఈశ్వర్ సరన్ ఈ తీర్మా నానికి ఒక సవరణను ప్రతిపాదించారు.

పడింత మదనమోహన్ మాలవ్యా, లాలా హంసరాజ్ ఆనాటి తమ అనుభవాలను వర్ణించారు. పంజాబు ప్రభుత్వం జరిపించిన నిష్పాక్షిక దర్యాప్తువల్ల, పోలీసులు తమ ఆదేశాలకు లోబడి వ్యవహరించినట్టూ మాలవ్యా గాని హంస్‌రాజ్‌గాని ఏమీ నిరూ పించలేక పోయినట్టూ తేలిందని బ్రిటిషు సభ్యుడు క్రేరర్ అన్నారు. అధికారేతర కేసు, రాజకీయ ప్రదర్శన మాత్రమేనని ఆయన వాదించారు.

జిన్నా, జయకర్, బ్రిటిషు సభ్యుడి ఉపన్యాసాన్ని గట్టిగా వ్యతిరేకించారు. స్వతంత్ర మైన దర్యాప్తు బహిరంగంగా జరగాలని కోరారు. కేసు అంటూ ఏదీ లేదని బ్రిటిష్ సభ్యుడివాదనను మోతీలాల్ నెహ్రూ ఖండించారు. మాలవ్యా, హంస్‌రాజ్ వర్ణించిన ఆనాటి సంఘటనల గురించి ప్రస్తావిస్తూ ఆయన, అవి నిజమేఅయితే ఆవేళ జరిగి నది హత్య తప్ప మరొకటి కాదని చెప్పారు. దర్యాప్తు జరిపించేందుకు ప్రభుత్వం సందేహిస్తున్నట్టయితే, జయకర్ పేర్కొన్నట్టు ప్రభుత్యం మర్యాద అన్నదాన్ని పూర్తిగా ఒదులుకున్నట్టే చెప్పవచ్చునని అన్నారు.

ఈశ్వర్ సరన్ సవరణ మీద ఓటింగ్ జరిగింది. ప్రభుత్వం వ్యతిరేకించినప్పటికీ 57 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 45 ఓట్లు పడ్డాయి.

## నెహ్రూ నివేదిక

కొన్ని సంవత్సరాలముందు అంటే 1925 జూలై 7 వ తేదిన బిర్కెన్‌హెడ్, భారతీయులను సవాలు చేశారు: "భారతదేశపు గొప్ప ప్రజల్లో కొంత మేరకైనా అంగీ కారయోగ్యమైన రాజ్యాంగాన్ని రూపొందించవలసిందని" 49 సైమన్ సంఘపు నియా మకాన్ని ప్రకటించే సమయంలో, భారతీయులను ఈ సంఘంలో ఎందుకు నియమించ లేదో వివరించేటపుడూ ఆయన, భారతీయుల్లో మతపరమైన విభేదాలవల్ల, సంఘం లోని భారతీయ సభ్యులు ఒక హిందూ నివేదికనో లేక ముస్లిం నివేదికనో లేక మరే ఇతరమైన నివేదికనో తయారుచేసి వుండేవారని వాదించారు.

ఎగతాళిగా చేసినదే అయినా ఈ వ్యాఖ్యను భారతీయులు సవాలుగా తీసుకున్నారు. మద్రాసు కాంగ్రెసులో (1927 డిశంబరు) ఈవిషయమై ఆలోచించారు. ఇతర పార్టీలా బృందాలతో సంప్రదించి ఒక రాజ్యాంగం ముసాయిదాను తయారు చేయవలసిందని కార్యవర్గాన్ని ఆదేశించారు. ఈ నిర్ణయానికి అనుగుణంగా 1928 డిశంబరులో ఢిల్లీలో అఖిలపక్ష మహాసభ ఒకటి జరిగింది. మళ్ళీ మే నెలలో బొంబాయిలో జరిగింది. రాజ్యాంగాన్ని తయారు చేసేందుకు పండిత మోతీలాల్‌నెహ్రూ అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించింది.

ప్రముఖ ఉదారవాదులూ, రాజ్యాంగవాదులూ సభ్యులుగా వున్న ఈ సంఘం, అనేక సమస్యలను ఏదుర్కోవలసి వచ్చింది. వీటిలో ప్రధానమైనది మతవిభేదాలూ, దానికి అనుబంధమైన ఓటర్లు. సంఘం తన నివేదికను అగస్టులో సమర్పించింది. దీన్ని నెహ్రూ నివేదిక అని వ్యవహరించారు. వెంటనే డొమినియన్ ప్రతిపత్తి కావాలనీ స్వాతంత్ర్యం కావాలని కోరేవారు, తమ ప్రచారాన్ని కొనసాగించవచ్చుననీ నివేదికలో పేర్కొన్నారు. పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వం ఏర్పాటు కావాలనీ ప్రజాప్రతినిధులతో కూడిన శాసనసభకు పూర్తి ప్రాథమిక హక్కులుండాలనీ, ప్రభుత్వం, అటువంటి శాసనసభకు జవాబుదారీగా వుండాలనీ కోరారు.

సింద్ ఆర్థిక పరిస్థితి గురించి పూర్తిగా తెలుసుకున్న తర్వాత విడి రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని శిఫార్సు చేశారు. వాయవ్య సరిహద్దు రాష్ట్రంతో పాటు అన్ని రాష్ట్రాల్లోనూ శిఫార్సు చేసిన ప్రభుత్వాలను ఏర్పాటు చేయాలని సూచించారు. కేంద్ర శాసన సభకు (ప్రతినిధులసభ) ముస్లింలు అల్ప సంఖ్యాకులుగా వున్న రాష్ట్రాల్లో వారికీ, వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో ముస్లిమేతరులకూ తప్ప స్థానాలను ఎవరికీ ప్రత్యేకంగా కేటాయించరాదని సూచించారు. ఆవిధంగా చేసే సందర్భాల్లో కూడా, అల్ప సంఖ్యాకుల జనాభాకు తగినట్టు ఉండాలని చెప్పారు. అయితే ఈ అల్ప సంఖ్యాకులు అదనపు సీట్లకోసం పోటీ చేయవచ్చుకూడా.

రాష్ట్రాలకు సంబంధించినంతవరకూ, పంజాబ్‌లోనూ బెంగాల్‌లోనూ, ఏ మతానికి చెందినవారికీ స్థానాలను కేటాయించరాదని సంఘం శిఫార్సు చేసింది. మిగత రాష్ట్రాల్లో, ముస్లిం. అల్ప సంఖ్యాకులకు స్థానాలను కేటాయించవచ్చు. వారు అదనపు సీట్ల కోసం పోటీ చేయవచ్చు కూడా. వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోముస్లిమేతరులకు ఇదే విధమైన సౌకర్యాలుంటాయి. అన్ని సందర్భాల్లోనూ ఈ కేటాయింపు అన్నది పదేండ్లు మాత్రమే జరుగుతుంది.

అగస్టులో లక్నోలో జరిగిన అఖిలపక్ష సమావేశంలో నెహ్రూ నివేదికను పరిశీలించారు. సమావేశానికి ఇతరులతోపాటు కాంగ్రెసు లిబరల్ ఫెడరేషన్-ముస్లింలీగ్-

హిందూ మహాసభ-సెంట్రల్ సిఖ్‌లీగ్ ప్రతినిధులు కూడా హాజరయ్యారు. సమావేశం వారు, నివేదికను సూత్రరీత్యా ఆమోదిస్తూ కొన్ని సవరణలు చేశారు. నివేదికను బిల్లుగా రూపొందించవలసిందనీ, డిశంబరులో కలకత్తాలో జరిగే జాతీయమహాసభకు దానిని సమర్పించవచ్చుననీ సమావేశంలో నెహ్రూ సంఘాన్ని కోరారు.

ఈలోగా, నెహ్రూ నివేదికను ఆమోదించాలా వద్దా అన్న విషయమై ముస్లింలీగ్‌లో చీలిక ఏర్పడింది. మహమూదాబాద్ రాజా నాయకత్వంలోని వర్గంవారు నివేదికను సమర్థించారు, షౌకతలీ నాయకత్వంలోని మరొకవర్గంవారు, నిదికను వ్యతిరేకించారు. 1929 మార్చిలో జరిగే ప్రత్యేక సమావేశనివేదికను పరిశీలించవచ్చుననిలీగ్ నిశ్చయించుకుంది. అయితే, జాతీయ మహాసభకు హాజరయేందుకు జిన్నాతోసహా కొంతమంది ప్రతినిధులతో ఒక బృందాన్ని ఎంచుకుంది. హిందూమహాసభ నాయకులు కూడా ముఖ్యంగా మూంజే, నివేదికను వ్యతిరేకించారు. విడిగా సింద్ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలన్న శిఫార్సును ముఖ్యంగా వీరు వ్యతిరేకించారు. సీట్ల కేటాయింపు విషయమై కొంతమంది శిఖ్ఖు నాయకులు కూడా నివేదికను వ్యతిరేకించారు.

కలకత్తాలో జరిగిన జాతీయ మహాసభలో జిన్నా వైఖరిలో మార్పు కనిపించింది. నియోజకవర్గాలు - కేటాయింపు విషయంలో ఇదివరలో సమాధానవైఖరి అవలంబించిన జిన్నా కేంద్ర శాసనసభలో మూడింట ఒకవంతుసీట్లు ముస్లింలకు కేటాయించాలని పట్టుబట్టారు. (అంటే ముస్లింలకు ప్రత్యేకత ఉండాలని కోరారు. అఖిలపక్ష మహాసభలో దీన్ని ఏకగ్రీవంగా త్రోసిపుచ్చారు) యువజన ఓటుహక్కును మంజూరుచేయని పక్షంలో, పంజాబు - బెంగాల్లో జనాభా ప్రాతిపదికగా పదేండ్లపాటు ముస్లింలకు సీట్లను కేటాయించాలని కోరారు. రాష్ట్రాలకు రెసిడ్యూయరీ (అవశిష్టమైన)అధికారాలివ్వాలనీ సింద్‌ను బొంబాయినుంచి వేరుచేయాలనీ కూడా జిన్నా కోరారు. మహాసభవారు, జిన్నా ప్రతిపాదనలను త్రోసిపుచ్చారు. నిరసనగా జిన్నా మహాసభనుంచి వెళ్ళిపోయారు. దీనితోజిన్నా వేరుపడినట్టు చెప్పవచ్చు. 1929 మార్చిలో జిన్నా, భారతరాజ్యాంగానికి సంబంధించి ఒక ప్రకటన చేశారు. ముస్లింలకు పూర్తి రక్షణ ఉండాలన్న తమ అభిప్రాయాన్ని ప్రకటనలో పొందుపరిచారు. 'జిన్నా పధ్నాలుగు అంశాలు' అన్న పేరుతో ఆదరిమిలా ప్రఖ్యాతిపొందిన ఈ ప్రకటనలో మిగతా విషయాలతోపాటు కేంద్ర శాసనసభలో ముస్లింలకు మూడవవంతు స్థానాలను కేటాయించాలన్నది ఒకటి. ప్రత్యేక నియోజకవర్గాలు ఇప్పటిమోస్తరుగానే కొనసాగాలనీ, ఏమతంవారైనా ఎప్పుడైనా, తమ ప్రత్యేక నియోజకవర్గాన్ని విడనాడి సంయుక్త నియోజకవర్గంలా చేరే ఏర్పాటు వుండాలనీ ప్రకటనలో కోరారు. 50 జిన్నా - కాంగ్రెసుమధ్య విభేదాలు మరింత ఎక్కువైనటు దీనివల్ల స్పష్టమైంది.

## శాసనసభలో నెహ్రూ నివేదిక

శాసనసభ బడ్జెటుసమావేశం జరిగినపుడు, భారతీయ రాజకీయరంగంలోచీలికలు బాగా ప్రస్ఫుటమయాయి. ప్రభుత్వమూ - దాని మద్దతుదార్లూ ఎంతో సంతోషించారు.

1929 మార్చి 11 వ తేదీన వైస్‌రాయ్ కార్యవర్గ సమితి ఖర్చులను మంజూరు చేయవలసిందని ప్రభుత్వం కోరినపుడు, మోతీలాల్‌నెహ్రూ, మొత్తాన్ని ఒకరూపాయ తగ్గించవలసిందని కోరుతూ ఒకతీర్మానాన్ని ప్రతిపాదించారు. ప్రజలకోరిక చరిత్రను జ్ఞప్తికి తెస్తూ ఆయన ప్రభుత్వం ఏవిధంగా నిర్లక్ష్యంచేసినదీ వివరించారు. సైమన్ సంఘం గురించి ప్రస్తావిస్తూ ఈసంఘం తయారుచేసే నివేదిక యూరోపియన్లనూ ప్రభుత్వవర్గాలనూ తప్ప మరెవరినీ సంతృప్తిపరచజాలదని చెప్పారు. పాత 'ప్రజల కోరిక' సంతరించుకున్న కొత్తరూపాన్ని అఖిలపక్ష మహాసభకు చెందినసంఘం రూపొందించిన రాజ్యాంగంలో పొందుపరచినట్లు ఆయన పేర్కొన్నారు. (నెహ్రూనివేదిక) మతపరమైన పరిష్కారానికి సంబంధించి కొన్ని విభేదాలున్నమాట నిజమేనని ఆయన అంగీకరించారు. కాని డొమినియన్ ప్రతిపత్తి లభించినపుడు ఇవన్నీ సమసిపోతాయని ఆయన అభిప్రాయపడ్డారు. వెంటనే డొమినియన్ ప్రతిపత్తి కావాలని కాంగ్రెసు కోరుతున్నట్లు ఆయన తెలియచేశారు. 1929 ఆఖరుకు అది లభించకపోయినట్లయితే, నెహ్రూ నివేదికకు ఎవరూ కట్టుబడివుండనక్కరలేదు. కాంగ్రెసుపార్టీ సభ్యులు తమ కార్యాచరణపథకాన్ని అమలు జరుపవచ్చు దేశప్రజలనుకూడా తమ పథకంలో పాల్గొనవలసిందని ఆహ్వానించవచ్చు.[51]

మోతీలాల్‌నెహ్రూ, సంఘనివేదిక గురించి ప్రస్తావించడం ప్రభుత్వానికి ఇబ్బంది కలిగించింది. చాలామంది ముస్లిం సభ్యులూ యూరోపియన్లూ, నివేదికను ముస్లింలు బలపరచలేదుకనుక దాన్ని దేశప్రజలందరికోరికగా పరిగణించరాదని నిరసన తెలియచేశారు.

మార్చి 12 వ తేదీనకూడా చర్చ కొనసాగింది. అందరూ జిన్నావైపు దృష్టి కేంద్రీకరించారు. వెంటనే ఆయన నిరాశాజనకంగా మాట్లాడ్డం ప్రారంభించారు. ఈసమస్య చాలా ముఖ్యమైనదని ఆయన సభవారికి గుర్తుచేశారు. మోతీలాల్‌నెహ్రూతో అనేక అంశాల విషయంలో తాము ఏకీభవిస్తున్నామని చెప్పారు. కాని తమకు అంగీకారం కానిది ఆయన ఉపన్యాసంలో చాలావుందని బయటపెట్టారు. కాంగ్రెసు విధానంతోగాని కాంగ్రెసు కార్యక్రమంతోగాని తాము ఏకీభవించడంలేదని తెలియచేశారు. డొమినియన్ ప్రతిపత్తికంటె ఎక్కువ తాము కోరబోమని చెప్పారు. మావిధానమేమిటంటే నామోస్తరుగా ఆలోచించే వారందరిదీకూడా, డొమినియన్ బాధ్యతాయుత ప్రభుత్వం

మకుదాలు. అంతకంటె ఎక్కువావద్దు తక్కువావద్దు'' 52 అన్నారు జిన్నా. రెండవది నెహ్రూ నివేదికలో ముస్లింలకోరికలను చేర్చలేదని చెప్పారు. ఇంకా ఇలాఅన్నారు:

''ముస్లింలతరపున నేను ఒక సంగతి స్పష్టం చేయదలిచాను. పూర్తి బాధ్యతతో నేనీమాటలంటున్నాను. నెహ్రూ నివేదిక, మతవిభేదాలకు సంబంధించినంతవరకు 1927 లో ముస్లింలుచేసిన ప్రతిపాదనలకు ప్రతిగా తయారుచేసినదితప్ప మరొకటికాదు. ముసల్మానులకు ఇది ఆమోద యోగ్యంకాదు''. 53

ఈ ఘట్టంలో మోతిలాల్ నెహ్రూకూ, జిన్నా – మౌల్వీ మహమ్మద్ యాకూబ్ – కె. అహ్మద్‌లకూ మధ్య తీవ్రమైన వాదోపవాదాలు జరిగాయి. ఈ విషయమై ప్లెబిసైట్ (ప్రజామోదం) జరిపించవలసిందని అంటే నెహ్రూ నివేదిక ముస్లింలకుఆమోద యోగ్యమా కాదా అన్న విషయమై జిన్నా మోతిలాల్ నెహ్రూను సవాలు చేశారు. ముస్లింల్లో కొంతమందికి మాత్రమే ఇది ఆమోదయోగ్యంకాలేదని మోతిలాల్ నెహ్రూ వాదించారు. జిన్నా ఆవేశంతో సభవారి నుద్దేశించి ఇలా అన్నారు.

''ఆయన (నెహ్రూ) ఈ సంగతి గుర్తించడం మంచిది. ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది. నెహ్రూ నివేదిక ముస్లింలకు ఆమోదయోగ్యంకాదు.''54

ఈ సందర్భంలో నెహ్రూ నివేదికగురించి తమ ఓటును నమోదు చేయబోవడంలేదనీ కాని రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించి శాసనసభ గతంలో అనేకసార్లు ఆమోదించిన తీర్మానంగురించి ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకోకపోయినందుకు, మోతీలాల్ ప్రతిపాదించిన అభిశంస్య తీర్మానాన్ని ఆమోదించవలసిందని సభను కోరుతున్నామనీ చెప్పారు.

టి. ఎ. కె. షేర్వాణీ ముస్లిం మతవాదులకు వ్యతిరేకంగా వ్యవహరించారు. నెహ్రూ నివేదికకు వ్యతిరేకంగా ప్రకటనలుచేసిన ముస్లిం సభ్యుడు భారతీయ ముస్లింలు తరపున అటువంటి ప్రకటనలు చేసేందుకు అర్హులుకారని ఆయన అన్నారు. ముస్లింల అభిప్రాయాన్ని తెలుసుకోలేదని ఆయన చెప్పారు. నెహ్రూ నివేదికను వ్యతిరేకిస్తున్నవారు, తాము నెహ్రూ నివేదికను ఆమోదించబోమని చెబుతున్నవిధంగానే ముస్లింలు ఈ నివేదికను ఆమోదిస్తున్నారని తాము చెబుతున్నామని ఆయన అన్నారు. అసలు సమస్య హిందువులకూ. ముస్లింలకూ మధ్య వున్నది, సంబంధించినది కాదనీ భారతీయులకూ హిందువులైనా, ముస్లింలైనా, పార్సీలైనా ప్రభుత్వానికి మధ్య వున్నదనీ ఆయన సభ్యులకు గుర్తు చేశారు. భారతీయులకు, ప్రభుత్వనుంచి హక్కులు సంక్రమించినపుడు, హిందువులు, ముస్లింలమధ్య విభేదాలు సమసిపోతాయని ఆయన చెప్పారు.

నెహ్రూ నివేదిక, తన శత్రువులకుకూడా అనుకూలంగావుందని షేర్వాణీ వ్యంగ్యంగా అన్నారు. ఎటువంటి కారణమూ లేకుండా ప్రభుత్వానికి అనుకూలంగా ఓటుచేసిన సభ్యులు ఇప్పుడు నివేదికపాకుతో ప్రభుత్వానికి అనుకూలంగా ఓటు చేయడానికి సిద్ధమవుతున్నారని చెప్పారు.[55]

"కాంగ్రెసుకు నిజంగా ఏం కావాలి? డొమినియన్ ప్రతిపత్తాలేక స్వాతంత్ర్యమా" అని యూరోపియన్ సభ్యుడు కలొనల్ క్రాఫర్డ్ వెటకారంగా అడిగిన ప్రశ్నను శ్రీనివాసయ్యంగార్ గుర్తుంచుకున్నారు. స్వాతంత్ర్యమే భారతదేశం లక్ష్యమని శ్రీనివాసయ్యంగార్ కలొనల్ క్రాఫర్డ్‌కు చెప్పారు. 1928 కలకత్తా మహాసభలో, కాంగ్రెసు, అఖిలపక్ష మహాసభ ఆమోదించిన రాజ్యాంగ రూపంలో ఒక రాజీ ప్రతిపాదనకు అంగీకరించింది. 1929 ఆఖరుకు ప్రభుత్వం దాన్ని మంజూరుచేయక పోయినట్టయితే తామూ తమ స్నేహితులూ ఎటువంటి చర్యనైనా తీసుకోగలమనీ డొమినియన్ ప్రతిపత్తికి కట్టుబడి వుండబోమనీ ఆయన స్పష్టం చేశారు. బ్రిటిషు ప్రభుత్వంతో జరుపుతున్న పోరాటంలో హిందువులకు చేయూత నివ్వవలసిందని ఆయన ముస్లింలకు విజ్ఞప్తి చేశారు.[56]

తీర్మానంమీద రెండురోజులపాటు వాదోపవాదాలు తీవ్రంగా జరిగినపిమ్మట సభలో ఓటింగ్ జరిగింది. మోతిలాల్ నెహ్రూ తీర్మానం 68 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 52 ఓట్లు పడ్డాయి. ఇది ప్రతిపక్షానికి విజయమే. అయితే దీనివల్ల భారతదేశంలో మతవిభేదం మరింత ఎక్కువవుతున్నట్లు తేలింది. ప్రభుత్వవర్గాలు సంతోషించాయి. "ఎన్ని సమావేశాలు జరిగినా ఈ అగాధాన్ని పూడ్చలేవు" అన్న బర్కెన్‌హెడ్ వాక్యం వారికి గుర్తుకు వచ్చివుంటుంది.[57]

## ప్రజాభద్రత బిల్లు : తీవ్రపోరాటం

1926 నుంచీ భారతదేశంలో వామపక్ష ఉద్యమం వేళ్ళుపాతుకుంటూ వచ్చింది. కార్మికులూ, కర్షకుల పార్టీలు ఈ ఉద్యమానికి ప్రారంభంలో రాజకీయ అంగాలుగా పని చేశాయి. 1928లో వివిధ రాష్ట్రాల్లో పనిచేస్తున్న బృందాలన్నీ కలిసి అఖిల భారత కార్మికుల - కర్షకుల పార్టీగా రూపొందాయి. ఈపాటికి కాంగ్రెసులో వామపక్షవర్గాలకు గుర్తింపు లభించింది. 1928లో కలకత్తా మహాసభలో జవహర్‌లాల్, సుభాష్ చంద్రబోస్ కార్యదర్శులుగా నియమింపబడడం దీనికి తార్కాణం. కాంగ్రెసులోని వామపక్షవర్గాలకూ - బయటి ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి మధ్యమార్గంగా వుండేది కార్మికులు - కర్షకుల పార్టీ. ట్రేడ్‌యూనియన్ ఉద్యమంకూడా అంతకంతకు మారుతూ వచ్చింది. 1928లో కార్మికుల సమ్మెలవల్ల 3 కోట్ల 15 లక్షల పనిరోజులు నష్ట

మయాయి. అదీకాక కార్మికులు రాజకీయ శక్తిగా పనిచేయడం ప్రారంభించారు. సైమన్ సంఘం, భారతదేశం చేరుకున్నపుడు ఇది స్పష్టంగా తెలిసింది, కార్మికులు ప్రదర్శనలను హర్తాళ్‌లను ఏర్పాటు చేశారు. 1929 మే నెలలో 'బాంబె క్రానికల్' "సోషలిజం రాబోతూవుంది" అని వ్రాసింది.[58]

భారతదేశంలో కమ్యూనిజం ప్రభావం ఎక్కువవుతూండడం పట్ల భారత ప్రభుత్వం భయపడ సాగింది. మాస్కోలోని కమ్యూనిస్ట్ ఇంటర్‌నేషనల్ భారతదేశంలో కమ్యూనిజమ్‌కు చేయూతనిస్తువుందనీ భారతదేశానికి బ్రిటిషు కమ్యూనిస్టులను పంపుతూ వుందనీ భావించింది. కమ్యూనిస్టులు కార్మిక సంస్థల్లోకి ప్రవేశించారని భారత ప్రభుత్వానికి వార్తలందాయి. కలకత్తా కాంగ్రెసులో తీవ్రవాదులు విజయం సాధించారని కూడా విశ్వసించింది. ఈ వామపక్షాల బెడదను తొలగించాలని నిశ్చయించుకుంది. దీనికిగాను శాసనసభలో రెండు బిల్లులను ప్రవేశపెట్టింది. ఇవి ప్రజాభద్రత బిల్లు, వాణిజ్య వివాదాల బిల్లు. ప్రజాభద్రత బిల్లుకు సుదీర్ఘమైన చరిత్ర వుంది. శాసనసభలో దీనిగురించి జరిగినంత చర్చ మరే బిల్లు గురించీ జరుగలేదు. 1928 సెప్టెంబరు 4 వ తేదీన శాసన సభలో దీన్ని మొదటిసారిగా ప్రవేశపెట్టారు. భారతీయులు కానివారినీ విద్రోహక చర్యల్లో పాల్గొనేవారినీ బ్రిటిష్ ఇండియానుంచి తొలగించేందుకు ఈ బిల్లును ఉద్దేశించినట్టు దేశ వ్యవహారాల సభ్యుడు చెప్పారు. బిల్లును ప్రతిఘట్టంలోనూ తీవ్రంగా ఖండించారు.

బిల్లును శిఫార్సుల సంఘానికి నివేదించాలని సవరణ ప్రతిపాదించినపుడు మొదటి సారి ఘర్షణ జరిగింది. ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకునేందుకు బిల్లును పంచి పెట్టాలని అమర్‌నాథ్ దత్ ప్రతిపాదించారు. "భారతదేశాన్ని ఇతరదేశాలతో సంబంధం లేకుండా చేసేందుకుద్దేశించిన దుస్స్వభావంగల బిల్లు" అని సి. ఎస్. రంగ అయ్యర్ అన్నారు. [59] చిత్తశుద్ధితో చేసినది కాదని లాలాలజపత్‌రాయ్ భావించారు." బోల్షివిజమ్ వల్లకాని కమ్యూనిజం వల్లగాని మనకేమీ బెడదలేదు. మనకు ముప్పుగా తయారైంది. స్వప్రయోజన కారులైన పెట్టుబడిదారులు" [60] అన్నారాయన. బిల్లు, అణిచివేసేదిగానూ నిరంకుశంగానూ ఉందని పేర్కొంటూ శ్రీనివాసయ్యంగార్ బిల్లును పూర్తిగా ఏ మాత్రం సందేహంలేకుండా ప్రతిఘటించారు. కమ్యూనిజం బూచిని చూసి భయపడవద్దని ఆయన సభ్యులను హెచ్చరించారు. బిల్లుకు అవసరంలేదనీ ఏమాత్రం న్యాయంకాదనీ పురుషోత్తమదాస్ ఠాకుర్‌దాస్ అన్నారు. భారతదేశంలో కమ్యూనిజానికి ప్రాతిపదిక ఏర్పరిచిందిభారత ప్రభుత్వమేననీ, భారత వ్యతిరేక విధానాలను అవలంబించి కమ్యూనిజం వృద్ధికి సహాయపడుతూకూడా వుందనీ ఆయన విశ్వసించారు.[61] కార్మికుల ప్రతినిధి అయినఎన్. ఎం. జోషీ మాట్లాడుతూ, ప్రజలకు తమ సిద్ధాంతాలను తెలియచెప్పే స్వేచ్ఛ

ఇతరులకు మోస్తరుగానే కమ్యూనిస్టులకు కూడా వుండాలని కోరారు. 62

సెప్టెంబరు 14 వ తేదీన ప్రతిపక్ష నాయకులైన పండిత మోతీలాల్ నెహ్రూ, బిల్లును గట్టిగా ప్రతిఘటించారు. దేశ వ్యవహారాల సభ్యుడు, రక్తవర్షపు విప్లవం, కమ్యూనిజం వల్ల కలిగే భయంకర పరిణామాలను వర్ణించినపుడు మిత్రులు సర్ హరి సింగ్ గౌడ్ చలించిపోవడం తాము గమనించామని అన్నారు. 1927 లో సోవియట్ రష్యా సందర్శించినపుడు తాము స్వయంగా చూసినవాటిని ఆయన వర్ణించారు. అక్కడ ప్రజలు తమ తమ మత సంప్రదాయాలను ఏవిధంగా స్వేచ్ఛగా అనుసరిస్తున్నదీ, సాంఘిక-విద్యా-ఆర్థికరంగాల్లో సోవియట్ రష్యా ఎంతగా అభివృద్ధి చెందినదీ ఆయన వివరించారు. సోవియటిజంకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రచారాన్ని ఆయన ఖండించారు. ఇతర దేశాలతో ముఖ్యంగా ఆసియా దేశాలతో సాంఘిక - సాంస్కృతిక సంబంధాలను పెంపొందించుకోవాలన్న ఆకాంక్ష భారతీయుల్లో వుందనీ, ఈ బిల్లును ఆమోదించినట్టయితే అటువంటివాటికి అవరోధంగా వుంటుందనీ ఆయన అన్నారు. ఈబిల్లునే శాసనంగా రూపొందించినట్టయితే, "శాసనాల గ్రంధానికే పెద్ద కళంకంవంటిది" అవుతుందంటూ ఆయన ముగించారు.63

ఆతర్వాత జయకర్, బిల్లును వ్యతిరేకించారు. తమకు అధికారుల్లో విశ్వాసం లేదనీ ఈ బిల్లువల్ల వారికి విపరీతమైన అధికారాలు లభిస్తాయనీ ఆయన పేర్కొన్నారు.64 మాలవ్యా మాట్లాడుతూ, తమకు కమ్యూనిస్టుల ఎడల సానుభూతి లేదనీ అయినా ప్రజలకు జరుగుతున్న అన్యాయాన్ని అరికడితేతప్ప భారతదేశంలో కమ్యూనిజం వ్యాప్తిని ఎవరూ ఆపలేరనీ చెప్పారు. విప్లవం అన్నది మనకు అనుకూలంగా మలుచుకునేది కాదని బొంబాయికి చెందిన డి. వి. బ్రెల్‌వీ అన్నారు. భారతదేశంలో కూడా విప్లవానికి దారితీసే పరిస్థితులు ఉండాలని ఆయన అభిప్రాయపడ్డారు. బిల్లును తయారుచేసిన వ్యక్తి ఈ బిల్లును ఎందుకు ఉద్దేశించారో సృష్టించేశారని కె. సి. నియోగి అన్నపుడు సభ్యుల నవ్వులతో సభ ప్రతిధ్వనించింది. బిల్లులోని ఒకటవ క్లాజులో "ఈ చట్టాన్ని ప్రజా భద్రత (భారతదేశంనుంచి తొలగించే) చట్టం అనవచ్చు"నని పేర్కొన్నారు. భారతదేశంలో ప్రజలకు భద్రత లేకుండా చేయడమే దీని ఉద్దేశ్యమని అందువల్లనే తాము దీన్నివ్యతిరేకిస్తున్నామనీ నియోగి అన్నారు.65

అయితే ప్రభుత్వాన్ని గట్టిగా సమర్ధించినవారు లేకపోలేదు. హరిసింగ్‌గౌడ్, సర్దార్ బహాదూర్ కాప్టన్ హీరాసింగ్ బ్రార్, విక్టర్ సాస్సూన్, సాహెబ్‌జాదా అబ్దుల్ కయ్యూం, ఇబ్రాహీం రహీమ్‌తుల్లా చాలామంది ఇతరులూ ప్రభుత్వాన్ని సమర్ధించారు.

పోటీ తీవ్రంగా జరిగింది రెండు పక్షాల మధ్య. బిల్లును శిఫార్సుల సంఘానికి నివేదించాలన్న తీర్మానం మీద ఓటింగ్ జరిగింది, 62 ఓట్లతో నెగ్గింది ప్రతికూలంగా 59 ఓట్లు పడ్డాయి.

1929 సెప్టెంబరు 20 వ తేదీన బిల్లును, శిఫార్సుల సంఘం నివేదికతోపాటు సభలో మళ్లీ ప్రవేశపెట్టినప్పుడు మళ్ళీ వాదోపవాదాలు జరిగాయి. బిల్లు అదివరకటికంటె అధ్వాన్నంగా వుందని దొరైస్వామి అయ్యంగార్ అభిప్రాయపడ్డారు. కార్మికులూ కర్షకుల ద్వారా మాత్రమే భారతదేశానికి స్వాతంత్ర్యం లభించగలదనీ అందువల్లనే ఈ వర్గాల్లో జాతీయతాభావం పెంపొందకుండా అరికట్టేందుకు ఈ బిల్లును ప్రభుత్వం తల పెట్టిందనీ టంగుటూరి ప్రకాశం అన్నారు. ఆయన బిల్లును సమూలంగా వ్యతిరేకించారు. 66 బ్రిటిషు పార్లమెంటు వహించవలసిన బాధ్యతను భారత శాసన సభ మీదికి తోస్తున్నారని ఎన్. సి. కేల్కార్ అభిప్రాయపడ్డారు. "కమ్యూనిస్టు సిద్ధాంతానికి సంబంధించినంతవరకు కొత్త ఏమీ లేదు. ఇతర సిద్ధాంతాల విషయంలో వ్యవహరించిన తీరుగానే ఈ సిద్ధాంతం విషయంలో కూడా వ్యవహరించే వీలు, దేశ ప్రజలకుండాలి 67 అన్నారాయన.

ఈసారి బిల్లును ఇంకా తీవ్రంగా ప్రతిఘటించారు. ఓటింగ్ జరిగినపుడు సరిసమానంగా వచ్చాయి. 61:61. అందరూ అధ్యక్షులైన పటేల్ వంక చూశారు. మెజారిటీ మద్దతులేని బిల్లును, అందునా ఇటువంటి అసాధారణ బిల్లును ప్రభుత్వం ఆమోదించడం ప్రెసిడెంటు పటేల్‌కు ఇష్టంలేకపోయింది. ఆయన బిల్లుకు వ్యతిరేకంగా ఓటు చేశారు. ప్రభుత్వం వీగిపోయింది.

భారత ప్రభుత్వం అంతటితో వూరుకోలేదు. కమ్యూనిస్టు—వామపక్ష భావాలు భారతదేశంలో వ్యాప్తిచెందటంపట్ల ప్రభుత్వ ఆందోళనను వైస్రాయ్ 1929 జనవరిలో శాసనసభలో మాట్లాడుతూ ఈవిధంగా వ్యక్తం చేశారు;

"కమ్యూనిస్టు సిద్ధాంతాల వ్యాప్తి ఆందోళన కలిగిస్తువుంది"

అందువల్ల దేశవ్యవహారాల సభ్యుడు 1929 ఫిబ్రవరి 4 వ తేదీన శాసనసభలో సవరించిన ప్రజాభద్రత బిల్లును ప్రవేశపెట్టారు. బిల్లును శిఫార్సుల సంఘానికి నివేదించవలసిందని ప్రతిపాదించారు. మళ్లీ యుద్ధం ప్రారంభమైంది. ప్రజాభిప్రాయ సేకరణకు బిల్లును పంచిపెట్టాలని బిహార్‌లోని ముజఫర్‌పూర్‌కు చెందిన గయాప్రసాద్ సింగ్ కోరారు. ఇదేమోస్తారు బిల్లు విషయంలో గతంలో ప్రతిపక్షం ప్రభుత్వాన్ని సవాలు చేసిందనీ ఇప్పుడు కూడా చేస్తుందనీ ఆయన పేర్కొన్నారు. ఈ బిల్లువల్ల

ప్రభుత్వానికి ఇదివరలో సూచించిన బిల్లువల్ల కంటె ఎక్కువ అధికారాలు లభిస్తాయని ఆయన అన్నారు. మొదటి బిల్లులో మోస్తారుగా బ్రిటిషు ఇండియాలో నివసించే బ్రిటిషు పౌరుడు అనకుండా 'ఇండియాలో నివసించే బ్రిటిషు పౌరుడు' అని సవరించారని ఆయన పేర్కొన్నారు.68 దివాన్ చమన్‌లాల్ బిల్లును పూర్తిగా వ్యతిరేకించారు "... ... సోషలిజానికి వ్యతిరేకంగా ప్రచారం చేయదలచుకున్నట్టయితే, సోషలిజాన్ని అణిచివేసేందుకు అధికారాలు అడుగుతున్నట్టయితే, అవి మా మరణానంతరం మాత్రమే లభించగలవు" 69 అని ఆయన హెచ్చరించారు. బిల్లువల్ల ప్రభుత్వ అధికారాలు పటిష్టమవుతాయేగాని ప్రజలకు ఏమాత్రం లాభం వుండదని రంగస్వామి అయ్యంగార్ అన్నారు.

పారిశ్రామికవేత్త ఘన శ్యామదాస్‌బిర్లా, కమ్యూనిజంపట్ల తమకేమాత్రం సాను భూతిలేదని స్పష్టం చేశారు. ఎన్ని ఎగుడుదిగుడులు సంభవించినా పెట్టుబడిదారీ వ్యవస్థ కొనసాగుతుందని ఆయన అభిప్రాయ పడ్డారు. అయితే ఎటువంటి విచారణ జరుపకుండా ప్రజలను నిర్బంధించే అధికారమూ ప్రభుత్వానికి సంక్రమింపచేసే ఏచర్య నైనా తాము, ఇతర భారతీయ పెట్టుబడిదార్లతో పాటు వ్యతిరేకిస్తామని ఆయన చెప్పారు. ఆయనింకా ఇలా అన్నారు.

"అయ్యా, ఈ బిల్లును గత సెప్టెంబరులో సభలో ప్రవేశపెట్టారు. సభవారు త్రోసిపుచ్చారు. కమ్యూనిజాన్ని అరికట్టాలన్నది ప్రభుత్వ ఉద్దేశ్యమైనట్టయితే, భారతీయ పారిశ్రామికవేత్తలను సంప్రదించివుండవలసింది. యూరోపు పారిశ్రామిక వేత్తలను ప్రభుత్వం సంప్రదించిందో లేదో తెలియదుకాని భారతీయ వాణిజ్యవేత్త లను మాత్రం సంప్రదించలేదు.70

కమ్యూనిజాన్ని అరికట్టాలని ప్రభుత్వం నిజంగా అనుకోవడంలేదని బీరర్‌కు చెందిన ఎం. ఎస్. అనే అభిప్రాయ పడ్డారు. కమ్యూనిజమ్ అన్నది సామ్రాజ్యవాద ఫలితం ప్రభుత్వం నిజంగా కమ్యూనిజంతో పోరాడదలచుకున్నట్టయితే మొదట బ్రిటిషు సామ్రాజ్యవాద తత్వంతో పోరాడేందుకు ప్రతిపక్ష సభ్యులతో చేతులు కలుపవలసి వుంటుంది. దానికి వారు సిద్ధమేనా ? 71 అని అడిగారాయన.

మోతీలాల్ నెహ్రూ, మాలవ్యా మళ్లీ బిల్లును ప్రతిఘటించారు. న్యాయ శాఖ అధికారల స్థానే ఈ బిల్లువల్ల ప్రభుత్వానికి అధికారాలు లభిస్తాయన్న కారణంగా మాలవ్యా, ఈ బిల్లును వ్యతిరేకించారు. ఈ బిల్లు భారత జాతీయతకు భారత జాతీయ కాంగ్రెసుకు వ్యతిరేకంగా వుందని మోతీలాల్ నెహ్రూ అభిప్రాయ పడ్డారు. ఆయన ఈ బిల్లుకు "భారత బానిసత్వపు బిల్లు నంబరు ఒకటి" అని పేరు పెట్టారు. 72

అయితే బిల్లును సమర్థించిన వారు లేకపోలేదు. "అతి ముఖ్యమైన ఈ శాసనాన్ని ఆమోదించకపోయినట్లయితే జాతీయత దెబ్బ తింటుందని" 73 మహమ్మద్ షానవాజ్ వంటి సభ్యులు అభిప్రాయపడ్డారు. కమ్యూనిజం బెడదను అరికట్టేందుకు ఏదో ఒక శాసనం మంచి దేగాని ఈ బిల్లులోని అంశాలు మాత్రం తమకునచ్చలేదని ఎం.కె. ఆచార్య అన్నారు.

ఈసారి, ప్రభుత్వం, తన మద్దతుదార్లను బాగా కూడగట్టుకుంది. బిల్లును శిఫార్సుల సంఘానికి నివేదించాలన్న తీర్మానాన్ని సభవారు ఆమోదించారు.

శిఫార్సుల సంఘం సూచనలతోపాటు బిల్లును మళ్లీ మార్చి 28 వ తేదీన శాసన సభలో ప్రవేశపెట్టారు. కాని దానికి వారం రోజుల ముందు, ప్రభుత్వం ప్రముఖ కమ్యూనిస్టు నాయకులూ ట్రేడ్ యూనియన్ నాయకులూ ముప్పయి ఒక్కమందిని అరెస్టు చేసి మారుమూలవున్న మీరట్‌కు విచారణకు పంపింది. ఇదే ఆ తర్వాత మీరట్ కుట్రకేసుగా ప్రఖ్యాతిగాంచింది. దీనితో ప్రభుత్వాన్ని దేశ వ్యాప్తంగా విమ ర్శించటం ప్రారంభించారు. ప్రభుత్వ చర్య, కమ్యూనిజాన్ని హతమార్చేందుకు ఉద్దేశించినదికాదనీ భారతీయులను భయభ్రాంతులను చేసేందుకుద్దేశించినదనీ గాంధీజీ పేర్కొన్నారు. "చట్టం మాటున అరాచకం పరిపాలిస్తూవుందని" ఆయన అన్నారు74

ప్రజాభద్రత బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టినపుడు న్యాయవిషయాల సభ్యుడు శిఫా ర్సుల సంఘం నివేదికను వివరించినపుడు, జయకర్ మాట్లాడుతూ కమ్యూనిస్టుల అరెస్టు మీరట్‌లో వారి విచారణ దృష్ట్యా, బిల్లు మీద చర్చను ప్రభుత్వం వాయిదా వేయడం మంచిదని పేర్కొన్నారు. న్యాయశాఖ పర్యవేక్షణలో వున్న విషయాలకు బిల్లు మీద చర్యవల్ల హానికలుగవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు. సభ మళ్లీ ఏప్రిల్ 2 న సమావేశమైనపుడు అధ్యక్షులైన పటేల్ మాట్లాడుతూ ప్రజాభద్రత బిల్లుకు మూలకారణ మేదో, మీరట్ కుట్ర కేసుకు కూడా మూలకారణం అదేననీ అందువల్ల బిల్లు మీద చర్చ జరిగినట్లయితే కుట్రకేసుకు సంబంధించిన అంశాలు కూడా చర్చలో ప్రస్తావనకు రాగల వనీ అన్నారు. మీరట్ విచారణ జరిగేవరకూ బిల్లును వాయిదా వేయడం మంచిదని ఆయన ప్రభుత్వానికి సలహా ఇచ్చారు. లేదా బిల్లును వెంటనే ఆమోదించాలని ప్రభు త్వం అదుర్దాగా వున్నట్లయితే మీరట్ కేసును ఉపసహరించుకుని బిల్లు మీద చర్చ జరి పించవచ్చునని సూచించారు.75 ప్రభుత్వం సందిగ్ధంలో పడింది.

దేశవ్యవహారాల సభ్యుడు ఏప్రిల్ 4 న మాట్లాడుతూ బిల్లు మీద చర్చ జరిపే విష యంలో న్యాయశాస్త్రరీత్యా అవరోధమేదీ లేదని ప్రభుత్వం అభిప్రాయపడుతూందనీ. అందువల్ల మీరట్ కుట్ర కేసుతో సంబంధంలేకుండా, ఇది అవసరం కాబట్టి బిల్లు మీద

చర్చ ప్రారంభించాలనీ చెప్పారు. అదరిమిలా న్యాయశాస్త్రరీత్యా ఘర్షణ జరిగింది. బిల్లు మీద చర్చ జరగడానికి వీలులేదని జాతీయవాదులు పట్టు పట్టారు. బిల్లు మీద చర్చను సభాధ్యక్షులు ఇకమీద ఆపజాలరని రాజా గజన్‌ఫర్ అలీఖన్ ద్వారా జిన్నా సభవారికి తంతి పంపారు. 76

ఏప్రిల్ 14 న అధ్యక్షులైన పటేల్ తమ తీర్పు చెప్పారు. సుదీర్ఘ ప్రకటన చేస్తూ ఆయన న్యాయశాఖ పర్యవేక్షణలోవున్న అంశాలు ప్రస్తావనకు రాకుండా నిజమైన చర్చ జరిగే వీలులేదని పేర్కొన్నారు. తీర్మానం మీద చర్చ జరుగరాదని చెప్పే హక్కు సభాధ్యక్షులకు ఉన్నదా అన్న విషయమై ప్రస్తావిస్తూ ఆయన అటువంటి అధికారమిచ్చే ప్రత్యేక నిబంధన ఏదీ లేకపోయినా అవసరాన్ని బట్టి అటువంటి అధికారం సంక్రమిస్తుందని చెప్పారు. అదీగాక సభపద్ధతులను దుర్వినియోగంచేసే అవకాశం ఉందని అధ్యక్షులు అభిప్రాయపడినపుడు, అటువంటి తీర్మానాన్ని త్రోసిపుచ్చే అధికారం సభాధ్యక్షులకు స్వతహాగా ఉందని పటేల్ అన్నారు. ఈ కారణాలు ఆధారంగా ఆయన, ప్రజాభద్రత బిల్లు మీద ఇక ఎటువంటి చర్చ జరుగడానికి వీలులేదని చెప్పారు. 77

ప్రభుత్వం మాత్రం, దీనివల్ల ఏమాత్రం చలించలేదు. ఆ మరునాడు వైస్‌రాయ్ ఉభయసభల సభ్యులనుద్దేశించి మాట్లాడుతూ సభాధ్యక్షుల నిర్ణయంతో తాము ఏకీభవించడం లేదని చెప్పారు. "......భారత శాసనసభ ఈ శాసనాన్ని ఆపినందువల్ల విప్లవ ఉద్యమాలకు కారకులైనవారు ఊరుకోబోరు" 78 అందువల్ల వైస్‌రాయ్, బిల్లువల్ల కలిగే అధికారాలన్నిటినీ గవర్నర్ జనరల్‌కూ ఆయన సమితికీ సంక్రమింపచేస్తూ ఒక ఉత్తర్వు జారీ చేశారు. 1929 లో శాసనసభ బడ్జెటు సమావేశంలో అందరి దృష్టినీ ఆకర్షించిన మరొక బిల్లు-వాణిజ్యవివాదాల బిల్లు. ఈ బిల్లు గురించి కూడా ప్రభుత్వమూ ప్రతిపక్షమూ బలాబలాలు పరీక్షించుకున్నాయి. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకునేందుకు ఈబిల్లును 1928 సెప్టెంబరులో పంచిపెట్టారు. 1929 ఫిబ్రవరి 11 వ తేదీన, కార్మిక సభ్యుడు సర్ భూపేంద్రనాథ్ మిత్ర బిల్లును శిఫార్సుల సంఘానికి నివేదించవలసిందని కోరుతూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. దేశమంతటా ముఖ్యంగా బొంబాయిలో వరుసగా సమ్మెలు జరుగుతున్న దృష్ట్యా ఇది చాలా అవసరమని చెప్పారు. దర్యాప్తు జరిపే న్యాయస్థానలనూ రాజీ కుదిర్చేందుకు బోర్డులనూ ఏర్పాటు చేసేందుకు ఈ బిల్లును ఉద్దేశించారు. ప్రజోపయోగమైన సర్వీసుల్లో హఠాత్తుగా సమ్మెలు జరుపడం శిక్షార్హమవుతుంది. వాణిజ్య వివాదాలకు సంబంధించని సమ్మెలు చట్టవిరుద్ధమవుతాయి. ఈ బిల్లును కూడా ప్రతిపక్షంలోనూ ప్రతిఘటించారు.

1929 ఏప్రిల్ 2వ తేదీన, శిఫార్సుల సంఘం నివేదికతో పాటు బిల్లును సభలో

ప్రవేశపెట్టారు. విట్లే కార్మిక సంఘం తన నివేదికను సమర్పించేవరకూ బిల్లు మీద చర్చను వాయిదావేయాలని వి. వి. జోగయ్య కోరారు. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకునేందుకు బిల్లును మళ్ళీ పంచిపెట్టాలని దివాన్ చమన్‌లాల్ కోరారు. శ్రామికవర్గాలకే కాక భారతీయులందరికీ ఈ బిల్లు పెద్ద బెడద అని ఆయన అభిప్రాయపడ్డారు. ఎన్. సి. కేల్కార్ శ్రీనివాసయ్యంగార్, చమన్‌లాల్‌ను సమర్థించారు. శ్రామికుల స్వేచ్ఛను అణిచివేసేందుకు అధికార్లు వేసుకున్న పథకమే ఈ బిల్లు అని జమునాదాస్ యం. మెహతా వర్ణించారు. 79 ఈ బిల్లు నిజానికి రాజకీయ బిల్లు అనీ వాణిజ్య వివాదాల బిల్లు రూపంలో దీన్ని సభలో ప్రవేశపెట్టారనీ పండిత ఠాకుర్‌దాస్ భార్గవ అన్నారు. ఈ బిల్లువల్ల భారతదేశంలో ట్రేడ్ యూనియన్ వ్యవస్థ కుంటుపడుతుందని ఎం. ఎస్. అనే అభిప్రాయపడ్డారు.

అధికార పక్షం గట్టిగా ప్రతిఘటించినప్పటికీ సభ బిల్లును ఏప్రిల్ 8 వ తేదీన ఆమోదించింది. కాని ఆ వెంటనే ప్రేక్షకుల గ్యాలరీ నుంచి ఎవరో రెండు బాంబులను విసిరారు. ఇవి, అధికార సభ్యులు కూర్చునే బెంచీల మీద పడి ప్రేలాయి. గొడవ జరిగి. సభ వాయిదా పడింది. బిల్లును ఆమోదించడం దీనితో మరుపురాని సంఘటన అయింది.

జతిన్‌దాసు మరణం : శాసనసభలో అభిశంసనతీర్మానం

బాంబు సంఘటన తర్వాత పోలీసులు సర్దార్ భగత్‌సింగ్, బటుకేశ్వరదత్ అన్న ఇద్దరు యువ విప్లవకారులను అరెస్టు చేశారు. ఆదరిమిలా అటువంటి విప్లవకారులు చాలా మందిని అరెస్టు చేశారు. వారిమీద లాహోర్‌లో ఒక కేసు ప్రారంభించారు. లాహోర్ కుట్రకేసు భారతీయులందరినీ ఆకర్షించింది.

లాహోర్ కుట్ర కేసుకు సంబంధించిన ఖైదీలను మామూలు నేరస్తులుగా చూశారు జైలులో. భగత్‌సింగ్ నాయకత్వంలో ఖైదీలు ఆందోళన ప్రారంభించి, తమను రాజకీయ ఖైదీలుగా చూడవలసిందని అడిగారు. ప్రభుత్వం దీనికి అంగీకరించలేదు. ఖైదీలు నిరాహారదీక్ష ప్రారంభించారు. వీరిలో విప్లవ భావాలతో నిండిన జతీంద్రనాథ్ దాసు అన్న యువకుడు కూడా వున్నాడు. ఈ యువకులకు హాని జరుగకుండా చూడాలని ప్రజలు ప్రభుత్వాన్ని కోరారు. ప్రభుత్వం ఖాతరు చేయలేదు. జతిన్‌దాస్ 1929 సెప్టెంబరు 13 వ తేదీన మరణించాడు. ప్రభుత్వపు నిర్లక్ష్యవైఖరిపట్ల ఆగ్రహావేశాలతో దేశప్రజలు ఉడికి పోయారు.

ఢిల్లీలో ఈవార్త తెలిసినపుడు శాసనసభ సమావేశం జరుగుతూవుంది. సెప్టెంబరు 14 వ తేదీన జతిన్‌దాసు మరణం గురించీ దానికి సంబంధించిన ఇతర విషయాల

గురించి చర్చించేందుకు సభ వాయిదా పడాలని పండిత మోతీలాల్ నెహ్రూ కోరారు. దీనికి అనుమతించడంతో చర్చ జరిగింది. లాహోర్‌లో ఖైదీలపట్ల ప్రభుత్వం అమానుషంగా ప్రవర్తించినందుకు సభ్యులు ప్రభుత్వాన్ని అభిశంసించారు.

లాహోర్‌లో ఒక యువకుడు క్షీణించిపోతువుండగా ఏదీపట్టనట్టు వున్నందుకు మోతీలాల్‌నెహ్రూ ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు. "మన ఉదారమైన ప్రభుత్వం మరణ శయ్యలపై వున్న యువకులతో చెలగాటమాడుతూ వుంది. వారు (యువకులు) తప్పు దోవపట్టినవారేకావచ్చు అయినా దేశభక్తులు. అమూల్యమైన వారి ప్రాణాలు హరించి పోతూ వుంటే ప్రభుత్వం చూస్తూ వుంది" అన్నారాయన 80 యువకుల్లో చాలా మంది చావుకు సిద్ధంగావున్న ఈ సమయంలో ప్రభుత్వం ఏం చేయాలన్న మీమాంసలో పడి నందుకు ఆయన విచారం వ్యక్తపరిచారు.

దేశవ్యవహారాల సభ్యుడు ప్రభుత్వం తరపున మాట్లాడుతూ ప్రభుత్వవైఖరిని సమ ర్థించారు. కాని ప్రతిపక్షం దీనితో సంతృప్తి పడలేదు. ఖైదీలు కోరుతున్న వాటి గురించి భగత్‌సింగ్ వ్రాసిన లేఖలో పేర్కొన్న అంశాలను గురించి మాట్లాడుతూ మాలవ్యా, వారు కోరినవి ఎంతసహేతుకమైనవో చెప్పారు. "వారు, గౌరవనీయు లైన యువజనులు. తమదేశానికి స్వాతంత్ర్యం సంపాదించి పెట్టాలని చిత్తశుద్ధి ఆత్మ గౌరవమూవున్న ప్రతివారూ కోరినట్టే వీరూ కోరుతున్నారు"81 అన్నారాయన. అయినా ప్రభుత్వం తగిన విధంగా వ్యవహరించలేదనీ అమూల్యమైన ఒక యువకుడిని పోగొట్టుకున్నామనీ మాలవ్యా ఫిర్యాదు చేశారు. ప్రభుత్వం జతిన్‌దాసును హత్య చేసిందని అమర్‌నాథ్ దత్ ఆరోపించారు. కె. సి. నియోగి, ఖైదీల ధైర్య సాహసా లను మెచ్చుకున్నారు. పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాస్ మాట్లాడుతూ నేరాలను తాము సమర్థించబోమనీ అయినా ప్రభుత్వం ప్రతీకారచర్య తీసుకోవడం ప్రారంభించినట్టయితే తాము తమ సహచరులూ ఊరుకోబోమని స్పష్టం చేశారు.

అఖరున వాయిదా తీర్మానం మీద ఓటింగ్ జరిగింది, 55 ఓట్లతో నెగ్గింది. ప్రతి కూలంగా 47 ఓట్లు పడ్డాయి. ప్రభుత్వాన్ని శాసనసభలో అభిశంసించారు. బయట దేశప్రజలు గర్హించారు.

### శారదా బిల్లు

సమాజంలోని చెడుగులను తొలగించేందుకు కొన్ని చట్టాలను ఆమోదించడానికి శాసనసభలోని జాతీయవాదులు ఎంతో కృషి చేశారు. బాల్య వివాహాలు వాటి ఫలితంగా బాలికలకు వైధవ్యం ప్రాప్తించడం, ముఖ్యంగా హిందూవుల్లో అటువంటి చెడుగుల్లో ఒకటి. ఈ విషయంలో అజ్మీర్‌కు చెందిన రాయ్ బహాదుర్ హర్‌బిలాస్ శారద

గణనీయమైన కృషి చేశారు. మూడవ శాసనసభ సమావేశమైన కాలమంతా, ఆయన తమ, బాల్యవివాహాల బిల్లును ప్రవేశపెట్టడంలో ఎంతో కృషి చేశారు. ఈ బిల్లు, శారదా బిల్లుగా ప్రఖ్యాతిగాంచింది. 18 ఏండ్లలోపు బాలురకూ 14 ఏండ్లలోపు బాలికలకు వివాహాలు జరుగకుండా అపడమే ఈ బిల్లు ఉద్దేశ్యం. ప్రభుత్వం ఈ బిల్లు విష యంలో అంత శ్రద్ధ చూపలేదు. దేశంలోని సనాతనులు కొంతమంది ఈ బిల్లును వ్యతిరేకించారు. అయితే మోతీలాల్ నెహ్రూ, జిన్నావంటి అధునాతనులూ ఎచ్. ఎస్. కుంజ్రు, ఎచ్. పి. మోడి వంటి ఉదారవాదులూ బిల్లును గట్టిగా సమర్థించారు. చివరకు బిల్లును శాసనసభ 1929 సెప్టెంబరు 23 వ తేదీన, శాసనసమితి సెప్టెంబరు 28 వ తేదీన ఆమోదించాయి. సాంఘిక శాసనాల అవతరణలో ఇది ఒక మైలురాయి.

**సభా హక్కుల కోసం పోరాటం :**

సభకూ సభ్యులకూ వున్న-అవి ఏపాటివైనా హక్కులూ ప్రత్యేక సౌకర్యాలు ప్రభుత్వము అధికార్ల చేతుల్లోకి పోకుండా అరికట్టేందుకు శాసనసభలోని అధికారేతర సభ్యులు చేసిన కృషి, శాసనసభ ద్వారా జరిగిన స్వాతంత్ర్యపోరాటంలో ప్రముఖ పాత్ర వహించింది. బ్రిటిషు కామన్సు సభకున్న హక్కులూ ప్రత్యేక సౌకర్యాలూ భారత శాసన సభకు సంక్రమించేట్టు సభ్యులు నిబంధనలనూ సంప్రదాయాలనూ రూపొందించేందుకు ప్రయత్నించారు. ఈ కృషిలో 1925 ఆగష్టు 24 నుంచి సభాధ్య క్షులుగా పనిచేసిన వి. జె. పటేల్ అతిముఖ్యపాత్ర వహించారు. దీని మూలంగా సభ్యుల హక్కులనూ గౌరవాన్ని కాపాడే శక్తివంతమైన వ్యక్తిగా రూపొందడమే కాక ప్రజాస్వామ్య రాజ్యాంగం వున్న ఒక స్వతంత్ర దేశంలో ప్రతిపక్షానికీ ప్రతిపక్ష నాయ కుడికీ ఉండవలసిన హోదాను కలుగచేశారు. 82

ఈ పోరాటం సుదీర్ఘంగా జరిగింది. ఇందులోని కొన్ని ముఖ్య సంఘటనలను మాత్రమే పరిశీలిద్దాము.

వి. జె. పటేల్, ప్రభుత్వ మద్దతుగల టి. రంగాచారియార్‌తో పోటీ చేసి శాసనసభ అధ్యక్షులైనపుడు స్వరాజ్యవాది అయిన ఈయన స్వాతంత్ర్యయోధుడుగా తమ పాత్రను విడచిపెట్టకుండా సభాధ్యక్షులుగా ఏవిధంగా పనిచేయగలరని అందరూ అభిప్రాయ పడ్డారు.

శాసనసభ అధ్యక్షులుగా పదవీ బాధ్యతలు స్వీకరించినప్పటి నుంచీ, తాము స్వేచ్ఛగా వ్యవహరించలేకపోతున్నామని అభిప్రాయ పడసాగారు. అన్నిటికీ శాసనసభ కార్య దర్శి సలహా మీద ఆధారపడవలసిరావడమే దీనికి కారణము. ఈ కార్యదర్శి,

శాసనసభాధ్యక్షులకు విధేయులుగా ఉండనక్కరలేదు. అదీగాక దాదాపు అన్ని విష యాల్లో ఈ కార్యదర్శి, గవర్నర్ జనరల్‌కూ ఆయన సమితికీ బాధ్యులు. మామూలుగా ఈ కార్యదర్శి, శాసనసభలో నామినేటెడ్ సభ్యులుగా వుండేవారు. అందువల్ల తమకు నచ్చిన పార్టీలో చేరేవారు, ఆపార్టీ కోసం పనిచేసేవారు, ఆ పార్టీ సభ్యులతో పాటు ఓటుచేసేవారు. అటువంటి కార్యదర్శి సలహాను నిష్పాక్షికమైనదిగానూ స్వతంత్రమైనదిగానూ సభాధ్యక్షులు స్వీకరించలేకపోయేవారు. ఈ విషయమై పటేల్, గవర్నర్ జనరల్‌తో చర్చించారు. ఆ తర్వాత 1928 ఆకులురాలే కాలంనుంచీ కార్యదర్శిని శాసనసభకు నామినేటెడ్ చేసే అలవాటును మానుకున్నారు.

అయితే ఇది స్వల్పమైనది. అసలు ముఖ్యమైన విషయం, శాసనసభకు విడిగా సిబ్బంది అంటూ లేకపోవడం. పటేల్ కోరినమీదట, 1926 జనవరిలో, శాసన సభకు విడిగా ఒక కార్యాలయం ఉండాలని ప్రభుత్వానికి దీనితో ఎటువంటి ప్రమేయమూ ఉండరాదనీ శిఫార్సు చేస్తున్న తీర్మానాన్ని అధ్యక్ష సమావేశం ఆమోదించింది. అయితే, ప్రభుత్వం దీన్ని పట్టించుకోలేదు. దానితో పటేల్ ప్రభుత్వానికి ఒక సవివరమైన పథకాన్ని సమర్పించారు. శాసనసభను, భారతప్రభుత్వపు శాసనసభా విభాగాన్నుంచి వేరుచేయాలనీ, ఈ కార్యాలయం ఏర్పాటు దానిలోని ప్రధానమైన అధికార్లు శాసన సభాధ్యక్షులద్వారా శాసనసభ అదుపులో వుండాలనీ ఈ పథకంలో ప్రధానంగా కోరారు. ప్రభుత్వంతో సంప్రదింపులు జరిగాయి, కాని ఈ విషయమై ప్రభుత్వానికీ సభాధ్యక్షులైన పటేల్‌కు మధ్య బేధాభిప్రాయాలు కనిపించాయి.

1928 సెప్టెంబరు 5 వ తేదీన సభాధ్యక్షులు పటేల్ ఈ పరిణామాలన్నిటినీ సభ్యులకు తెలియజేశారు. సెప్టెంబరు 22 వ తేదీన ప్రతిపక్ష నాయకులైన పండిత మోతీలాల్‌నెహ్రూ, 1928 డిశంబరు ఒకటవతేదీ నాటికి శాసనసభకు విడిగా ఒక శాఖను ఏర్పాటు చేయాలని కోరుతూ ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఈ శాఖలోని అధికార్లను గవర్నర్ జనరల్ సభాధ్యక్షులతో సంప్రదించి నియమించాలనీ ఈ అధికార్ల మీద క్రమశిక్షణ తీసుకునే అధికారం సభాధ్యక్షులకుండాలనీ గవర్నర్ జనరల్‌కు అప్పీలుచేసుకునే అధికారం అటువంటి అధికార్లకు కల్పించాలనికూడా తీర్మానంలో కోరారు. తీర్మానాన్ని శాసనసభ ఆమోదించిన ఫలితంగా విడిగా ఒక సభ ఏర్పాటైంది.

సభ్యులూ సభాధ్యక్షులూ, సభాధ్యక్షస్థానం హోదాను పరిరక్షించుకునేందుకు బాగా శ్రమపడవలసి వచ్చింది. కొన్ని బ్రిటిష్ పత్రికలూ ఆంగ్లోఇండియన్ పత్రికలూ సభాధ్యక్షులపై దుష్ప్రచారం చేయసాగాయి. 1928 సెప్టెంబరు 4 వ తేదీ గయాప్రసాద్ సింగ్, సభాధ్యక్షులమీద జరుగుతున్న ఈ దుష్ప్రచారం గురించి చర్చించేందుకు సభ

వాయిదా పడాలని కోరుతూ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. వాయిదాతీర్మానం సరిగా లేదని సభాధ్యక్షులన్నారు. సెప్టెంబరు 14 వ తేదీన ప్రతిపక్ష నాయకులైన పండిత మోతీలాల్‌నెహ్రూ మళ్ళీ ఈసంగతి ప్రస్తావించారు. డెయిలీ టెలిగ్రాఫ్, టైమ్స్ ఆఫ్ ఇండియా విలేఖర్లు సభాధ్యక్షులకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నారని ఆయన ఆరోపించారు. ప్రభుత్వమే, సభాధ్యక్షులకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తూ వుందని 'పయనీర్' సిమ్లా విలేఖరి వ్రాశారు. ఆదరిమిలా చర్చ సందర్భంగా దేశ వ్యవహారాల సభ్యుడు ఇతర సభ్యుల మోస్తరుగానే తమ అసంతృప్తిని తెలియచేశారు. ప్రతిపక్ష నాయకులు చేసిన ఆరోపణలు నిజమైనవేనని సభాధ్యక్షులు ఒక ప్రకటన చేశారు. ఆదరిమిలా అటువంటి వార్తాపత్రికల విలేఖర్ల (పాస్) ప్రవేశార్హతను సభాధ్యక్షులు రద్దుచేశారు. సభాధ్యక్షులు మళ్ళీ ఆదేశాలిచ్చేవరకు యీవిలేఖర్లకు బిల్లులుగానీ యితర నోటీసులుగానీ పంపించరాదన్నారు.

1929 ఏప్రిల్ 11 న ప్రజా భద్రత బిల్లుమీద చర్చ కొనసాగకుండా, సభాధ్యక్షులైన పటేల్ తమకు స్వతహాగా వున్న అధికారాన్ని వినియోగించి ఏవిధంగా ఆపుచేసినదీ యింతకు ముందే గమనించాము. అమర్నాడు వైస్రాయి ఉభయసభలనుద్దేశించిమాట్లాడుతూ యీవిషయంలో తమ హక్కుల గురించి సభాధ్యక్షుల నిర్వచనంతో తాము ఏకీభవించటం లేదని చెప్పారు.

ఆదరిమిలా శాసనసభ 1929 సెప్టెంబర్ 2 న సమావేశం ప్రారంభించింది. ఈలోగా సభాధ్యక్షులయిన పటేల్ వైస్రాయితో చర్చించారు. సభాధ్యక్షుల తీర్పును ఆయన విమర్శించినందుకు, తమ నిరసన తెలియజేశారుకూడా. వైస్రాయికూడా తమపట్టు విడువలేదు. అయితే సభాధ్యక్షులను అగౌరవ పర్చాలన్న వుద్దేశ్యంగానీ, ఆయన హక్కులలో జోక్యంచేసుకోవాలన్న వుద్దేశ్యంగానీ తమకు లేదని తెలియజేశారు. సభ రెండవ తేదీన సమావేశమయినప్పుడు, యీపరిణామాల గురించి సభాధ్యక్షులు సుదీర్ఘమయిన ప్రకటన చేశారు. సభలో సభాధ్యక్షులిచ్చే తీర్పులను విమర్శించే అధికారంగానీ, అభిశంసించే అధికారంగానీ సభ్యులకు మాత్రమే వున్నదని వైస్రాయి అంగీకరించనందుకు పటేల్ సంతృప్తి వ్యక్తపరిచారు. ఈ చర్చను యింతటితో ముగించవలసిందని ఆయన సభికులకు విజ్ఞప్తి చేశారు. తాము అధ్యక్షులుగా వున్నంత కాలం, సభ్యులూ, సభాధ్యక్షులూ రాజ్యాంగానికి కట్టుబడి వుంటామని, సభాభవనంలో రాజ్యాంగమే అత్యున్నతమైనదనీ చెప్పారు. 83

సభా భవనానికి పోలీసులను కాపలా పెట్టే విషయమై కూడా పటేల్ ప్రభుత్వంతోనూ, అధికార్లతోనూ పోరాడవలసి వచ్చింది. 1928 ఏప్రిల్ 8 నాటి బాంబు

సంఘటన తర్వాత, సభా భద్రత సమస్య తలయెత్తింది. ఈ విషయాన్ని పరిశీలించేందుకు, సభాధ్యక్షులైన పటేల్, దేశ వ్యవహారాల సభ్యుడి అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించారు ; వాదప్రతివాదాలు జరిగాయి. 1930 జనవరి 20 వ తేదీన ప్రేక్షకుల గేలరీలో యూనిఫారం ధరించిన పోలీసులు కూర్చుని వుండటం సభాధ్యక్షులు గమనించి, గేలరీలను ఖాళీ చేయవలసిందిగా ఆదేశించారు. విధిలేక పోలీసులు అక్కడి నుంచి వెళ్లిపోవలసి వచ్చింది. శాసనసభా భవనానికి కాపలాగా పోలీసులను నియమించే విషయమై, తమకూ భారత ప్రభుత్వానికీ-ఢిల్లీ స్థానిక ప్రభుత్వానికే మధ్య భేదాభిప్రాయాల ఫలితంగా తీవ్రమయిన పరిస్థితి ఏర్పడిందని, సభాధ్యక్షులు, సభ్యులకు తెలియజేశారు. సభా భవనంలో, సభాధ్యక్షుల అధికారం ఉన్నతమైందనీ భద్రత చర్యలకు సంబంధించి సభాధ్యక్షుల నిర్ణయమే తుది నిర్ణయమనీ, ఆయన అనుమతి లేనిదే సభా ప్రాంగణంలో ఎటువంటి చర్య తీసుకోరాదనీ, సభాధ్యక్షులుగా తమ వైఖరిని స్పష్టం చేశారు. కాని ప్రభుత్వం మాత్రం, సభాధ్యక్షుల భద్రత, సభ్యుల భద్రతా తమ బాధ్యత అనీ, దానికిగానూ అవసరమైనంత మంది పోలీసులను నియమించే అధికారం తమకుందని ప్రభుత్వం పట్టు బట్టింది. ఈ విషయమై ప్రభుత్వం తన వైఖరిని పునరాలోచించాలని, సభాధ్యక్షులు వ్యక్తం చేశారు. ఈలోగా విలేఖర్లు కూర్చునే గేలరీలు తప్ప, మిగతా గేలరీలన్నింటినీ మూసివేయవలసిందని ఆదేశించారు.

ఈ సందర్భంలో వైస్రాయి జోక్యం చేసుకుని, సభాధ్యక్షులతోనూ, ప్రతిపక్ష నాయకులతోనూ, శాసనసభ్యులైన యితర పార్టీల నాయకులతోనూ, చర్చలు జరిపారు. ఈ విషయమై ఒక అంగీకారానికి వచ్చేందుకు ఫిబ్రవరి 20 వ తేదీన శాసనసభలో చేసిన ప్రతిపాదన ప్రాతిపదిక కాగలదని వైస్రాయి అన్నారు. ప్రభుత్వం, శాసనసభకు సహాయంగావుండేందుకు ఒక సీనియర్ అధికారిని నియమిస్తుందనీ, సభాభవనంలో భద్రత విషయంలో సభాధ్యక్షునికి ఆయన బాధ్యతవహిస్తారనీ, ఒప్పందంలో ముఖ్యంగా పేర్కొన్నారు. సభా భవనం వెలుపలి భద్రత విషయమై ఆ తర్వాత పరిశీలించవచ్చునని అభిప్రాయపడ్డారు. ఈలోగా, సభా భవనం వెలుపల పోలీసులకు ఇచ్చే ఆదేశాలన్నిటినీ, సభాధ్యక్షుల ఆమోదంతో రూపొందించవలసి వుంటుంది. ఆయన స్థానిక ప్రభుత్వ సలహా మీద వ్యవహరిస్తారు, ఇది సంతృప్తికరమైన పరిష్కారం కాగలదని సభాధ్యక్ష్యులు ఆశించారు.

సభ్యుల హక్కులూ, ప్రత్యేక సౌకర్యాలకోసం, వారిహోదాకోసం, సభాధ్యక్షులూ, సభ్యులూ యీ విధంగా అడుగడుగునా పోరాటం జరపవలసివచ్చింది. ఈ హక్కుల వల్ల ఇంగ్లండ్‌లోని కామన్స్ సభకు వున్న హోదా భారత శాసనసభ్యులకుకూడా సంక్ర

మించగలదన్న భయంతో అధికార్లు ఈ చర్యలను ప్రతిఘట్టంలోనూ ప్రతిఘటించారు. భారతీయులుఎంతో ముందుచూపుతో చేసిన కృషి ఇది.

స్వాతంత్ర్య పతాకావిష్కరణ :

శాసనసభలో యీ గొడవంతా జరుగుతూవుండగా, బైట ప్రజలు, బ్రిటిష్ సామ్రాజ్యవాద తత్వంతో పోరాటానికి సిద్ధపడుతున్నారు. సైమన్ సంఘాన్ని బహిష్కరించినప్పుడు కరెన్సీ, ఉక్కు రక్షణ, ప్రజాభద్రత, బిల్లులమీద శాసనసభలో చర్చ జరిగినప్పుడూ, ప్రజల మారుతున్న భావాలు ప్రస్ఫుటమయ్యాయి. అయినప్పటికీ, శాసనసభల వెలుపల జరుగుతున్న వాటికి యివి ఏ మాత్రం కొలబద్ధలుకావు.

1928లో గాంధీజీ తమ సత్యాగ్రహ సాధనాన్ని తమ కుడిభుజమయిన సర్దార్ వల్లభాయ్‌పటేల్ ద్వారా ప్రయోగించారు. బార్డోలీలో కర్షకులు పటేల్ నాయకత్వంలో పన్నుల నిరాకరణోద్యమాన్ని నిర్వహించారు. గాంధీజీ 1928 డిశంబరులో, కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభకు హాజరయ్యారు అంటే, యింకా రాజకీయ రంగానికి దూరంగా వుండాలని ఆయన అనుకోలేదన్నమాట. పూర్తి స్వాతంత్ర్యం కావాలనికోరుతూ మద్రాసు మహాసభలో ఆమోదించిన తీర్మానాన్ని మార్చి, నెహ్రూ నివేదికలో పేర్కొన్న విధంగా పూర్తి డొమినియన్ ప్రతిపత్తి కావాలని కోరుతూ మరొక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. అదే సమయంలో బ్రిటిషు ప్రభుత్వానికి ఒక అల్టిమేటం (అంతిమ తీర్మానం) యిచ్చారు. 1929 ఆఖరునాటికి బ్రిటిష్ ప్రభుత్వం నెహ్రూ నివేదికను ఆమోదించకపోయినట్టయితే, కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య సాధనకోసం తన అహింసాత్మక సహాయనిరాకరణోద్యమాన్ని మళ్లీ ప్రారంభిస్తుందని, కాంగ్రెసు హెచ్చరించింది. ఈసారి సహాయనిరాకరణోద్యం పన్నుల చెల్లింపు నిరాకరణతో ప్రారంభమవుతుంది. 1929 మార్చిలో గాంధిజీ మాట్లాడుతూ శాసనోల్లంఘనం వల్లా, పన్నుల చెల్లింపు నిరాకరణవల్లా సంభవించే బ్రహ్మాండమైన ఫలితాల గురించి తమకు పూర్తిగా తెలుసునని చెప్పారు. "స్వాతంత్ర్యం సాధించాలన్న ఉన్మాదంతో వున్న నా బోటివాడు ప్రమాదాలకు సిద్ధపడక తప్పదు"[84] అన్నారు.

దేశంలోని యువజనులూ, కార్మికులూ ఏ విధంగా ఆలోచిస్తున్నదీ, మీరట్ కుట్రకేసు, లాహోర్ కుట్రకేసు, జతీన్‌దాసు వీరమరణంవల్ల స్పష్టం అయింది. అన్నిటినీ మించినది, సైమన్ సంఘాన్ని బహిష్కరించటం.

1929 మధ్యనాటికి, ఆందోళన చెందిన భారతీయులు పోరాటపథంవైపు పురోగమిస్తున్నారని, వారిని శాంతింపచేయడం అవసరమనీ వైస్‌రాయ్ లార్డ్ అర్విన్ వాగా

గుర్తించారు. ఆ సమయానికి ఇంగ్లండులో లేబర్‌పార్టీ మళ్ళీ అధికారంలోకి వచ్చింది. వేసవిలో ఆయన స్వదేశం వెళ్ళారు. భారతదేశంలో బ్రిటిషు విధానం గురించి సైమన్ నివేదికను ప్రచురించిన తర్వాత రాజ్యాంగాన్ని తయారుచేయడంలో భారతీయులకు సంబంధం ఉండేట్టు చేయడంగురించీ చేయబోతున్న ప్రకటన గురించి ఆయన ప్రభుత్వంతో సంప్రదించారు. ఈ లోగా సైమన్ సంఘం నివేదిక ఇంకా సిద్ధం కాక పోవడంవల్ల శాసనసభకు 1929 ఆకులురాలేకాలంలో జరుగవలసిన ఎన్నికలను వాయిదా వేయబోతున్నట్టు వైస్‌రాయ్ మే నెలలో ప్రకటించారు.

ఇంగ్లాండునుంచి తిరిగివచ్చిన తర్వాత 1929 అక్టోబరు 31 వ తేదీన వైస్‌రాయ్: "భారతదేశంలో రాజ్యాంగ పరమైన అభివృద్ధి ఫలితంగా డొమినియన్ ప్రతిపత్తి ఏర్పాటు కాగలదని 1917వ సంవత్సరపు ప్రకటనల్లోనే పేర్కొన్నట్టు తమ ప్రభుత్వంతరపున ప్రకటించేందుకు తమకు అధికారమిచ్చినట్టు" ప్రకటించారు. 85

దీనితో, భారతదేశంలో బ్రిటిషువారి ఉద్దేశ్యాల గురించి ఎటువంటి సందేహాలు ఉండనక్కరలేదని వైస్‌రాయ్ అభిప్రాయపడ్డారు. రాజ్యాంగాన్ని రూపొందించడంలో భారతీయులకుకూడా పాత్ర కల్పించే విషయమై ప్రస్తావిస్తూ ఆయన సైమన్‌సంఘం తన నివేదికను సమర్పించిన తర్వాత ప్రభుత్వం దాన్ని పరిశీలించిన తర్వాత బ్రిటిషు ప్రభుత్వం బ్రిటిషు ఇండియా ప్రతినిధులనూ సంస్థానాల ప్రతినిధులనూ, బ్రిటిషు ఇండియా సమస్యల గురించీ అఖిలభారత సమస్యల గురించీ చర్చించేందుకు ఆహ్వానిస్తుందని తెలియచేశారు. క్లుప్తంగా చెప్పాలంటే మరికొన్ని రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించిన సమస్యల గురించి చర్చించేందుకు రౌండ్ టేబుల్ సమావేశాన్ని ఏర్పాటు చేస్తారన్నమాట. సైమన్ సంఘంలో భారతీయులను నియమించనందుకు ప్రజల్లోకలిగిన చిరాకును తొలగించేందుకు ఈవిధంగా తలపెట్టారు.

వైస్‌రాయ్ ప్రకటనగురించి చర్చించేందుకు ప్రముఖ రాజకీయ నాయకులు ఢిల్లీలో నవంబరు ఒకటవ తేదీన సమావేశమయ్యారు. ప్రముఖ కాంగ్రెసు నాయకులూ ఉదారవాది నాయకులూ సమావేశానికి హాజరయారు. వీరిలో గాంధీజీ, మాలవ్యా, మోతీలాల్‌నెహ్రూ, జవహర్‌లాల్‌నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్, తేజ్‌బహదూర్‌సప్రు పాల్గొన్న ఈ సమావేశంలో ఒకప్రకటన విడుదలచేశారు. "బ్రిటిషు ప్రభుత్వానికి మా సహకారాన్ని అందివ్వగలమనే ఆశిస్తున్నాము. అయితే దేశప్రజలకు విశ్వాసం కలిగేందుకూ దేశంలోని ప్రధానమైన రాజకీయ సంస్థల సహకారాన్ని పొందేందుకూ ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకోవలసి వుంటుంది. (రాజకీయ ఖైదీలకు క్షమాభిక్ష పెట్టడంవంటివి) కొన్ని అంశాల గురించి స్పష్టంగా తెలియచేయవలసి వుంటుంది"

అని ప్రకటనమీద సంతకాలు చేసినవారు పేర్కొన్నారు. ప్రకటనలో ఇంకా ఈవిధంగా అన్నారు:

"ప్రభుత్వం ఏర్పాటుచేస్తున్న ఈ సమావేశం డొమినియన్ ప్రతిపత్తి గురించి కాక, చర్చించడానికి డొమినియన్ రాజ్యాంగానికి ఒక పథకాన్ని తయారుచేయడానికి జరుగుతుందని తెలుస్తోంది"86

వైస్‌రాయ్ డిశంబరు 23న గాంధీజీ, జిన్నా, మోతీలాల్ నెహ్రూ, సప్రు మరికొందరినీ తమ భవనానికి పిలిపించారు. ప్రభుత్వం ఏర్పాటుచేయబోతున్న రౌండు టేబుల్ సమావేశంలో భారతదేశంలో డొమినియన్ ప్రతిపత్తిని ఏర్పాటు చేసేందుకు రాజ్యాంగం ముసాయిదాను తయారు చేస్తారనీ, ఈరాజ్యాంగాన్ని వెంటనే అమలు పరుస్తారనీ వాగ్దానం చేయవలసిందని కాంగ్రెసు నాయకులు కోరారు. అటువంటి వాగ్దానంచేసే స్థితిలో వైస్‌రాయ్ లేడనీ స్పష్టంగా తెలిసిపోయింది. సమావేశం నిరుపయోగమైంది.

ఈ పరిస్థితిలో భారత జాతీయ కాంగ్రెసు, 1929 ఆఖరులో లాహోర్‌లో సమావేశమైంది. భారత యువజనుల ఆదర్శమూర్తి అయిన పండిత జవహర్‌లాల్‌నెహ్రూ సమావేశానికి అధ్యక్షత వహించారు. ఆయన అధ్యక్షతన గాంధీజీ ప్రధాన తీర్మానాన్ని ప్రతిపాదించారు:

"ఈ కాంగ్రెసు, గత ఏడాది కలకత్తా మహాసభలో ఆమోదించిన తీర్మానానికి అనుగుణంగా కాంగ్రెసుపార్టీ ప్రణాళికలోని ఒకటవ ప్రకరణలో పేర్కొన్న స్వరాజ్ అన్న పదానికి అర్థం సంపూర్ణ స్వాతంత్ర్యమనీ, నెహ్రూ నివేదికలోని పథకం మొత్తం ఇకచెల్లనేరదనీ, ఇకమీద కాంగ్రెసు సభ్యులందరూ సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం కృషిచేయాలనీ ప్రకటిస్తూవుంది.87

ఇప్పుడు ప్రజలు కోరుతున్నది సంపూర్ణ స్వాతంత్ర్యమని తేటతెల్లమైంది. కాంగ్రెసు సభ్యుల దృష్టి చలించకుండా వుండేందుకుగాను ఇకమీద శాసనసభకు జరిగే ఎన్నికల్లో కాంగ్రెసు సభ్యులు పాల్గొనరాదని ఆదేశించారు. శాసనసభల నుంచీ ఇతర సంఘాలనుంచీ కాంగ్రెసు సభ్యులు రాజీనామా చేయాలని ఆఖరుకు ఆదేశించారు.

అన్నివైపులా ఉత్సాహం వెల్లుబుకుతూ వుండగా 1929 డిశంబరు 31వ తేదీ రాత్రి 12 గంటలు కొట్టినతర్వాత, స్వాతంత్ర్య పతాకాన్ని ఆవిష్కరించారు. శాసనసభల్లో స్వాతంత్ర్య ప్రతిధ్వనీ ఏ విధంగా వ్యాపించినదీ తర్వాతి అధ్యాయంలో చూడగలం.

1927-29 మధ్యకాలంలో దేశప్రజలు తమ బలాన్ని కూడగట్టుకుంటున్నారని

మాత్రం చెప్పగలం. ప్రతిఘటనజ్యోతి, ప్రతికూలమైన గాలులు అప్పుడప్పుడూ అల్లల్లాడించినా, శాసనసభలో జాజ్వల్యమానంగా వెలుగుతూనేవుంది.

## రెఫరెన్సులు


1. సుభాష్ చంద్రబోసు, ది ఇండియన్ స్ట్రగుల్: 1920-1942 (బొంబాయి, 1940) పే. 120
2. రామ్‌గోపాల్ అండ్ దిగ్విజయసింగ్, ఇండియన్ పాలిటిక్స్ ఫ్రమ్ క్రౌన్ రూల్ టు ఇండిపెండెన్స్: 1858-1947 (అలీఘర్ యస్. డి.) పే. 284
3. ఇబిడ్., పే. 184-5,
4. హిందూముస్లిం సమస్య పరిష్కారానికి దేశబంధు చిత్తరంజన్‌దాసు బెంగాల్‌కూ ఒక ముసాయిదా ఒప్పందాన్ని తయారుచేశారు. ఇదే బెంగాల్ ఒప్పందంగా ప్రఖ్యాతిగాంచింది. బెంగాల్ శాసనసభకు జనాభా ప్రాతిపదికగా సంయుక్త నియోజకవర్గాలనుంచి ప్రతినిధులను ఎన్నుకునేందుకు ఈ ఒప్పందంవల్ల వీలు ఏర్పడింది. స్థానిక సంస్థల్లో అధిక సంఖ్యాకవర్గాలకు (ముస్లింలు) 60 శాతం ప్రాతినిధ్యమూ, అల్పసంఖ్యాక వర్గాలకు (హిందువులు) 40 శాతం ప్రాతినిధ్యమూ ఉంటుంది. ప్రభుత్వోద్యోగాల్లో 55 శాతం ముస్లింలకు కేటాయిస్తారు. సర్వీసుల్లో వారి కొరత తీరేవరకూ ఇది కొనసాగుతుంది. హిందూ నాయకులు కొంతమంది ఈ ఒప్పందాన్ని గట్టిగా ప్రతిఘటించారు. కాకినాడ కాంగ్రెసు (డిశంబరు 1923) దీన్ని ధృవపరచలేకపోయింది.
5. బి. ఆర్. నంద, మోతీలాల్ నెహ్రూ (కొత్తఢిల్లీ, 1964) పే. 169.
6. బి. పట్టాభి సీతారామయ్య, హిస్టరి ఆఫ్ ది నేషనల్ కాంగ్రెసు (బొంబాయి 1945), 1, పే. 305
7. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1927, పే.21-22
8. ఇబిడ్., పే. 25-26
9. ఇబిడ్., పే. 29
10. ఇబిడ్., పే 442-5
11. ఇబిడ్., పే. 488
12. ఇబిడ్., పే. 491

13. ఇబిడ్., పే. 500
14. కోట్‌మన్, ఇండియా ఇన్ 1926-27 పే. 68
15. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ ఎన్. 7, పే. 129
16. ఇబిడ్., పే. 142
17. ఇబిడ్., పే. 747
18. ఇబిడ్., పే. 768
19. ఇబిడ్., పే. 905-06
20. ఇబిడ్., పే. 907
21. ఇబిడ్., పే. 989
22. ఇబిడ్., పే. 759
23. ఇబిడ్., పే. 1109—10
24. ఇబిడ్., పే. 916
25. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 2, 1927, పే. 1777
26. కోట్‌మన్, యన్. 14, పే. 87
27. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, యన్. 25, పే. 1800
28. ఇబిడ్., పే. 1866
29. ఇబిడ్., పే. 1262-4
30. బోస్, యన్. 1, పే. 142
31. బి. డి. శుక్ల, ఎ హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ లిబరల్ పార్టీ (అలహాబాద్ 1960) పే. 296-7
32. ఇబిడ్., పే. 299
33. యస్. గోపాల్, ది వైస్రాయల్టీ ఆఫ్ లార్డ్ అర్విన్ (అక్స్‌ఫర్డ్ 1957) పే. 23
34. రెండవ ఎర్ల్ బర్కెన్ హెడ్, ది లైఫ్ ఆఫ్. యఫ్. ఇ. స్మిత్, ఫస్ట్ ఎర్ల్ ఆఫ్ బర్కెన్ హెడ్ (లండన్, 1960) పే. 512
35. ఇబిడ్., పే. 515
36. ఇబిడ్., పే. 516

37. వి. సి. జోషి, ఎడ్., లాలాలజపత్‌రాయ్: రైటింగ్స్ అండ్ స్పీచెస్ (ఢిల్లీ, 1966) వా. 2, పే. 379-90
38. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1928, పే. 397
39. ఇబిడ్., పే 407-11
40. ఇబిడ్., పే. 424
41. ఇబిడ్ ., పే. 425
42. ఇబిడ్.
43. ఇబిడ్., పే. 429
44. ఇబిడ్., పే. 445
45. ఇబిడ్., పే. 461
46. ఇబిడ్., పే. 463
47. ఇబిడ్.
48. యంగ్ ఇండియా, 6 డిసెంబరు 1928
49. బర్కెన్‌హెడ్. యస్. 34. పే. 508
50. యం. రఫీక్ అఫ్‌జల్, సెలెక్టెడ్ స్పీచెస్ అండ్ స్టేట్‌మెంట్స్ ఆఫ్ క్వాది అజమ్ మొహమ్మదలీ జిన్నా (లాహోర్, 1966) పే. 302—05
51. కె. యం. పణిక్కర్ అండ్ ఎ. పర్షాద్. ఎడ్స్., ది వాయిస్ ఆఫ్ ఫ్రీడమ్, సెలెక్టెడ్ స్పీచెస్ ఆఫ్ పండిత్ మోతీలాల్‌నెహ్రూ (బొంబాయి, 1961) పే. 436—47
52. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ వా. 2, 929 పే. 1731
53. ఇబిడ్., పే. 1727
54. ఇబిడ్.
55. ఇబిడ్., పే. 1832—35
56. ఇబిడ్., పే. 1815-23
57. బర్కెన్‌హెడ్, యస్. 34, పే, 507
58. అర్. పామేదత్; ఇండియా టుడే (బొంబాయి, 1949) పే. 336
59. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 3, 1928, పే. 458, 467

60. ఇబిడ్., పే. 645
61. ఇబిడ్., పే. 671
62. ఇబిడ్., పే. 675
63. పణిక్కర్ అండ్ పర్షాద్ యన్. 51, పే. 392
64. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 3. 1928, పే. 783
65. ఇబిడ్., పే. 813
66. ఇబిడ్., పే. 1358
67. ఇబిడ్., పే. 1372
68. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, 1929 వా. 1. పే. 390
69. ఇబిడ్., పే 463
70. ఇబిడ్., పే. 485-8
71. ఇబిడ్., పే. 578
72. పణిక్కర్ అండ్ పర్షాద్, యన్. 51, పే. 588, 406, 411
73. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ యన్. 70, పే. 564
74. గోపాల్, యన్, 33, పే. 44
75. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 3, 1929, పే. 2652-54
76. ఇబిడ్., పే. 2888
77. ఇబిడ్., పే. 2987-91
78. ఇబిడ్., పే. 2996
79. ఇబిడ్., పే. 2472
80. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1929, పే. 802-03
81. ఇబిడ్., పే. 809
82. బోసు, యన్. 1, పే 118
83. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1929, పే. 109-12
84. గోపాల్ యన్. 33, పే. 47

85. ఇండియా ఇన్ 1929-30, పే. 466-8

86. గోపాల్, యన్, 33, పే. 51

87. సీతారామయ్య, యన్. 6, పే, 357

అయిదవ అధ్యాయం

# స్వరాజ్య వాదులులేని శాసనసభ : 1930—1934

## లాహోర్ కాంగ్రెస్ - ఆ తర్వాత

1929 డిశంబరులో లాహోర్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభ, సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం పోరాడలవసిందని ప్రజలను ఉద్బోధించింది. 1930 లో దేశంలో కల కలం బయలు దేరింది. కార్యాచరణ పథకాన్ని తయారు చేయవలసిందని లాహోర్ కాంగ్రెసు అఖిల భారత కాంగ్రెసు సంఘాన్ని ఆదేశించింది. పోరాటం ప్రారంభించేందుకు గాంధీజీ ఉత్తర్వు జారీచేయవలసి వుంది. ఆ సమయంలో దేశ ప్రజలందరూ ఉత్సుకతతో ఎదురుచూడ సాగారు. ముందు ఏం జరుగబోతున్నదోనని. "రథ చక్రాలు తిరగడం ప్రారంభించాయి. అయితే ఎక్కడ ఏవిధంగా ప్రారంభించా లన్నది ఇంకా అగమ్యగోచరంగా వుంది" అని జవహర్‌లాల్‌నెహ్రూ ఆ తర్వాత వ్రాశారు.1

లాహోర్ కాంగ్రెసు నిర్ణయాలను అమలుపరచేందుకు చర్యలు తీసుకోవడానికి కొత్త కాంగ్రెసు కార్యావర్గం 1930 జనవరి 2 వ తేదీన సమావేశమైంది. మొట్టమొదట, శాసన సమితులను బహిష్కరించే విషయమై ప్రారంభించింది. రిజిస్టరయిన ఓటర్లు లాహోర్ కాంగ్రెసు ఆదేశాన్ని అనుసరించి శాసన సమితుల్లో తమ సభ్యత్వానికి రాజీ నామానివ్వని సభ్యులు రాజీనామా చేసేట్టు చూడాలని పేర్కొన్నారు. శాసన సమితు లకు ముందు ముందు జరిగే ఎన్నికల్లో పాల్గొనరాదని కూడా ఓటర్లను కోరింది. జనవరి 26 వ తేదీని స్వాతంత్ర్యదినంగా దేశమంతటా ఉత్సవాలు జరుపుకునేందుకు నిశ్చ యించింది. గాంధీజీ, స్వాతంత్ర్య ప్రకటన నొకదాన్ని తయారు చేశారు. దీన్ని కాంగ్రెసు కార్యవర్గం ఆమోదించిది. "మా దేశానికి అవాంతరంగా తయారైన పాల నకు ఇకమీద అణిగిమణిగి వుండడం, మానవుడిపట్లా దేవుడిపట్లా కూడా అత్యాచారమే అవుతుంది 2 " అని ఈ ప్రకటనలో పేర్కొన్నారు. ఈ ప్రకటనను దేశమంతటా

పట్టణాల్లోనూ పల్లెల్లోనూ ప్రజలకు చదివి వినిపించాలని నిర్ణయించుకున్నారు. పూర్ణ స్వరాజ్యస్థాపనకు, కాంగ్రెసు ఇచ్చే ఆదేశాలను అనుసరిస్తామని ప్రజలు ప్రతిజ్ఞపూనేట్టు చేయాలని కూడా నిర్ణయించుకున్నారు. స్వాతంత్ర్యదినాన్ని పాటించేందుకు అన్ని ఏర్పాట్లు జరుగుతూండగా ప్రజలు అంతకు ముందెన్నడూ లేనంత ఉత్సాహాన్ని ప్రదర్శించారు. 3

ఈ సమయంలో ఢిల్లీలో 1930 జనవరి 20 వ తేదీన శాసనసభ ఆరవ సమావేశం ప్రారంభమైంది. కాంగ్రెసు ఆదేశాన్ననుసరించి ఇరవై ఏడుగురు శాసనసభ్యులు రాజీనామా చేశారు. దీనితో ప్రతిపక్షమైన స్వరాజ్యవాదుల బృందం, శాసన సభనుంచి పూర్తిగా తొలగిపోయింది. వారి స్థానాన్ని పండిత మదనమోహన్‌మాలవ్యా నాయకత్వంలో జాతీయవాదుల పార్టీ ఆక్రమించింది. రాజీనామాచేయని కొంత మంది స్వరాజ్యవాదులు, వెనుక బెంచీలకు వెళ్లవలసి వచ్చింది. అప్పటి శాసనసభలో గొడవ జరిగే అవకాశమే లేకపోయింది. 4

అయితే ఈ ప్రశాంతతను సభాధ్యక్ష్యులే కొంత బెదర కొట్టారు. కాంగ్రెసు తీర్మానించినప్పటికీ సభాధ్యక్ష పదవికి రాజీనామాచేయని వి. జె, పటేల్, మొదటి రోజునే శాసనసభా భవనానికి భద్రత ఏర్పాట్లగురించి వివాదాన్ని లేవతీశారు. కొంత ఉద్రిక్తత ఏర్పడింది కాని దరిమిలా ఒక అంగీకారం కుదిరింది. (నాల్గవ అధ్యాయం చూడుడు) ఆ మరునాడు, శాసనసభలను నిషేధించే విషయమై తమ వైఖరిని సభాధ్యక్షులు స్పష్టం చేశారు. ఏదైనా ఒక రాజకీయపార్టీ ఆదేశాన్ని సభాధ్యక్షులు అనుసరించరాదనీ అందుకే తాము రాజీనామాచేయలేదనీ చెప్పారు. "భారతదేశంలో నెలకొనివున్న పరిస్థితుల దృష్ట్యా దేశ శ్రేయస్సుకోసం శాసనసభాధ్యక్షులు ఇంతకంటే స్వేచ్ఛవుండేస్థానం కోసం రాజీనామా చేయవలసిరావచ్చు"5 వని ఆయన స్పష్టం చేశారు. అంటే ముందుగా నోటీసు ఇవ్వడ మన్నమాట.

లాహోర్ కాంగ్రెసు నిర్ణయాలకు అనుగుణంగా పౌర ఉల్లంఘనకు సన్నాహాలు జరుగుతున్న దృష్ట్యా వైస్‌రాయ్‌కూడా ప్రభుత్వ విధానాన్ని స్పష్టంచేయడంలో జాగుచేయలేదు. జనవరి 25న ఆయన శాసనసభ్యులనుద్దేశించి మాట్లాడారు. 1929 అక్టోబరు 31న తాము చేసిన ప్రకటనవల్ల కలిగిన సందేహాలను తొలగించేందుకు ప్రయత్నించారు. ఆ సందర్భంలో తాము, భారత రాజ్యాంగ అభివృద్ధి లక్ష్యం గురించి వివరించామనీ లక్ష్యసాధనతో దాన్ని ముడిపెట్టరాదనీ చెప్పారు. "భారత రాజకీయవర్గాలకూ భారత ప్రభుత్వానికీ మధ్య రాజీ కుదిరేందుకు తాము అన్నివిధాలా కృషి చేస్తామని చెప్పారు. అప్పుడు గ్రేట్‌బ్రిటన్ - భారతదేశమూ కలిసి ప్రస్తుత ఇబ్బందులకు ఒక పరిష్కార

మార్గాన్ని కనిపెట్టే వీలు కలుగుతుంద"ని వైస్‌రాయ్ అన్నారు. లాహోర్ కాంగ్రెసు నిర్ణయాల గురించి ప్రస్తావిస్తూ ఆయన, ఈ విధంగా హెచ్చరించారు.

"శాంతిభద్రతల పరిరక్షణకు నామీదా నా ప్రభుత్వంమీదా వున్న బాధ్యతను నేను పూర్తిగా నిర్వర్తిస్తాను." 6

## దండి యాత్ర

ఈ ముఖ్యమైన ప్రకటనలు వినడమేకాక శాసనసభ అనేక బిల్లుల గురించి చర్చ జరిపింది. నిజమైన ప్రతిపక్షమంటూ లేకపోవడంతో ఈ బిల్లులను ఆమోదించడంలో ప్రభుత్వానికి ఏమాత్రం ఇబ్బంది లేకపోయింది. రైల్వే బడ్జెటునుకూడా కొంత చర్చ తర్వాత ఆమోదించారు.

ఈలోగా, శాసనసభల వెలుపల వాతావరణం వేడెక్కుతూవుంది. జనవరి 26న దేశవ్యాప్తంగా ఉత్సవాలు జరిగాయి. గాంధీజీ ఇంకా సంఘర్షణకు దిగలేదు. జనవరి 30న ఆయన 'యంగ్ ఇండియా'లో పదకొండు అంశాలను పేర్కొంటూ వీటి విషయమై వైస్‌రాయ్, భారతీయులను సంతృప్తిపరచాలని కోరారు. గాంధీజీ తమ పదకొండు అంశాలలో "పూర్ణ స్వాతంత్ర్యం" అన్న కాంగ్రెసుకోరికను సడలించారని కాంగ్రెసు అధ్యక్షులైన జవహర్‌లాల్ నెహ్రూతోపాటు చాలామంది భారతీయ నాయకులు అభిప్రాయపడినప్పటికీ గాంధీజీ మాత్రం స్వాతంత్ర్యం బహిర్ స్వరూపం గురించి తమకు అంత పట్టింపులేదనీ తమకు కావలసింది స్వరాజ్యమని పేర్కొంటూ, వైస్‌రాయ్ కనుక ఈ అంశాల విషయమై భారతీయులను సంతృప్తిపరచినట్లయితే పౌర ఉల్లంఘన గురించి ప్రస్తావించబోమనీ అభిప్రాయ ప్రకటన స్వేచ్ఛ వుండే ఎటువంటి సమావేశంలోనైనా కాంగ్రెసు హృదయపూర్వకంగా పాల్గొంటుందనీ ప్రకటించారు.

ప్రభుత్వం దీనికి ఎటువంటి సమాధానమూ ఇవ్వకపోవడంతో గాంధీజీ ఫిబ్రవరి ఆఖరులో ఉప్పు చట్టాలమీద పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించేందుకు నిశ్చయించారు. "పేదలదృష్ట్యా ఉప్పుపన్ను అన్నిటికంటే అన్యాయమైనది కావడంచేత స్వాతంత్ర్య ఉద్యమాన్ని గాంధీజీ, ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించడంతో ప్రారంభించాలని నిశ్చయించారు. ఈ చట్టంవల్ల ప్రజలు, ఉప్పును తయారుచేసుకునే వీలులేకుండా పోయింది. గాంధీజీ మార్చి 2వ తేదీన మళ్ళీ వైస్‌రాయ్‌కి వ్రాశారు. బ్రిటిష్ పాలనవల్ల భారతదేశంలో కలిగిన చెడుగులను తొలగించవలసిందని ఆయన వైస్‌రాయ్‌కి విజ్ఞప్తి చేశారు. వైస్‌రాయ్ అటువంటిచర్య తీసుకోకపోయినట్లయితే, తామూ తమ సహచరులు దండిలో సముద్ర తీరానికివెళ్లి అక్కడ చట్టాన్ని ఉల్లంఘిస్తామని గాంధీజీ వైస్

రాయ్‌కి తెలియచేశారు. వైస్‌రాయ్ నుంచి తుంచినట్టుగా వ్యతిరేకంగా సమాధానం వచ్చింది. సంప్రదింపులకు ఎటువంటి అవకాశమూ లేకపోవడంతో గాంధీజీ డెబ్బయి తొమ్మండుగురు సహచరులతో దండికి దేశప్రజలందరూ అభినందిస్తూవుండగా 141 మైళ్ళ యాత్ర ప్రారంభించారు. ఈలోగా ప్రభుత్వం చూస్తూ వూరుకోలేదు. గాంధీజీ దండియాత్ర ప్రారంభించకముందే గుజరాత్‌లోని బోర్‌సాద్ తాలూకాలోని ఒక గ్రామంలో మార్చి 7వ తేదీన బహిరంగ సమావేశంలో ఉపన్యసిస్తూవుండగా సర్దార్ వల్లభాయ్ పటేల్‌ను అరెస్టు చేశారు. స్వాతంత్ర్యయోధులకు ఇది హెచ్చరిక అయింది.

## శాసనసభ విషయంలో మాలవ్య విస్పృహ

పటేల్ అరెస్టయినపుడు ఢిల్లీలో శాసనసభ సమావేశం జరుగుతూవుంది. సర్దార్ పటేల్ అరెస్టు గురించి చర్చించేందుకు సభ వాయిదాపడాలని ప్రతిపక్ష నాయకులైన పండిత మదనమోహన్ మాలవ్యా 10వ తేదీన కోరారు. అనుమతి లభించింది. మాలవ్యా, ప్రభుత్వాన్ని రెండు అంశాల విషయంలో ఖండించారు. ఒకటి: ప్రభుత్వం, పటేల్‌ను, ఇంకా ఉపన్యసించకముందే అరెస్టుచేసి అప్పుడు అమల్లోవున్న చట్టాన్ని ఉల్లంఘించింది. రెండు: గాంధీజీ ప్రతిపాదనలన్నిటినీ త్రోసిపుచ్చి ప్రభుత్వం, అహింసాయుత ఉద్యమాన్ని ప్రారంభించడంకంటె గాంధీజీకి మరొకమార్గంలేకుండా చేసింది. "స్వయంపాలన కావాలన్న భారతీయుల ఆక్రందనను శ్రీ గాంధీ ఉద్యమం ప్రతిబింబిస్తుందన్న అంశాన్ని గుర్తుంచుకోవడం ముఖ్యం." అన్నారాయన. 8 ప్రస్తుత పరిస్థితి తీవ్రమైనదనీ చట్టాన్ని సవరించినపుడు డొమినియన్ ప్రతిపత్తిని ప్రకటించేందుకు సిద్ధపడివుండాలనీ భారత ప్రభుత్వం బ్రిటిషు ప్రభుత్వానికి తెలియచేయాలని మాలవ్యా కోరారు. బ్రిటిషు ప్రభుత్వం అందుకు సిద్ధపడనిచో ఈ విషయాన్ని ఐక్య రాజ్యసమితికి (లీగ్ ఆఫ్ నేషన్స్‌కు) నివేదించవలసివుంటుందనీ ఆయన హెచ్చరించారు. ఐక్యరాజ్యసమితిలో భారతదేశానికి అప్పటికే సభ్యత్వముంది.9

సి.ఎస్. రంగఅయ్యర్, మాలవ్యాను సమర్థిస్తూ గాంధీజీజైల్లో వుండగా ఏమాత్రందేశ భక్తివున్న భారతీయుడూ రౌండ్‌టేబుల్ సమావేశానికి హాజరుకాబోడని గుర్తుంచుకో వలసిందని ప్రభుత్వానికి చెప్పారు.10 ప్రభుత్వం అణిచిపెట్టే విధానాన్ని మానుకుని, ప్రజాభిప్రాయాన్నీ గాంధీజీవంటి గొప్ప నాయకుల అభిప్రాయాన్నీ మన్నించడం మంచిదని ఎం. ఎస్. అనే ప్రభుత్వాన్ని కోరారు.

అయితే మౌల్వీ మహమ్మద్ యాకూబ్‌ఖాన్, మాలవ్యాతో అంగీకరించలేదు. నిజా నికి పటేల్‌ను అరెస్టు చేయడం, అమల్లోవున్న చట్టాన్ని ఉల్లఘించడం కాదని ఆయన వాదించారు. అదీకాక కాంగ్రెసు అనుసరిస్తున్న విధానంవల్ల దేశంలో అరాచకమూ

కల్లోలమూ ఏర్పడుతాయని ఆయన అభిప్రాయ పడ్డారు. 11 జిన్నా కూడా గాంధీజీ ప్రారంభించిన ఉద్యమంతో తాము అంగీకరించడంలేదని స్పష్టం చేశారు. "ప్రభుత్వానికి సంబంధించినంతవరకూ ఈ ఉద్యమాన్ని బెదరింపుగాగాని బలవంతంపెట్టడంగాని ఉపయోగించడం నాకిష్టం లేదు" అని కూడా ఆయన చెప్పారు. 12 అయితే సర్దార్ పటేల్, శిక్షస్మృతికిందికివచ్చే ఉపన్యాసమేదీ చేయలేదని తాము భావిస్తున్నట్టు మాత్రం చెప్పారు.

చివరకు, సభలో ఓటింగ్ జరిగింది. మాలవ్యా వాయిదా తీర్మానం 53 ఓట్లతో వీగిపోయింది. అనుకూలంగా 30 ఓట్లు మాత్రమే వచ్చాయి. ఇండిపెండెంట్లు ఎక్కువ మంది తటస్థంగా వున్నారు. ముస్లింసభ్యులందరూ ప్రభుత్వంతో ఓటు చేశారు.

మాలవ్యా అప్పుడు కూడా అంత నిస్పృహ చెందలేదు. మార్చి 13 న, ప్రభుత్వం జవుళి పరిశ్రమ (రక్షణ) బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టినపుడు ప్రభుత్వం వ్యవహరించిన తీరు ఆయనకు పూర్తిగా నిరాశ కలిగించింది. ఈ బిల్లుకింద ఇంగ్లండు తప్ప, మిగత అన్నిదేశాల నుంచి దిగుమతి చేసుకునే జవుళి వస్త్రాల మీద నూటికి ఇరవైవంతుల దిగుమతి సుంకాన్ని విధిస్తారు. ఇంగ్లండు నుంచి దిగుమతి చేసుకునే జవుళి వస్త్రాల మీద నూటికి 15 వంతులు మాత్రమే విధిస్తారు. అంటే 5 శాతం తక్కువన్నమాట. బ్రిటిష్ సామ్రాజ్యానికి ఈవిధంగా ప్రత్యేక సౌకర్యం కల్పించడాన్ని మాలవ్యా, కుంజ్రు బిశ్వనాద్‌దాస్, ఘనశ్యామదాస్-చమన్‌లాల్-జయకర్-కె. సి. నియోగి-ఇంకా చాలామంది వ్యతిరేకించారు. ప్రభుత్వాన్ని సమర్థించినవారు కూడా లేకపోలేదు. జిన్నా ఎటూ స్పష్టంగా చెప్పలేదు. మార్చి 27 న ఏ దేశం నుంచి దిగుమతి చేసుకునే జవుళి వస్త్రాలైన వాటి మీద విధించేసుంకం సమానంగా ఉండాలని పేర్కొంటూ మాలవ్యా ఒక సవరణను ప్రతిపాదించారు. సవరణ మీద అసలు బిల్లు మీద మూడు రోజులపాటు హోరాహోరి చర్చ జరిగింది. మార్చి 31 న మాలవ్యా సవరణ మీద ఓటింగ్ జరిగింది. సవరణ 60 ఓట్లతో వీగిపోయింది అనుకూలంగా 44 ఓట్లు పడ్డాయి.

ఓటింగ్ ఫలితాన్ని ప్రకటించిన వెంటనే మాలవ్యా లేచి "ఈ బిల్లుమీద జరిగే చర్చలో పాల్గొనడం మహా పాపమే అవుతుంది" అని చెప్పి, ఇతర జాతీయవాద పార్టీ సభ్యులతోపాటు సభనుంచి వెళ్లిపోయారు. ఆ తర్వాత దివాన్ చమన్‌లాల్ మాలవ్యా చెప్పిన దానినంతటినీ సమర్థించారు. ఆయన కూడా తమకొత్త స్వరాజ్యపార్టీలోని మిగతా సభ్యులతోపాటు సభ నుంచి నిష్క్రమించారు. ఆ దరిమిలా షణ్ముగం చెట్టి ప్రతిపాదించిన నిరపాయకరమైన సవరణతోపాటు బిల్లును ఆమోదించారు.

ఆవేళ సభ వాయిదా పడేముందు సభాధ్యక్షులైన పటేల్ సభ్యులందరితో కరచాలనం

చేస్తూ "శాసనసభ మళ్ళీ అసలు సమావేశమౌతుందో లేదో తెలియదు. సమావేశమైనా, మనలో ఎంతమంది సమావేశంలో పాల్గొంటామోలేదో కూడా తెలియదు " అన్నారు. శాసనసభ ఢిల్లీ సమావేశం అవిధంగా ముగిసింది.

రెండు రోజుల తర్వాత ఏప్రిల్ 2 న మాలవ్యా శాసనసభ్యత్వానికి రాజీనామా చేశారు. వైస్‌రాయ్‌కి ఒక ఉత్తరం వ్రాస్తూ " పత్తి రక్షణ బిల్లును" సభ్యులు ఆమోదించక పోయినప్పటికీ ఏవిధంగా బలవంతంగా ఆమోదింపచేసినదీ వర్ణించారు. "అందువల్ల, మా ప్రజలకు అన్యాయం జరిగేందుకు వీలుకల్పిస్తున్న రాజ్యాంగాన్ని సమర్థిస్తూ శాసన సభలో సభ్యుడిగా కొనసాగరాదన్న నిశ్చయానికి రావలసి వచ్చింది" 13

## ఉప్పుసత్యాగ్రహం

గాంధీ, 24 రోజుల యాత్ర తర్వాత ఏప్రిల్ 5న దండి చేరుకున్నారు. ఆ మరు నాడు సముద్రతీరం నుంచి గుప్పెడు ఉప్పు తీసుకుని, భారత ప్రభుత్వ ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించారు. ఆ తర్వాత వారం రోజులు జాతీయవారంగా పాటించాలనీ ఉప్పు పన్నుకు వ్యతిరేకంగా అహింసాయుతపోరాటం జరుపాలనీ ఆయన ప్రజలనుద్బోధించారు. ప్రసిద్ధి చెందిన ఉప్పుసత్యాగ్రహం ఈవిధంగా ఆరంభమైంది. జాతీయవాదాన్ని దేశమంతటా పాటించారు. "ఒక చివరినుంచీ ఇంకొక చివరి దాకా దేశమంతా ఉవ్వెత్తున లేచింద"ని పట్టాభి సీతారామయ్య వ్రాశారు. 14 ఏప్రిల్ 18 న, కొంతమంది యువ విప్లవకారులు చట్‌గాంవ్ మందుగుండు నిల్వల మీద దాడి జరిపి సెంట్రీలను చంపారు. ప్రభుత్వానికి ఇంతకంటె ఆందోళన కలిగించిన సంఘటన పెషావర్‌లో జరిగింది. ఏప్రిల్ 23 న, సరిహద్దు నాయకులైన అబ్దుల్ గఫార్‌ఖాన్ అరెస్టుకు నిరసన తెలియ చేసేందుకు గుమికూడిన గుంపు మీద కాల్పులు జరిపేందుకు 39 వ గర్‌వాల్ రైఫిల్స్‌కు చెందిన రెండు పటాలాలు నిరాకరించాయి.

అప్పుడు ప్రభుత్వం కఠినతరమైన వైఖరి అవలంభించింది. ఏప్రిల్ 16 న జవహర్‌లాల్‌నెహ్రూను అరెస్టు చేశారు. ఏప్రిల్ 23 న బెంగాల్ ఆర్డినెన్స్ (అధికార శాసనాలు) జారీ చేశారు. ఉద్యమాన్ని అరికట్టేందుకు దీనివల్ల అధికార్లకూ మేజి స్ట్రేట్లకూ విస్తృతమైన అధికారాలు లభించాయి. పెషావర్‌లో నిరంకుశపాలన సాగింది. గాంధీజీని మే 5 న అరెస్టు చేశారు. దానితో దేశమంతటా ప్రదర్శనలూ సమ్మెలూ బ్రహ్మాండమైన సభలూ ప్రారంభమయ్యాయి. స్వాతంత్ర్యపోరాటం విజయవంత మయేందుకు ఎటువంటి త్యాగాలైనా చేయడానికి సిద్ధపడవలసిందని కాంగ్రెసు కార్యవర్గం ప్రజలనుద్బోధించింది. ప్రభుత్వం కూడా మరింత కఠినంగా వ్యవహరించడం ప్రారం భించింది.

## శాసనసభ నుంచి వి. జె. పటేల్ రాజీనామా

ఈ కల్లోలంలో లాహోర్ కాంగ్రెసు ఆదేశాన్ని పాటించని వి. జె. పటేల్, పున రాలోచించుకోసాగారు. తమతోటివారు, ప్రాణాలను కూడా ఒడ్డి స్వాతంత్ర్యం కోసం పోరాటం సలుపుతూ వుండగా తాము, బూటకమైన శాసనసభలో కొనసాగడం సబబుగా లేదని గుర్తించారు. సభాధ్యక్షపదవికీ శాసనసభలో సభ్యత్వానికి రాజీనామా ఇస్తూ పటేల్ ఏప్రిల్ 25 న వైస్రాయ్‌కి ఈ విధంగా వ్రాశారు :

"ఆధునిక కాలంలో అతి గొప్ప వ్యక్తి అయిన మహాత్మగాంధీ నాయకత్వంలో భారత జాతీయ కాంగ్రెసు ప్రారంభించిన అహింసాయుత-సహాయనిరాకరణ-పౌర ఉల్లంఘన ఉద్యమం ముమ్మరంగా జరుగుతూ వుంది. నాదేశ ప్రజల్లో వందలాది ప్రముఖులు అప్పుడే మీ ప్రభుత్వ జైళ్ళకు చేరుకున్నారు... మాదేశ స్వాతంత్ర్య సమర చరిత్రలో ఇటువంటి ఘట్టంలో నేను మాతోటి వారితో ఉండడం సబబు. శాసన సభాధ్యక్ష స్థానంలో కాకుండా నాదేశ ప్రజలకు చేయూతగా ఉండాలని విశ్వ యించుకున్నాను."15

భారతదేశం ఇంకా త్యాగాలు చేయనక్కరలేకుండా ఇబ్బందులు పడకుండా అర్విన్ సహాయంతో బ్రిటిష్ కామన్‌వెల్తులో స్వయంపాలనా ప్రతిపత్తిగల దేశంగా తన న్యాయ మైన స్థానాన్ని త్వరలో అలంకరించగలదని తాము ఒకప్పుడు విశ్వసించామని కూడా పటేల్ వైస్రాయ్‌కి చెప్పారు. కాని, ఇంగ్లండులోనూ భారతదేశంలోనూ ఇటీవల జరిగిన సంఘటనలు తమను పూర్తిగా నిరాశపరచాయనీ, బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిలో మార్పు వస్తుందని చెప్పడం వుత్త బూటకమని తాము ఒక నిర్ధారణకు వచ్చామనీ కూడా పటేల్ పేర్కొన్నారు. రౌండ్ టేబిల్ సమావేశం విషయంలో గాంధీజీ వైఖరి సరైనదని ఇప్పుడు ఋజువైందని ఆయన అభిప్రాయ పడ్డారు. అందువల్ల భారత ప్రభుత్వంతో తమ సంబంధాలన్నింటినీఆయన త్రుంచి వేశారు.

పటేల్ రాజీనామాను ఆమోదించడం వైస్రాయ్‌కి సంతోషకారణమే అయింది. శాసనసభాధ్యక్షులుగా పటేల్ ప్రభుత్వానికి కంటకంగానే తయారయారు "మీరు సహే తుకమైన వాదానికి తల ఒగ్గే స్థితిలోలేరని మీ లేఖవల్ల స్పష్టంగా తెలుస్తూ వుంది" అని వైస్రాయ్ క్లుప్తంగా సమాధానమిచ్చారు. 16

## శాసన సభ మీద ప్రభావం

శాసనసభ వేసవి సమావేశం జులై 7 న ప్రారంభమైనపుడు, అంతకు ముందు నెలల్లో రాజకీయరంగంలో జరిగిన పరిణామాల ప్రభావం తెలియవచ్చింది. దేశంలో

జరుగుతున్న పౌర ఉల్లంఘన ఉద్యమం, దానిపట్ల ప్రభుత్వ వైఖరి దృష్ట్యా సభ్యులు వ్యవహరించవలసి వచ్చింది. అదీగాక ఎంతో కాలంగా ఎదురు చూసిన సైమన్ సంఘం నివేదిక జూన్‌లో విడుదలైంది, భారతీయులను ఎంతగానో నిరుత్సాహపర చింది.

వైస్‌రాయ్, ఉభయసభలనుద్దేశించి జులై 9 వ ఉపన్యసించారు. పౌర ఉల్లంఘన గురించి తమ అభిప్రాయాన్ని దాన్ని తాము ఏవిధంగా ఎదుర్కొనబోతున్నదీ ఆయన సభ్యులకు తెలియచేశారు. పౌర ఉల్లంఘన ఉద్యమం కొనసాగినంతకాలం, దాన్ని పూర్తిగా ప్రతిఘటిస్తామని ఆయన చెప్పారు. రౌండ్ టేబుల్ సమావేశం అక్టోబరు ఆఖరులో సమావేశమౌతుందని ఆయన తెలియచేశారు. సైమన్ సంఘం నివేదిక భారతీయుల్లో ఎక్కువ మందికి నిరాశ కలిగించిందని బాగా తెలిసినప్పటికీ ఆయన ఈ సమావేశం చట్టబద్ధమైన సంఘం తయారుచేసిన నివేదిక సహాయంతోనూ ఇతర పత్రాల సహాయంతోనూ స్వేచ్ఛగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించవచ్చునని" సభ్యులకు హామీ ఇచ్చారు. 17

ఆ మరునాడు ఆర్థిక సభ్యుడు, రౌండ్ టేబుల్ సమావేశానికి సంబంధించిన ఖర్చులకు అదనపు పద్దులను మంజూరు చేయవలసిందని కోరుతూ శాసనసభను కోరారు. వైస్‌రాయ్ ఉపన్యాసం దృష్ట్యా శాసనసభలోని అప్పటి సభ్యుల దృష్ట్యా దీనికి ఎటువంటి అభ్యంతరమూ ఉండదని భావించారు. మియాఁ మొహమ్మద్‌షా నవాజ్, నూరు రూపాయల లాంఛనపు కోత విధించారు. దరిమిలా చర్చ శాంతంగానే జరిగింది. కాంగ్రెసు ప్రారంభించిన పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని తాము ఆమోదించడంలేదని సభ్యులు దాపరికంలేకుండా తెలియ చేశారు. కాని, కాంగ్రెసూ దాని నాయకులైన గాంధీజీవంటివారే ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యం వహిస్తున్నవారని వారికి తెలియక పోలేదు. అందువల్ల, కాంగ్రెసుతో సమరసంతో వ్యవహరించవలసిందని వారు ప్రభుత్వాన్ని కోరారు.

లండన్‌లో జరిగే రౌండు టేబుల్ సమావేశంలో భారతీయులు పాల్గొనాలని తాము ఎందుకు భావిస్తున్నారో జిన్నా వివరించారు. "లండన్ సమావేశం మనలను మరింత నిరాశపరచవచ్చు. మన ఆశలన్నిటినీ పటాపంచలు చేయవచ్చు.. అయినా నేను అక్కడికి వెళ్లి నేను న్యాయమనుకుంటున్న దానికోసం పోరాడక పోయినట్లయితే నా దేశ ప్రజలపట్ల నా ధర్మాన్ని నిర్వర్తించనట్లేనని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను. ప్రపంచ ప్రజలముందు దోషిగా నిల్చోవలసివస్తుందని భావిస్తున్నాను. సమావేశానికి హాజరైనందువల్ల నాకు పోయేదేమీ లేదు. నేను దేనికీ గుడ్డిగా తల ఒగ్గడం లేదు"

అన్నారు జిన్నా.[18] అందువల్ల ఈ ఖర్చు అవసరమైనదేనని ఆయన అభిప్రాయ పడ్డారు.

సి. పి. రామస్వామి అయ్యర్ కూడా అదే విధంగా అభిప్రాయపడ్డారు. డొమినియన్ ప్రతిపత్తి అన్నది గొప్పదీ నిజమైనదీ, తప్పకుండా విజయవంతమయేదీనని ఆయన గట్టిగా విశ్వసించారు. రౌండ్ టేబుల్ సమావేశం భారత దేశపు శ్రేయస్సుకు హానికరం కాజాలదని ఆయన అనుకున్నారు. [19]

ఎం. కె. ఆచార్య రౌండ్ టేబుల్ సమావేశం జరుగడాన్ని సమర్థించారు. పక్షాలందరూ ఏకమై గాంధీజీ — మాలవ్యా వంటి నాయకులు సమావేశానికి హాజరయేట్టు ప్రయత్నించాలని కోరారు.

ప్రస్తుత పరిస్థితుల్లో పౌర ఉల్లంఘనద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించగలమని ఉత్తర మద్రాసుకు చెందిన అబ్దుల్ లతీఫ్ సాహెబ్ ఫరూకి అభిప్రాయపడ్డారు. సమావేశంలో కాంగ్రెసు నాయకులు పాల్గొనేట్టు చేసేందుకు ప్రభుత్వం నిజంగా ప్రయత్నించలేదని ఆయన అన్నారు. కాంగ్రెసు లేకుండా సమావేశం జరిగినట్టయితే, భారతీయుల నిజమైన భావాలను సమావేశం ప్రతిబింబింపజాలదని ఆయన అభిప్రాయపడ్డారు. ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేసే చర్యల ఫలితంగా శాంతి సౌమ్యస్య వాతావరణం ఏర్పడబోదనికూడా ఆయన చెప్పారు.[20]

ఎన్. జి. రంగా సైమన్ నివేదికను తీవ్రంగా విమర్శించారు. "వినాశకరమైన, దురుద్దేశపూరితమైన ఈ నివేదిక"[21] గురించి ప్రభుత్వం ఇంత పెద్దపెట్టున ప్రచారం చేయడం పొరపాటని అన్నారు.

పౌర ఉల్లంఘన ఉద్యమం, బ్రిటిషు ప్రభుత్వానికీ, భారత ప్రభుత్వానికీ నచ్చచెప్ప లేకపోయినదాన్ని రౌండ్ టేబుల్ సమావేశం గురించీ సైమన్ నివేదిక గురించీ ఒక స్థిర అభిప్రాయంతోవున్న బ్రిటిషు ప్రభుత్వానికి ఆయన (జిన్నా) నచ్చచెప్పగలరా అని రంగా, జిన్నాను ప్రశ్నించారు. గాంధీజీవంటి నాయకులు పాల్గొనని రౌండ్ టేబుల్ సమావేశం విఫలం కావడం తథ్యమని ఆయన ఉద్ఘాటించారు.

కె. సి. నియోగి తమ స్వానుభవం గురించి చెబుతూ, డయర్ తత్వం (జలియన్ వాలా బాగ్ కాల్పులకు ఆధ్వర్యం వహించిన కలోనల్ డయర్) దేశానికి బెడదగా తయారైందని అన్నారు. ఎల్. పి. మోడి, అంతకుముందు మాట్లాడిన చాలామంది మోస్తరుగానే ప్రభుత్వం కాంగ్రెసును మంచి చేసుకోవాలని అభిప్రాయపడ్డారు. కాంగ్రెసు ఆమోదం లేనిదే రౌండ్ టేబుల్ సమావేశం నిర్ణయాలవల్ల ఫలితం ఉండబోదని ఆయనకూడా అభిప్రాయపడ్డారు. కాంగ్రెసు విషయంలో ప్రభుత్వం జాగ్రత్తగా వ్యవహ

రించడంలేదని జయకర్ హెచ్చరించారు.[22] ప్రముఖ భారతీయ నాయకులు రౌండ్ టేబుల్ సమావేశంకి హాజరయేట్టు చేసేందుకు ప్రభుత్వం, కాంగ్రెసుతో సామరస్యంగా వ్యవహరించాలని ఆయన విజ్ఞప్తి చేశారు. అయితే పద్దులను ఆమోదించాలనీ, రౌండ్ టేబుల్ సమావేశంకి ఇది ప్రతిబంధకం కారాదనీ తామూ తమపార్టీ అభిప్రాయపడుతున్నట్లు ఆయన చెప్పారు.

పౌర ఉల్లంఘన ఉద్యమం విషయంలో రాష్ట్ర ప్రభుత్వ వైఖరి తమకు సంతృప్తి కరంగా లేదని షణ్ముగం చెట్టి అన్నారు. ఏదిఏమైనా శాంతిభద్రతల పరిరక్షణ భారత ప్రభుత్వ బాధ్యత అనీ అందువల్ల ఈ విషయాన్ని రాష్ట్రప్రభుత్వాలకు వదిలేయకుండా భారత ప్రభుత్వం ఒక స్పష్టమైన విధానాన్ని అవలంబించాలనీ ఆయన కోరారు. ప్రస్తుత ఆందోళనలో ప్రాణనష్టానికి బాధ్యత పూర్తిగా భారతప్రభుత్వానిదేనని కలకత్తాకు చెందిన శరదింద ముఖర్జీ అన్నారు.

మూడురోజులు చర్చ జరిగిన తర్వాత కోత తీర్మానంమీద ఓటింగ్ జరిగింది. తీర్మానం 60 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 48 ఓట్లు వచ్చాయి. ఇది, ప్రభుత్వానికి ఏదురుచూడని దెబ్బే అయింది. అదీ, వైస్‌రాయ్ చేసిన గొప్ప ఉపన్యాసం తర్వాత, మామూలుగా ప్రభుత్వానికి అనుకూలంగా వ్యవహరించే సభ్యులు చాలామంది. ఈ సందర్భంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటుచేశారని భావించారు.

జూలై 17న. బ్రిటిషు సామ్రాజ్యంలో భాగంగా భారతదేశం తన రాజ్యాంగాన్ని స్వయంగా నిర్ణయించేహక్కును గుర్తించాలని ఎటువంటి హింసాకాండచేయని గాంధీజీనీ ఇతర రాజకీయ ఖైదీలనూ విడుదల చేయాలనీ కోరుతూ ఎం. కె. ఆచార్య ఒక తీర్మానాన్ని ప్రతిపాదించినపుడు భారతదేశంలో రాజకీయ పరిస్థితి గురించి మళ్లీ చర్చ ప్రారంభమైంది.. చర్చలో పాల్గొన్న సభ్యులు సైమన్ నివేదికపట్ల తమ అసంతృప్తిని వ్యక్త పరిచారు. ఆర్. టి. సి. (రౌండ్‌టేబుల్ సమావేశం) ఫలప్రదమయేందుకు కాంగ్రెసు నాయకులు సమావేశంలో పాల్గొనేట్టు ప్రభుత్వం ప్రయత్నించడం అవసరమని పేర్కొన్నారు. ఈ సందర్భంగా తూర్పు పంజాబుకు చెందిన అబ్దుల హాయ్ మాట్లాడుతూ హిందూ ముస్లిం విభేదాలను అవకాశంగా తీసుకోవద్దని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. భారతీయులు తమ మతపరమైన సమస్యలను పరిష్కరించుకోలేక పోయారు కాబట్టి, స్వయంపాలనకు వారు అనర్హులని భావించినట్టయితే, భారత ప్రభుత్వానిక్కూడా భారతదేశంలో వుండేందుకు అర్హతలేదన్నమాట. భారతప్రభుత్వంకూడా ఈ సమస్యను పరిష్కరించలేకపోయింది కాబట్టి గాంధీజీని నిర్లక్ష్యంచేయడానికి వీలులేదనీ, ఈ దేశంలో లెఖ్ఖలోకి తీసుకోవలసిన వ్యక్తి ఎవరైనావుంటే అది గాంధీజీయేనని ఆయన ఉద్ఘాటించారు. తీర్మానంమీద ఓటింగ్ జరుగలేదు. చర్చించి ఊరుకున్నారు.

## నాల్గవ శాసనసభ

వైస్‌రాయ్ అంతకుముందు ప్రకటించినవిధంగా నాల్గవ శాసనసభకు 1930 సెప్టెంబరులో ఎన్నికలు జరిగాయి. కాంగ్రెసు, పౌర ఉల్లంఘన ఉద్యమానికి అనుగుణంగా ఎన్నికలను బహిష్కరించింది. కాంగ్రెసు వలంటీర్లు స్త్రీలతోసహా చాలాచోట్ల పోలింగ్ కేంద్రాల దగ్గర పికెట్ చేశారు. చాలామంది పోటీలేకుండా ఎన్నికయారు. స్థానాలన్నిభర్తీ అయాయి.

జూలైనుంచీ దేశమంతటా పౌర ఉల్లంఘన ఉద్యమం రెండవ ఘట్టం జరుగుతూ వుంది. బ్రిటిష్ సామాగ్రిని బహిష్కరించడం, పన్నుల చెల్లింపు నిరాకరణ ఉద్యమంలో ముఖ్య అంశము. ప్రభుత్వంకూడా స్వాతంత్ర్యయోధులతో ఘర్షణకు దిగింది. తూర్పున బెంగాల్, వాయవ్యాన సరిహద్దురాష్ట్రమూ వారి ఆగ్రహానికి గురయాయి. సరిహద్దు రాష్ట్రంలో అయిదు నెలలకుపైగా సైనిక శాసనం విధించారు. గుజరాత్ - యునైటెడ్ ప్రావిన్సెస్‌లో పన్నుల చెల్లింపు నిరాకరణ ఉద్యమం విషయంలో ప్రభుత్వం కఠినంగా వ్యవహరించడం మొదలుపెట్టింది.

ఈ వాతావరణంలో నాల్గవ శాసనసభ ఢిల్లీలో 1931 జనవరి 14వ తేదీన మొదటి సమావేశం ప్రారంభించింది. రైల్వే బడ్జెటూ, కేంద్ర బడ్జెటుమీద మామూలుగా జరిగే చర్చలుకాక శాసనసభ అనేక బిల్లులను అతి సులభంగా ఆమోదించింది. సభ్యులు, ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచిపెట్టే విధానాలను నిర్లక్ష్యం చేయలేకపోయారు. అందువల్ల అప్పుడప్పుడూ దాని గురించి ప్రస్తావించారు.

## రాజీకి విజ్ఞప్తి

జనవరి 29న అటువంటి సన్నివేశం ఒకటి జరిగింది. భారత ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేసే విధానం గురించి పంజాబుకు చెందిన షేక్ సాదిక్ హసన్ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. "ప్రభుత్వం ఇప్పుడు అనుసరిస్తున్న విధానాన్ని వెంటనే విడనాడి సానుభూతితోకూడిన రాజీవిధానాన్ని అనుసరించవలసిందని శాసనసభ గవర్నర్ జనరల్‌కూ అయన సమితికీ శిఫార్సుచేస్తూవుంది" అని తీర్మానంలో పేర్కొన్నారు.[23]

తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ హసన్, గాంధీజీనీ ఇతర ప్రముఖ నాయకులనూ జనవరి 26 న రాజీ చర్యగా విడుదల చేయాలని కోరారు. జనవరి 19 వ మొదటి రౌండ్ టేబుల్ సమావేశం ముగింపు సభలో ప్రధానమంత్రి మేక్డొనాల్డ్ ఉపన్యసించిన తర్వాత హసన్ ఈవిధంగా కోరారు. గాంధీజీ కొద్ది మంది ఇతర నాయకులనూ విడుదల చేసినంత మాత్రాన ప్రభుత్వానికి ప్రజలకూ మధ్య స్నేహభావం ఏర్పడబోదని హసన్

చెప్పారు. జైడులో వున్న ఎటువంటి హింసాకాండ చేయని ఖైదీలందరినీ విడుదల చేయాలని ఆయన కోరారు. ప్రస్తుత పరిస్థితిలో కావలసినది ప్రభుత్వం తన అణిచి వేసే విధానాన్ని మానుకోవడం కాదనీ పౌర ఉల్లంఘన ఉద్యమం మూలంగా జైలులో వున్న వారందరినీ విడిచిపెట్టడం అవసరమనీ మహమ్మద్ యామీన్ ఖాన్ కూడా చెప్పారు.

బి. అర్. పురి, బి. దాస్, సి. యస్. రంగా అయ్యర్, హసన్ తీర్మానాన్ని గట్టిగా సమర్థించారు. ఫిబ్రవరి 5 వ సింధ్‌కు చెందిన సేత్ అబ్దుల్లా హారూన్, తీర్మానానికి సవరణ ప్రతిపాదించినపుడు చర్చ కొనసాగింది. ప్రస్తుత క్లిష్ట పరిస్థితికి ఇరుపక్షాల వారూ కారకులని ఆయన అభిప్రాయపడ్డారు. రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొనేందుకు అవకాశాలు లభించినా గాంధీజీ వాటిని తిరస్కరించి ఉద్యమాన్ని ప్రారంభించారనీ దానివల్ల దేశానికి హాని కలిగిందనీ ఆయన వాదించారు. ప్రభుత్వం కూడా ఏమీ తీసిపోకుండా పగ తీర్చుకునే విధానాన్ని అవలంబిస్తూవుందని పేర్కొన్నారు. ఇరుపక్షాలవారు రాజీపడవలసిందని ఆయన విజ్ఞప్తి చేశారు.

హారూన్ ఆ దరిమిలా, సైనిక శాసనం విధించిన వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో పరిస్థితి గురించి ప్రస్తావించారు:

"...అయ్యా, ముసల్మానులు దేశంలో తమ పరిస్థితి గురించి ఆలోచించవలసిన సమయం వచ్చింది. ప్రభుత్వం మీద గాని మరెవరిమీదనైనగాని ఆధారపడరాదనీ తమకాళ్లపై తాము నిలబడాలనీ ముసల్మానులు నిశ్చయించుకునే సమయం వచ్చింది. దేశాన్ని అభివృద్ధిపరచడంలో ముసల్మానులు కూడా పూర్తి బాధ్యత వహించాలని శాసనసభలోని ముసల్మాను స్నేహితులనూ బయటి ముసల్మాను ప్రజలనూ నేను కోరుతున్నాను." 24

అన్ని ఉత్తర్వులనూ అణిచివేసే చట్టాలనూ ఉపసంహరించి ఖైదీలను విడుదల చేయాలని కోరుతూ అమర్‌నాధ్ దత్, తీర్మానానికి ఒక సవరణను ప్రతిపాదించారు. గాంధీజీ ప్రారంభించిన ఉదమ్యం, రాజ్యాంగ బద్ధమైనదనీ న్యాయమైనదనీ ఎప్పుడైన హింసాకాండ జరిగినట్టయితే గాంధీజీ వంటి నాయకులు గర్హించారనీ హరి సింగ్ గౌడ్ పేర్కొన్నారు. ప్రభుత్వం ధైర్యంచేసి ఖైదీలను విడుదలచేసినట్టయితే, పౌర ఉల్లంఘన ఉద్యమం మళ్లీ ప్రారంభమయ్యే అవకాశాలు చాలా తక్కువని ఆయన అభిప్రాయపడ్డారు.

ఇండిపెండెంట్ పార్టీ నాయకులైన సర్ అబ్దుర్ రహీమ్ కూడా అణచివేసే చట్టాలనూ ఉత్తర్వులనూ విమర్శించారు. రాజకీయ ఖైదీలందరినీ విడుదలచేసినపుడే

రాజ్యాంగ సమస్య గురించి చర్చించేందుకు తగిన వాతావరణం ఏర్పడుతుందన్న గాంధీజీ అభిప్రాయంతో తాము ఏకీభవిస్తున్నామని ఆయన తెలియ చేశారు. 25

రెండు రోజులపాటు జరిగిన చర్చలో, ఇరుపక్షాలవారూ రాజీపడాలన్న అభిప్రాయం ప్రధానంగా వ్యక్తమైంది. చర్చ ముగిసినపుడు హరిసింగ్ గౌడ్ మాట్లాడుతూ తీర్మానం మీద ఓటింగ్ జరుగరాదనీ చర్చను కాలనిర్ణయంలేకుండా వాయిదా వేయాలనీ కోరారు. సభానాయకులైన సర్ జార్జ్ రెయినీ, అభ్యంతరం చెప్పకపోవడంతో తీర్మానం మీద చర్చ కాలనిర్ణయం లేకుండా వాయిదా పడింది.

దేశప్రజల అభిప్రాయాన్ని ఇది వ్యక్తపరిచింది. చివరకు మార్చి 5 వ గాంధీ-అర్విన్ ఒప్పందం కుదిరింది.

### భగత్ సింగ్‌ను చంపినందుకు నిరసన

భగత్ సింగ్‌నూ మరో ఇద్దరు విప్లవకారులనూ చంపివేసిన మరునాడు మార్చి 24 వ ప్రజలు మళ్లీ కోపోద్రిక్తులయ్యారు. అప్పటి ప్రతిపక్ష నాయకులైన టి. రంగాచారియార్ మాట్లాడుతూ, ఏ నేరానికైతే భగత్ సింగ్‌ను చంపారో ఆనేరంతో భగత్ సింగ్‌కు సంబంధంలేదని ప్రజల్లో ఎక్కువమంది విశ్వసిస్తున్నారని చెప్పారు. "గాంధీజీ వంటి వ్యక్తి ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వానికి తెలియచేసినపుడు ప్రభుత్వం అర్థంచేసుకుంటుందని ప్రజలు ఎదురు చూశారు కాని, ప్రభుత్వం, ప్రజాభిప్రాయాన్ని ఖాతరు చేయలేదు." అంటూ రంగాచారియార్ తామూ జాతీయవాద పార్టీ ప్రభుత్వ చర్యను గట్టిగా నిరసిస్తున్నామనీ, సభనుంచి నిష్క్రమిస్తామని చెప్పారు.

ప్రభుత్వం ఏం సమాధానం చెబుతుందోనని రంగాచారియార్ వేచి చూశారు. దేశ వ్యవహారాల సభ్యుడు సమాధానం చెబుతూ విచారణ న్యాయంగా జరిగిందనీ శిక్ష సరైనదనీ ప్రభుత్వం విశ్వసించడంచేత జోక్యం చేసుకోలేదని చెప్పారు. సభానాయకులు సర్ జార్జ్ రెయినీ మాట్లాడుతూ జాతీయవాదులు సభనుంచి నిష్క్రమించినట్లయితే, వారి నియోజకవర్గాలపట్ల బాధ్యతను విస్మరించడమే అవుతుందని చెప్పారు. తమకు అవన్నీ తెలుసునని జాతియవాదులు చాలామంది సమాధానం చెప్పారు. ఆ తర్వాత నిరసనగా సభనుంచి నిష్క్రమించారు.

### "ఉత్తర్వుల ద్వారా ప్రభుత్వం" గురించి తీర్మానం

నాల్గవ శాసనసభలోని ప్రతిపక్ష సభ్యులు, పౌర ఉల్లంఘన ఉద్యమం అవసరంతో దాని ఔచిత్యంలోగాని వారికివిశ్వాసం లేకపోయినప్పటికీ, ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేసే విధానాన్ని ప్రతిఘటిస్తునే వచ్చారు. 1931 ఆఖరులోనూ 1932 ప్రారంభం

లోనూ, భారత ప్రభుత్వం లార్డ్ విలింగ్‌డన్ కింద, కాంగ్రెసు సంస్థల మీద కాంగ్రెసు జరిపే ఉద్యమాల మీద విరుచుకుపడినపుడు అణిచివేసే విధానం గురించి ప్రస్తావించే అవకాశం మళ్లీకలిగింది. గాంధీజీ లండన్‌లో, రౌండ్ టేబుల్ సమావేశం రెండవసభకు హాజరై తిరిగి వచ్చే లోపున జవహర్‌లాల్‌నెహ్రూ అబ్దుల్‌గఫార్‌ఖాన్ వంటి నాయకులను ప్రభుత్వం అరెస్టు చేసింది. బెంగాల్‌లో విప్లవకారుల కార్యకలాపాలలోనూ వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో రెడ్‌షర్ట్ ఉద్యమంతోనూ యునైటెడ్ ప్రావిన్‌సెస్‌లో శిస్తు చెల్లింపునిరాకరణ ఉద్యమంతోనూ వ్యవహరించేందుకు ప్రభుత్వం అత్యవసర అధికారాలను చేపట్టింది. భారతదేశంలో పరిస్థితి గురించి చర్చించేందుకు ఇంటార్వ్యూ కోసం గాంధీజీ వైస్‌రాయిని కోరారు. పరిస్థితిని ఎదుర్కొనేందుకు ప్రభుత్వం తీసుకున్న చర్యల గురించి గాంధీజీతో చర్చించడం వైస్‌రాయికి ఇష్టంలేక పోయింది. గాంధీజీ 1931 డిశంబరు 28 న బొంబాయి చేరుకున్నపుడు కాంగ్రెసు కార్యవర్గం సమావేశమై పరిస్థితిని సమీక్షించింది. రౌండ్ టేబుల్ సమావేశం ఫలితాలు అసంతృప్తి కరంగా వున్నాయని కార్యవర్గం పేర్కొంది. ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేసే విధానాన్ని గర్హించింది. ఉత్తర్వులు పనిచేసే తీరు గురించి దర్యాప్తు జరుపవలసిందన్న తమ కోరికకు ప్రభుత్వం సంతృప్తికరమైన సమాధానం ఇవ్వని పక్షంలో మళ్లీ పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించాలని ప్రజలను కోరింది.

భారత ప్రభుత్వం సంప్రదింపులు జరిపే ధోరణిలో లేదు. దానికి బదులు 1932 జనవరి 4 న గాంధీజీని అరెస్టు చేసింది. "భారతదేశాన్నంతటినీ ముట్టడిస్తున్నట్టు చాటడమే ఇది" అని నెహ్రూ వర్ణించారు.[26] అమెరికాలోని లిబరల్ పత్రిక "ది నేషన్", "భారతదేశంలో యుద్ధం" అని వ్రాసింది.[27]

యుద్ధం వంటి ఈ పరిస్థితి, శాసనసభలోని అధికారేతర సభ్యులను కదిలించింది. హరిసింగ్‌గౌడ్, ఫిబ్రవరి 1 న సుదీర్ఘమైన తీర్మానాన్ని ప్రతిపాదించారు. శాసన సభ నవంబరు సమావేశం ముగిసిన వెంటనే జారీ చేసిన వివిధ ఉత్తర్వులపట్ల తీర్మానంలో అసంతృప్తి వ్యక్తపరిచారు. గాంధీజీని ఇతరులనూ అరెస్టు చేసినందుకు నిరసన తెలియచేశారు. అదే సమయంలో, హింసాకాండను కూడా గర్హించారు. శిస్తు చెల్లింపు నిరాకరణవంటి ఉద్యమాలను నిరసించారు. అత్యవసర బిల్లులను, అవి అవసరమైనట్టయితే వాటిని శాసనసభలో ప్రవేశపెట్టాలని వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోనూ యునైటెడ్ ప్రావిన్‌సెస్‌లోనూ జరిగిన సంఘటనల గురించి దర్యాప్తు జరిపేందుకు ఒక సంఘాన్ని నియమించాలనీ కూడా తీర్మానంలో కోరారు. భారతదేశంలో కొత్త రాజ్యాంగాన్ని ప్రారంభించే సందర్భంలో వైస్‌రాయ్ దేశంలోని అన్ని సంస్థల సహ

కారాన్ని సంపాదించాలని శిఫార్సు చేశారు.[28] గౌడ్ తమ ఉపన్యాసంలో, ఉత్తర్వుల లోని కఠినమైన అంశాలను విమర్శించారు. నాయకులు జైళ్లలో మ్రగ్గుతూండగా రాజ్యాంగాన్ని రూపొందించడంలో పార్టీల సహకారాన్ని పొందడం అసంభవమని ప్రకటించారు.

శ్రీ ఎ. రామస్వామి ముదలియార్, గౌడ్ తీర్మానాన్ని సమర్థించారు, శాసనసభ, తన విధులను నిర్వర్తించేందుకు అనుమతినివ్వక, ఉత్తర్వులను జారీచేసే పక్షంలో శాసన సభను రద్దు చేయడం మంచిదని పేర్కొన్నారు. భారతదేశంలోని నిరంకుశపాలకులు, రష్యాలోని జార్‌లకు ఏమాత్రం తీసిపోరని అస్సామ్‌కు చెందిన అబ్దుల్ మతీన్ చౌధురీ అన్నారు. కూలిపోవడానికి సిద్ధంగా వున్న ప్రభుత్వాన్ని ఉత్తర్వులు కాపాడజాలవని ఆయన హెచ్చరించారు. బి. దాస్, బి. ఆర్. పురి, ఎన్. ఎం. జోషి, చాలామంది ఇతరులూ కూడా ప్రభుత్వాన్ని గర్హించారు.

చర్చ, ఫిబ్రవరి 2 న కూడా కొనసాగింది. షన్ముగంచెట్టి, ఉత్తర్వులు రాజ్యాంగ విరుద్ధమైనవని పేర్కొనలేదు కాని వాటిని ఏ ఉద్దేశ్యంతో జారీచేశారో దాన్ని మాత్రం గర్హించారు. స్థానిక అధికార్లనూ ఏజెంట్లనూ ఆయన తప్పుపట్టలేదు. భారతదేశానికి సంబంధించిన మంత్రి అంతక్రితం రేడియోలో మాట్లాడుతూ "ఏనుగ తనవెంట అరుస్తూ వస్తున్న కుక్కలను లెఖ్ఖచేయదు" అంటూ అతితిరస్కారంగా మాట్లాడిన సంగతి సభ్యులకు గుర్తు చేశారు.

బొంబాయికి చెందిన సర్ కావాస్‌జీ జెహంగీర్ మాట్లాడుతూ, బ్రిటిషు వారితో సంబంధాలను తెగతెంపులు చేసుకోరాదనే వారిలో తాము కూడా ఒకరని చెప్పారు. అయితే ప్రస్తుత వివాదాలవల్ల ఈ సంబంధాలు సన్నగిలే ప్రమాదం వుందని ఆయన అన్నారు. అది జరుగకుండా జాగ్రత్త వహించవలసిందని ఆయన ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

ప్రభుత్వం దేన్ని రూపుమాపదలచిందో సభ్యులకు తెలిసేట్టు ప్రభుత్వం, తగిన బిల్లును తయారుచేసి శాసనసభలో ప్రవేశపెట్టాలని అబ్దుర్ రహీమ్ కోరారు. ప్రభుత్వం అవిధంగా చేయకపోయినట్టయితే, ప్రభుత్వం మరేదో మనసులో పెట్టుకువుందని సభ్యులు అనుకోవలసి వస్తుందని ఆయన అన్నారు.

తీర్మానం ప్రతిపాదించిన వ్యక్తిపట్ల మహమ్మద్ యామిన్ ఖాన్ ఆగ్రహం వహించారు. ప్రభుత్వాన్ని అభిశంసించడం తప్ప ఇది మరొకటి కాదని ఆయన అన్నారు. దాన్ని స్పష్టంగా తెలియచేసివుండవలసిందని ఆయన అభిప్రాయ పడ్డారు. "ప్రజలు పోరాడదలచుకున్నట్టయితే బహిరంగంగా పోరాడా"లని ఆయన పేర్కొన్నారు.

రాజ్యాంగాన్ని రూపొందించడంలో సహకరించేందుకు ఆందోళనకారులకు ప్రభుత్వం ఎంతో అవకాశం కల్పించిందనీ ఆందోళనకారులే ఆ అవకాశాన్ని తిరస్కరించారనీ ఆయన వాదించారు. అటువంటి సమయంలో ప్రభుత్వం మాత్రం ఏం చేయగలదని ఆయన అన్నారు. 30

చర్చ ముగిసిన తర్వాత ఓటింగ్ జరిగినపుడు గౌడ్ తీర్మానం 62 ఓట్లతో వీగి పోయింది. అనుకూలంగా 44 ఓట్లు మాత్రమే వచ్చాయి. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రతిపాదించిన అభిశంసన తీర్మానం వంటి తీర్మానాన్ని "సర్దుకుపోయే" శాసనసభ ఆమోదిస్తుందని ఎదురుచూడడం కూడా పొరపాటే.

## రాజ్యాంగ సమస్య

రౌండ్ టేబుల్ సమావేశ ఖర్చులకు అదనపు పద్దులను ఆమోదించవలసిందని ప్రభుత్వం కోరినప్పుడు 1930 జులై 10-12 తేదీల్లో చర్చ జరుగ్గా గాంధీజీ వంటి కాంగ్రెసు నాయకులు రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొనేందుకు వీలుగా సామరస్య చర్యలు తీసుకోవలసిందని సభ్యులు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసిన సంగతి ఇది వరకే గమనించాము. ఆ దరిమిలా ప్రభుత్వమూ కాంగ్రెసు నాయకులమధ్య అంగీకారానికి సప్రూ, జయకర్ చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

భారత ప్రభుత్వం, సంస్థానాధీశుల నుంచీ కాంగ్రెసేతరులనుంచీ ప్రతినిధు లను ఎంచుకుంది. రౌండ్ టేబుల్ సమావేశం మొదటి సభ లండన్‌లో నవంబరు 12 న ప్రారంభమైంది. సమావేశానికి హాజరవుతున్న ప్రతినిధులు, భారత దేశంలోని రాజకీయ పార్టీలు ఎన్నుకున్న ప్రతినిధులు కాకపోవడంచేతా, వైస్‌రాయి నామినేట్ చేసినవారు కావడంచేతా, అన్నిటికంటె ముఖ్యమైనది కాంగ్రెసుకు చెందిన వారెవరూ సమావేశంలో పాల్గొనకపోవడంచేత సమావేశం ఫలితాల గురించి ఇదమిద్ధ మని ఎవరూ ఊహించలేకపోయారు.

ఇక ముందు జరుగబోయే రాజ్యాంగ సంస్కరణల కింద బ్రిటిషు ఇండియాతోనూ సంస్థానాలతోనూ ఒక ఫెడరేషన్‌ను ఏర్పాటు చేయాలని సమావేశంలో మొత్తం మీద అందరూ అభిప్రాయ పడ్డారు. సంస్థానాధీశులు అదివరలో వహించిన వైఖరి దృష్ట్యా చూసినట్లయితే ఇది ఎదురు చూడని పరిణామమనే చెప్పవచ్చు. సమావేశానికి కంటకంగా తయారైనది, మతపరమైన ప్రాతినిధ్యం. ఆగాఖాన్, జిన్నా నాయకత్వం లోని ముస్లిం మతవాద నాయకులు ముస్లింలకు మతపరమైన నియోజక వర్గాలుండాలన్న తమ పట్టును విడువలేదు. అణగారిపున్న వర్గాల ప్రతినిధినని చెప్పుకుంటున్న బి. ఆర్. అంబేద్కర్ కూడా ప్రాతినిధ్యం విషయంలో, అణగారిపున్న వర్గాలను

ప్రత్యేక వర్గంగా పరిగణించాలని కోరారు. హిందూ ప్రతినిధులు మాత్రం సంయుక్త నియోజకవర్గాలుండాలని స్పష్టంగా పేర్కొన్నారు. అవసరమనిపించిన సందర్భాల్లో వారు కోరినట్లయితే అల్పసంఖ్యాకులకు కొన్ని స్థానాలను కేటాయించవచ్చునని వీరు పేర్కొన్నారు. ఈ విషయమై అంగీకారం కుదరలేదు. సమావేశం 1931 జనవరి 19 వరకూ జరిగింది. ప్రధానమంత్రి మెక్డోనాల్డ్, చర్చల సారాంశాన్ని తెలియచేశారు. ఆ సమయంలో సమావేశం చర్చించిన ప్రధాన అంశాల విషయంలో ప్రభుత్వ విధానాన్ని కూడా స్పష్టం చేశారు.

సమావేశంలో మొత్తం మీద అంగీకారం కుదిరిన ఫెడరేషన్ అన్న సూత్రం గురించి ప్రస్తావించడమేకాక ప్రధానమంత్రి ఈ మధ్య కాలంలో, భారత ప్రభుత్వ బాధ్యతను శాసనసభలకు కేంద్ర-రాష్ట్ర శాసనసభలు రెండింటికీ అప్పగించాలని తమ ప్రభుత్వం అభిప్రాయపడుతున్నట్లు తెలియచేశారు. "అయితే ఇది కొన్ని షరతులకు లోబడి వుంటుందనీ అల్పసంఖ్యాకుల రాజకీయ స్వేచ్ఛనూ హక్కులనూ కాపాడేందుకు అవసరమైన హామీలతో కూడి ఇది అమలు జరుగవలసి వుంటుంద"నీ ఆయన పేర్కొన్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో రక్షణ-విదేశవ్యవహారాలూ గవర్నర్—జనరల్ ఆధ్వర్యంలో ఉంటాయనీ వీటి విషయంలో పాలనానిర్వహణకు అవసరమయే అధికారాలు ఆయనకు లభిస్తాయనీ కూడా ప్రధానమంత్రి ప్రకటించారు. పౌరఉల్లంఘన జరుపుతున్న వారు, వైస్‌రాయ్ విజ్ఞప్తిని మన్నించి ఈ పథకంతో సహకరించగలరన్న ఆశాభావాన్ని ప్రధానమంత్రి వ్యక్తపరిచారు.

## మొదటి రౌండ్ టేబుల్ సమావేశం గురించి శాసనసభలో చర్చ

రౌండు టేబుల్ సమావేశంలో జరిగిన చర్చల గురించి చర్చించాలని శాసన సభ్యులు ఎంతో ఆసక్తితో వున్నారు. 1931 జనవరి 29 న వారు, కె. సి. రాయ్ ప్రతిపాదించిన తీర్మానాన్ని ఆమోదించారు. రౌండ్ టేబుల్ సమావేశానికి సంబంధించిన పత్రాలను శాసనసభకు అందచేయవలసిందని తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు శిఫార్సు చేశారు.

మార్చి 2 న సభానాయకులైన సర్ జార్జ్‌రెయినీ, రౌండ్ టేబుల్ సమావేశానికి సంబంధించిన పార్లమెంటరీ పత్రాల గురించి చర్చించవలసిందని ప్రతిపాదించారు.

టి. రంగాచారియార్ ఇది అదనుగా తీసుకుని బ్రిటిషువారు లాఠీ దెబ్బలతో సాయుధ శకటాలతో బాంబులను పడవేయడంతో భారతదేశాన్ని బ్రిటిషు సామ్రాజ్యం అధీనంలో ఎల్లకాలం ఉంచుకోజాలరని హెచ్చరించారు. మితవాదులు పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ఖండించకపోవడానికి కారణం, ప్రభుత్వం మరింత కఠినంగా వ్యవహరిస్తుందన్న భయమేనని ఆయన చెప్పారు. రౌండ్ టేబుల్ సమావేశం గురించి ప్రస్తావిస్తూ ఆయన

లండన్‌లో రూపొందించిన దాన్ని శాసనసభ ఆమోదించవలసివుందనీ వ్యక్తిగత సమస్యల గురించి సంఘాల్లో చర్చించాలనీ కోరారు. బ్రిటిషు ప్రభువులు లండన్‌లో చేసిన మోస్తరుగా సభ్యులందరూ ముక్త కంఠంతో మాట్లాడాలని ఆయన సభ్యులకు విజ్ఞప్తి చేశారు. మతపరమైన సమస్యను లండన్‌లో పరిష్కరించలేక పోయినందుకు, ఇండిపెండెంటుపార్టీ నాయకులైన సర్ అబ్దుర్ రహీం విచారం వ్యక్తపరిచారు. అయితే అందరూ సమావేశంగా నిదానంగా ఆలోచించినట్టయితే ఈ సమస్య చాలావరకు పరిష్కారమౌతుందన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తపరిచారు.

షణ్ముగంచెట్టి, రౌండ్ టేబుల్ సమావేశానికి ప్రతిపాదించిన రక్షణలను క్షుణ్ణంగా పరిశీలించారు. దేశ ఆర్థికాభివృద్ధికి ఏమాత్రమూ అవరోధం కాని స్వరాజ్యం పనికి రాకుండా పోయిందని ఆయన అన్నారు. ఈ దృష్ట్యా సమావేశంలో ప్రతిపాదించిన ఆర్థిక రక్షణలను పరిశీలించినపుడు తమకు నిరాశకలిగిందని ఆయన తెలియచేశారు. ఈ ప్రతిపాదనల మూలంగా గవర్నర్ జనరల్‌కు బడ్జెటుకు సంబంధించి విస్తృతమైన అధికారాలు లభిస్తాయి. ఈ విషయాల్లో గవర్నర్ జనరల్‌కు ఎవరు సలహా ఇస్తారు? లేక ఆయన వైట్‌హాల్ నుంచీ లండన్ నగరంలోని వాణిజ్యవేత్తలనుంచీ సలహాలను పొందుతారా? ఈ విషయాలన్నీ చిక్కులతో కూడుకున్నవిగా తాము భావిస్తున్నామనీ దేశ ఆర్థికాభివృద్ధికి ఇవి అవరోధంగా ఉంటాయనీ ఆయన చెప్పారు.[31]

చాలామంది సభ్యులు ఈ రక్షణల గురించి సందేహాలు వెలిబుచ్చారు. రక్షణవ్యయం శాసనసభ ఆధీనంలో వుండాలని బి. దాస్., బి. ఆర్. పురి కోరారు. ఆర్థిక రక్షణల విషయమై రౌండ్ టేబుల్ సమావేశంలో తమ అసమ్మతిని తెల్పిన ఎచ్. పి. మోది ఈరక్షణలు అస్పష్టమైనవీ విస్తృతమైనవీ అని పేర్కొన్నారు. దేశంలోని ద్రవ్య చట్టాలను మార్చేందుకుద్దేశించిన ఏదైన బిల్లును గవర్నర్ జనరల్ ఆమోదించడమన్నది, రిజర్వు బ్యాంకు అమల్లోకి వచ్చేదాకా మాత్రమే జరుగాలని ఆయన కోరారు. కాని, రౌండ్ టేబుల్ సమావేశంలో మాత్రం, ఈ అధికారం కాలనిర్ణయం లేకుండా కొనసాగాలని మొత్తం మీద అభిప్రాయపడ్డారు. [32]

రౌండ్ టేబుల్ సమావేశం గొప్పవిజయాన్ని సాధించిందని మియాఁ మహమ్మద్ షా నవాజ్ విశ్వసించారు. రక్షణలు అంత పెద్దవేమీ కాదని ఆయన అభిప్రాయపడ్డారు. గవర్నర్లూ గవర్నర్ జనరల్ ప్రత్యేక అధికారాల గురించి ప్రస్తావిస్తూ ఆయన భారత దేశం విదేశ జోక్యం లేకుండా రాజ్యాంగాన్ని స్వయంగా రూపొందించుకున్నట్టయితే అప్పుడు కూడా కొన్ని రక్షణ లుంటాయని చెప్పారు. అల్ప సంఖ్యాకుల రక్షణ విషయంలో మాత్రం తాము నిరాశచెందామని ఆయన తెలియ చేశారు.

పాట్నాకు చెందిన ఎం. మస్వూద్ అహ్మద్, రౌండ్ టేబుల్ సమావేశంలో చేసిన ప్రతిపాదనలను జిన్నా - పద్నాలుగు అంశాల పథకంతో పోల్చారు. ముస్లింలు కోరుతున్న వాటికి అంగీకరించలేదని ఆయన ఆగ్రహించెందారు. ప్రత్యేక నియోజక వర్గాలగురించి ఆయన చాలా గట్టిగా మాట్లాడారు. "షరతులతోకూడిగాని లేకుండాగాని, సంయుక్త నియోజకవర్గాలు ముసల్మానులకు ప్రస్తుతం అక్కరలేదని నేను స్పష్టం చేయదలచుకున్నాను. స్థానిక సంస్థల్లోకూడా వారికి ప్రత్యేక నియోజకవర్గాలు అవసరం" అన్నారాయన. ఇటువంటి ముఖ్యమైన విషయం గురించి ఎటువంటి నిర్ణయమూ తీసుకోనందుకు ఆయన కినుక వహించారు. "...తాము కోరుతున్నదాన్ని పరిష్కరించక పోయినట్టయితే అంతర్ యుద్ధానికి దారితీయవచ్చునని ముసల్మానులు చాలామంది అభిప్రాయపడుతున్నారు" అని ఆయన హెచ్చరించారు. 33

మౌల్వి మహమ్మద్ యాకూబ్, ప్రతిపాదనల విషయమై అంత ఉత్సాహంగా ధ్వనించలేదు, నిరాశ చెందినట్టుకూడా కనినంచలేదు. అయితే, ముస్లింలు ఏమీ సాధించలేకపోయారని ఆయనకూడా అభిప్రాయపడ్డారు. ఫెడరల్ స్వరూపానికి బెడదలేకుండా వుండేందుకుగాను, రెసిడ్యుయరీ అధికారాలు రాష్ట్రాలకుండడం అవసర మని ఆయన ఉద్ఘాటించారు.

సమావేశం సాధించిన గొప్ప విషయం, భారత రాజ్యాంగ స్వరూపం గురించి ఒక అంగీకారానికి రావడమేనని హిందూ మహాసభ ప్రముఖనాయకులైన భాయి పరమానంద్ అన్నారు. మరొకటి, బాధ్యతాయుత ప్రభుత్వం-దీనితోపాటు రక్షణలూ కేటాయింపులూ ముడిపెట్టబడినప్పటికీ, మతపరమైన సమస్య విషయంలో సమావేశం విఫలం కావ డానికి బాధ్యత జిన్నాదేనని ఆయన అభిప్రాయపడ్డారు. రాష్ట్రాలకు స్వపరిపాలన ప్రతిపత్తి ఇచ్చేందుకు ఆయన అభ్యంతరం తెలుపలేదు.

"అయితే, ఈ సంగతిని ఈ సభలోని సభ్యులు తమకు బాధ్యతాయుత ప్రభుత్వం లభించినపుడు నిర్ణయించవలసి వుంటుంది. అయితే వీటిని మనకు షరతులరూపంలో అందించినట్టయితే ముసల్మానులు ఈ షరతులకు లోబడిన పరిష్కారానికి మాత్రమే అంగీకరించినట్టయితే దానివల్ల దేశంలో మతపరమైన ప్రభావం వున్నట్టు కనిపిస్తూ వుందని నేను అభిప్రాయపడుతున్నాను. అటువంటి ధోరణి పెరగడం, భారత దేశంలో నిజమైన జాతీయతా భావం అభివృద్ధికే అవరోధం" అని ఆయన పేర్కొన్నారు. 34

ఫెడరేషన్ ఏర్పడినట్టయితే, కార్మిక విషయాలకు సంబంధించి రాష్ట్రాలు కేంద్ర శాసనసభ అదుపులో వుండేందుకు ప్రత్యేక ఏర్పాట్లు జరిగితే తప్ప శ్రామికవర్గ ప్రయోజ

వాలకు తగిన రక్షణ వుండదని ఎన్. ఎమ్. జోషి అభిప్రాయ పడ్డారు. కార్మిక శాసనాలు, ఫెడరల్ విషయంగా ఉండాలని ఆయన కోరారు.

"ముస్లింలు ఒక జాతి"అనీ "స్వయం నిర్ణయసూత్రం ఆధారంగా వారికి విడి నియోజక వర్గాలు ఏర్పాటుచేయాల"నీ బొంబాయికి చెందిన నవాబ్ నహర్ సింగ్ జీ ఈశ్వర్ సింగ్ జీ చెప్పారు. "భూస్వాముల హక్కుల రక్షణ" మొదలైన వాటికి రక్షణలూ ప్రత్యేక అధికారాలూ అవసరమని ఆయన ఉద్ఘాటించారు.35

రామస్వామి ముదలియార్, కౌవాస్‌జీ జెహంగీర్, సమావేశం సాధించిన అంశాలను పేర్కొంటూ అన్ని పక్షాలవారూ సర్దుకుపోయే ధోరణిని అవలంభించాలని కోరారు.

మొదటి రౌండ్ టేబుల్ సమావేశం తర్వాత గాంధీజీనీ ఇతర ప్రముఖ కాంగ్రెసు నాయకులనూ విడుదల చేశారు. గాంధీజీ వైస్‌రాయ్ మధ్య సంప్రదింపులు జరిగాయి. ఫలితంగా గాంధీ అర్విన్ ఒప్పందం కుదిరింది. దీనివల్ల రెండవ రౌండ్ టేబుల్ సమావేశం లో కాంగ్రెసు పాల్గొనేందుకు మార్గమేర్పడింది. కాంగ్రెసు తరపున గాంధీజీ సమావేశంలో పాల్గొన్నారు. జాతీయవాద ముస్లింలనాయకులైన డాక్టర్ అన్సారీని సమావేశానికి ఆహ్వానించవలసిందని గాంధీ చేసిన సూచనను త్రోసిపుచ్చి ప్రభుత్వం ఈసారి కూడా, ఇతర ప్రతినిధులను ఎన్నిక చేసింది. ముస్లింప్రతినిధుల్లో ఈసారి కూడా జిన్నా వున్నారు.

రెండవ రౌండ్ టేబుల్ సమావేశం లండన్‌లో 1931 సెప్టెంబరు 7 న ప్రారంభమైంది. ఈలోగా ఒక పెద్ద సంఘటన జరిగింది. లేబర్ ప్రభుత్వం స్థానే రామ్సే మేక్డొనాల్డ్ ప్రధానమంత్రిగా జాతీయ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. నిజానికి కన్‌సర్ వేటివ్ పార్టీ ఆధిపత్యంలో వుందని చెప్పవచ్చు. కన్‌సర్‌వేటివ్ అయిన సర్‌శామ్యూల్‌హోర్ భారతదేశానికి సంబంధించిన మంత్రి అయ్యారు.

గాంధీజీ, కాంగ్రెసు తీర్మానాలకు అనుగుణంగా, కేంద్రంలోనూ రాష్ట్రాల్లోనూ, పూర్తి బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలనీ, గవర్నర్ జనరల్‌కు ప్రత్యేక అధికారాలేవీ ఉండరాదనీ కోరారు. కాని మళ్ళీ మతపరమైన సమస్య పెద్ద అవరోధంగా ఏర్పడింది. ఈ సమస్య పరిష్కారానికి రౌండ్ టేబుల్ సమావేశం అల్ప సంఖ్యాక వర్గాల సంఘం ఒకదాన్ని నియమించింది. కాని ఈసంఘం ఒక నిర్ణయానికి రాలేకపోయింది. మతపరమైన విడి నియోజకవర్గాలకు గాంధీజీ అంగీకరించేట్టు లేదు. ముస్లిం మతవాదులు కూడా దాన్ని ఒదులుకునేట్టు లేరు. రాజీకి గాంధీ చేసిన ప్రయత్నాలను హిందూమతవాదులు సాగనివ్వలేదు. ఈ విషయమై

సామ్రాజ్యవాదులు వ్యవహరిస్తున్న తీరువల్ల అసలు ఒక ఒప్పందం కుదిరే అవకాశమే కన్పించలేదు. బ్రిటిషు రచయిత ఎడ్వర్డ్ థామ్సన్ ఇలా వ్రాశారు:

"రెండవ రౌండ్ టేబుల్ సమావేశంలో, పట్టు విడువని ముస్లింలూ బ్రిటిషు రాజకీయవర్గాల్లోని ప్రజాస్వామ్య వ్యతిరేకులూ పొత్తు కుదుర్చుకున్నట్టు బాగా వెల్లడైంది. ఇది, భారతదేశంలో మరింత గట్టిపడి, అభివృద్ధి నిరోధకంగా తయారైంది. దీన్ని ఋజువుచేయవచ్చు."36

మతపరమైన సమస్యకు ఒక పరిష్కారాన్ని కనిపెట్టకుండానే సమావేశం ముగిసింది. ప్రధాన సమస్యల విషయంలో కూడా పెద్ద పురోభివృద్ధి కనిపించలేదు. సమావేశం 1931 డిశంబరు 11 వ తేదీ ముగిసింది.

గాంధీజీ భారతదేశానికి తిరిగి వచ్చినపుడు ప్రభుత్వం కాంగ్రెసు సంస్థల మీద విరుచుకు పడింది. పౌర ఉల్లంఘన మళ్లీ ప్రారంభమైంది. గాంధీజీనీ ఇతర నాయకులనూ అరెస్టు చేశారు.

## మతపరమైన తీర్పు—గాంధీజీ ఆమరణ నిరాహారదీక్ష

గాంధిజీ ఇంకా జైల్లో వుండగా, ప్రధానమంత్రి మేక్డొనాల్డ్, 1932 అగస్టు 16 న మతపరమైన తీర్పు ప్రకటించారు. దీని ప్రకారం ముస్లింలకే కాక, దళిత వర్గాలకు కూడా ప్రత్యేక నియోజక వర్గాలుంటాయి. భారతదేశంలో చీలికలను ఎక్కువ చేసే ప్రయత్నంతప్ప ఇది మరొకటి కాదు. ఈసారి హిందువుల్లో అగ్రకులాలవారికీ నిమ్న కులాల వారికీ మధ్య చీలికలేర్పడేందుకు ప్రయత్నించారు. గాంధీజీ జైలునుంచి ప్రధానమంత్రికి ఒక లేఖ వ్రాస్తూ తాము ఈ నిర్ణయాన్ని తమ ప్రాణాన్ని ఒడ్డి ప్రతిఘటిస్తామని తెలియచేశారు. దళిత వర్గాలకు మతపరమైన ప్రాతినిధ్యం ఇచ్చే పథకాన్ని బ్రిటిషు ప్రభుత్వం సెప్టెంబరు 20 లోపున ఉపసంహరించుకోక పోయినట్టయితే తాము ఆ రోజున నిరసన వ్రతం ప్రారంభించి ఆ మరణాంతం కొనసాగిస్తామని గాంధీజీ తమ లేఖలో పేర్కొన్నారు. దళితవర్గాల ప్రతినిధులను సాధారణ ఓటర్లు ఎన్నుకోవలసిందేనని ఆయన పునరుద్ఘాటించారు.

## శాసనసభలో ఆందోళన

గాంధీజీ ఈ నిర్ణయం తీసుకోవడంతో దేశంలో కలకలం బయలుదేరింది. శాసనసభలో కూడా ఆందోళన వ్యక్తమైంది. సెప్టెంబరు 18 వ తేదీన సి. యస్. రంగయ్యర్, శాసనసభలో వాయిదా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

"మహాత్మాగాంధీ మరణిస్తే ఎవరు జీవించి వుంటారు." అని ఆయన ప్రశ్నించారు. "బ్రిటిషు సామ్రాజ్యవాదులకు లాభకరంగా వుండేట్టు ఇరవై ఏండ్లుగా మాలో చీలికలు ఏర్పరుస్తున్నారు. మా మతం—మా దేవుళ్ల మా సామాజిక వ్యవస్థ అన్నింటినీ ఛిన్నాభిన్నం చేసేందుకు ప్రయత్నిస్తున్నారు" అంటూ ఆయన "ఈ విషపు వేర్పాటు విధానం" అవలంభిస్తున్నందుకు ప్రధానమంత్రిని ఖండించారు. "భారతీయుల అభిప్రాయాన్ని కూడగట్టేందుకు ఒక అవకాశమివ్వవలసిందని గాంధీజీ కోరారు. దాన్ని తిరస్కరించారు" అంటూ శ్రీ రంగయ్యర్ "ఒక వేళ మహాత్మాయే మరణించినట్టయితే, నేను చెబుతున్నాను భారతదేశంతో బ్రిటిషు సంబంధం పూర్తిగా అంతరిస్తుంది" 37 అన్నారు.

దళిత వర్గాల ప్రతినిధిగా నామినేట్ అయిన రావు బహదుర్ ఎం. సి. రాజా మాట్లాడుతూ, దళితవర్గాల సమస్య అదివరకెన్నడూ ఇంత ప్రాముఖ్యం వహించలేదని చెప్పారు. దీనికి దళితవర్గాలు గాంధీజీకి ఋణపడి వుంటారని ఆయన అన్నారు. దళిత వర్గాల పునరుద్ధరణ గాంధీజీ ప్రధాన జీవితలక్ష్యమని రాజా చెప్పారు. సంయుక్త నియోజకవర్గాలు తమ కులాలవారికి ఆమోదయోగ్యమేనని అయితే, ఈ అధికారం భారతీయుల చేతుల్లోకి వచ్చిన తర్వాత అమలు జరుగాలని పేర్కొన్నారు.

"మా పునరుద్ధరణకు అవసరమైనది, సాధారణ నియోజకవార్గాలనుంచి మా ప్రతినిధులను మేము ఎన్నుకునే అధికారం మాకు లభించడం. సీట్ల కేటాయిపుంతో సంయుక్త నియోజకవర్గాలను ఏర్పాటు చేసే పధకం ఆచరణయోగ్యమైనదికాదని ప్రధానమంత్రి ఎందుకు అంటున్నారో నాకు తెలియడంలేదు. మద్రాసులోని స్థానిక సంస్థల్లో ఇది ఇప్పటికే అమల్లో వుంది. మరికొన్ని రాష్ట్రాల్లో ఇది సంతృప్తికరంగా పనిచేస్తూ వుంది"38

మతపరమైన తీర్పులో పొందుపరచిన పథకం మూలంగా దళిత వర్గాలు రాజకీయంగా అస్పృశ్యులౌతారని రాజా పేర్కొన్నారు. తమ పథకంలో దళితవర్గాలను వేరుచేయలేదన్న ప్రధానమంత్రి వాదనను ఆయన ఖండించారు. "దళితవర్గాల ప్రతినిధులకు అగ్రకులాలవారి ఓట్లు పొందే అవకాశంలేనపుడు భారతీయులందరూ సమానమన్న భావం ఏవిధంగా కలుగుతుంది" అని ఆయన ప్రశ్నించారు.

పంజాబుకు చెందిన సర్దార్ సంత్ సింగ్, గాంధీజీకి జోహారులర్పిస్తూ, ప్రపంచంలో అటువంటి సత్పురుషుడు ప్రస్తుతం మరొకరులేరని పేర్కొన్నారు. ఈ సమస్య విషయమై గాంధీజీ మరణించడమే సంభవిస్తే భారత-బ్రిటన్ల మధ్య అగాధం మరింత పెద్దదవుతుందని దాన్ని ఎవరూ పూడ్చలేరని ఆయన హెచ్చరించారు. 39 మతపరమైన

నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్న శక్తులను అర్థంచేసుకోవలసిందని ఆయన విజ్ఞప్తి చేశారు.

రౌండ్ టేబుల్ సమావేశంలో దళితవర్గాలకు సీట్లను కేటాయించే విషయమై గాంధీజీ మొండివైఖరి అవలంభించారనీ అందువల్ల అంబేద్కర్ నియోజకవర్గాలు కావాలని కోరారనీ కౌవాస్‌జీజహంగీర్ అన్నారు. "కాని గాంధీజీ ఇప్పుడు తమ అభిప్రాయాన్ని మార్చుకున్నారు. దానితో రాజా-అంబేద్కర్‌లమధ్య పెద్ద అవరోధం తొలగిపోయింది. ఈ విషయాన్ని పరిష్కరించేందుకు ప్రభుత్వం గాంధీజీకి అవకాశమివ్వగలదని నేను ఆశిస్తున్నాను" అన్నారు జెహంగీర్.

ప్రభుత్వం ఈ విషయంలో ఏవిధంగా సహాయం చేయగలదో తమకు తెలియడం లేదని మహమ్మద్ యాకుబ్ అన్నారు. హిందువుల్లోని ఈ రెండువర్గాలకు చెందిన దేశభక్తులు ఈ గొప్పవ్యక్తిని కాపాడవలసివుందని ఆయన పేర్కొన్నారు. 40 ఈవిషయంలో ప్రధానమంత్రిని తప్పుపట్టడంలో అర్థంలేదని అబ్దుర్ రహీమ్ కూడా అన్నారు. అయితే గాంధీజీకి దళితవర్గాల సంక్షేమంపట్ల అత్యంత శ్రద్ధవుందనీ, హిందువుల్లోని అగ్ర కులాలవారి నాయకులతోనూ దళితవర్గాల నాయకులలోనూ సంప్ర దించేందుకు గాంధీజీకి తగిన అవకాశమివ్వాలనీ ఆయన కోరారు. 41

ప్రభుత్వం తరపు సభానాయకులైన సర్ సి. పి. రామస్వామి అయ్యర్ మాట్లాడుతూ గాంధీజీపట్ల తమకెంతో గౌరవంవుందనీ అయితే ఈ విషయంలో ఆయన అనుసరించిన విధానాన్ని తాము ఆమోదించజాలమనీ చెప్పారు. దీనివల్ల ఇబ్బందికరమైన అవాంఛ నీయమైన పరిణామాలు ఏర్పడవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు. దీనితో సంబంధ మున్నవారు పరస్పరం చర్చలు జరిపి ఒక అంగీకారానికి రావడం ఒక్కటే దీనికి తగిన పరిష్కారమని ఆయన చెప్పారు.

ఈ సమస్యతో సంబంధమున్న వర్గాల నాయకులతో గాంధీజీ సంప్రదించేందుకు ప్రభుత్వం తగిన అవకాశం కల్పించాలనీ అప్పుడే ఒక పరిష్కారం కుదురుతుందనీ హరిసింగ్‌గౌడ్, ఎస్. సి. మిత్ర మరికొందరూ ప్రభుత్వాన్ని కోరారు. రంగయ్యర్ తీర్మానం అవిధంగా వీగి పోయింది.

గాంధీజీ జైల్లోనే ఇంటర్వ్యూలు జరిపేందుకూ ఉత్తర ప్రత్యుత్తరాలు స్వేచ్ఛగా జరిపేందుకూ ప్రభుత్వం అన్ని సౌకర్యాలూ కల్పించింది. భారతీయ నాయకులు కూడా కృషి ప్రారంభించారు. సప్రు సూచనమీద రాష్ట్ర శాసన సభల్లో దళితవర్గాలకు కేటాయించే స్థానాలసంఖ్య రెండింతలకు పైగా పెరిగేట్టు (148) ఒక పథకాన్ని రూపొందించారు. ఈ స్థానాలకు ఎన్నిక సంయుక్త నియోజక వర్గాలద్వారా జరుగుతుంది. అయితే దీనికిముందు ప్రాథమిక ఎన్నిక ఒకటి జరుగుతుంది. దళితవర్గాలకోసం

ప్రత్యేకించిన ఒక్కొక్క స్థానానికి దళితవర్గాలు. నలుగురు అభ్యర్థులను ఎంచుకుంటారు. వీరిలో ఒకరిని సాధారణ నియోజకవర్గం ఎన్నుకుంటుంది. పూనా ఒప్పందాన్ని ప్రధానమంత్రి ఆమోదించడంతో గాంధీజీ తమ నిరసన వ్రతాన్ని సెప్టెంబరు 26 న మానుకున్నారు.

శాసనసభ – శ్వేతపత్రమూ

మతపరమైనతీర్పు – పూనా ఒప్పందం తర్వాత రౌండ్‌టేబుల్ సమావేశం మరొక సారి సమావేశమైంది. 1932 నవంబరు 17 నుంచి డిశంబరు 24 వరకూ ఈ సమావేశం జరిగింది. రెండవ సమావేశం నియమించిన ఉపసంఘాల నివేదికలను పరిశీలించడం, ఈ సమావేశం చేసిన ప్రధానమైనపని. ఈ నివేదికలూ, ఇతర షరతులూ ఆధారంగా బ్రిటిషు ప్రభుత్వం భారతదేశంలో రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించి ఒక పథకాన్ని స్వయంగా తయారుచేసింది. దీన్ని 1933 మార్చి 17 న శ్వేతపత్రంగా ప్రకటించారు. "మొదటి రౌండ్‌టేబుల్ సమావేశం ముగిసి నప్పటినుంచీ ఇంగ్లండ్‌లో ఎక్కువవుతున్న కన్సర్వేటివ్‌ల విమర్శను శాంతింప చేసేందుకే దీన్ని ఉద్దేశించారు." 42 భారతదేశంలో, ఒక్క కాంగ్రెసుమాత్రమే కాక లిబరల్‌పార్టీ, ముస్లిం మహాసభకూడా ఈపథకాన్ని తిరస్కరించాయి. ఈపథకం అనేక రక్షణలూ కేటాయింపులతో కూడుకున్నదేకాక, డొమినియన్ ప్రతిపత్తి గురించి ప్రస్తావించనేలేదు. "ఈపథకం ఎటువంటి పథకమైనా, స్వయంపాలన కుద్దేశించిన పథకంమాత్రం కాదు" అని అలహాబాదుకు చెందిన "ది లీడర్" పేర్కొంది. 43

శాసనసభలో మార్చి ఆఖరున, శ్వేతపత్రంమీద మూడురోజులపాటు చర్చ జరిగింది. శ్వేతపత్రంమీద చర్చ జరుపవలసిందని అప్పట్లో సభా నాయకులైన సర్ బ్రజేంద్రమిత్తర్ మార్చి 29వ ప్రతిపాదించారు. ప్రతిపక్ష నాయకులైన సర్ అబ్దుర్ రహీమ్ దీనికి ఒకసవరణను ప్రతిపాదించినపుడు సభ్యులు పెద్దపెట్టున హర్షధ్వానాలు చేశారు. సవరణ ఈవిధంగా వుంది:

"కేంద్ర – రాష్ట్ర పాలనారంగాల్లో ప్రజా ప్రతినిధులకు ఎక్కువ బాధ్యత కార్యాచరణ స్వేచ్ఛ ఉండేట్లు భారత రాజ్యాంగ సంస్కరణలను బ్రిటిషు ప్రభుత్వం సవరిస్తేతప్ప భారతదేశంలో శాంతి నెలకొనేందుకుగాని భారతీయులు సంతృప్తి చెందేందుకుగాని దేశ అభివృద్ధికిగాని వీలుపడదని బ్రిటిషు ప్రభుత్వానికి తెలియచేయ వలసినదిగా శాసనసభ గవర్నర్ జనరల్‌కూ ఆయనసమితికీ అర్థిస్తూవుంది."



గోవింద వల్లభ పంత్



వి. యస్ శ్రీనివాస శాస్త్రి



శివస్వామి అయ్యర్



హృదయనాథ్ కుంజ్రు

తమ సవరణగురించి మాట్లాడుతూ రహీమ్, శ్వేతపత్రం వల్ల దేశప్రజలు చాలా కలవరపడుతున్నారని పేర్కొన్నారు. "బాధ్యతాయుత ప్రభుత్వంకోసం రాజకీయ ఆందోళన ఎంతకాలంగా కొనసాగుతూవుందో మనకు తెలుసు. ఈవిషయంలో ప్రభుత్వ ప్రతిపాదనలు లోపభూయిష్టంగా వున్నట్టయితే భారతీయులు చేతులుకట్టుకుని కూర్చుంటారని బ్రిటిషు పార్లమెంటూ బ్రిటిషు ప్రజలూ భారత ప్రభుత్వమూ భావిస్తున్నట్టయితే అది పొరపాటే అవుతుంది. భారతీయులు ఊరుకోరు" అని ఆయన హెచ్చరించారు. 44

రహీమ్ తమ అభిప్రాయాలను విపులీకరించారు. కొంతకాలం వరకూ రక్షణలు అవసరమని చెప్పారు. అయితే ఈ మధ్యకాలం ఎప్పుడు అంతమౌతుంది? అదీకాక మధ్యకాలానికి కూడా రక్షణలు చాలావిస్తృతమైనవిగా ఉన్నాయి. గవర్నర్ జనరల్ గవర్నర్‌లకు అప్పచెప్పిన రక్షణల స్వభావాన్ని ఆయన సవాలుచేశారు. "సైన్యం, రక్షణ, ఆర్థికశాఖ,.... ఇవన్నీ, రైల్వేలుకూడా వారి ఆధీనంలోనే ఉంటాయి. ఇక శాసనసభకు ఏం మిగిలినట్టు ? " అని ఆయన ప్రశ్నించారు.

పథకంలోని రక్షణలదృష్ట్యా హరిసింగ్‌గౌడ్, బి. దాస్, సి. ఎస్. రంగయ్యర్, కె. సి. నియోగి, రాజాబహదుర్ జి.కృష్ణమాచారియార్, అమర్‌నాథ్‌దత్, గయాప్రసాద్ సింగ్, చాలామంది ఇతరులూ ప్రతిపాదనలను తీవ్రంగా విమర్శించారు.

భారత సరిహద్దులూ మతపరమైన సమస్యలదృష్ట్యా గవర్నర్ జనరల్‌కూ గవర్నర్‌కూ కొన్ని ప్రత్యేక అధికారాలు అవసరమని ముహమ్మద్ యాకూబ్ విశ్వసించారు. వారికి కొన్ని అధికారాలు ఇచ్చినంతలోనే భారతీయుల్లో అపనమ్మకం బయలుదేరుతూ వుందని ఆయన అన్నారు. ఆ తర్వాత ఆయన శ్వేతపత్రం విషయమై ముస్లింల ఇబ్బందులను మొరపెట్టుకున్నారు. రాష్ట్రాల్లో, ఫెడరల్ శాసన సభలో, మంత్రిమండలిలో సర్వీసుల్లో ముస్లింలకు కేటాయించే స్థానాలను స్పష్టంగా నిర్ణయించాలన్నది ఆయన కోరినవాటిలో ఒకటి. ఫెడరల్ ఎగువసభలో ప్రత్యేక నియోజకవర్గాలు ఆధారంగా ముస్లింలకు ప్రాతినిధ్యముండాలనికూడా ఆయన కోరారు.

శ్వేతపత్రంలో ముస్లింలకిచ్చిన సౌకర్యాలతో వారు తృప్తిపడనందుకు హిందూ మహాసభ ప్రతినిధి అయిన భాయిపరమానంద్ విచారం వ్యక్తపరిచారు. ఇతర శాఖల్లోకూడా మతపరమైన వాటిని వారు కోరుకున్నారని ఆయన అన్నారు. భారత దేశంలో ప్రజాస్వామ్యానికి జాతీయతకూ విఘాతం కలిగించే ఓటింగ్ పద్ధతిని ప్రభుత్వం పరోక్షంగా ప్రవేశపెడుతూ వుందనీ ఇదిచాలా అన్యాయమనీ ఆయన చెప్పారు. ప్రభుత్వం, ఎందుకైనా మంచిదని మతవాదులను సంతృప్తిపరుస్తూ వుందని ఆయన

అభిప్రాయపడ్డారు. కేంద్ర శాసనసభలో ముస్లింలకు స్థానాలను కేటాయించిన పద్ధతివల్ల భారతదేశంలో హిందువులే అల్పసంఖ్యాకులుగా తయారైనట్టు ఆయనఫిర్యాదు చేశారు. 46

సర్దార్ సంత్‌సింగ్, శిఖు మతవాదుల అభిప్రాయాలను వ్యక్తం చేశారు. శ్వేతపత్రంలోని ప్రతిపాదనలకు శిఖులకు ఏమాత్రం అమోదయోగ్యం కావని ఆయన ప్రభుత్వానికి స్పష్టంగా చెప్పారు. "శిఖులు కోరుకున్నవాటిని టోరీ ప్రభుత్వం పరిశీలించే స్థితిలో లేదని మతపరమైన తీర్పువల్లా శ్వేతపత్రంలోని ప్రతిపాదనవల్ల తేలిపోయింది" అన్నారాయన. శ్వేతపత్రం భారతదేశాన్ని శాశ్వతంగా విభజిస్తుందని చెప్పారు. "బ్రిటిషువారు ఎప్పటికీ అంగీకరించరు...... భారతదేశంలోని భారతీయ పౌరసర్వీసు, అధికారాన్ని వదులుకునేందుకు ఎన్నటికీ అంగీకరించదు. బ్రిటిషువారికి సహేతుకమైన వాదనతో నచ్చచెప్పవచ్చునని భావిస్తున్న మనమిత్రులు బ్రిటిషువారి గురించి ఇంకా తెలుసుకోవలసివుంది" అన్నారాయన.

రామస్వామి ముదలియార్ మితవాదుల అభిప్రాయాన్ని తెలియచేశారు. శ్వేతపత్రం రౌండ్‌టేబుల్ సమావేశంలో తీసుకున్న నిర్ణయాలకు చాలా భిన్నంగా వుందనీ ఇది అన్యాయమనీ ఆయన ఫిర్యాదుచేశారు. అఖిలభారత పబ్లిక్‌సర్వీసు కమిషన్ సభ్యులను గవర్నర్ జనరల్ నియమిస్తారనీ రాష్ట్ర సంఘాల సభ్యులను గవర్నర్లు నియమిస్తారనీ సమావేశంలో సూచించగా, శ్వేతపత్రంలో దాన్ని మార్చినట్టు ఆయన పేర్కొన్నారు. శ్వేతపత్రం ప్రకారం ఈ అధికారం, భారతదేశానికి సంబంధించిన బ్రిటిషు మంత్రికి సంక్రమిస్తుంది. ఆయన ఈ మంత్రిని వైట్‌హాల్‌కు చెందిన గొప్ప మొగల్ చక్రవర్తి అని వర్ణించారు. ముదలియార్ మరికొన్ని అభ్యంతరాలనుకూడా తెలిపారు. ఆర్థిక పరమైన బాధ్యత గురించి శ్వేతపత్రంలో రిజర్వుబ్యాంకుకు యీ బాధ్యత అప్పగించే సమయానికి బ్యాంకు బాగా పనిచేస్తూ వుండాలని పేర్కొన్నారు. దీనికి అర్థం ఏమిటని ఆయన ప్రశ్నించారు. శ్వేతపత్రంలోని ఒక్కొక్క అంశాన్ని క్షుణ్ణంగా పరిశీలించి చూసినట్టయితే మితవాదులకు కూడా కంపరం పుడుతూందని ఆయన చెప్పారు. భారత దేశానికి సంబంధించిన బ్రిటిష్ మంత్రికి సంక్రమించిన మితిమీరిన అధికారాలను చూస్తే ఎవరికైనా దిగ్భ్రాంతి కలుగుతుందని ఆయన పేర్కొన్నారు 47

ఈ పథకం భారత ప్రభుత్వ అధికారదర్పాన్ని పూర్తిగా ప్రతిబింబిస్తుందని సింద్‌కి చెందిన లాల్‌చంద్ నవల్‌భాయి పేర్కొన్నారు. ఫెడరేషన్‌లో సంస్థానాలనుకూడా చేర్చటం, ప్రభుత్వ అధికారాన్ని పటిష్ఠం చేయటమేనని ఆయన చెప్పారు. సింద్‌లోని హిందూ అల్ప సంఖ్యాకులను ఏమాత్రం లెక్కచేయకుండా, సింధ్‌ని ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయటానికికూడా ఆయన అభ్యంతరం తెలిపారు.

ఈ విధంగా మూడురోజులు జరిగిన చర్చలో అధికారపక్షానికి చెందినవారెవరూ శ్వేతపత్రాన్ని గురించి అభిప్రాయం తెలియజేయలేదు. చివర అబ్దుర్ రహీమ్ సవరణను సభవారు ఆమోదించారు. సవరణను ఎవరూ వ్యతిరేకించలేదు. అంటే స్వరాజ్యవాదులులేని శాసనసభ శ్వేతపత్రాన్ని తిరస్కరించిందన్నమాట.

శాసన సభ అసమర్థత

బ్రిటిష్ ప్రయోజనాలతో సంబంధంవున్న ఆర్థిక, ద్రవ్య విషయాల్లో శాసనసభ అసహాయస్థితిలో ఏమీ చేయలేక పోయినట్టు స్పష్టం అయింది. 1931లో భారతప్రభుత్వం ఆర్థిక సమస్యను ఎదుర్కొనవలసి వచ్చింది. 1931—32 ఆర్థిక సంవత్సరంలోని మొదటి అయిదునెలల్లో ప్రభుత్వ ఆదాయం, అనుకున్నదానికంటె తగ్గిపోయింది. శిస్తు చెల్లింపు నిరాకరణోద్యమం వల్లా, నిషేధపుఉద్యమంవల్లా, ఆదాయం తగ్గింది. సంవత్సరాంతానికి లోటు 19 కోట్లరూపాయలకు మించవచ్చునని ప్రభుత్వం గుర్తించింది. లోటుని భర్తీ చేసేందుకూ, అప్పట్లో ప్రపంచ వ్యాప్తంగా ఆర్థికరంగంలో యేర్పడిన మాంద్యంవల్ల కలిగిన యిబ్బందులను యెదుర్కొనేందుకూ, ప్రభుత్వం అత్యవసర ఆర్థిక బిల్లును ప్రవేశపెట్టి ఢిల్లీలో నవంబర్ 4 నుంచి 20 వరకూ శాసనసభ ప్రత్యేక సమావేశాన్ని యేర్పాటుచేసింది.

సభలో ఆర్థిక మంత్రి మాట్లాడుతూ ఖర్చులన్నీ పోగా 1933 మార్చి నాటికి అయిదు కోట్లరూపాయలు అదనపునిధులు కావాలనీ, యీబిల్లు 18 నెలలు మాత్రమే అమలులో వుంటుందనీ తెలియచేశారు.

బిల్లులోని పన్నుల ప్రతిపాదనలు విపరీతంగా వుండటంతో, ఎటువంటి సందర్భంలోనూ అభ్యంతరం చెప్పని యీ శాసనసభకూడా, బిల్లుని ప్రతిఘటించింది. షణ్ముగం చెట్టి మాట్లాడుతూ "యీ బిల్లులోని ప్రతిపాదనలు మాకు ఆమోదయోగ్యంకాదని మేము యీనాడు చెబుతున్నామూ అంటే ఆర్థికమంత్రి మార్గానికి అవరోధం కల్పించాలని కాదు. పన్నులభారం విషయంలో యింక ఏమాత్రం భరించలేని స్థితికి చేరుకున్నాం అన్నారు." 48

ప్రజలు బిల్లులో ప్రతిపాదించిన విపరీతమైన పన్నులభారాన్ని మోసేందుకు, ఏమాత్రం సిద్ధంగా లేరని శాసనసభ్యులకు బాగా తెలుసు. ప్రభుత్వం యీవిషయంలో తన వైఖరిని ఏమాత్రం మార్చు కోదనికూడా వారికి తెలుసు. జాతీయవాదపార్టీ నాయకులైన సర్. హరసింగ్ గౌర్ మాట్లాడుతూ " ప్రభుత్వంతో సహకరించేందుకే మేమిక్కడవున్నాం. ప్రభుత్వకూడా మాతో సహకరిస్తే బాగుంటుంది." అని అర్థించారు.

ప్రభుత్వం తరపున ఆర్థిక సభ్యుడు ఎంతో గట్టిగా వాదించేటప్పటికి శాసనసభ బిల్లులోని నాలుగు ప్రతిపాదనలను త్రోసిపుచ్చింది. బడ్జెట్‌లో నాల్గు కోట్ల రూపాయల మేరకు యీ విధంగా నష్టంకల్గిందన్న మాట.

అయితే ప్రభుత్వంమాత్రం యీ కోతలను ఆమోదించేందుకు సిద్ధపడలేదు. హరిసింగ్ గౌర్, అబ్దుర్‌రహీమ్, యామిన్ ఖాన్ వైస్రాయిని కల్సుకుని శాసనసభ నిర్ణయం గురించి ఆయనకు నచ్చచెప్పేందుకు ప్రయత్నించారు. ఇవేవీ ఫలించలేదు. నవంబర్ 20 వ తేదీన శాసనసభకు వైస్రాయినుంచి ఒక వర్తమానం అందింది. "లోటును (4 కోట్ల రూపాయలు) భర్తీ చేయకుండా నేను నా విధులను నిర్వర్తించ లేను." అందువల్ల బిల్లును మొదట ప్రవేశపెట్టినపుడు ప్రతిపాదించిన విధంగా కోతను భర్తీ చేసేందుకు ఒక సవరణను ఆమోదించవలసిందని ఆయన సిఫార్సు చేశారు.

హరిసింగ్ గౌర్ బాధ పడ్డారు. ఈ బిల్లు విషయంలో తమపార్టీ యిక ఎటువంటి సంబంధం పెట్టుకోబోదని ఆయన ప్రకటించారు. అబ్దుర్‌రహీమ్ కూడా నిరాశచెందారు. ఆయన యీవిధంగా అన్నారు :

"లక్షలాది దేశ ప్రజలు మేము దేశానికి సహాయం చేయగలమన్న ఆశతో మమ్ములను యిక్కడకు పంపించారు. మేము మాత్రం ఎందుకూ పనికిరాకుండా పోయాం. ప్రభుత్వం చర్యలకు సంబంధించినంత వరకూ ఎటువంటి మార్పు చేసేందుకూ మాకు అధికారం లేదు."49

ఒకప్పుడు మోతీలాల్ నెహ్రూ అనుయాయులే అయినా ప్రస్తుతం ప్రభుత్వంతో సహకరిస్తున్న రంగయ్యర్ మాట్లాడుతూ "శాసనసభ యీ విషయంలో తీసుకున్న నిర్ణయాన్ని ప్రభుత్వం ఆమోదించి వుండవలసిందని నేను అభిప్రాయ పడుతున్నాను. ఇది శాసనసభను బహిష్కరించండి, అవే వారికి సరైన సమాధానంగా వుండేది" అన్నారు. 50

అయితే ప్రభుత్వం యీ అభ్యర్థనను వినేస్థితిలోలేదు. ఆర్థిక బిల్లులోని కోతలను భర్తీచేసే సవరణలన్నిటినీ ఆమోదించారు. జాతీయవాద పార్టీ, ఇండిపెండెంటుపార్టీ సభ్యులూ నిరసనగా సభనుంచి లేచి వెళ్ళిపోయారు. సవరించిన బిల్లును ఓటింగ్ కోసం మళ్ళీ శాసన సభలో ప్రవేశపెట్టినపుడు వీరు మళ్ళీ సభలోకి వచ్చారు. బిల్లును ఆఖరి ఘట్టంలోకూడా ప్రతి ఘటించాలని వీరు కృతనిశ్చయంతో వున్నారు. ఈ విషయంలో దేశ ప్రజల అభిప్రాయాలు వారికి పూర్తిగా తెలుసు. సవరించిన బిల్లుమీద సభలో

ఓటింగ్ జరిగినప్పుడు బిల్లు వీగిపోయింది. అనుకూలంగా 48 ఓట్లూ, ప్రతికూలంగా 63 ఓట్లూ పడ్డాయి.

వైస్రాయి అంతటితో వూరుకోలేదు. తమ సర్టిఫికేషన్ అధికారాన్ని ఉపయోగించి బిల్లును రాజ్య సమితికి సిఫార్సు చేశారు. సమితిలోకూడా యెన్నికయిన సభ్యులు బిల్లును ప్రతిఘటించారు. చివరకు 24 ఓట్లతో బిల్లు ఆమోదం పొందింది. వ్యతిరేకంగా 9 ఓట్లు మాత్రమే పడ్డాయి. దరిమిలా వైస్రాయి సర్టిఫికేషన్‌తో, బిల్లు చట్టం అయింది. ప్రభుత్వం ఇటువంటి " స్వల్పవిషయాలతో " చలించలేదు. 51

అట్టావా వాణిజ్య ఒప్పందం

ఒక ఏడాది తర్వాత ప్రభుత్వంతో మరొకసారి ఘర్షణ జరిగింది. ఈసారి, బ్రిటిషు ఆర్థిక ప్రయోజనాలకు సంబంధించినది ఇది.

ఆర్థికరంగంలో క్లిష్టపరిస్థితి ఏర్పడటంతో గ్రేట్‌బ్రిటన్ 1931 లో తన స్వేచ్ఛా వాణిజ్య విధానాన్ని వదులుకుంది. 1932 ఆరంభంలో, నూటికి పదివంతుల సాధారణ సుంకం పద్ధతిని ప్రారంభించింది, భారతదేశమూ ఇతర డొమినియన్లూ ఈ కొత్త సుంకాన్ని 1932 నవంబరు 15 వ తేదీవరకు కట్టనవసరంలేకుండా వీలుకల్పించారు. ఆ తేదీకి బ్రిటన్‌తో వాణిజ్య ఒప్పందం లేకపోయినట్టయితే ఈదేశాలనుంచి వచ్చే సామగ్రిమీద కొత్త సుంకాలను విధిస్తారు.

ఈ సందర్భంలో 1932 జులైలో అట్టావాలో ఇంపీరియల్ ఎకనామిక్ కాన్ఫరెన్సు ఒకటి ఏర్పాటైంది. భారత ప్రభుత్వం శాసనసభ అనుమతి లేకుండానే ఈసమావేశంలో పాల్గొనేందుకు సర్ అతుల్ చటర్జీ నాయకత్వంలో ఒక ప్రతినిధివర్గాన్ని పంపేందుకు నిశ్చయించింది. శాసనసభ్యులు ఇద్దరిని షణ్ముగం చెట్టి, అబ్దుల్లాహారూన్ ప్రతినిధి వర్గంలోకి తిసుకున్నారు.

ఈసమావేశం ఫలితంగా భారత - బ్రిటన్‌లమధ్య ఒక వాణిజ్య ఒప్పదం కుదిరింది. ఈ ఒప్పందంవల్ల భారత సామగ్రిమీద 10 శాతం సుంకం రాయితీ కొనసాగుతుంది. బ్రిటిషేతర సామగ్రి కొన్నిటిమీద సుంకాన్ని ఎక్కువచేస్తారు. భారతదేశం వైపున కొన్నితరహాల బ్రిటిషు సామగ్రిమీద 10 శాతం రాయితీ వుంటుంది, కొన్నిరకాల మోటారుబండ్లమీద 7.5 శాతం రాయితీ వుంటుంది. అట్టావా సమావేశం ముగిసినపుడు, మరొక అనుబంధ ఒప్పందం కూడా కుదిరింది. దీనిమూలంగా భారత మార్కెట్టులో బ్రిటిషు ఉక్కుకు ప్రత్యేక సదుపాయాలుంటాయి. బ్రిటన్‌లో భారత ఉక్కుకు కూడా అదేమోస్తరు సదుపాయాలను కల్పిస్తారు.52

భారతదేశంలో ఈ ఒప్పందాన్ని వ్యతిరేకించారు. భారత విదేశ వాణిజ్యంలో ఎక్కువభాగం యూరోపేతర దేశాలతో జరుగుతూ వుంది. బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రత్యేక సదుపాయాలు కల్పించే విధానంవల్ల ఈ దేశాలతో భారతదేశపు వాణిజ్యం దెబ్బతింటుందని భారతీయులు భయపడ్డారు. బ్రిటన్‌లో భారత సామగ్రికి ప్రత్యేక సదుపాయాలు కల్పించడం విషయంలో, ఇది అర్థంలేనిదని భావించారు. తేయాకు, జనుమువంటి భారతీయ ఉత్పత్తులకు బ్రిటన్‌లో గిరాకీ ఎటూ వుందనీ వీరు అభిప్రాయ పడ్డారు. కొన్నిరకాల సామగ్రి విషయంలో భారతదేశం గుత్తాధిపత్యం కలిగివుందనీ అందువల్ల ఈ ప్రత్యేక సదుపాయాలవల్ల ఏమీ లాభంలేదనీ వీరు భావించారు. బ్రిటిషుసామ్రాజ్యానికి కల్పించిన ప్రత్యేక సదుపాయాల మూలంగా భారత మార్కెటును బ్రిటిషు సామగ్రిని నింపుతారనీ, మిగతాదేశాలసామగ్రి, అధిక సుంకాలవల్ల బ్రిటిషు సామగ్రితో పోటీ చేయజాలదనీ వీరు అభిప్రాయపడ్డారు. దీనివల్ల భారతీయ వాడకందార్లు ఎక్కువ చెల్లించవలసి వుంటుంది. ఒక ముక్కలో చెప్పాలంటే ఈ ప్రత్యేక సదుపాయాలవల్ల భారతదేశానికి హానిజరుగుతుంది, బ్రిటన్‌కు లాభం చేకూరుతుంది. భారతదేశంలోని పత్రికలు అట్టావా వాణిజ్య ఒప్పదాన్ని గట్టిగా ప్రతిఘటించారు.

ఈ సందర్భంలో వాణిజ్య సభ్యుడు సర్ జోసఫ్ భోర్, శాసనసభలో నవంబరు 7వ తేదీన ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. తీర్మానంలో ఈవిధంగా పేర్కొన్నారు:

> భారత ప్రభుత్వమూ యునైటెడ్ కింగ్‌డమ్, 1932 అగస్టు 20 వ తేదీన అట్టావాలో కుదుర్చుకున్న ఒప్పందాన్ని ఈ శాసనసభ ఆమోదిస్తూ వుంది. ఈ ఒప్పందాన్ని అమలు పరచేందుకు అవసరమైన శాసన పరమైన చర్యలను వీలైనంత త్వరలో భారత శాసనసభలో ప్రవేశపెట్టవలసిందని ఈ శాసనసభ గవర్నర్ జనరల్‌కూ ఆయన సమితికి శిఫార్సు చేస్తూ వుంది. 53

సభ్యులు ఈ తీర్మానానికి అనేక సవరణలు ప్రతిపాదించారు. భారతదేశానికి బాధ్యతాయుత స్వయంపాలన లభించేవరకూ బ్రిటన్‌కు వాణిజ్య సదుపాయాలు కల్పించే విషయమై ఆలోచించేందుకు భారతదేశం సిద్ధంగాలేదని బ్రిటిషు ప్రభుత్వానికి తెలియచేయవలసిందని ప్రధాన జాతీయవాద సవరణలో కోరారు. అట్టావా వెళ్ళిన భారత ప్రతినిధి వర్గం భారత ప్రజలకు ప్రాతినిధ్యం వహించజాలదనీ భారత ప్రభుత్వానికి మాత్రమే ప్రాతినిధ్యం వహించగలదనీ వీరు పేర్కొన్నారు. భారతదేశానికి ఆర్థిక వ్యవహారాల్లో ఎటువంటి స్వేచ్ఛాలేదని అన్ని విషయాల్లోను-రాజకీయ-ద్రవ్య విషయాల్లో-భారతదేశం బ్రిటిషు ప్రభుత్వం అదుపాజ్ఞల్లో ఉందనీ, ఈ ఒప్పందంవల్ల తేలుస్తూ వుందని వీరు

అన్నారు. ఒప్పందంవల్ల ఇంగ్లాండుకే లాభం చేకూరుతుందని వీరు వాదించారు. దేశవాళీ పరిశ్రమలు పూర్తిగా అభివృద్ధి చేందేందుకు వీలుగా సుంకాలు విధించే స్వేచ్ఛ కల్పించా లని కోరారు. వాణిజ్య సభ్యుడి తీర్మానం సరికొత్త తరహాగా వుందని హరిసింగ్ గౌర్ అన్నారు. ఈ తీర్మానం, ఏ బిల్లుకు సంబంధించినదో ఆ బిల్లు పాఠం, సభ్యులకు తెలియదని ఆయన చెప్పారు. ఈ ఒప్పదంవల్ల భారత వాడకందారు మీద ఎక్కువ భారం పడుతుందనీ లేదా ఆదాయం తగ్గిపోతుందనీ మోధి అభిప్రాయ పడ్డారు. ఈ ఒప్పందం అమలు జరిగినట్టయితే భారతదేశపు ఆర్థిక ప్రయోజనాలు దెబ్బతింటాయని అబ్దుర్ రహీమ్ భావించారు. శాసనసభకు చెందిన ఒక సంఘం ఒప్పందాన్ని మొదట పరిశీలించాలని కోరుతూ యునైటెడ్ ప్రావిన్సెస్‌కు చెందిన జియా వుద్దీన్ అహ్మద్ ఒక సవరణ ప్రవేశపెట్టారు.

ఇంత ప్రతిఘటన రావడంతో ప్రభుత్వం తీర్మానాన్ని, శాసనసభకు చెందిన ప్రత్యేక సంఘానికి నివేదించేందుకు అంగీకరించింది. ప్రత్యేక సంఘంలో ఏకభిప్రాయం కుదరలేదు. శాసనసభకు రెండు నివేదికలను సమర్పించారు. ఆదరిమిలా మరొకసారి చర్చ జరిగింది. అధికారేతర తీర్మానాలు వీగిపోవడమో ఉపసహరించుకోవడమో జరి గింది.

వాణిజ్య సభ్యుడి తీర్మానాన్ని చివరకు సభవారు ఆమోదించారు. ఒప్పదంలోని ప్రతి పాదనలను పొందు పరచిన కొత్త సుంకాల బిల్లును సభవారు 1932 డిశంబరు 15 వ తేదీన ఆమోదించారు. అట్టావా ఒప్పదం భారతదేశంలో ఈవిధంగా అమల్లోకి వచ్చింది.

## గాంధీజీ విషయమై శాసనసభ ఆందోళన

1932 సెప్టెంబరులో పూనా ఒప్పందం తర్వాత ఇంకా జైల్లోవున్న గాంధీజీ తమ దృష్టినంతా హరిజనులపై కేంద్రీకరించారు. కొత్తగా 'హరిజన్' అన్న వార పత్రికను ప్రారంభించి, హిందూ సమాజంలో అనుసరిస్తున్న అస్పృశ్యతానిర్మూలనకు పత్రికా ముఖంగా ఉద్యమాన్ని ప్రారంభించారు. బయట దేశంలో పౌర ఉల్లంఘన ఉద్యమం కొనసాగుతూనే వుంది, కాని బలహీనమవుతూ వచ్చింది. అస్పృశ్యత ఉద్యమాన్ని కూడా సనాతన హిందువులు ప్రతిఘటించారు.

శాసనసభలో, గాంధీజీని విడుదల చేసే విషయమై ప్రభుత్వ వైఖరిని తెలుసు కునేందుకు అనేకసార్లు ప్రశ్నలూ అనుబంధ ప్రశ్నలూ అడిగారు. ఆ రోజుల్లో ప్రజలు గాంధీజీని విడుదల చేయాలని ప్రధానంగా కోరుతూ వచ్చారు. ప్రజల ఈ కోరికను ప్రతిబింబిస్తూ మహ్‌మూద్ అహ్మద్ 1933 ఫిబ్రవరి 15 వ తేదీన ఒక తీర్మానాన్ని

ప్రవేశపెట్టారు. గాంధీజీపీ, జమియత్ ఉల్ ఉల్మా నాయకులైన ముఫ్తీకిఫాయత్ ఉల్లానూ విడుదల చేయవలసిందని తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు శిఫార్సు చేశారు. దేశంలో రాజకీయ ప్రతిష్ఠంభనకు అహ్మద్, ప్రభుత్వాన్ని తప్పుపట్టారు. గాంధీజీ, ప్రస్తుతం హరిజన ఉద్ధరణకు పూనుకున్నారనీ ఆయన్ను విడుదల చేయాలనీ అప్పుడే రాజ్యాంగ విషయమై కొంత పురోభివృద్ధికి సాధ్యమనీ ఆయన చెప్పారు. 54

సంత్‌సింగ్ తీర్మానాన్ని గట్టిగా సమర్థిస్తూ "మహాత్మాగాంధీ వంటి మహర్షితుల్యులనూ, ముఫ్తీకిఫాయత్ ఉల్లా వంటి గొప్పవారినీ ఖైదులోపెట్టే వ్యవస్థను ఎవారు మాత్రం సమర్థించగలరు." అని ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. గాంధీజీ, తమ అహింసావిధానంతో దేశప్రజలను అదుపులో పెట్టగలిగారని ఆయన విశ్వసించారు. ఎస్. సి. మిత్ర, చాలా మంది ఇతరులూ సంత్‌సింగ్‌ను సమర్థించారు.55

చర్చ మార్చి ఒకటవతేదీన కొనసాగింది. గాంధీజీ హరిజన ఉద్ధరణకుచేస్తున్న కృషిని రంగయ్యార్ ఉద్ఘాటించారు. ఆయనకు ఈ కృషిలో అన్ని అవకాశాలూ వుండేందుకుగాను ఆయన్ను విడుదలచేయవలసిందని రంగయ్యార్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. అస్పృశ్యత - వ్యతిరేకఉద్యమం చివరకు, పౌరఉల్లంఘన ఉద్యమాన్ని అంతమొందిస్తుందని ఆయన పేర్కొన్నారు. దేశంలో రాజకీయశాంతి, గాంధీజీ - ఇతర రాజకీయనాయకుల విడుదలపై ఆధారపడివుందని ఎన్. ఎమ్. జోషి ఉద్ఘాటించారు.

కాని, దీనికి భిన్నంగా అభిప్రాయపడినవారు కూడా లేకపోలేదు. ప్రభుత్వం తన వైఖరిని సవరించుకున్నట్లయితే తాముకూడా తమ ధోరణిని మార్చుకుంటామని కాంగ్రెసువారు ఇంతవరకు ఎటువంటిసూచనా చేయలేదని మొహమ్మద్ యాకూబ్‌ఖాన్ వాదించారు. "అందువల్ల మొదట కాంగ్రెసునుంచి కొన్ని హామీలు పొందడం అవసరం" అని ఆయన సలహా ఇచ్చారు. 56

ఏప్రిల్ ఒకటవతేదీన చర్చ మళ్లీ ప్రారంభమైనపుడు మహమ్మద్ యామిన్‌ఖాన్ మాట్లాడుతూ, గాంధీజీ ఎంత ప్రజాదరణఉన్న నాయకుడైనా, ప్రజలు తాము ఆదేశించిన మార్గాన్నే అనుసరించేట్టుచేసి దేశానికి గొప్ప హానికలిగిస్తున్నారని చెప్పారు. గాంధీజీని విడుదలచేసేందుకు ఇది సరైన సమయం కాదని ఆయన విశ్వసించారు. 57 మౌల్విసయ్యద్ ముర్తుజా సాహెబ్ బహదూర్ మాత్రం యామిన్‌ఖాన్‌తో ఏకీభవించలేదు. గాంధీజీ దేశప్రజలకోసం మహత్తరమైన త్యాగాలు చేశారనీ, ప్రభుత్వం, తాను భారతీయుల ప్రయోజనాలను కాపాడగలనని ఇంతవరకు నిరూపించుకోలేదనీ ఆయన చెప్పారు. రాజ్యాంగ పరమైన ఉన్నతికి సంబంధించినంతవరకు గాంధీజీ నాయకత్వంలో

కాంగ్రెసుమాత్రమే ఏదైనా సాధించగలదనికూడా ఆయన అభిప్రాయపడ్డారు. అందువల్ల ప్రభుత్వం రాజకీయ నాయకులను విడుదల చేయాలని ఆయన కోరారు. 58 ఈఘట్టంలో వాయిదాతీర్మానం ఒకటి రావడంతో చర్చ అసంపూర్తిగా వుండిపోయింది.

ఏప్రిల్ 30 న గాంధీజీ జైలునుంచి ఒక ప్రకటనచేస్తూ మే 8 వ తేదీనుంచి ఇరవైఒక్క రోజులపాటు తాము నిరశనవ్రతం చేయబోతున్నట్లు తెలియచేశారు. తమ ఆత్మశుద్ధికోసమూ, హరిజనుల ఉద్ధరణకోసం కృషిచేస్తున్న తమ సహచరుల ఆత్మశుద్ధికోసమూ తాము ఈ నిరశనవ్రతం చేయబోతున్నట్టూ, దీనికి ఎటువంటి షరతులు లేవనీ, తమ ఈ నిర్ణయంలో తిరుగులేదనీ గాంధీజీ ప్రకటించారు. ఆయన మే 8 న నిరశనవ్రతం ప్రారంభించారు. ఆయన నిరశన వ్రతం ప్రారంభించిన కారణం దృష్ట్యా ప్రభుత్వం ఆయన్ను అదే రోజున విడుదల చేసింది. విడుదలైన వెంటనే గాంధీజీ పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ఆరు వారాలపాటు నిలిపివేస్తున్నట్లు ప్రకటించారు. దేశంలో శాంతిని కోరుతున్నట్టయితే రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయవలసిందని ఆయన ప్రభుత్వాన్ని అర్థించారు. భారత ప్రభుత్వం దీనికి నిరాకరించింది. పౌరఉల్లంఘన ఉద్యమాన్ని పూర్తిగా ఒదులుకుంటేతప్ప గాంధీజీ కోరినవిధంగా ఆయనకు ఇంటర్వ్యూ ఇవ్వడానికి వీలులేదని కూడా ప్రభుత్వం తెలియచేసింది. దానితో కాంగ్రెసు ఉద్యమాన్ని మరొక రూపంలో అంటే వ్యక్తిగత సత్యాగ్రహ రూపంలో మళ్ళీసాగించాలని నిర్ణయించుకుంది. ఆగస్టు 1 వ తేదీన గాంధీజీ వ్యక్తిగత సత్యాగ్రహం చేసేందుకు రాస్ అన్న గ్రామానికి వెళ్ళవలసింది కాని ఆయన్ని మళ్ళీ అరెస్టు చేశారు.

ఈసారి, జైలునుంచి హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు అదివరకటిమోస్తరుగా ఆయనకు వసతి కల్పించలేదు. దానితో ఆయన ఆగస్టు 17 వ మళ్ళీ నిరశనవ్రతం ప్రారంభించారు. వారంరోజుల్లో ఆయన బలహీనమయ్యారు. ఆయన్ను విడుదల చేయవలసిందని దేశప్రజలు ఆక్రందించారు.

గాంధీజీకి జైలులో తగిన వసతులు కల్పించకపోవడం గురించి చర్చించేందుకు ఎస్. సి. మిత్ర ఆగస్టు 23 వ తేదీన శాసనసభలో ఒక వాయిదాతీర్మానాన్ని ప్రవేశపెట్టారు. ఇదివరకటిమోస్తరుగానే సర్దార్ సంత్‌సింగ్, అబ్దుల్‌మతిన్ చౌధురి, చాలామంది ఇతరులూ తీర్మానాన్ని సమర్థించారు. అస్పృశ్యత వ్యతిరేక ఉద్యమాన్ని ప్రారంభించినందుకు ఎం. సి. రాజా, గాంధీజీని ప్రశంసించారు. ప్రభుత్వం ఆయనకు మద్దతునివ్వాలని రాజా కోరారు. బొంబాయికి చెందిన బి. వి. జాదవ్ రాజాను సమర్థించారు.

కాని పండిత సత్యేంద్రనాద్ సేన్, గాంధీజీ ఉద్యమంపట్ల సనాతన హిందువుల వైఖరిని ప్రతిబింబిస్తూ మిత్ర తీర్మానాన్ని వ్యతిరేకించారు. "సౌకర్యాలను తగ్గించా రన్నది కాదు మా విమర్శ. అసలు ఆ సౌకర్యాలు మొదట ఎందుకు కల్పించారన్నది మాఫిర్యాదు" అన్నారాయన. 59 నవాబ్ మేజర్ మలిక్ తాలిబ్ మెహ్‌దీఖాన్ కూడా గాంధీజీని విమర్శించారు. గాంధీజీ జైలునుంచి బయటికి రావడానికి నిరాకరిస్తున్నందుకు తాము ప్రభుత్వాన్ని తప్పుపట్టజాలమని అయన చెప్పారు.60 ప్రభుత్వం గాంధీజీని బేషరతుగా విడుదల చేసినట్టూ గాంధీజీ నిరాహార దీక్షను విరమించుకున్నట్టూ వచ్చిన తంతిని చదివి వినిపించడంతో సభ్యులు శాంతపడ్డారు.

## స్వరాజ్యపార్టీ ఉద్ధరణ

జైలునుంచి వచ్చిన తర్వాత గాంధీజీ, హరిజనోద్ధరణకు పాటుపడాలని నిశ్చయించు కున్నారు. దీనికిగాను దేశమంతటా పర్యటించేందుకు నవంబరులో బయలుదేరారు. సనాతన హిందువులు ఆయన్ని ప్రతిఘటించారు. శాసనసభలో గాంధీజీ లక్ష్యానికి అనుకూలంగా బిల్లును అస్పృశ్యత నివారణబిల్లు హిందూదేవాలయాల ప్రవేశబిల్లు - ప్రవేశపెట్టారు. వీటిమీద చర్చ జరిగింది. ఈ రెండుబిల్లుల గురించీ వివిధరకాల అభిప్రాయాలు వెలువడ్డాయి. మొదటిబిల్లు గురించి 1934 ఆగస్టు 1 వ తేదీ నాటికి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకునేందుకు పంచిపెట్టారు. రెండవదాన్ని ఉపసంహరించు కున్నారు. నిజానికి ఈ సమయానికి శాసనసభకు ప్రతిఘటించే శక్తి పూర్తిగా పోయిందని చెప్పవచ్చు. 1934 ఏప్రిల్ 11 వ భారత రాష్ట్రాల రక్షణ బిల్లును ఆమోదించినపుడు మాట్లాడుతూ మౌల్వి షఫీ దావూది ఇదేమాట అన్నారు. 61

శాసనసభ జులై 16 లో సిమ్లాలో సమావేశమైనపుడు, శాసనసభ ఎంత చప్పబడి పోయిందో ఇంకా బాగా వెల్లడైంది. ప్రభుత్వం ప్రవేశపెట్టిన అనేక బిల్లులను శాసన సభ ఆమోదించింది. వీటిలో కొన్ని భారతీయుల దృష్ట్యా చాలా అభ్యంతకరమైనవి. బెంగాల్ క్రిమినల్‌లా సవరణ సప్లిమెంటరీ (అనుబంధంగా చేర్చినది) బిల్లు ఇందులో ఒకటి దీనివల్ల బెంగాల్‌నుంచి ఉగ్రవాదులను బయటికి పంపి నిర్బంధ శిబిరాల్లో వుంచే అధికారం ప్రభుత్వానికి శాశ్వతంగా లభిస్తుంది. ఇటువంటిదే మరొక బిల్లు, భారతసైనిక (సవరణ) బిల్లు. సైనిక పరిషత్తులో ఉత్తీర్ణులయ్యే ఒక ప్రత్యేక వర్గపు భారతీయ అధి కార్ల సృష్టికి ఇది దారి తీసింది. ఈ బిల్లువల్ల భారతీయ అధికార్లకు బ్రిటిషు సైనికులకు అధిపత్యం వహించే హక్కు లభించదని జాతీయవాదులు విమర్శించారు. భారతీయ అధికార్లు ఎన్నటికీ ఉన్నత పదవులను అలంకరించజాలరు. బి. దాసు బిల్లును పూర్తిగా వ్యతిరేకించారు. కొత్త రాజ్యాంగం అమల్లోకి వచ్చేవరకూ దీన్ని వాయిదా వేయాలని

ఆయన కోరారు. ప్రభుత్వం మాత్రం అంతవరకు వేచి వుండలేకపోయింది. బిల్లును సభవారు ఆమోదించారు. శాసనసభ తమకు అన్యాయం చేసిందని శాసనసభ వెలుపల భారతీయులు అభిప్రాయ పడ్డారు.

బయట ప్రజలు కూడా అలసిపోయారు. ఏప్రిల్ 7 వ తేదీన స్వరాజ్యం కోసం పౌర ఉల్లంఘనను రద్దు చేయాలని గాంధీజీ కాంగ్రెసుపార్టీ వారికందరికీ సలహా ఇచ్చారు. అఖిలభారత కాంగ్రెసు సంఘం, ఈ నిర్ణయాన్ని ఆమోదించింది. పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని 1934 మే 20 వ తేదీనుంచి రద్దు చేశారు. ఈలోగా డాక్టర్ అన్సారీ కృషితో గాంధీజీ ఆశీర్వచనంతో, స్వరాజ్యపార్టీని పునరుద్ధరించాలని నిర్ణయించారు. అయిదవ శాసనసభకు జరిగే ఎన్నికల్లో పోటీ చేయాలని కూడా నిశ్చయించారు. ప్రస్తుత పరిస్థితుల్లో దేశం అనుకున్నది సాధించేందుకు శాసనసభలో ప్రవేశించడం అవసరమని, అఖిలభారత కాంగ్రెసు సంఘం మే 18, 19 తేదీలలో జరిపిన సమావేశాల్లో అంగీకరించింది. రాబోతున్న ఎన్నికల్లో కాంగ్రెసు వారి కార్యకలాపాలను పర్యవేక్షించి వాటికి ఆధ్వర్యం వహించేందుకు పార్లమెంటరీ బోర్డు నొకదాన్ని ఏర్పాటు చేయాలని నిశ్చయించింది. పాతవిధానాన్నే మళ్లీ అనుసరిస్తున్నారన్నమాట ప్రజా ఉద్యమం నిష్ప్రయోజనమైనపుడు రాజ్యాంగ వాదాన్ని అనుసరించారు.

## రెఫరెన్సులు


1. జవహర్‌లాల్ నెహ్రూ, ఏన్ ఆటోబయోగ్రఫీ (లండన్, 1945), పే. 201-2
2. బి. పట్టాభి సీతారామయ్య, ది హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ నేషనల్ కాంగ్రెసు (బొంబాయి, 1946), వా. 1, పే. 363-4.
3. సుభాష్ చంద్రబోస్, ది ఇండియన్ స్ట్రగుల్, 1920-1942 (బొంబాయి 1964) పే. 176-8.
4. ఇండియా ఇన్ 1929-30 పే. 9.
5. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా, 1, 1930, పే 132
6. వైస్‌రాయ్ స్పీచ్ ఇన్ 'స్పీచెస్ బై లార్డ్ అర్విన్ (సిమ్లా, 1931) వా. 2 పే. 94-104.
7. సీతారామయ్య, యన్. 2, పే. 366.
8. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 2, 1930, పే. 1518
9. ఇబిడ్., పే. 1522.

10. ఇబిడ్., పే. 1527
11. ఇబిడ్., పే. 1537
12. ఇబిడ్., పే. 1539
13. ఇండియన్ అన్యుయల్ రిజిస్టర్ 1930 (కలకత్తా, యన్. డి) వా. 1, పే. 314-17
14. సీతారామయ్య, యన్. 2, పే. 389
15. జి. ఐ. పటేల్, వల్లభాయి పటేల్ లైఫ్ అండ్ టైమ్స్ (బొంబాయి, యన్. డి.), బుక్ 2, పే. 1139
16. ఇబిడ్., పే. 1141
17. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1930, పే. 38-39
18. ఇబిడ్., పే. 61
19. ఇబిడ్., పే. 67-73
20. ఇబిడ్., పే. 129-30
21. ఇబిడ్., పే. 138
22. ఇబిడ్., పే. 172
23. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1931, పే. 439
24. ఇబిడ్., పే. 631
25. ఇబిడ్., పే, 641-2
26. నెహ్రూ, యన్. 1, పే. 322
27. ది నేషన్ (న్యూయార్క్) 134 (13 జనవరి 1932) పే. 33
28. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1932 పే. 212
29. ఇబిడ్., పే. 278
30. ఇబిడ్., పే. 306
31. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 2, 1931 పే, 1441-44
32. ఇబిడ్., పే. 1685
33. ఇబిడ్., పే. 1475-7
34. ఇబిడ్., పే. 1, 1658

35. ఇబిడ్., పే. 1651-2

36 ఎడ్వర్డ్ థామ్సన్, ఎన్‌లిస్ట్ ఇండియా ఫర్ ఫ్రీడమ్ (లండన్. 1941) పే. 50

37. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1932, పే. 580–81

38. ఇబిడ్., పే. 584

39. ఇబిడ్., పే. 585-6

40. ఇబిడ్., పే. 591

41. ఇబిడ్., పే. 600

42. ఏ. బి. కీత్, ఎకాన్‌స్టిట్యూషనల్ హిస్టరీ ఆఫ్ ఇండియా 1600-1935 (లండన్, 1937)పే. 308

43. ఇండియన్ అన్యుయల్ రిజిస్టర్ 1933 (కలకత్తా, యన్. డి) వా. 1, పే. 61

44. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 3, 1933, పే. 2776-7

45. ఇబిడ్., పే. 2801-3

46. ఇబిడ్., పే. 2804-10

47. ఇబిడ్., పే 2912-13

48. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 7, 1931, పే. 1629

49. ఇబిడ్., పే. 2190

50. ఇబిడ్., పే. 2208

51. ఏ. శేషాద్రి అయ్యంగార్, "రిజెక్షన్ ఆఫ్ ది ఫైనాన్స్ బిల్లు" ఇండియన్ రెవ్యూ, 33 (జనవరి 1932) పే. 19-22

52. ఇండియా ఇన్ 1931–32, పే 68

53. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 6, 1932, పే. 1731

54. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1933, పే. 721

55. ఇబిడ్., పే. 723-4

56. ఇబిడ్., వా. 2, పే. 1400

57. ఇబిడ్., వా. 4, పే. 3053

58. ఇబిడ్., పే. 3067
59. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 5, 1933, పే. 150
60. ఇబిడ్., పే. 158
61. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1934, పే. 3286

## ఆరవ అధ్యాయము

# 1935వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టం ప్రతిఘటన : అయిదవ శాసన సభ

### అయిదవ శాసనసభకు ఎన్నికలు

1930–34 మధ్య ఉవ్వెత్తుగా వచ్చిన జాతీయపోరాటం, 1934 మే 20వ తేదీన పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని రద్దు చేయడంతో విషాదంగా ముగిసింది. అయితే అదే సమయంలో యదార్థ పరిస్థితులదృష్ట్యా స్వాతంత్ర్య పోరాటాన్ని మరొక రూపంలో కొనసాగించేందుకు సన్నాహాలు ప్రారంభమయ్యాయి. ఈ కొత్తరూపం, శాసనసభకు నవంబరులో జరుగనున్న ఎన్నికల్లో కాంగ్రెసు తరపున పోటీ చేయడమే. దీనికి గాను పండిత మదనమోహన్ మాలవ్యా అధ్యక్షతన కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు నొకదాన్ని ఏర్పాటు చేశారు. కాని ఆ వెంటనే, మతపరమైన తీర్పు విషయమై కాంగ్రెసులో విభేదాలేర్పడ్డాయి. ఈ విషయమై కాంగ్రెసు తటస్థవైఖరి అవలంబిం చింది. మాలవ్యా, అణే, మాత్రం తీర్పును ఏమాత్రం సందేహంలేకుండా తిరస్కరించాలని కోరారు. ఈ విషయమై సమాధానం కుదరకపోవడంతో కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు అధ్యక్ష పదవికి మాలవ్యా, కాంగ్రెసు కార్య వర్గంలో సభ్యత్వానికి అణే రాజీనామా ఇచ్చారు. వీరు విడిగా 'కాంగ్రెసు నేషనలిస్టు పార్టీ' అని నొక కొత్తపార్టీని ఏర్పాటు చేశారు. మతపరమైన తీర్పును తిరస్క రించాలని కోరుతూ వీరు ఎన్నికల్లో పోటీ చేసేందుకు అనేక నియోజకవర్గాల్లో తమ అభ్యర్థులను నిలబెట్టారు. మరొకవైపున కాంగ్రెసు తరపున సర్దార్ వల్లభాయ్‌పటేల్ మతపరమైన తీర్పు అంత ముఖ్యవిషయం కాదనీ "కాంగ్రెసా లేక ప్రభుత్వమా" అన్నది అసలు సమస్య అనీ ప్రకటించారు. కాంగ్రెసు అభ్యర్థికి వేసే ప్రతి ఓటూ భారతదేశపు స్వాతంత్ర్యానికి వేసే ఓటు అవుతుందని కాంగ్రెసు పార్లమెంటరీబోర్డుకు అప్పుడు అధ్యక్షులైన డాక్టర్ అన్సారీ చెప్పారు.[2] కాంగ్రెసుకు అధ్యక్షులుగా ఎన్ని కైన రాజేంద్రప్రసాద్ కాంగ్రెసు ఎన్నికల ప్రచారానికి మరొక కొత్తరూపునిచ్చారు. ప్రస్తుత శాసనసభలోని సభ్యులు "దేశాన్నివంచించారనీ ప్రజలవిశ్వాసాన్ని దుర్వినియోగం

చేశార"నీ, అందువల్ల వారిని కాంగ్రెసు అభ్యర్థులను ఎన్నుకోవలసిందనీ ఆయన ఓటర్లకు విజ్ఞప్తి చేశారు.[3] కాంగ్రెసు శాసనసభ్యులు ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తారనీ ప్రభుత్వానికి అవరోధంగా వ్యవహరిస్తారనీకూడా ప్రకటించారు.

ఎన్నికల ఫలితాలు తెలిసినపుడు శాసనసభలో కాంగ్రెసు, మిగతా అన్ని పార్టీల కంటె పెద్ద పార్టీగా అవతరించింది. శాసనసభలో కాంగ్రెసు సభ్యులు 44 మందీ కాంగ్రెసు జాతీయవాదులు 11గురు, ఇండిపెండెంట్లు 22 (ముగ్గురు తప్ప మిగతా అందరూ ముస్లింలు), యూరోపియన్లు 11 గురు, నామినేటెడ్ అధికార్లు 26 గురు, నామినేటెడ్ అధికారేతరులు 13 గురు వున్నారు. ఎన్నికలలో ఒక ముఖ్య విశేషం అట్టావా మహాసభకు భారతప్రతినిధిగా వెళ్లిన షన్ముగం చెట్టి ప్రభుత్వ మద్దతు వున్నప్పటికీ, కాంగ్రెసు అభ్యర్థి వెంకటాచలం చెట్టితో పోటీచేసి ఓడిపోవడం. పాత శాసనసభలో మరొక ప్రముఖసభ్యుడు సర్ హరిసింగ్ గౌర్ కూడా ఓడిపోయారు. మద్రాసులో కాంగ్రెసు అభ్యర్థి ఎస్. సత్యమూర్తి, జస్టిస్ పార్టీకి చెందిన ప్రముఖ నాయకులైన రామస్వామి ముదలియార్‌ను ఓడించారు. బీహార్‌లో అనుగ్రహ నారాయణ సిన్హా, పెద్ద పారిశ్రామికవేత్త అయిన సర్ రామకృష్ణ దాల్మియాను ఓడించారు. ఉదారవాదులుకూడా తుడిచిపెట్టుకుపోయారు. ప్రభుత్వం నిరంకుశంగా ప్రవర్తించినప్పటికీ, పౌర ఉల్లంఘన ఉద్యమం విఫలమైనప్పటికీ కాంగ్రెసు, ఓటర్ల విశ్వాసాన్ని-పరిమితమే అయినా కోల్పోలేదని ఎన్నికల ఫలితాలవల్ల తెలిసింది.

## శాసనసభ కొత్తరూపం

అయిదవ శాసనసభ పూర్తిగా కొత్తరకమైనది. బొంబాయికి చెందిన ప్రతిభాశాలి న్యాయవాది అయిన భూలభాయి దేశాయి కాంగ్రెసు పార్టీకి నాయకత్వం వహించారు. ఆర్థిక సభ్యుడికి త్వరలోనే పక్కలో బల్లెంగా తయారైన గోవింద వల్లభ పంత్ పార్టీకి ఉపనాయకులు. "చర్చించడంలో ఉద్దండు"డైన ఎస్. సత్యమూర్తి పార్టీ కార్యదర్శుల్లో ఒకరుగానూ పీలకంఠదాసు మరొక కార్యదర్శిగాను నియమితులయారు. అసఫ్అలీ చీఫ్ విప్‌గానూ, టి. ఎస్. ఎస్. రాజన్, ఎన్. వి. గాడ్గిల్ ఇతర విప్‌లుగానూ పనిచేశారు. శ్రీ వి. వి. గిరి. ఎన్. జి. రంగా, ఎన్. ఎమ్. జోషి, మోహన్‌లాల్ సక్సేనా కార్మిక కర్షక శాసనాల విషయమై ఎక్కువ శ్రద్ధ వహించారు.

ఎం. ఎ. జిన్నా, ఇండిపెండెంట్లకు నాయకత్వం వహించారు. కాంగ్రెసు జాతీయవాదులకు ఎం. ఎస్. అణే నాయకులుగా వ్యవహరించారు. ఎచ్. పి. మోదీ, కావస్‌జీ జెహంగీర్, మితవాద — ఉదారవాద రాజకీయాలకు ప్రాతినిధ్యం వహించేవారు. మొత్తంమీద అయిదవ శాసనసభలో, నాల్గవ శాసనసభలో మోస్తరుగాకాక రెండవ —

మూడవ శాసనసభలో మొత్తరుగా అప్పటి భారత రాజకీయాల్లోని ప్రముఖులు చేరారు. కాంగ్రెసు సభ్యులు గాంధీ టోపీలు ధరించడం, వారు ఆత్మ విశ్వాసంతో వ్యవహరించడం సమావేశాలకు కొత్త ఆకర్షణ కలిగించింది.[4] అయితే జిన్నా, ఆయన ఇండిపెండెంటు సభ్యుల మద్దతు దొరికితేనే ప్రభుత్వాన్ని ఓడించగలమని కాంగ్రెసు సభ్యులు గుర్తించకపోలేదు. జిన్నాకూడా తమ అవసరాన్ని పూర్తిగా గుర్తించారు. ప్రభుత్వంకూడా ఈ విషయాన్ని గుర్తించింది. అందుచేత శాసనసభలోని ప్రభుత్వ ప్రతినిధులు, జిన్నా, కాంగ్రెసుతో చేరకుండా ప్రయత్నిస్తూ వచ్చారు.

1935 జనవరిలో శాసనసభ మొదటిసారి సమావేశమైన కొద్దికాలానికే ఈ సంగతి వెల్లడైంది. సందర్భం, శాసనసభాధ్యక్షుల ఎన్నిక. విఠల్‌భాయి పటేల్, నిర్బంధాలను పాటిస్తూనే ప్రభుత్వం శాసనసభను తనకు ఇచ్చవచ్చిన విధంగా ఉపయోగించకుండా ఏవిధంగా అవరోధంగా వ్యవహరించినదీ ప్రభుత్వం మర్చిపోలేదు. అయిదవ శాసనసభ తీరుతెన్నులుచూసి ప్రభుత్వం శాసనసభలో తన బలాన్ని పటిష్టం చేసుకోవాలని నిశ్చయించుకుంది. అధ్యక్ష ఎన్నికల్లో జిన్నా నాయకత్వంలోని ఇండిపెండెంట్ల ఓట్లు ప్రముఖ పాత్ర వహించగలవని ప్రభుత్వానికి తెలుసు. అందువల్ల అదివరకటి శాసనసభలో ఇండిపెండెంటు పార్టీ నాయకులైన సర్ అబ్దుర్ రహీమ్‌ను అధ్యక్ష పదవికి అభ్యర్థిగా ఎంచుకుంది. కాంగ్రెసుపార్టీ ప్రముఖ జాతీయవాద ముస్లింనాయకుల్లో ఒకరైన టి. ఎ. కె. షేర్వాణీని తన అభ్యర్థిగా ఎంచుకుంది. జిన్నాకు, మొదట ఏం చేయాలో తోచలేదు. చివరకు, ప్రభుత్వ అభ్యర్థికి ఓటుచేయాలని నిర్ణయించుకున్నారు. దానితో జాతీయవాద అభ్యర్థి ఓడిపోయారు. ఆయనకు 62 ఓట్లు మాత్రమే వచ్చాయి, ప్రభుత్వ అభ్యర్థికి 70 ఓట్లు వచ్చాయి.[5]

### మొదటి ఘర్షణ

శాసనసభలో జాతీయవాదులు మొదట గాంధీజీ – ఆయన కార్యకలాపాలకు సంబంధించి, ప్రభుత్వంతో ఘర్షణపడ్డారు. కాంగ్రెసుతో సంబంధాలన్నిటినీ మానుకుని, నిర్మాణ కార్యకాలాపాల విషయమై తమ దృష్టిని కేంద్రీకరించాలని తాము ఆలోచిస్తున్నట్టు గాంధీజీ 1934 సెప్టెంబరు 7 వ తేదీన ప్రకటించారు. ఆయన కోరిక మీదట అక్టోబరులో బొంబాయిలో జరిగిన కాంగ్రెసు మహాసభలో, ఇటువంటి కార్యకలాపాలను ప్రోత్సహించే దృష్టితో అనేక తీర్మానాలను ఆమోదించారు. ఒక తీర్మానంలో కాంగ్రెసు కార్యకలాపాల్లో భాగంగా గాంధీజీ మార్గదర్శకత్వంలో ఆయన సలహాతో పనిచేసే అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘం ఒకదాన్ని ఏర్పాటు చేసేందుకు జె. సి. కుమారప్పకు అధికారమిచ్చారు. నూలు వడకడం కాక ఇతర

గ్రామ పరిశ్రమల పునరుద్ధరణకూ అభివృద్ధికీ ఈ సంఘం కృషిచేస్తుంది. "కాంగ్రెసు రాజకీయ కార్యకలాపాలతో సంబంధం లేకుండా స్వతంత్రంగా సంఘటితమైన ప్రత్యేక కృషి జరిపినపుడే ఇది సాధ్యమవుతుంద"ని తీర్మానంలో పేర్కొన్నారు.

గాంధీజీ తలపెట్టిన ఈ కార్యక్రమం కూడా భారత ప్రభుత్వానికి కోప కారణమైంది. నవంబరు 29 వ తేదీన, భారత ప్రభుత్వానికి చెందిన దేశ వ్యవహారాలశాఖ అన్ని స్థానిక ప్రభుత్వాలకూ పాలనా సంస్థలకు ఒక రహస్య పత్రాన్ని పంపింది. బొంబాయి కాంగ్రెసులో తీసుకున్న నిర్ణయాల ఫలితంగా ఉత్పన్నమైన పరిస్థితి గురించి, ముఖ్యంగా అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘం ఏర్పాటు గురించి ఈ రహస్య పత్రంలో పేర్కొన్నారు. గాంధీజీ, రాజకీయాల ద్వారా తమ నాయకత్వాన్ని నిలుపుకోలేక పోయారనీ గ్రామ ప్రజలను తద్వారా దేశాన్నంతటినీ తమ నాయకత్వంకిందికి తెచ్చుకునేందుకు ఇది మరొక సాకు అనీ ప్రభుత్వం అభిప్రాయపడింది. అందువల్ల ఈ సంఘపు కార్యకాలాపాలను కనిపెట్టి వుండవలసిందనీ ఈ సంఘానికి ఎటువంటి సహాయాన్నీ అందచేయరాదనీ ప్రభుత్వం తన అధికార్లకు హెచ్చరిక చేసింది. హిందూస్తాన్ టైమ్స్ బొంబాయి విలేఖరి తెలివితేటలవల్ల ఈ రహస్య పత్రం సంగతి వెల్లడైంది. భారత ప్రభుత్వం చాలా ఇబ్బందిపడింది.

కొత్త శాసనసభ సమావేశమైన మొదటిరోజునే, (1935 జనవరి 21) ప్రభుత్వం జారీచేసిన ఈ రహస్య పత్రం గురించి చర్చించేందుకు సభా కార్యక్రమాలను వాయిదా వేయాలని కోరుతున్న తీర్మానాన్ని ప్రతిపాదించేందుకు అనుమతినివ్వవలసిందని కాంగ్రెసు సభ్యులు సత్యమూర్తి కోరారు. అనుమతి లభించడంతో తీర్మానంమీద కోపోద్రేకాలతో చర్చ జరిగింది.

ఈ సంఘాన్ని ప్రారంభించడంలో గాంధీజీ ఉద్దేశ్యాలను శంకిస్తున్నందుకు సత్యమూర్తి ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు. "ప్రజల ఉన్నతికోసం జరిగే కృషిలో సహకరించవలసిందని ప్రభుత్వం అర్థిస్తూ వచ్చింది. కాని నాయకులు అటువంటి కార్యకలాపాలను ప్రారంభించినపుడు మాత్రం ప్రభుత్వం, అటువంటి కార్యకలాపాలకు ఎటువంటి సహాయమూ చేయవద్దని, తన అధికార్లను ఆదేశిస్తూవుంది. ఇంత జరిగిన తర్వాత సహకారం - సమాధానపడడం - శాంతి సామరస్యాలు - వీటిగురించి మాట్లాడడం ఉత్త బూటకమనీ మోసంచేయడానికేతప్ప మరొకటి కాదనీ మేము అన్నట్లయితే అది తప్పవుతుందా?" అని ఆయన ప్రశ్నించారు. 6

సత్యమూర్తిని వంత్ గట్టిగా సమర్థించారు. ప్రభుత్వం అదివరలో భారతీయ పత్రికల విషయంలో వ్యతిరేక ధోరణి అవలంబించిందని ప్రస్తుత విషయంలో మాత్రం

దేశ వ్యవహారాల సభ్యుడు పరస్పర సంబంధంలేని, తప్పు సమాచారాన్ని తెలియచేసే వార్తలు ఆధారంగా చర్య తీసుకున్నారని పంత్ పేర్కొన్నారు. దేశ వ్యవహారాల సభ్యుడు ఇప్పటికైనా తెలివిగా వ్యవహరించినందుకు ఆయన వ్యంగ్య ధోరణిలో అభినందించారు. పత్రికలకు సంబంధించిన చట్టాలను ప్రభుత్వం రద్దు చేయగలదన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తపరిచారు. "ఒకవేళ ఆవిధంగా జరిగినట్లయితే గ్రామ పరిశ్రమల సంఘం, అనుకోకుండా ఇది సాధించినందుకు తనను తాను అభినందించు కుంటుంది. సంఘంతో సహకరించరాదనిప్రభుత్వం భావిస్తున్నప్పటికీ సంఘంప్రభుత్వంతో సహకరించేందుకు ముందుకువస్తుంది." అన్నారు పంత్. ఖాయమైన ప్రభుత్వోద్యోగులను ప్రజాప్రతినిధులకు వ్యతిరేకంగా అధికార్లతో కుమ్మక్కయ్యేట్టు చేయడం మంచిదేనా అని ఆయన ప్రశ్నించారు. గ్రామపరిశ్రమ, పరిశ్రమలో ఒక భాగంగా 1919వ సంవత్సరపు భారత ప్రభుత్వ చట్టంకింద, బదలాయింపబడిన అంశమనీ కేంద్ర ప్రభుత్వం ఆవిషయమై ఒక పత్రాన్ని జారీచేసిందనీ కూడా ఆయన పేర్కొన్నారు. ప్రభుత్వం భారతప్రభుత్వ చట్టానికే వ్యతిరేకంగా వ్యవహరించలేదా? అని ఆయన ప్రశ్నించారు. 7

ఈ పత్రం, అధికార్లకు ఒక ఆదేశంమాత్రమేనన్న దేశ వ్యవహారాల సభ్యుడి వాదన గురించి వ్యాఖ్యానిస్తూ రాజన్, ఇది కసితో జారీచేసిన ఆదేశమని పేర్కొన్నారు. "మహాత్మా గాంధీకాని, కాంగ్రెసుకాని పేదవారి సంక్షేమంకోసం ప్రారంభించే ప్రతి ఉద్యమాన్నీ తుడిచిపెట్టేందుకిచ్చిన ఆదేశమ"ని ఆయన వర్ణించారు. 8 కాంగ్రెసు జాతీయవాది అయిన వి. ఎన్. బెనర్జీ కూడా ప్రభుత్వం గ్రామ పరిశ్రమల సంఘం విషయంలో వ్యతిరేక ధోరణినవలంబిస్తున్నందుకు గర్హించారు.

శాసనసభ సమావేశమైన మొదటిరోజునే ప్రభుత్వమూ ప్రతిపక్షమూ బలాబలాలు పరీక్షించుకోవలసి రావడం విచారకరమని బెంగాల్‌కు చెందిన ఫజులుల్‌హక్ అన్నారు. అయితే ఈ సందర్భంలో దోషం పూర్తిగా అధికార్లదేనని ఆయన నిర్భయంగా చెప్పారు. ప్రభుత్వ సర్క్యులర్ (ప్రకటన పత్రం) అభ్యంతరకరమైనదేదీ తమకు కనిపించలేదని ఢాకాకు చెందిన ఎ. ఎచ్. గజ్‌నవి చెప్పారు. "అది ఒకఉత్తర్వుకాని ఆదేశంకానే కాదు. ఒకానొక ఉద్యమం గురించి ప్రభుత్వం తన అభిప్రాయాన్ని ఈ ప్రకటనద్వారా తెలియచేసింది. పౌరఉల్లంఘన ఉద్యమం, రాష్ట్రాల్లో అవాంతర పరిస్థితి తెచ్చిపెట్టింది. ఈ అనుభవందృష్ట్యా, కొత్త పేరుతో ఏదైనా ఉద్యమం ప్రారంభమై ముందు ముందు పౌరఉల్లంఘన ఉద్యమం మొస్తరుగా తయారుకాకుండా ప్రభుత్వం అప్రమత్తంగా ఉండడం సబబు కాదా? " అని ఆయన ప్రశ్నించారు. 9

చర్చను ముగించవలసిందని కాంగ్రెసు సభ్యులు కోరారు. కాని అధ్యక్షులు దీనికి అంగీకరించక పోవడంతో చర్చించి వదిలేశారు.

## మళ్ళీ ప్రత్యేక హక్కుల ప్రశ్న

రెండవరోజున, శాసనసభలో ఎస్. సి. బార్డోలోయి వాయిదా తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. శాసనసభకు ఎన్నికైన శరత్‌చంద్రబోస్ శాసనసభ్యులుగా తమ విధులకు హాజరుకాకుండా ప్రభుత్వం ఆపడం గురించి చర్చించాలని బార్డొలోయి తమ వాయిదా తీర్మానంలో కోరారు. ఇది సభాహక్కులకు భంగం కలిగించడమేనని శాసనసభలో తమకు ప్రాతినిధ్యం వహించేందుకు శరత్‌చంద్రబోస్‌ను ఏకగ్రీవంగా ఎన్నుకున్న నియోజక వర్గానికి అన్యాయంచేయడమేనని ఆయన వాదించారు. చర్చ అతి తీక్ష్ణంగా జరిగింది. అంతకు ఎనిమిదేండ్లక్రితం మూడవ శాసనసభలో ఎస్. సి. మిత్రను గురించి జరిగిన చర్చను జ్ఞప్తికి తెచ్చింది.

న్యాయశాఖ సభ్యుడు సర్ నృపేంద్రనాథ్ సర్కారు ప్రభుత్వాన్ని సమర్థించారు. ప్రస్తుత శాసనసభ బ్రిటిషు సామ్రాజ్యపు చట్టం ప్రకారం ఏర్పాటైనది కాబట్టి సభకు ఆ చట్టంవల్ల సంక్రమించే హక్కులు తప్ప బోస్‌ను నిర్బంధంలో వుంచడంలో పార్ల మెంటరీ హక్కుల ప్రశ్నే ఉత్పన్నంకాదని ఆయన వాదించారు.

భూలభాయి దేశాయి, న్యాయశాఖ సభ్యుడి వాదనను ఖండిస్తూ వాయిదా తీర్మానాన్ని సమర్థించారు. బ్రిటిషు ప్రభుత్వ చట్టంవల్ల సభకు ఎటువంటి హక్కులూ సంక్ర మించకపోయినట్లయితే 1818వ సంవత్సరపు రెగ్యులేషన్-III కింద నిర్బంధితు లైనఒక సభ్యుడిమీద ఆ చట్టం నిర్బంధాలనుకూడా విధించలేదని ఆయన వాదించారు. కామన్సు సభ్యులకు వున్న హక్కు లాలు ఆధారంగా తాము వాదించడంలేదనీ బ్రిటిషు చట్టం, ఒక సభ్యుడికి స్వతహాగావున్న హక్కులను నిరాకరించనంతకాలం, వాటికి అంగీకరించవలసివుంటుందనీ భూలభాయి దేశాయి చెప్పారు. క్రితంసారి ప్రభుత్వం, శాసనసభ నిర్ణయాన్ని ఖాతరు చేయకపోయినప్పటికీ శాసనసభ్యులు తమ విధులకు హాజరుకాకుండా వారిని నిర్బంధించరాదన్న విషయమై మాత్రం ఒక ఆనవాయితీ ఏర్పడి వుందని ఆయన గుర్తుచేశారు. సభ్యుల హర్షధ్వానాల మధ్య ఆయన ప్రభుత్వానికి ఈ విధంగా విజ్ఞప్తి చేశారు.

"ఎవరైనా ఒకవ్యక్తి నేరంచేసినట్లు ఆరోపణ జరిగిన సందర్భంలోకూడా న్యాయ స్థానం సమన్సు పంపినట్లయితే, న్యాయనిర్వహణలో సహాయపడేందుకు ఆ వ్యక్తిని న్యాయస్థానంలో హాజరుపరుస్తారు. (కాపలా వారితోనేఅయినా) కానిఇక్కడ నేరం చేసినట్లు ఎటువంటి ఆరోపణాకూడాలేకుండా కేవలం ఒక ఉత్తర్వుచేత నిర్బంధితులైన ఒక శాసనసభ్యుడికి కోర్టులో న్యాయనిర్వహణలో తోడ్పడంకంటెఎక్కువ గొప్పపని కాకపోయినా అంతటి ప్రాముఖ్యంగల శాసనసభకు హాజరయే హక్కులేదని మాకు

చెబుతున్నారా? శ్రీ ఎస్. సి. బోస్ హక్కు అంతటికంటె ఎక్కువదీ, గొప్పదీ ఉదాత్తమైనదీ, ప్రయోజనకరమైనదీ అనీ, దాన్ని పరిరక్షించడం అవసరమనీ నేను సభవారికి మనవి చేసుకుంటున్నాను."[10]

జిన్నాకూడా సభ, పార్లమెంటు కాదనీ అందువల్ల పార్లమెంటుకుండే హక్కులు లేవనీ అన్నారు. అయితే ఆయన ప్రభుత్వాన్నీవిధంగా ప్రశ్నించారు:

"బోస్‌ను 1932 ఫిబ్రవరి నుంచి నిర్బంధంలో వుంచడం న్యాయమేనా? ఆయన మీద విచారణ జరిపించకుండా శాసనసభ్యులుగా ఆయని తమ విధులను నిర్వర్తించకుండా ఆటంకపరచడం న్యాయమా? ప్రభుత్వం ఈ విధంగా వ్యవహరించినందుకు ప్రభుత్వాన్ని అభిశంసించే హక్కు మాకుంది. మా అసమ్మతి తెలియచేయాలని భావిస్తున్నాం" అంటూ ఆయన వాయిదా తీర్మానాన్ని ఎటువంటి సంకోచం లేకుండా ఆమోదించవలసిందని సభ్యులందరికీ విజ్ఞప్తి చేశారు.[11]

తీర్మానంమీద కోపోద్రేకాలతో చర్చ జరిగినతర్వాత ఓటింగ్ జరిగింది. తీర్మానం 58 ఓట్లతో ఆమోదం పొందింది. వ్యతిరేకంగా 54 ఓట్లు పడ్డాయి. శాసనసభలో ప్రభుత్వం ఓడిపోవడం ఇదే మొదటిసారి.

## రాజకీయ రంగంలో పోరాటం

### సంయుక్త శిఫార్సుల సంఘం నివేదిక తిరస్కృతి

రాజ్యాంగ సంస్కరణలకు సంబంధించిన శ్వేతపత్రం విషయంలో భారతీయులు ఏ విధంగా వ్యవహరించినదీ అయిదవ అధ్యాయంలో గమనించారు. అప్పటి శాసన సభకూడా దాన్ని దాదాపు తిరస్కరించింది. బ్రిటిషు ప్రభుత్వం మాత్రం, రాజ్యాంగ రూపకల్పన కొనసాగించింది. శ్వేతపత్రంలోని ప్రతిపాదనలను పరిశీలించేందుకు లార్డ్ లిన్‌లిత్‌గో అధ్యక్షతన పార్లమెంటుకు అనుబంధంగా సంయుక్త శిఫార్సుల సంఘం ఒకదాన్ని నియమించింది. ఈ సంఘం 1934 నవంబరులో తన నివేదికను సమర్పించింది. శ్వేతపత్రంలోని ప్రతిపాదనలను మొత్తంమీద ఆమోదించింది. కొన్ని ముఖ్య విషయాల్లోమాత్రం, శ్వేతపత్రంకంటెకూడా అధ్వాన్నంగా వుంది. ఉదాహరణకు కేంద్ర శాసన దిగువసభకు ప్రత్యక్ష ఎన్నికలు జరుగాలని శ్వేతపత్రంలో ప్రతిపాదించగా పరోక్ష ఎన్నికలు జరుగాలని సంయుక్త శిఫార్సుల సంఘం శిఫార్సు చేసింది. సంయుక్త శిఫార్సుల సంఘం రక్షణల అవసరాన్ని మరింత ఉద్ఘాటించింది.

దీనికి తగినట్టు గవర్నర్ జనరల్ గవర్నర్ల అధికారాన్ని ఎక్కువ చేసింది.[12] ఈ సంస్కరణల మాటున వున్న బ్రిటిషు ప్రభుత్వ ఉద్దేశ్యం స్పష్టమైంది. "భారత దేశంలో మన వైస్‌రాయ్‌లూ, మన గవర్నర్లూ, వారికింద భారతదేశానికి సంబంధించిన మంత్రి ఆధ్వర్యంలో నియమితులయే అధికారులూ, పార్లమెంటు కల్పించే రక్షణతో భారతీయ మంత్రులూ శాసనసభలూ తమ రాజకీయ అధికారాన్ని మన ప్రయోజనాలకు అనుగుణంగా ప్రయోగించేట్టు చూస్తారు" అని, 1935వ సంవత్సరపు చట్టాన్ని రూపొందించిన స్టాన్‌లీ బాల్డ్‌విన్, అప్పటికే సందేహపడుతున్న బ్రిటిష్‌వారికి హామీ ఇచ్చారు.[13]

సంయుక్త శిఫార్సుల సంఘం చేసిన శిఫార్సులను భారతీయుల్లోని అన్ని వర్గాలవారూ గర్హించారు. "విదేశీయులు ఈదేశాన్ని ఇంకా తమ అధీనంలో వుంచుకుని తమ ప్రయోజనాలకు ఉపయోగించుకునేందుకు వీలుకల్పించే పథకం ఇది" అని డిశంబరులో పట్నాలో సమావేశమైన కాంగ్రెసు కార్యావర్గం పేర్కొంది. దేశప్రజలు దీన్ని తిరస్కరించాలని కోరింది.[14] డిశంబరులో పూనాలో జరిగిన జాతీయ లిబరల్ ఫెడరేషన్ పదహారవ మహాసభకు అధ్యక్షత వహిస్తూ పండిత హృదయనాథ్ కుంజ్రూ, సంయుక్త శిఫార్సుల సంఘం ప్రతిపాదనలను ఆమోదించినట్లయితే కేంద్ర శాసనసభ జాతి ఐకమత్యానికి చిహ్నంగా ఉండబోదనీ ప్రజాశక్తిని సంఘటితపరచే సాధనంగా కూడా ఉండజాలదనీ పేర్కొన్నారు. "ఈ నివేదికను ప్రతిఘటించడం మన ప్రాణాలకోసం పోరాడడమే అవుతుంది." అన్నారాయన.[15] ముస్లింలీగ్ కూడా 1935 జనవరి 27 వ తేదీన దీన్ని గర్హించింది. అఖిలభారత ముస్లిం మహాసభ మాత్రం ఈ పథకం "అసంతృప్తికరంగా"నే వున్నా భారతీయులు దాన్ని తిరస్కరించక, పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వంకోసం సమైక్యంగా కృషిచేయాల"ని అభిప్రాయపడింది.[16]

శాసనసభలో కూడా ఇదేమోస్తరు అభిప్రాయాలు వెల్లడయాయి. 1935 ఫిబ్రవరి 4 వ తేదీన సభానాయకులైన సర్కార్, నివేదికమీద చర్చను ప్రతిపాదించారు. చాలాసవరణలు వచ్చాయి. కాంగ్రెసుపార్టీ నాయకులైన దేశాయి ప్రతిపాదించిన సవరణ రెండుభాగాలుగా వుంది. "సామ్రాజ్యవాద ఆధిపత్య భావంతోనూ ఆర్థిక స్వప్రయోజనాలదృష్ట్యా" ఈ రాజ్యాంగాన్ని రూపొందించారనీ "భారతీయులకు నిజమైన అధికారాన్ని ఇచ్చే ఉద్దేశ్యం ఏమాత్రం లేద"నీ సవరణలో పేర్కొన్నారు. అందువల్ల ఈ పథకం ఆధారంగా ప్రవేశపెట్టే ఏబిల్లునైనా ఆమోదించరాదని సవరణలో శిఫార్సు చేశారు. దేశంలో శాంతికి భంగం కలుగకుండానూ పరస్పర అంగీకారంవల్ల సమస్యలు పరిష్కారం కాగల అవకాశం ఉండడంచేతా "శాసనసభ

ప్రస్తుతానికి మతపరమైన తీర్పును ఆమోదిస్తూగాని, తిరస్కరిస్తూగాని ఎటువంటి అభిప్రాయాన్ని వెల్లడిచేయకుండా వుండడమే మంచిద"ని సవరణలో పేర్కొన్నారు.

జిన్నా ఒక సవరణను ప్రవేశపెట్టారు. ఇది మూడు భాగాలుగా వుంది. వివిధ మతాలవారూ మరొక అంగీకారానికి వచ్చేవరకూ మతపరమైన తీర్పును ఆమోదించాలని శాసనసభ మొదటిభాగం ప్రకారం అంగీకరించింది. రాష్ట్ర ప్రభుత్వాల పథకం చాలా అసంతృప్తికరంగా నిరాశాజనకంగా" వుందని పేర్కొంటూ, ఈ పథకంలోని అనేక అభ్యంతరకరమైన అంశాలమూలంగా అధికారుల - శాసనసభల బాధ్యత నిరుపయోగంగా వుందని చెప్పారు. ఈ అభ్యంతరకర అంశాలను తొలగిస్తే తప్ప, ఈ పథకం భారతీయుల్లో ఎవరికీ సంతృప్తికరంగా వుండబోదని జిన్నా అన్నారు. సవరణలోని మూడవ భాగంలో జిన్నా, అఖిలభారత ఫెడరేషన్ అన్న కేంద్ర ప్రభుత్వ పథకం పూర్తిగా హానికరమైనదనీ బ్రిటిషు ఇండియా ప్రజలకు ఇది ఆమోదయోగ్యం కాదనీ పేర్కొన్నారు. ఈ పథకం ఆధారంగా ఎటువంటి బిల్లునూ ప్రవేశపెట్టవద్దని బ్రిటిషు ప్రభుత్వానికి తెలియచేయవలసిందని భారత ప్రభుత్వానికి సభవారు సవరణలోని ఈ భాగంకింద శిఫార్సు చేశారు. బ్రిటిషు ఇండియాలో పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని చేసేందుకు వెంటనే చర్యలు తీసుకోవాలనికూడా ఈ భాగంలో కోరారు.

హిందూమహాసభ అభిప్రాయాన్ని తెలియచేస్తూ భాయి పరమానంద్ ఒక సవరణ ప్రతిపాదించారు. నివేదిక, ఏకపక్షమైన అన్యాయమైన మతపరమైన తీర్పు ఆధారంగా తయారుచేసినది కావడంతో భారత ప్రభుత్వ రాజ్యాంగాన్ని హిందువులకు వ్యతిరేకంగానూ భారతీయులకు వ్యతిరేకంగానూ ప్రజాస్వామ్యానికే వ్యతిరేకంగానూ తయారు చేసిందని సవరణలో పేర్కొన్నారు. ఇది శాసనసభకు ఎంతమాత్రం ఆమోదయోగ్యం కాదని చెప్పారు.

గజ్నవి, ముస్లిం మహాసభ అభిప్రాయాన్ని తెలియచేశారు. వివిధ మతాలవారు ఒక అంగీకారానికి రాలేకపోయినందువల్ల మతపరమైన తీర్పును ఆయన తమ సవరణలో ఆమోదించారు. అయితే, బ్రిటిషు ఇండియా ప్రతినిధివర్గం సంయుక్త శిఫార్సుల సంఘానికి సమర్పించినసంయుక్త నివేదికలోని శిఫార్సులకు అనుగుణంగా పథకంలో మార్పులు చేయాలని కోరారు. 17

దేశాయి మాట్లాడుతూ, సభలో ప్రతిపాదించిన సవరణలన్నిటినీ వివరించారు. ఇవన్నీ, సంయుక్తశిఫార్సుల సంఘం పథకాన్ని తిరస్కరిస్తున్నాయని పేర్కొన్నారు. తమ అభిప్రాయానికీ (దేశాయి) జిన్నా అభిప్రాయనికీ పెద్ద తేడా లేదని న్యాయశాఖ

మంత్రి వ్యాఖ్యానించినందుకు ఆయన సంతృప్తి వ్యక్తపరిచారు. ఫెడరల్ పథకం గురించి ప్రస్తావిస్తూ ఆయన, తమనూ బ్రిటిషు ఇండియానూ ఒకటిగా కలుపరాదని సంస్థానాధీసులు అభిప్రాయపడుతున్నట్టు తెలియచేశారు. గవర్నర్ జనరల్ ప్రత్యేక బాధ్యతలనూ రక్షణలనూ వివరిస్తూ దేశాయి, ప్రజాప్రతినిధులకు అధికారాన్ని బదలాయించడమే లేదని చెప్పారు. రాష్ట్రాల స్వయంపాలనా ప్రతిపత్తి ఉత్త బూటకమని అన్నారు. మతపరమైన జాతిపరమైన భాషాపరమైన విభేదాలు, విచ్ఛిన్నకర ధోరణులకు దారితీస్తాయన్న సంయుక్త శిఫార్సుల సంఘం నివేదికలో పేర్కొన్న వాదాన్ని ఆయన ఖండించారు. 18

జిన్నా మాట్లాడుతూ "నాకు సంబంధించినంతవరకూ మతపరమైన తీర్పు నాకు సంతృప్తికరంగాలేదు... మేము మా స్వంత పథకాన్ని రూపొందించుకునేవరకూ మాకు తృప్తిగా వుండదన్నది నా అభిప్రాయం" అన్నపుడు సభ హర్షధ్వానాలతో నిండిపోయింది. "మతానికీ, జాతికీ రాజకీయాల్లో తావు కల్పించరాదు" అన్న దేశాయి అభిప్రాయంతో ఏకీభవించారు. ఆయన కాంగ్రెసు పార్టీ నాయకులను ఈ విధంగా ప్రశ్నించారు :

"ఇది కేవలం మతానికి సంబంధించినదేనా ? అది కేవలం భాషకు సంబంధించిన దేనా ? కాదు, ఇది అల్పసంఖ్యాకులకుసంబంధించినది పూర్తిగా రాజకీయసమస్య"

జిన్నా ఫెడరల్ పథకాన్ని వివరిస్తూ "పూర్తిగా ఎందుకూ పనికిరానిదీ వినాశకర మైనదీ ఏమాత్రం ఆమోదయోగ్యంకానిదీ" అని వర్ణించారు" బ్రిటిషు ఇండియా రాజ్యాంగంలో బాధ్యత అంతా కేంద్రానికి ఉండేట్టు 'అఖిలభారత ఫెడరేషన్' అన్న పథకాన్ని ప్రారంభించార"ని జిన్నా పేర్కొన్నారు. రాష్ట్రాలకు సంబంధించినంత వరకు ప్రస్తుతాని కంటె తప్పకుండా మెరుగేనని జిన్నా అభిప్రాయపడ్డారు. "అయితే ఇందులోకూడా రెండవసభ, గవర్నర్ అధికారాలు మొదలైన అభ్యంతరకరమైన అంశాలున్నాయని" జిన్నా అన్నారు. తమ ఉపన్యాసాన్ని ముగింపుచేస్తూ జిన్నా రాష్ట్రపథకాన్ని సవరించి, కేంద్ర పథకాన్ని ఒదులుకుని బ్రిటిషు ఇండియాలో పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసే దృష్టితో మొత్తం పరిస్థితిని, భారతీయుల సలహాతో సమీక్షించాలని" కోరారు. 19

ఫజుల్‌హక్ మాట్లాడుతూ, మంత్రుల అధికారాలమీద విధించదలచిన పరిమితులవల్ల బాధ్యతాయుత ప్రభుత్వమన్న సూత్రానికి అవరోధమని చెప్పారు. మతపరమైన తీర్పు చెడ్డదని అంగీకరించారు కాని ప్రస్తుత పరిస్థితుల్లో అది అవసరమని పేర్కొన్నారు. "మామిత్రులు మాతో సంప్రదింపులు జరిపి ఒక అంగీకారానికి వచ్చినట్టయితే మేము,

ముసల్మానులం, మతపరమైన తీర్పును, ఈ క్షణం వదులుకోవడానికి సిద్ధంగా వున్నాం" అని ఆయన ప్రకటించారు. 20

పంత్, దేశాయి ప్రతిపాదించిన తీర్మానాన్ని గట్టిగా సమర్థించారు. భారతీయులను బెదిరించడానికి ఈ మతపరమైన బూచిని ప్రతిసారీ చూపెడుతున్నారని ఆయన చెప్పారు. "ప్రతిప్రాంతంలోనూ విదేశపాలన విభేదాలను కల్పిస్తూనే వచ్చినట్టు చరిత్ర వల్ల తెలుస్తుంది" అన్నారాయన. న్యాయశాఖ మంత్రిని, తమ పథకాన్ని ఉపసంహరించుకోవలసిందని కోరారు. భారతదేశంలో స్వయంపాలనకు ఒక పథకాన్ని తయారు చేసుకునేందుకు శాసనసభకు అనుమతి నివ్వవలసిందని కూడా కోరారు. 1922 లో సర్వంసహాధికారంగల రాజ్యంగా ప్రకటించిన ఈజిప్టులో రక్షణల చరిత్రను ఆయన వివరించారు. "ఈజిప్టు రాజుయొక్క బ్రిటిషు సలహాదారు కోరిన మీదట, రక్షణలు ఆధారంగా రాజ్యాంగాన్ని రద్దు చేశారు. గత పద్నాలుగేండ్లుగా అది రద్దయి వుంది. భారతదేశంలో కూడా ఈ రక్షణలు అంతకంటే ఎంత మాత్రం మెరుగ్గా లేవు. సంయుక్త శిఫార్సుల సంఘం ప్రతిపాదించిన పథకం మొత్తం వికృతమైనదీ, అతితెలివైన బూటకమూ, రాజ్యాంగపరమైన అభివృద్ధి పేరుతో ఇటువంటి ప్రహసనం మరేదేశంలోనూ జరుగలేదు" 21

గాడ్గిల్ మాట్లాడుతూ, సంయుక్త శిఫార్సుల సంఘం పథకం కింద గవర్నర్లకూ గవర్నర్ జనరల్‌కూ, అతిశక్తివంతమైన చక్రవర్తికంటె కూడా ఎక్కువ అధికారాలు లభిస్తాయని చెప్పారు. బ్రిటిష్‌వారు భారతదేశం నుంచి తొలగిపోయినట్టయితే, హిందువులూ ముస్లింలూ తగువులాడుకుంటారనీ అందువల్ల బ్రిటిషు వారితో సంబంధాలను చెడగొట్టుకోరాదనీ వాదిస్తున్నవారిని గాడ్గిల్ ఖండించారు. బ్రిటిషువారు వైదొలగినట్టయితే, ఈ రెండు మతవర్గాల వారూ మొదట బలా బలాలను పరీక్షించుకున్నా ఆ తర్వాత పరస్పరం సంప్రదించుకుని ఒక జాతీయ పథకాన్ని రూపొందించుకుంటారని గాడ్గిల్ అభిప్రాయ పడ్డారు. ఫెడరల్ పథకాన్ని విమర్శిస్తూ అటువంటి ఫెడరేషన్‌లో సంస్థానాధీశుల రాజకీయ రంగంలో ఆధిపత్యం వహిస్తారని చెప్పారు. 22

అసఫలీ మాట్లాడుతూ, శ్వేతపత్రాన్నీ, సంయుక్త శిఫార్సుల సంఘం నివేదికనూ ఆసేతు హిమాచలం గర్హించినప్పటికీ రాజ్యాంగ సంస్కరణ బిల్లును పార్లమెంటు చేత ఇంత హడావుడిగా ఎందుకు ఆమోదించే ప్రయత్నం చేస్తున్నారని బ్రిటిషు ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. "వారు సంయుక్త శిఫార్సుల సంఘం తయారు చేసినది బ్రిటిషు సామ్రాజ్య సమాధికి మకుటాయమానంగా చరిత్రలో శాశ్వత స్థానాన్ని ఆక్రమిస్తుందని" అసఫలీ చెప్పారు.23 దేశమంతా ఒక్కుమ్మడిగా పథకాన్ని గర్హిస్తూవున్నా విరసన

తెలియచేస్తూవున్నా బ్రిటిషు ప్రభుత్వం ఈ పథకాన్ని భారతీయుల మీద రుద్దేందుకు ఎందుకు అంత త్వరపడుతుందో అర్థంకావడంలేదనీ బీహారుకు చెందిన దీప్ నారాయణ సింగ్ కూడా ఆశ్చర్యం వ్యక్తపరిచారు.

మతపరమైన తీర్పును ఏదో విధంగా భారతీయుల మీద రుద్దేందుకు జరుగుతున్న ప్రయత్నం చూస్తే భారతీయులు ఐక్యమత్యంగా ఉండరాదని ప్రభుత్వం కోరుతూందని స్పష్టంగా తెలుస్తున్నట్టు అణే చెప్పారు. అఖిల భారత ఫెడరేషన్‌లో భాగంగా సంస్థానాలను కూడా చేర్చడం కూడా భారతీయుల్లో చీలికలు ఏర్పరచే ప్రయత్నమేనని ఆయన చెప్పారు. 24

మతపరమైన తీర్పువల్ల భారతదేశంలోని అన్ని మతాలవారికీ శిఖ్ఖులతో సహా లాభం చేకూరుతుందన్న సంయుక్త శిఫార్సుల సంఘం నివేదిక వాదనను సర్దార్ మంగళ్‌సింగ్ ఖండించారు. ఇది మసిపూసి మారేడుకాయ చేయడమేననీ ఆయన చెప్పారు. మతపరమైన తీర్పువల్ల భారతదేశంలో మతపరమైన విభేదాలు కొనసాగుతాయని ఆయన వాదించారు. ముస్లింలు అల్ప సంఖ్యాకులుగావున్న యునైటెడ్ ప్రావిన్సెస్ వంటి రాష్ట్రాల్లో, ముస్లింలకు ఇచ్చిన ప్రాముఖ్యాన్ని ఆయన వ్యతిరేకించలేదు. పంజాబులోని శిఖ్ఖుల విషయంలో కూడ అదే విధంగా శ్రద్ధ వహించనందుకు ఆయన విమర్శించారు. సంయుక్త శిఫార్సుల సంఘం ప్రతిపాదించిన ఫెడరల్ పథకాన్ని కూడా ఆయన గర్హించారు. 25

భూస్వాముల తరపున మాట్లాడుతూ రాజాబహదుర్ హరిహరప్రసాద్ నారాయణసిన్హా, జమీందార్లకు సంబంధించిన శిఫార్సుల గురించి మాత్రమే ప్రస్తావించారు. రాష్ట్ర-కేంద్ర శాసనసభల్లో వివిధ వర్గాల వారికి ప్రాతినిధ్యం కల్పించే పథకంలో జమీందార్లకు వారికి ఇవ్వవలసినంత ప్రాముఖ్యం ఇవ్వలేదని ఆయన విమర్శించారు. పర్మినెంట్ సెటిల్‌మెంటు(శాశ్వత ఒప్పందాని)కు అనుగుణంగా చట్టంలో తగిన ఏర్పాట్లు చేసినపుడే జమీందార్ల హక్కులకూ హోదాకూ భంగం కలుగకుండా ఉంటుందనికూడా ఆయన చెప్పారు. 26

బొంబాయి మిల్లుయజమానుల సంఘం ప్రతినిధిగా ఎచ్. పి. మోది మాట్లాడుతూ రాజ్యాంగ సంస్కరణల బిల్లుమీద చర్చ జరగాలని చెప్పారు, అది ఎంత బాగా లేకపోయినా ప్రస్తుతంవున్న పరిస్థితికంటె కొంత అయినా మెరుగ్గా వుంటుందని ఆయన అభిప్రాయపడ్డారు. మంచి ప్రభుత్వందృష్ట్యా రక్షణలు కొంత వరకు అవసరమే అయినా, రాజ్యాంగాన్ని రక్షణలతో నింపరాదని మాత్రం ఆయన పేర్కొన్నారు. రాజ్యాంగంలో ఎక్కడా డొమినియన్ ప్రతిపత్తి ఇచ్చేందుకు వీలుగా

భారతదేశాన్ని అభివృద్ధిపరచడం అన్న సంగతి ఎక్కడా పేర్కొనకపోవడం తమకు బాధగావుందని చెప్పారు. 27

ఎస్. ఎమ్. జోషి మాట్లాడుతూ భారతదేశంలో రక్షణలు కావలసినవారు ఎవరైనా వుంటే వారు శ్రామిక వర్గంవారూ మామూలు ప్రజానీకమూ అని చెప్పారు. ఈరక్షణలైనా గవర్నర్లయొక్క గవర్నర్ జనరల్‌యొక్క అధికారాల రూపంలో వుండరాదనీ శాసనసభలో తగిన ప్రాతినిధ్యం కల్పించాలనీ ఆయన కోరారు. "భారతీయులకు సంబంధించినంతవరకు బ్రిటిషు వారికి బ్రిటిషు ఇండియా ప్రజల్లోకంటె సంస్థానాధీసుల్లో ఎక్కువ విశ్వాసం వుంది. బ్రిటిషు ఇండియా ప్రజలకు సంబంధించి నంతవరకు మామూలు ప్రజానీకంలో కంటె, భూస్వాముల్లోనూ వాణిజ్యవేత్తల్లోనూ సంయుక్త శిఫార్సుల సంఘం ఎక్కువ విశ్వాసాన్ని కనబరచింది. సంయుక్త శిఫార్సుల సంఘం తయారుచేసిన పథకంలో ఈ విచక్షణ స్పష్టంగా కనిపిస్తూ వుంది," 28 అన్నారాయన.

సత్యమూర్తి మాట్లాడుతూ, రాజ్యాంగ పథకాన్ని గట్టిగా విమర్శిస్తూ ప్రతిపక్షల వారి వాదనను సమీక్షించారు. "శ్వేతపత్రాన్ని తిరస్కరించాలన్న ఏకైక లక్ష్యంతో కాంగ్రెసు ఎన్నికల్లో పాల్గొంది. లక్షలాది ప్రజలు కాంగ్రెసుకు ఓటు వేసినదికూడా అందుకే, శ్వేతపత్రాన్ని ఆమోదించాలని కోరినవారందరూ ఎన్నికల్లో ఓడిపోయారు." అన్నారు సత్యమూర్తి. ఫెడరేషన్ ప్రతిపాదనను విరమించుకున్నట్టయితే బిల్లును కూడా విరమించుకోవలసి వుంటుందని న్యాయశాఖ సభ్యుడు చెప్పి వున్నారు. ఫెడరేషన్ ప్రతిపాదననూ బిల్లునూ కూడా విరమించుకున్నట్టయితే అవి పేరూ ఊరూ లేకుండా పోతాయని సత్యమూర్తి న్యాయశాఖ సభ్యుడికి హామీ ఇచ్చారు. 29

మూడురోజుల చర్చ తర్వాత, సభాధ్యక్షులకు ఒక సమస్య ఏర్పడింది. అసలు తీర్మానానికి 12 సవరణలుండడమే కాక ఒక్కొక్క సవరణ రెండు మూడు భాగాలుగాకూడా వుంది. మొట్టమొదట దేశాయి సవరణలోని మొదటిభాగం మీద ఓటింగ్ జరిగింది. ప్రభుత్వం తలపెట్టిన రాజ్యాంగ పథకం, సామ్రాజ్యవాద ఆధిపత్య భావంతో రూపొందించినదనీ ఇది ఆధారంగా ప్రభుత్వం ఎటువంటి శాసనాన్నీ తలపెట్టరాదనీ ఈభాగంలో కోరారు. సవరణ వీగిపోయింది. అనుకూలంగా 61 ఓట్లూ ప్రతికూలంగా 72 ఓట్లూ పడ్డాయి. జిన్నా తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు చేశారు.

సభాధ్యక్షులు ఆతర్వాత జిన్నా సవరణలోని మొదటి భాగం మీద ఓటింగ్ జరిపించారు. మరొక అంగీకార యోగ్యమైన పరిష్కారం లేకపోవడం వల్ల

మతపరమైన తీర్పును ఆమోదిస్తున్నట్లు దీనిలో పేర్కొన్నారు. సభాధ్యక్షుల సూచన మీద దేశాయి, తమ తీర్మానంలోని రెండవ భాగాన్ని జిన్నా తీర్మానంలోని మొదటి భాగానికి సవరణగా ప్రతిపాదించారు. దేశాయి సవరణ వీగిపోయింది. అనుకూలంగా 44 ఓట్లూ ప్రతికూలంగా 84 ఓట్లూ పడ్డాయి. జిన్నా అణే ఇద్దరూ దేశాయి తీర్మానానికి ప్రతికూలంగా ఓటు చేశారు.

ఆతర్వాత, జిన్నా మొదటి సవరణమీద ఓటింగ్ జరిగింది. మొదట మొదటి భాగం మీద ఓటింగ్ జరిగినపుడు, 68 ఓట్లతో నెగ్గింది, ప్రతికూలంగా 15 ఓట్లు పడ్డాయి. దేశాయి ఆయన బృందమూ ఓటింగ్‌లో పాల్గొనలేదు. అణే తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు చేశారు.

జిన్నా సవరణలోని మిగతా రెండు భాగాల మీద ఓటింగ్ ఒకేసారి జరుగాలా లేక విడివిడిగా జరుగాలా అన్న విషయమై తీవ్రమైన బేధాభిప్రాయాలు వెలువడ్డాయి. ఓటింగ్ విడివిడిగా జరుగాలని గజ్నవీ, కౌవాస్‌జీ జహాంగీర్, న్యాయశాఖ సభ్యుడూ కోరారు. రెండింటి మీదా ఒకటిగా ఓటింగ్ జరుగాలని దేశాయి వాదించారు. న్యాయ శాఖ సభ్యుడు, జిన్నాను మంచిచేసుకునేందుకు ప్రయత్నించారు. జిన్నా మాట్లాడుతూ, విడివిడిగా ఓటింగ్ జరుగాలని తాము మొదట కోరినా, రెండింటిమీదా ఒకేసారి ఓటింగ్ జరుగాలన్న వాదనలతో తాముకూడా ఏకీభవిస్తున్నామని చెప్పారు. ఓటింగ్ జరిగింది, జిన్నా తీర్మానం 74 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 58 ఓట్లు పడ్డాయి. ఈసారి జిన్నా, దేశాయి అణే తీర్మానానికి అనుకూలంగా ఓటు చేయగా, గజ్నవీ మోది జహాంగీర్, తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు చేశారు.

ఆ తర్వాత, మొత్తం సవరణ మీద ఓటింగ్ జరుపాలా వద్దా అన్న విషయమై వివాదం ఏర్పడింది. ఈ సందర్భంలో అవసరంలేదని దేశాయి వాదించారు. అవసరమని న్యాయశాఖమంత్రి చెప్పారు. సవరణలోని మొదటి భాగం కారణంగా హిందువులు, మొత్తం సవరణకే వ్యతిరేకంగా ఓటు చేస్తారనీ మూడవ భాగం కారణంగా చాలామంది ముస్లింలూ మితవాదులూ సవరణకు వ్యతిరేకంగా ఓటు చేస్తారనీ దానితో సవరణ వీగి పోతుందని న్యాయశాఖ సభ్యుడు ఎదురు చూశారు. జిన్నాలేచి, ప్రభుత్వం ఈ మొత్తం తతంగాన్ని ప్రహసనం చేయాలని తలపెడుతూ వుందని చెప్పినపుడు సభ్యులు "హియర్ హియర్" అన్నారు.

చివరకు సభాధ్యక్షులు, అసలు తీర్మానం లక్ష్యం, సంయుక్త కపార్సుల సంఘం నివేదిక విషయమై సభవారి అభిప్రాయం తెలుసుకోవడమేనని చెప్పారు. ప్రస్తుత సంద

ర్యంలో సభ్యులను ఇక ఏమీ ప్రశ్నించనవసరంలేదని సభాధ్యక్షులు ప్రకటించినపుడు సభ్యులు హర్షధ్వనాలు చేశారు. సభ అంతటితో వాయిదా పడింది.[30]

శాసనసభలో బయటా వ్యతిరేక అభిప్రాయాలు వెల్లడైనప్పటికీ భారత ప్రభుత్వం మాత్రం, అందరూ రాజ్యాంగాన్ని అమలు జరుపడంలో సహకరిస్తారనే అభిప్రాయ పడింది. మార్చి 26 న అసవలీ అడిగిన ప్రశ్నకూ సత్యమూర్తి అడిగిన అనుబంధ ప్రశ్నలకూ సమాధానం చెబుతూ సభానాయకులు సర్కార్ ఈ సంగతి తెలియచేశారు.[31] భారతదేశానికి సంబధించిన మంత్రికి ఈ సంగతి తెలియచేశారా అని అడిగిన ప్రశ్నకు సర్కార్ జవాబు చెప్పలేదు. భారత ప్రభుత్వం తప్పుదోవపట్టించే నిర్ణయం తీసుకోవడం గురించి చర్చించేందుకు వాయిదా తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి అనుమతి ఇవ్వవలసిందని సత్యమూర్తి మార్చి 28 న కోరారు. సర్కార్ ఇందుకు నిరాకరించారు. కొంతసేపు చర్చ జరిగిన తర్వాత తీర్మానం సరిగాలేదని సభాధ్యక్షులు చెప్పారు.

## రాజ్యాంగ నిర్ణయ సభకోసం అభ్యర్ధన

ఈలోగా, బ్రిటిషు ప్రభుత్వం, భారతదేశంలోని శాసనసభల అభిప్రాయాలకోసం వేచి చూడలేదు. సంయుక్త శిఫార్సుల సంఘం నివేదిక ఆధారంగా తయారుచేసిన భారత ప్రభుత్వ బిల్లును, 1935 ఫిబ్రవరి ఒకటవ తేదీన పార్లమెంటులో ప్రవేశపెట్టారు. అప్పటికి బిల్లు గురించి, కేంద్ర శాసనసభ అభిప్రాయాన్ని అడగనుకూడ లేదు. భారత దేశం వ్యతిరేకించినప్పటికీ బిల్లును ఆపలేదు. 1935 ఆగష్టు 4న, పార్లమెంటు ఆమోదించిన రూపంలో బిల్లు రాజామోదం పొందింది. ఈ రాజ్యాంగంలోని ఫెడరల్ అంశాల్లో ముఖ్యమైనవాటిని అమెరికన్ రచయిత ఒకరు ఈవిధంగా పేర్కొన్నారు:

"పూర్తిగా బ్రిటిషు ప్రభుత్వానికి బాధ్యులైన అధికారుల అధికారాలు దీనివల్ల ఇంకా విస్తృతమై పటిష్ఠమయాయి. బ్రిటిషు ప్రభుత్వానికీ-సంస్థానాధీశులూ-భూస్వాములూ-భారతదేశంలోని ఇతర అభివృద్ధి నిరోధక శక్తుల మధ్య సంబంధాలు మరింత గట్టి పడ్డాయి. భారతదేశంలో బ్రిటిషు వాణిజ్యానికి పరిశ్రమలకూ బ్యాంకింగ్ వ్యవహారాలకూ నౌకాయానానికి ఏమాత్రం భంగం కలుగబోదు. భారత ఆర్థిక వ్యవస్థ, విదేశ వ్యవహారాలూ బ్రిటిషువారి చేతుల్లోనే కొనసాగుతాయి. బ్రిటిషువారి ఆధీనంలోని పాలనా వ్యవస్థను సవరించేందుకుగాని, దానితో జోక్యం కల్పించుకునేందుకుగాని భారతీయులకు ఎటువంటి అవకాశమూ వుండదు.[32] రాజ్యాంగ విషయాల్లో నిపుణులైన కీత్ కూడా ఈవిధంగా వ్యాఖ్యానించారు: ఫెడరేషన్‌లోని వివిధ భాగాలకూ సామ్యం లేదు. అందుచేత అవన్నీ ఒకటిగా ఉండే సావకాశంలేదు. పథకం బ్రిటన్‌కు మాత్రం అనుకూలంగా వుంది. బ్రిటిషు ఇండియాలో ఎటువంటి ప్రజాస్వామ్య ధోరణులు తలఎత్తినా

అణిచివేసేందుకు బ్రిటన్‌కు వీలుంది. బ్రిటిషు ఇండియాలోని కేంద్ర ప్రభుత్వానికి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని అప్పచెప్పకుండా దాటవేసే వుద్దేశ్యంతోనే ఈ ఫెడరేషన్ తలపెట్టినట్లు భారతీయులు అభిప్రాయపడడంలో న్యాయంలేక పోలేదు. రక్షణ విదేశ వ్యవహారాలూ ఫెడరల్ ప్రభుత్వానికి అప్పచెప్పకుండా బాధ్యతను అప్పగిస్తున్నట్లు చెప్పుకోవడంలో అర్థంలేదు. 33

భారతదేశంలో, 1936లో కాంగ్రెసు అధ్యక్షులైన జవహర్‌లాల్ నెహ్రూ కొత్త రాజ్యాంగం "సంకెళ్ళతోకూడిన కొత్త ప్రణాళిక" అని వర్ణించారు.34 కొత్త రాజ్యాంగం మొత్తాన్ని త్రోసిపుచ్చినట్లు 1936 ఏప్రిల్‌లో లక్నోలో సమావేశమైన కాంగ్రెసు ఒక సమగ్రమైన తీర్మానంలో మళ్ళీ పేర్కొంది. రాజ్యాంగ నిర్ణయసభను ఏర్పాటు చేయాలని మళ్ళీ కోరింది. స్వరాజ్యపార్టీ 1934 మే 3 న మొట్టమొదటిసారిగా ఈ విధంగా కోరింది. యావద్ భారతదేశమూ ఒక జాతి అన్నది ప్రాతిపదికగా అటువంటి రాజ్యాంగసభ ఒక రాజ్యాంగాన్ని రూపొందించాలని తీర్మానంలో కోరారు. వయోజన ఓటింగ్ ఆధారంగా గాని, లేదా దాని మోస్తరు ఓటింగ్ ఆధారంగా గాని రాజ్యాంగ నిర్ణయ సభ్యులను ఎన్నుకోవాలని కోరారు. దీన్ని సఫలీకృతం చేసుకునేందుకు కృషి చేయవలసిందని కాంగ్రెసు శాసనసభ్యులనూ బయటనున్నవారినీ కూడా ఉద్బోధించింది.35

బ్రిటిషు ప్రభుత్వం, భారత ప్రభుత్వ చట్టంలోని రాష్ట్రీయ విభాగాన్ని 1937 ఏప్రిల్ ఒకటి నుంచీ అమలు జరుపాలని నిశ్చయించింది. దీనికి అనుగుణంగా 1937 వసంతకాలంలో రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు జరిగాయి. ఎన్నికల్లో పోటీచేయాలనీ అయితే ఎటువంటి సందర్భంలోనూ రాష్ట్ర ప్రభుత్వాల్లో పాల్గొనరాదనీ కాంగ్రెసు నిశ్చయించుకుంది. జిన్నా నాయకత్వంలో ముస్లింలీగ్‌కూడా పోటీచేసేందుకు నిర్ణయించుకుంది. కాంగ్రెసు ప్రచారంతో "పల్లెప్రాంతాలు అంతకు ముందెన్నడు ఎరుగని చైతన్యంతో తొణికిసలాడాయి".36 ఫలితంగా కాంగ్రెసు బ్రహ్మాండంగా గెల్చింది. అయిదు రాష్ట్ర శాసనసభల్లో మద్రాసు – యునైటెడ్ ప్రావిన్సెస్ – సెంట్రల్ ప్రావిన్సెస్ - బీహార్ - ఒరిస్సా కాంగ్రెసుకు అత్యధిక మెజారిటీ లభించింది. నాలుగు రాష్ట్రాల్లో బొంబాయి - బెంగాల్ - అస్సాం - వాయువ్య సరిహద్దు రాష్ట్రాలలో అతి పెద్ద పార్టీగా అవతరించింది. సింధ్ – పంజాబు రాష్ట్రాల్లో చిన్న మైనారిటీగా గెల్చింది.37 "స్వాతంత్ర్యమూ సమాజవువ్నతి కావాలని ఓటర్లు కోరుతున్నట్లు దీనివల్ల తేలింది."38

ఒక్క లొసుగు, కాంగ్రెసు ముస్లింలనుంచి ఎక్కువ ఓట్లను పొందలేకపోయింది. బ్రిటిషు ఇండియాలోని 482 ముస్లిం నియోజకవర్గాల్లో కాంగ్రెసు 58 స్థానాలను

మాత్రమే పోటీచేసింది. 26 గెల్చుకుంది. అదికూడా ఎక్కువగా వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో. అయితే ముస్లింలీగ్‌కూడా తమకు ముస్లింల మద్దతు వుందన్న వాదనను ఋజువు పరచలేకపోయింది. ముస్లింలు అధిక సంఖ్యాకులుగా వున్న బెంగాల్ - పంజాబ్ - సింధ్ - వాయవ్య సరిహద్దు రాష్ట్రాల్లోనే గెలువలేకపోయింది. ముస్లిం ఓట్లు, అనేక ముస్లిం పార్టీలూ వర్గాలమధ్య చీలిపోయాయి. హిందువులు ఎక్కువగా వున్న రాష్ట్రాల్లో మాత్రం ముస్లింలీగ్ మిగతా ముస్లిం పార్టీల కంటె పెద్దదిగా అవతరించింది.[39]

ఎన్నికల తర్వాత కాంగ్రెసు - వాదోపవాదాల తర్వాత రాష్ట్రప్రభుత్వాల్లో పాల్గొనేందుకు నిశ్చయించుకుంది. బ్రిటిషు ఇండియాలోని పదకొండు రాష్ట్రాల్లోనూ ఏడు రాష్ట్రాల్లో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. ఇవి: బొంబాయి - మద్రాసు — ది యునైటెడ్ ప్రావిన్సెస్ — సెంట్రల్ ప్రావిన్సెస్ — బీహార్ — ఒరిస్సా — వాయవ్య సరిహద్దు రాష్ట్రం. కాని మంత్రిమండలి ఏర్పాటుతో కాంగ్రెసు - ముస్లిం లీగ్‌మధ్య వైషమ్యాలు తలఎత్తాయి. ముస్లింలీగ్ మిగతా ముస్లిం పార్టీల కంటె పెద్దపార్టీగా అవతరించిన యునైటెడ్ ప్రావిన్సిస్‌లో కాంగ్రెసు తమతోపాటు సంకీర్ణ మంత్రిమండలిని ఏర్పాటుచేస్తుందని ముస్లింలీగ్ ఆశించింది. అయితే, ముస్లింలీగ్ శాసనసభలో విడిగా ఒక పార్టీగా వ్యవహరించకుండా వుండే పక్షంలో ముస్లింలీగ్‌కు చెందిన ఒకరిద్దరిని మంత్రిమండలిలోకి తీసుకుంటామనీ, అటువంటివారు కాంగ్రెసు క్రమశిక్షణకు లోబడి వుండవలసివుంటుందనీ కాంగ్రెసు స్పష్టం చేసింది.[40] ముస్లిం లీగ్‌కు ఇది అంగీకారంకాలేదు. దీనితో రెండు పార్టీలమధ్య చీలిక పెద్దదైంది. ఆ దరిమిలా కాంగ్రెసు అధికారంలోవున్న రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రుల సహాయంతో ముస్లింలను అణిచివేస్తున్నారని ముస్లింలీగ్ ఆరోపణలుకూడా చేయసాగింది. ఎన్నికల తర్వాత కాంగ్రెసు, జవహర్‌లాల్ ప్రోత్సాహంతో ముస్లిం ప్రజానీకంతో సంబంధాల కోసం ఉద్యమం ప్రారంభించింది. ఇదికూడా ముస్లిం నాయకులకు ముఖ్యంగా జిన్నాకు కోపకారణమైంది. మరొకవైపున వారూ, ముస్లిందరినీ ఒక నాయకుడికింద, ఒక పతాకం కింద ఒక పార్టీగా కూడగట్టేందుకు మత ద్వేషాన్ని ప్రచారం చేయడం ప్రారంభించారు. "కాంగ్రెసు విధానం ఫలితంగా ఏర్పడిన మతాభిమానానికి ప్రతీకగా ముస్లింలు ప్రశంసించడంతో జిన్నా అతిత్వరగా నాయకులవుతున్నారు."[41]

ఈ పరిస్థితుల్లో కాంగ్రెసు శాసనసభ్యుల జాతీయ మహాసభ 1937 మార్చిలో జరిగింది. జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షత వహించారు. "భారతీయులు తమ రాజ్యాంగాన్ని తామే రూపొందించుకునేందుకు వీలుగా 1935 వ సంవత్సరపు భారత

ప్రభుత్వ చట్టాన్ని ఉపసంహరించాలని శాసనసభలో వీలైనంత త్వరలో కోరాల"ని కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీలను సమావేశంలో కోరారు. దీనికిగాను రాజ్యాంగ నిర్ణయ సభను ఏర్పాటు చేయాలని కోరవలసిందనికూడా వారిని ఆదేశించారు.[42]

"కాంగ్రెసు రాష్ట్రాలు" ఏడింటిలోనూ శాసనసభలు ఈ తీర్మానాన్ని 1937 అగస్టు-అక్టోబరులో ఆమోదించాయి.

కేంద్ర శాసనసభ, అకులురాలు సమావేశం ప్రారంభమైనపుడు 1937 సెప్టెంబరు 17వ తేదీన సత్యమూర్తి ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు.

"1935 వ సంవత్సరపు భారత ప్రభుత్వచట్టం దేశప్రజల అభిప్రాయాలనూ ఏ విధంగానూ ప్రతిబింబించడంలేదు. భారతీయులకు ఏమాత్రం సంతృప్తికరంగా లేదు. వయోజన ఓటింగ్ ఆధారంగా ఎన్నికయే రాజ్యాంగ నిర్ణయసభ రూపొందించే రాజ్యాంగాన్ని, ఈ చట్టంస్థానే ప్రవేశపెట్టవలసిందని సభవారు అభిప్రాయపడుతున్నట్టు భారతదేశానికి సంబంధించిన బ్రిటిషు మంత్రికీ, బ్రిటిషు ప్రభుత్వానికి మనవి చేయవలసిందిగా గవర్నర్ జనరల్‌కు సభవారు శిఫార్సు చేస్తున్నారు."

తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ సత్యమూర్తి మొదట, ప్రతిపక్ష సభ్యులుగా మాత్రమే తాము ఈ తీర్మానాన్ని ప్రతిపాదించడంలేదనీ, బ్రిటిషు ఇండియాలోని పదకొండు రాష్ట్రాల్లో ఏడు రాష్ట్రాల్లో పరిపాలన సాగిస్తున్న భారతీయ కాంగ్రెసు ప్రతినిధిగా తాము ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నామనీ చెప్పారు. అంటే బాధ్యతాయుతమైన ప్రతిపక్షం ప్రతిపాదించినది కాదనీ "రాష్ట్రాల్లో పరిపాలిస్తున్న అతి బాధ్యతాయుతమైన సంస్థ ప్రతిపాదించినది" ఈ తీర్మానమనీ స్పష్టం చేశారు. అనేక రాష్ట్ర శాసనసభలు ఈ తీర్మానాన్ని ఇదివరకే ఆమోదించాయని గుర్తుచేస్తూ ఆయన ఏ శాసనసభలోనూ ఏ అల్పసంఖ్యాకవర్గమూ — ముస్లింలుకూడా 'రాజ్యాంగ నిర్ణయసభ' అన్న పదాలకు అభ్యంతరం తెలుపలేదని చెప్పారు. "అహింసా సిద్ధాంతానికి కట్టుబడిన కాంగ్రెసు, రాజ్యాంగ నిర్ణయసభగురించి ప్రస్తావిస్తున్నదీ అంటే, ప్రస్తుత ప్రభుత్వం అటువంటి సభకు అంగీకరించేట్టు భారతీయులు చేయకలిగినపుడే అది సాధ్యమవుతుందని పూర్తి బాధ్యతాభావంతో చెబుతున్నాను" అన్నారు సత్యమూర్తి. "రాజ్యాంగ నిర్ణయసభ" అన్న పదాలకు అభ్యంతరం తెలుపుతున్న సభ్యులకు ఆయన ఈ విధంగా విజ్ఞప్తి చేశారు:

"నిరుపయోగమైన సభలూ సమావేశాలు ఇకమీద జరుపాలని మేం అనుకోవడం లేదు. దీనివల్ల మాలో మేము కీచులాడుకోవడం, తద్వారా బయటి వారూ ప్రభుత్వమూ "వీరు తమ స్వవిషయాలనుకూడా పరిష్కరించుకోలేరు" అనుకునేట్టు



శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్

కలకత్తా గవర్నమెంటు హౌసు, 1912 వరకు కౌన్సిలు వింటర్ సెషన్సు జరిగిన స్థలము



ఎంట్రెన్సు హాల్, టెంపరరీ కౌన్సిలు ఛాంబరు, ఢిల్లీ



ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిలు ఛాంబరు, సిమ్లా

చేయడం తప్ప మరొక ప్రయోజనమేదీ ఉండదంలేదు. అదీకాక రాజ్యాంగ నిర్ణయ సభలో మూడోపార్టీకి తావులేకుండా చేద్దామన్నది మా కోరిక. రాజ్యాంగ నిర్ణయ సభ నిర్ణయాలు తిరుగులేనివిగానూ బ్రిటిషు పార్లమెంటు వాటికి కట్టుబడివుండేట్టు గానూ ఉండాలన్నదికూడా మా అభిలాష. రాజ్యాంగ నిర్ణయసభ లక్ష్యంకూడా అదే.''43

మతపరమైన తీర్పు విషయంలో కాంగ్రెసు వైఖరిని సత్యమూర్తి ఆ తర్వాత వివరించారు. భారత ప్రభుత్వ చట్టాన్ని విమర్శనాపూర్వకంగా విశదీకరిస్తూ అది ఎంత అభ్యంతరకరమో అనంగీకారయోగ్యమో విపులీకరించారు. జిన్నా, సత్యమూర్తి తీర్మానానికి సవరణను ప్రవేశ పెట్టారు. రాజ్యాంగ నిర్ణయ సభకు సంబంధించిన తీర్మానపు భాగాన్ని తొలగించి దానిస్థానే, ''మరొక అంగీకారం కుదరని దృష్ట్యా, మతపరమైన తీర్పులో పేర్కొన్న నియోజకవర్గాలు ఆధారంగా ఎన్నికయ్యే మహాసభగాని సమావేశం గాని" అన్న పదాలను చేర్చారు. ముసల్మానులూ ఇతర అల్ప సంఖ్యాకవర్గాల ప్రయోజనాలకు వారి పరస్పర అంగీకారంతో పటిష్ఠమైన రక్షణ కల్పించవలసిందని బ్రిటిషు ప్రభుత్వానికి తెలియచేయవలసిందని కూడా జిన్నా తన తీర్మానంలో కోరారు.

1936 లో లిబరల్‌పార్టీ అధ్యక్షులైన జెహాంగీర్, జిన్నా తీర్మానానికి ఒక సవరణను ప్రతిపాదించారు. ఆయన కూడా జిన్నా మోస్తరుగా, రాజ్యాంగ నిర్ణయసభస్థానే, మతపరమైన తీర్పు ఆధారంగా ఒక మహాసభనేర్పాటు చేయాలని సూచించారు. జిన్నా ప్రతిపాదించిన తీర్మానంలో ''అన్ని అల్ప సంఖ్యాకులకూ ప్రాతినిధ్యం ఉండాలన్న'' అంశాన్ని చేర్చాలని సూచించారు

అణే, సత్యమూర్తి తీర్మానానికి సవరణను ప్రతిపాదించారు. భారత ప్రభుత్వ చట్టమే కాక, మతపరమైన తీర్పు కూడా భారత జాతీయుల అభిప్రాయాలను ప్రతిబింబించడం లేదనీ, అందుచేత చట్టంతో పాటు దాన్ని కూడా ఉపసంహరించుకోవాలనీ అణే తన సవరణలో కోరారు. రాజ్యాంగ నిర్ణయసభను, మతప్రమేయంలేని విధానం ప్రాతిపదికగా ఎన్నుకోవాలని పేర్కొనాలని కూడా అణే కోరారు.

భారత రాజకీయాల్లో అప్పటి ప్రధాన ధోరణులను తెలిపే ఈ సవరణలను ప్రతిపాదించిన తర్వాత, రాజ్యాంగ నిర్ణయ సభ కోసం అభ్యర్థన మీద చర్చకు అంతా సిద్ధమైంది.

పంజాబుకు చెందిన మౌలానా జఫర్ అలీఖాన్, జిన్నాను సమర్థిస్తూ కాంగ్రెసు సభ్యులనుద్దేశించి ఈమాటలన్నారు: ''స్వేచ్ఛ పేరుతో బ్రిటిషువారితో మతయుద్ధాన్ని జరిపేట్టయితే వారితో చేరే వారిలో నేను ప్రథముడిని కాగలను. భారత దేశానికి పూర్ణ

స్వాతంత్ర్యాన్ని సాధించి పెట్టేందుకుపోరాటం జరిపేట్టయితే, నేను ముందు నిలుస్తాను. కాని, ఈ సభలో ఉపన్యాసాలుచేసి తద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించదలచుకుంటే మాత్రం దానికివట్టే వేయేండ్లకాలంలోముస్లింలతో ఒక అంగీకారానికి రావడం అవసర మని అడగడం సబబని నేను భావిస్తున్నాను." ముస్లింలకు సంబంధించినంతవరకూ శ్రీ జిన్నాకు అన్ని అధికారాలూ వున్నాయని ఆయన సభవారికి గుర్తు చేశారు.

మౌలానా షౌకత్ అలీ మాట్లాడుతూ హిందువులూ ముస్లింల మధ్య అవగాహనకు ప్రయత్నించి ఏవిధంగా విఫలమైందీ తెలియ చేశారు. ఒకప్పుడు తాము గాంధీజీ నాయ కత్వంలో పనిచేశామనీ ఇప్పుడు జిన్నా నాయకత్వంలో పనిచేసేందుకు గర్విస్తున్నామనీ అందరికీ న్యాయం చేకూర్చేందుకు కృషి చేస్తున్న జిన్నాను మించిన ముస్లిం భారత దేశంలో మరొకరు లేరనీ షౌకతలీ చెప్పారు. ముస్లింలలో కార్యసాధకులు ప్రస్తుతం ఎవరైన ఉంటే ఆ వ్యక్తి జిన్నా ఒక్కరేనని ఆయన చెప్పారు. 44

కాంగ్రెసు, అధిక సంఖ్యలో వున్న రాష్ట్రాల్లో, అల్ప సంఖ్యాక వర్గాల విషయంలో ఔదార్యంతో వ్యవహరించి వుండవలసిందని యునైటెడ్ ప్రావిన్సెస్‌కు చెందిన మొహమ్మద్ యామిన్ ఖాన్ పేర్కొన్నారు. ఆయన మతపరమైన వైఖరీ, వర్గ ప్రయోజనాలూ ఒకటయాయి కాంగ్రెసువారు, అల్పసంఖ్యాకుల్లో ముఖ్యులైన ముస్లిం లను నిర్లక్ష్యంగా చూస్తున్నారని ఆయన ఆరోపించారు. అంతటితో ఆగలేదు:

"మరొక అల్పసంఖ్యాక వర్గాన్ని కూడా వీరు అలక్ష్యం చేస్తున్నారు. వీరు, జమీందార్లు. మా రాష్ట్రంలో రెండే పార్టీలున్నాయి, కాంగ్రెసుపార్టీ-జమీందారుపార్టీ. కాంగ్రెసు అధికారంలోకి వచ్చిన తర్వాత చేసినదేమిటి. భూములపై పన్నునంతటినీ వారు వసూలు చేశారు. భూమి శిస్తు వసూలును ఆపుచేశారు. జమీందార్లు పన్ను లెక్కడినుంచి కడ్తారు?"

రాజ్యాంగ నిర్ణయసభ ఏర్పాటైన తర్వాత అల్ప సంఖ్యాకుల పరిస్థితి ఏవిధంగా వుంటుందో దీనివల్ల తెలుసుకోవచ్చు నన్నారు ఖాన్. బ్రిటిషువారు లేకపోతే తమకు రక్షణ వుండదని జమీందారైన ఖాన్ అభిప్రాయ పడ్డారు. "రాజ్యాంగ నిర్ణయసభ ఏర్పాటైనప్పుడు, రక్షణ వుండదు. ఈ సభలో ప్రభుత్వ పక్షం లేకపోయినట్టయితే ఏవిధంగా వుంటుందో రాజ్యాంగ నిర్ణయసభ కూడా అదే విధంగా వుంటుంది. జమీం దార్లతో సహా అల్పసంఖ్యాక వర్గాలవారి ప్రయోజనాలకు అనుకూలంగా వ్యవహరించేందుకు సిద్ధంగా వున్నట్టు కాంగ్రెసు ఆచరణరీత్యా ఋజువుపరిస్తే తప్ప "మేం వారితో చేరం (కాంగ్రెసుతో), అంతేకాదు వారి కార్యకలాపాలను వ్యతిరేకిస్తూ వుంటాము." అని ఆయన స్పష్టం చేశారు. 46 కాంగ్రెసు తీర్మానాన్నీ అన్ని సవరణలనూ ఆయన వ్యతిరేకించారు.

వాయవ్య సరిహద్దు రాష్ట్రానికి చెందిన అబ్దుల్ కయ్యూం, సత్యమూర్తి తీర్మానాన్ని సమర్థించారు. తీర్మానాన్ని వ్యతిరేకించిన ముస్లింమతవాదులను ఆయన ఖండించారు.

"ముసల్మానులమైన మేము భారతీయులం పూర్తిగా భారతీయులం. మా హిందూ సోదరులతో సహకరించాలన్నదే మా విధానం. భారతదేశం యావత్తూ ఒక జాతి అన్నది మా విశ్వాసం. భవిష్యత్తు ఎంత ఉజ్వలంగా ఉండగలదో ఊహించగలం. సభలూ విభజనలు ఒప్పందాల గురించి మాట్లాడే వారికి లొంగేది లేదు. దేన్ని విభజించాలని అనుకుంటున్నారో అది ఇంకా మన చేతికి రాకముందే విదేశీయుల చేతిలో వుండగానే దాన్ని విభజించడం గురించి మాట్లాడేవారిమాట వినిపించుకోదలచుకోలేదు."

కయ్యూమ్, అన్ని వర్గాల భారతీయులకు ప్రాతినిధ్యముండే రాజ్యాంగ నిర్ణయసభ ఏర్పాటు ప్రతిపాదనను సమర్థించారు. "అటువంటి సభ ఆధారంగా, భారతదేశంలోని కోట్లాది మామూలు ప్రజానీకం అభీష్టాలకు అనుగుణంగా ఒక రాజ్యాంగం రూపొందినట్లయితే, దానివల్ల ఎటువంటి హాని వుండగలదో నాకు అర్థం కావడంలేదు" అన్నారాయన. 47

కలకత్తాకు చెందిన పండిత లక్ష్మీకాంత మైత్ర, అణే తీర్మానాన్ని సమర్థించారు, జిన్నా సవరణను వ్యతిరేకించారు. సత్యమూర్తి తీర్మానంలోని భావాన్నీ, రాజ్యాంగ నిర్ణయసభ ఉద్దేశ్యాన్నీ తాము సమర్థిస్తున్నామనీ అయితే, తీర్మానాన్ని ప్రతిపాదించేందుకు సత్యమూర్తి, తగిన సమయాన్ని ఎంచుకోలేదనీ మైత్ర అన్నారు. "బ్రిటిషు ప్రభుత్వం భారతదేశం మీద అభివృద్ధి నిరోధక రాజ్యంగాన్ని బలవంతంగా రుద్దింది. భారతీయులు ప్రతిఘటించదలచుకున్నట్లయితే మొదట బలం సమకూర్చుకోవడం మంచిది. తాము కోరుతున్నదాన్ని ప్రపంచంలోని ఏ శక్తి నిరాకరించలేని స్థితికి భారతీయులు చేరుకోవాలి. మతపరమైన తీర్పు రూపంలోనూ, ప్రత్యేక నియోజక వర్గాల రూపంలోనూ, బ్రిటిషు ప్రభుత్వం దుర్మార్గమైన విధానాన్ని ప్రవేశపెట్టింది. ఈ విధానం దేశ వ్యతిరేకమైనదీ నిర్హేతుకమైనదీ అని కాంగ్రెసు వర్ణించింది కూడా. మనలో నిజాయితీ సాహసం వున్నట్లయితే, అంతా ఒక త్రాటి మీద నిలబడి, "ఈ దేశంలో భవిష్యత్తులో రూపొందించుకునే ఎటువంటి రాజ్యాంగంలోనైనా, మతపరమైన తీర్పుకూ మతరపమైన ప్రాతినిధ్యానికి తావుండబోదని ఎలుగెత్తి చాటుదాం" అన్నారాయన. 48

మతపరమైన తీర్పును తిరస్కరించాలని సర్దార్ సంత్‌సింగ్ అన్నారు. మతపరమైన తీర్పు ఆధారంగా ఏదైనా రాజ్యాంగ నిర్ణయసభను సమావేశపరచినట్లయితే శిఖులు అటువంటి రాజ్యంగ నిర్ణయసభతో ఎటువంటి ప్రమేయమూ పెట్టుకోబోరని ఆయన స్పష్టం చేశారు. 49

భారత రాజకీయ జీవితంలో పెరుగుతున్న చీలికలు ఈవిధంగా పూర్తిగా ప్రస్ఫుట మయాయి. చర్చ ఇంకా పూర్తి కాకుండానే సభ వాయిదా పడింది. మళ్ళీ 1938 బడ్జెటు సమావేశంలో చర్చకు వచ్చింది. అప్పటికి తీర్మానాన్ని ఆమోదించే సూచన ఏదీ లేకుండా పోయింది. తీర్మానం మీద చర్చను కాల నిర్ణయం లేకుండా వాయిదా వేయవలసిందని కోరుతూ అసఫలీ, 1938 ఫిబ్రవరి 4 న ప్రతిపాదించారు. సభనాయకు లైన సర్కార్, చర్చను వాయిదా వేయవలసి వచ్చిన రాజకీయ కారణాలపట్ల వ్యంగంగా హర్షం వ్యక్తపరిచారు. అసఫలీ తీర్మానాన్ని ఆయన వ్యతిరేకించకపోవడం సహజమే. సభవారు అసఫలీ తీర్మానాన్ని ఆమోదించారు, చర్చ. కాలనిర్ణయం లేకుండా వాయిదా పడింది, భారత ప్రభుత్వానికి సంతోషం కలిగింది.

## దమన నీతి

పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని రద్దు చేసిన తర్వాత ప్రభుత్వం, 1934 జూన్‌లో కాంగ్రెసు మీద నిషేధాన్ని తొలగించింది. కాని దమన విధానాన్ని మాత్రం ఒదులుకోలేదు. ఖుదాయి ఖిద్మత్‌గార్, అనేక ఇతర యువజన - కర్షక సంస్థల మీద నిషేధాలు తొలగలేదు. 1934 జులైలో భారత కమ్యూనిస్టు పార్టీని చట్ట విరుద్ధమైనదిగా ప్రకటించారు. కాంగ్రెసువారిలో జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, ప్రభుత్వ దమన విధానానికి ప్రత్యేకంగా గురయ్యారు. ఈ విధానాన్ని వదులుకోవలసిందని కేంద్ర శాసన సభ్యులు. ప్రభుత్వాన్ని అనేకసార్లు కోరారు.

వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని ఖుదాయి ఖిద్మత్ గార్ల సంస్థమీద (రెడ్‌షర్ట్స్) వున్న నిషేధాన్ని తొలగించేందుకు వెంటనే చర్యలు తీసుకోవలసిందని గవర్నర్ జనరల్‌కు శిఫార్సు చేస్తూ 1935 ఫిబ్రవరి 5న వి. దాస్ - ఒక తీర్మానాన్ని శాసన సభలో ప్రవేశపెట్టారు. సరిహద్దు గాంధీ అయిన అబ్దుల్ గఫార్‌ఖాన్ నాయకత్వంలో ఖుదాయి ఖిద్మత్‌గార్ల ఉద్యమం ఎప్పుడూ ప్రశాంతంగానే జరుగుతూ వచ్చిందనీ అయినా ప్రభుత్వం వారిని అనుమానిస్తూ, వారిని అణిచివేయడానికి అన్ని చర్యలూ తీసుకుంటూ వుందనీ దాస పేర్కొన్నారు. ఈ సంస్థ కార్యకలాపాలవల్లనే సరిహద్దు రాష్ట్రానికి కూడా సంస్కరణలు విస్తరించినట్టు ఆయన చెప్పారు. ఈ సంస్థ మీద నిషేధాన్ని తొలగించాలని ఆయన ప్రభుత్వాన్ని కోరారు. దేశాయి - బెనర్జీ - అబ్దుల్‌మతిన్ చౌధురీ - షేర్వాణీ - షౌకతలీ, చాలామంది ఇతరులూ ఆయన్ను సమర్థించారు. వజాలుల్‌హక్ కూడా తీర్మానాన్ని సూత్రరీత్యా సమర్థించారు. ఎటువంటి పెద్ద ఉద్యమమైనా పూర్తిగా హింసకు దూరంగా ఉండగలదన్న అభిప్రాయంతో జిన్నా ఏకీభవించలేదు. అదే సమయంలో, తాము పొరపడడం లేదన్న ప్రభుత్వ అభి

ప్రాయంతో ఆయన ఏకీభవించను కూడా లేదు. ప్రభుత్వానికి ఈవిధంగా విజ్ఞప్తి చేశారు: "వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో దయచేసి శాంతిని నెలకొలపండి. అక్కడి ప్రజలు రాజ్యాంగ పద్ధతులు అవలంబించేట్టు చేయండి. సభలోని అన్ని ప్రాంతాల వారి అభిప్రాయానికి తల ఒగ్గండి" . 50

కాంగ్రెసు సభ్యులైన డాక్టర్ ఖాన్ సాహెబ్ తీర్మానాన్ని బలపరిచేందుకు లేచి నపుడు సభ్యులు హర్షధ్వానాలు చేశారు. ఆయన, సరిహద్దు రాష్ట్రం నుంచి శాసన సభకు ఎన్నికైన మొట్టమొదటి సభ్యుడు. బ్రిటిషు సైనికులు తమ రాష్ట్ర ప్రజలను ఎంతక్రూరంగా అణిచివేస్తున్నదీ ఆయన వివరించారు. సరిహద్దు రాష్ట్రం ఆయుధ గిడ్డంగివంటిదనీ అక్కడ పొగ రాజేందుకు ఏమాత్రం అవకాశం వుండరాదనీ సైమన్ సంఘం పేర్కొనడంగురించి ఆయన ప్రస్తావించారు. ఆయుధ గిడ్డంగిని శాంతియుతమైన నివాస గృహంగా మార్చేందుకే ఖుదాయి ఖిద్మత్‌గార్ల సంస్థను ప్రారంభించినట్టు చెప్పినపుడు సభ హర్షధ్వానాలతో మారు మ్రోగింది. ఖుదాయి ఖిద్మత్‌గార్లు ఎల్లప్పుడూ శాంతియుతంగానే వుంటారని పేర్కొంటూ డాక్టర్ ఖాన్ సాహెబ్, అందరిపట్లా నమ్రతతో వ్యవహరిస్తారని కూడా హామీ ఇచ్చారు. 51

చర్చ ఆఖరున దాసు తీర్మానం మీద ఓటింగ్ జరిగింది. 74 ఓట్లతో నెగ్గింది కూడా. ప్రతికూలంగా 46 ఓట్లు పడ్డాయి. ప్రతిపక్ష సభ్యులు దాదాపు అందరూ తీర్మానానికి అనుకూలంగా ఓటు చేశారు.

మార్చి 8 వ తేదీన, దేశవ్యవహారాల పద్దుల్లో, అణే రూ॥ 100 కోత ప్రతిపాదించి నపుడు, దమన విధానం మళ్ళీ చర్చకు వచ్చింది. ఎంతమాత్రమూ సమర్థనీయం కాని సమయంలో దమననీతిని అనుసరస్తున్నందుకు ప్రభుత్వాన్ని అభిశంసించే ఉద్దేశంతోనే ఆయన కోత తీర్మాన్నాన్ని ప్రతిపాదించారు. ఆగ్రాకు చెందిన పండిత శ్రీ కృష్ణదత్త పాలివాల్, కోతతీర్మానాన్ని సమర్థిస్తూ, అమెరికా - దక్షిణాఫ్రికా - ఐర్లెండ్ - రష్యాల్లో విఫలమైన దమననీతి భారతదేశంలో విజయం సాధించజాలదని చెప్పారు. బెంగాల్‌లో బ్రిటిషు అధికార్ల నిరంకుశపాలన గురించి సత్యాన్ని బయటపెట్టినట్టయితే హిట్లర్ క్రూరకృత్యాలు కూడా వాటిముందు దిగదుడుపే అవుతాయని చెప్పారు. 52

బీహార్‌కుచెందిన శ్రీ కృష్ణ సిన్హా మాట్లాడుతూ, ప్రభుత్వం తమజిల్లాలో గ్రామీణు లను ఏ విధంగా హింసించినదీ తెలియచేశారు. భారతదేశంలో పరిస్థితులు మారక పోయినా పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించుకోక పోయినా ప్రభుత్వం దమన చర్యలను అమలుపరుచివుండరాదని ఆయన చెప్పారు. ప్రజాభిప్రాయాన్ని పెడచెవిన పెట్టినందుకు ప్రభుత్వాన్నిగర్హించారు. అణే కోత తీర్మానాన్ని సమర్థించారు.53

తీర్మానంమీద ఓటింగ్ జరిగినపుడు 63 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 58 ఓట్లు పడ్డాయి. అనేక ఇతర సందర్భాల్లో కూడా దమననీతి విషయంలో ప్రభుత్వం వీగిపోయింది. 1936 మార్చి 23 వ తేదీన, సుభాష్‌చంద్రబోస్ మీద నిషేధానికి సంబంధించి నీలకంఠదాసు ప్రతిపాదించిన వాయిదా తీర్మానంమీద ప్రభుత్వం 62 ఓట్లతో వీగిపోయింది. తీర్మానానికి ప్రతికూలంగా 59 ఓట్లు పడ్డాయి. 1937 ఆగష్టు 25 వ తేదీన మళ్ళీ వీగిపోయింది. అండమాన్లలో రాజకీయఖైదీల నిరహారదీక్ష విషయమై సత్యమూర్తి ప్రతిపాదించిన వాయిదాతీర్మానం ఈ సారి కారణమైంది. తీర్మానానికి 62 ఓట్లు అనుకూలంగా, ప్రతికూలంగా. 58 ఓట్లూ పడ్డాయి.

## విదేశాల్లోని భారతీయుల విషయమై ఆందోళన

విదేశాల్లోని భారతీయులు పడుతున్న ఇబ్బందులు, శాసనసభల్లోనూ బయటా ఆందోళనకు అనేకసార్లు కారణమయాయి. కెనడాలో భారతీయులపట్ల చూపుతున్న విచక్షణను అంత మొందించేందుకు బ్రిటిషుప్రభుత్వం చర్య తీసుకునేట్టు చూడవలసిందని శ్రీనివాసశాస్త్రి మొదట్లో భారతప్రభుత్వాన్ని కోరారు.54 అయిదవ శాసనసభలో కూడా విదేశాల్లోని భారతీయులు పడుతున్న ఇబ్బందులు అనేకసార్లు చర్చకు వచ్చాయి. 1935 సెప్టెంబరు 18వ తేదీన, జాంజిబార్‌లో భారతీయుల పరిస్థితినిగురించి గోవిందవల్లభపంత్ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. జాంజిబార్‌లో స్థిరనివాస మేర్పరచుకున్న భారతీయుల ప్రయోజనాలకు అనుగుణంగా పటిష్టమైన చర్యలను తీసుకోవలసిందని తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు శిఫార్సుచేశారు. తీర్మానాన్ని సభవారు ఆమోదించారు. ఈ విషయంలో పటిష్టమైన చర్యలు తీసుకోనేందుకు ప్రభుత్వాన్ని అభిశంసిస్తూ సత్యమూర్తి 1937 ఆగష్టు 23 వ తేదీన ఒక వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించారు. వాదోపవాదాలతో చర్చజరిగిన మీదట తీర్మానం వీగిపోయింది, తీర్మానానికి ప్రతికూలంగా 66 ఓట్లూ అనుకూలంగా 25 ఓట్లూ పడ్డాయి. విదేశాల్లోని భారతీయులు పడుతున్న ఇబ్బందులను ప్రభుత్వం తొలగించలేకపోయింది. కనుక భూమి-విద్యా-ఆరోగ్యశాఖ పద్దులో రూ॥ 100 కోత విధించాలని కోరుతూ మోహన్‌లాల్ సక్సేనా 1937 మార్చి 8 వతేదీన ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు, కోత తీర్మానాన్ని సభవారు ఆమోదించారు. 1938 సెప్టెంబరు 5 వ తేదీన మళ్ళీ, జియావుద్దీన్ అహ్మద్ బర్మాలో భారతీయుల స్థితిగతుల గురించి వాయిదా తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. దీన్నికూడా సభవారు ఆమోదించారు. కెన్యాలోని హైలాండ్స్‌లో భారతీయులకు ప్రవేశం లేకుండా చేస్తూ వుండడంగురించి అబ్దుల్ కయ్యూం, 1939 మార్చి 7వ తేదీన వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించారు. సభవారు దీన్నికూడా ఆమోదించారు. మొత్తంమీద,

దమననీతి విషయంలో మోస్తరుగానే, విదేశాల్లో భారతీయులు పడుతున్న ఇబ్బందుల విషయంలోకూడా శాసనసభలోని ఎన్నికైన సభ్యుల్లో ఎక్కువమంది ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటు చేశారు.

## ద్రవ్య-ఆర్థిక విషయాలపై సంఘర్షణ

### బడ్జెట్ తిరస్కృతి

బ్రిటిషు సామ్రాజ్యవాదతత్వానికి భారత జాతీయ వాదులకూ మధ్య ఘర్షణ, ద్రవ్య ఆర్థిక విషయాల్లో బాగా ప్రస్ఫుటమైంది. 1935—39 మధ్య ఆర్థిక విషయాల సభ్యుడు సర్ జేమ్స్ గ్రిగ్ ప్రతిపాదించిన అయిదు బడ్జెటులనూ శాసనసభ తిరస్కరించింది. వాటిని అమలుపరచేందుకు గవర్నర్ జనరల్, తన సర్టిఫికేషన్ అధికారాన్ని వినియోగించవలసి వచ్చింది. రెండు-మూడు శాసనసభల్లో స్వరాజ్యవాదులు, ప్రాబల్యంగా వున్న రోజుల్లో మోస్తరుగా, నిజానికి గవర్నర్ జనరల్ తన ఈ అధికారాన్ని ఈ సంవత్సరాల్లో ఎక్కువగా వినియోగించారు. "జాతీయవాద ప్రతిపక్షం, ప్రభుత్వాన్ని ఈ సమయంలో ఇరుకున పడవేసినంతగా అంతకు ముందెన్నడూ పడవేయలేదు. 1921 40 సంవత్సరాల మధ్యన "సర్టిఫికేషన్" అధికారాన్ని ఉపయోగించిన పధ్నాలుగు సందర్భాల్లోనూ, ఎనిమిది, 1935 లోనూ ఆ తర్వాత ఏర్పడినవి" 55 అని కప్లాండ్ పేర్కొన్నారు.

### భారత బ్రిటిషు వాణిజ్య ఒప్పందం తిరస్కృతి

బడ్జెటులు కాక గవర్నర్ జనరల్ తన ప్రత్యేక అధికారాన్ని వినియోగించుకోవలసి వచ్చిన మరొక సందర్భం, 1935 వ సవత్సరపు భారత-బ్రిటిషు వాణిజ్య ఒప్పందాన్ని అమలు జరిపినపుడు కలిగింది. 1927 నుంచీ, భారత ప్రభుత్వం, బ్రిటిషు ప్రయోజనాల దృష్ట్యా, భారత మార్కెటులో బ్రిటిషు సామగ్రికి, భారతీయ సామాగ్రితోపాటు ఇతరదేశాల సామాగ్రికంటె అనుకూల వాతావరణం వుండేట్టు, భారత సుంకాల వ్యవస్థను రూపొందించింది. అట్టావా వాణిజ్య ఒప్పదం కింద, బ్రిటిషు సామగ్రికి ప్రత్యేక సౌకర్యాలు ఏవిధంగా కల్పించినదీ, ఒప్పందాన్ని ప్రతిఘటించినప్పటికీ ఏ విధంగా అమలు జరిపినదీ మనం ఇదివరకే గమనించాం.

1935 లో, కొత్త శాసనసభ సమావేశం కాబోతున్న తరుణంలో భారత ప్రభుత్వం బ్రిటిషు ప్రభుత్వంతో ఒక ఒప్పదం కుదుర్చుకుంది. ఈ ఒప్పదం ప్రకారం,

అట్టావా ఒప్పందాన్ని విస్తృతపరచారు. దీన్ని ప్రతిఘటించేందుకు భారత రాజకీయ-ఆర్థిక వర్గాలు ఏకమయాయి.

1935 జనవరి 29 వ తేదీన, వాణిజ్య సభ్యుడు సర్ జోసెఫ్ భోర్ జనవరి 9 వ తేదీన సంతకాలు జరిగిన ఒప్పందం గురించి చర్చ జరపవలసిందని ప్రతిపాదించారు. రక్షణ కల్పించిన వస్తు సామగ్రి విషయంలో ప్రభుత్వం వీలైనంత త్వరలో తన వైఖరిని స్పష్టం చేస్తుందనీ, ఎటువంటి అపోహలకు సందేహాలకూ తావులేకుండా చేస్తుందనీ వాణిజ్య సభ్యుడు వివరించారు. 56

శాసనసభ ఒప్పందాన్ని ఆమోదించడం లేదనీ అందుచేత దీన్ని వెంటనే ఉప సంహరించుకోవాలనీ కోరుతూ వెంకటాచలంచెట్టి ఒక సవరణను ప్రతిపాదించారు. ఒప్పందం భారతదేశానికి అన్యాయంగా వుందని పంజాబుకు చెందిన కె. యల్. గౌబ కూడా, ఒప్పందాన్ని వెంటనే రద్దు చేయాలని కోరారు.

అట్టావా ఒప్పందానికి ప్రస్తుత ఒప్పందం అనుబంధమనీ, అప్పటి అట్టావా ఒప్పందం, గడచిన శాసనసభ ఎన్నికల్లో వాణిజ్య నియోజక వర్గాలకు బాగా ఉపక రించిందనీ చెట్టి గుర్తు చేశారు. (అట్టావా ఒప్పంద రచయితల్లో ఒకరైన షణ్ముగం చెట్టి, వెంకటాచలం చెట్టి చేతిలో ఓడిపోయారు) భారత దేశంలోని వాణిజ్య వర్గాలు అట్టావా ఒప్పందాన్ని బలపరచక పోవడమే కాక, దాన్ని వీలైనంత త్వరలో రద్దు చేయాలని కోరుతున్నట్టు ఎన్నికల ఫలితాలవల్ల తేలిందని ఆయన చెప్పారు. పరిశ్రమల అభివృద్ధిలో భారతదేశం తనకున్న హక్కులన్నిటినీ ఈ ఒప్పందం వల్ల ఒదులుకున్నట్టే అవుతుందని చెట్టి అభిప్రాయపడ్డారు. 57

బాబు బైజ్‌నాథ్ బజోరియా మార్వాడి సంఘం ప్రతినిధిగా మాట్లాడుతూ, ఒప్పం దాన్ని ఈవిధంగా గర్హించారు. "బ్రిటిషు ప్రభుత్వం, బ్రిటిషు వాణిజ్య వర్గాల బలంతో భారత ప్రభుత్వాన్ని మించిపోయినట్టు ఈ ఒప్పదంవల్ల స్పష్టమవుతూ వుంది. భారత సుంకాల బోర్డు, రక్షణ సుంకాల గురించి చర్చించినపుడల్లా, బ్రిటిషు వాణిజ్య వర్గాలకు వారి కష్టనిష్టూరాలను చెప్పుకునే వీలు కల్పించే ఏర్పాటు చేయడాన్ని నేను ప్రత్యేకంగా గర్హిస్తున్నాను." అని అభ్యంతరం తెల్పారు.

భారత వాణిజ్యమండలి-బ్యూరో తరపున మాట్లాడుతూ మధురాదాసు విసన్‌జీ, ఒప్పందాన్ని వ్యతిరేకించారు. ఒప్పందంలోని అనేక ఏర్పాట్ల మూలంగా, దేశవాళీ ఉత్పత్తి దెబ్బతింటుందని ఆయన అభిప్రాయపడ్డారు. బ్రిటిషు వాణిజ్యవర్గాల అభి ప్రాయాన్ని తెలుసుకోవలసిన అవసరం గురించి ప్రస్తావిస్తూ విసన్‌జీ, ఏ ఉత్పత్తి

దారయినా తమ ఉత్పత్తులకు భంగంకలిగించే చర్యలను తీసుకోవలసిందని సలహా ఇస్తారా ? అని ప్రశ్నించారు. 59

ప్రతిపక్ష నాయకులైన దేశాయి, ఒప్పందంలోని అంశాలను విశదంగా పరిశీలించారు. ఒప్పదం అని పేర్కొంటున్న దీనిలో పరస్పరం ఇచ్చిపుచ్చుకునేది ఏమీలేదు కనుక దీన్ని ఒప్పదం అనడానికే వీలులేదని చెప్పారు. ఇది ఏకపక్షమైనదనీ, దీనివల్ల కలిగే లాభాలన్నీ బ్రిటిషు వాణిజ్య వర్గాలకే సంక్రమిస్తాయనీ అన్నారు. వెంకటా చలంచెట్టి ప్రతిపాదించిన సవరణను ఆయన సమర్థిస్తూ ఒప్పందాన్ని రద్దు చేయవలసిందని ప్రభుత్వానికి సలహా ఇచ్చారు. 60

అట్టావా ఒప్పదం ప్రకారం అంగీకరించిన సౌకర్యాలవల్ల భారతదేశానికి లాభించ లేదని పంత్ అన్నారు. ఈ ఒప్పదంవల్ల ఇంగ్లాండుకు భారతీయ ఎగుమతులు ఎక్కువై నట్టు చెబుతున్నారని ప్రత్యేక సౌకర్యం కల్పించిన సామగ్రి ఎగుమతులు 20 శాతమూ మిగతా సామగ్రి 50 శాతమూ పెరిగాయనీ ఆయన తెలియచేశారు. ఎగుమతుల్లో పెరుగుదలకూ ప్రత్యేక సౌకర్యాలకూ సంబంధంలేదని దీనివల్ల తెలిసిపోతూ వుందని ఆయన అన్నారు. 1935 వ సంవత్సరపు భారత-బ్రిటిషు ఒప్పదం ప్రకారం, బ్రిటిషు వాణిజ్య వర్గాలకు తమ కనిష్ఠ నిష్టురాలు తెల్పుకునే సౌకర్యం కల్పించగా భారత వాణిజ్యవర్గాలకు, ఒప్పదం కుదుర్చుకునేముందు మొరపెట్టుకునే అవకాశం కూడా కల్పించలేదని ఆయన పేర్కొన్నారు. భారత ప్రభుత్వం, బ్రిటిషు ప్రయోజనాలకు ఎంత తల ఒగ్గవలసివుందో దీనివల్ల తెలుస్తూవుందని ఆయన అన్నారు. 61

జిన్నా కూడా ఒప్పందాన్ని వ్యతిరేకించారు. మనదేశం నుంచి సామగ్రి దిగుమతి చేసుకునే దేశం ఇంగ్లాండు ఒక్కటి కాదని ఆయన వాదించారు. జర్మనీ-ఇటలీ-ఫ్రాన్సు మొదలైన దేశాలతో భారత వాణిజ్యం పెంపొందేందుకు ప్రస్తుత ఒప్పదం అవరోధంగా వుంటుందని ఆయన చెప్పారు.

రెండు రోజులు జరిగిన చర్చ సందర్భంగా పి. యన్. బెనర్జీ, బి. దాసు, అఖిల చంద్ర దత్త, మున్షి ఈశ్వర్ సారన్, సర్దార్ మంగళ్ సింగ్, మహమ్మద్ నౌమన్, సేట్ గోవింద దాసు, ఎన్. ఎమ్. జోషి మొదలైనవారంతా ఒప్పందాన్ని దుయ్య బట్టారు. చివరకు ఒప్పందాన్ని రద్దు చేయాలని కోరుతూ గౌబ ప్రతిపాదించిన సవ రణ మీద ఓటింగ్ జరిగింది. తీర్మానం 66 ఓట్లతో నెగ్గింది, ప్రతికూలంగా 58 ఓట్లు పడ్డాయి. భారత ప్రభుత్వం వీగిపోయింది కాని చలించలేదు. గవర్నర్ జనరల్, వోటును త్రోసిరాజని ఒప్పందాన్ని అమలు పరచారు. 1936 మార్చిలో అట్టావా వాణిజ్య ఒప్పందాన్ని మొత్తం రద్దుచేస్తూ నోటీసు ఇవ్వవలసిందని ప్రభుత్వానికి

శిఫార్సు చేస్తూ జిన్నా ప్రవేశపెట్టిన తీర్మానాన్ని శాసనసభ ఆమోదించింది. యునైటెడ్ కింగ్‌డమ్‌తోనూ ఇతర ముఖ్యమైన దేశాలతోనూ వాణిజ్య ఒప్పందాలను కుదుర్చుకోవాలని కూడా తీర్మానంలో శిఫార్సు చేశారు. అనేకసార్లు సంప్రదింపులు జరిగిన మీదట భారత-ఇంగ్లాండులు, 1939 మార్చిలో ఒక వాణిజ్య ఒప్పందం మీద సంతకాలు చేశాయి. ఈసారి జిన్నా, వింత ధోరణి నవలంబించారు. ఆయన ఈమాటలన్నారు:

"అయ్యా ఈ విషయంలో ముస్లింలీగ్ వైఖరి ఇది. ఈ ఒప్పందం, అట్టావా ఒప్పందంకంటె ఎంతో మెరుగైనది. అయితే ఇందువల్ల మా కొరిగేదేమీ లేదు. అందువల్ల ఈ ఒప్పందంతో ఎక్కువ సంబంధం వున్నవారు, వారికి ఈ ఒప్పదం ఒద్దనిఅంటూ వుండగా వారిపై బలవంతాన రుద్దడంలో సహకరించాలని మేము అనుకోవడంలేదు. పోగా మాకు సంబంధించినంతవరకు ప్రభుత్వం కూడా నా అభిప్రాయంలో చెడ్డదే. అందువల్ల ప్రభుత్వానికి కూడా సహాయం చేయాలని మేము అనుకోవడం లేదు. మా పార్టీ వైఖరి ఇది: మీరు మీరు దీన్ని పరిష్కరించుకోండి. మేం తటస్థంగా వుంటాం." 62

జిన్నా తటస్థంగా వున్నప్పటికీ శాసనసభ, కొత్త ఒప్పందాన్ని 59 ఓట్లతో త్రోసిపుచ్చింది. ఒప్పందానికి అనుకూలంగా 47 ఓట్లు వచ్చాయి. అయితే గవర్నర్ జనరల్ ఈమాటుకూడా తన ప్రత్యేక అధికారాన్ని వినియోగించి ఒప్పదంలోని అవసరమైన అంశాలను అమలు పరచారు.

జిన్నా తటస్థ వైఖరి, అప్పట్లో అర్థంకాలేదు కాని, లిన్‌లిత్‌గో కుమారుడూ చరిత్రకారుడూ ఆ తర్వాత ఈవిధంగా వ్రాశారు:

"జిన్నా, రాజీనామా చేస్తానని బెదిరించి, శాసనసభలోని ముస్లింలు, కొత్త వాణిజ్య ఒప్పదం మీద ఓటు చేయకుండా చేయడంతో ప్రభుత్వం వీగిపోయింది. ఈ చర్య లిన్‌లిత్‌గోకు ఆశ్చర్యాన్ని కలిగించింది. దేశమంతటా ప్రముఖ ముస్లింలు కూడా కోపం చెందారు. వారు జిన్నాను తీవ్రంగా విమర్శించారు. ఒక సంవత్సరం పాటు ఇటు ప్రభుత్వంతోగాని అటు కాంగ్రెసుతోగాని సహకరించకుండా, ఇరుపక్షాల వారికీ ముస్లింల మద్దతు ప్రాముఖ్యాన్ని తెలియచెప్పాలని జిన్నా భావించినట్టు వైస్రాయికి చెప్పారు. 63

## బ్రిటిషు జవుళి వస్త్రాల మీద సుంకం తగ్గింపుకు నిరసన

ఈలోగా శాసనసభలో 1936 సెప్టెంబరులో ఆసక్తికరమైన చర్చ జరిగింది. శాసనసభను సంప్రదించకుండానే భారత ప్రభుత్వం, బ్రిటిషు జవుళి వస్త్రాల మీద సుంకాన్ని 5 శాతం తగ్గిస్తున్నట్టు ప్రకటించింది.

ప్రభుత్వం తీసుకున్న ఈ చర్య గురించి చర్చించేందుకు టి. ఎస్. అవినాశలింగం చెట్టియార్ సెప్టెంబరు 2 వ తేదీన శాసనసభలో ఒక వాయిదా తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. భారత జవుళి పరిశ్రమకు తీరని అన్యాయం చేయడమేగాక, శాసనసభలో చేసిన వాగ్దానాలను విస్మరించారని కూడా ఆయన పేర్కొన్నారు. కృష్ణకాంత మాలవ్యా చెట్టియార్‌ను సమర్థిస్తూ సుంకాలకు సంబంధించి శాశ్వతమైన బోర్డు నొకదాన్ని ఏర్పాటు చేయాలనీ అటువంటి బోర్డు చేసే శిఫార్సులు ఆధారంగా మాత్రమే ప్రభుత్వం చర్య తీసుకోవాలనీ కోరినమాట నిజమేననీ అయితే తాత్కాలిక బోర్డు శిఫార్సులను శాసనసభకు నివేదించనవసరంలేదని తాము ఎప్పుడూ పేర్కొనలేదనీ ఆయన వివరించారు. ప్రభుత్వం, భారతీయులపట్ల కంటె బ్రిటిషు ప్రజలపట్ల స్నేహంగా వ్యవహరిస్తున్నందుకు ఆయన విమర్శించారు.

సవివరమైన దర్యాప్తు జరిపిన తర్వాత కూడా తాత్కాలిక సుంకాల బోర్డు, భారత బ్రిటిషు వాణిజ్య ఒప్పందం రెండేండ్ల క్రితం వచ్చిన నిర్ణయాలకే రావడం ఆశ్చర్యకరంగా వుందని పంత్ చెప్పారు. అడ్‌వెలొరమ్ సుంకాన్ని 25 శాతం నుంచి 20 శాతానికి తగ్గించాలని అప్పట్లో భారత-బ్రిటిషు వాణిజ్య ఒప్పందమూ, ఇప్పుడు తాత్కాలిక సుంకాల బోర్డూ శిఫార్సు చేశాయి. "సుంకాల బోర్డును నియమించడానికి రెండేండ్లు ముందు, ఈ నిర్ణయం తీసుకున్నారూ అంటే ఏదో అనుమానంగా వుండడమే కాక ఆశ్చర్యకరంగా కూడా వుంది. ఇది తప్పకుండా ఏదో ప్రేరేపణే" 64 అన్నారు పంత్.

సుంకాన్ని తగ్గించినందువల్ల వాడకం సామగ్రి ధరలు తగ్గుతాయంటూ జియావుద్దీన్ ఖాన్ అహ్మద్ ప్రభుత్వాన్ని సమర్థించారు. సుంకం తగ్గింపువల్ల భారత జవుళి పరిశ్రమలకు హాని కలుగుతుందని ఆయన భావించలేదు. గజ్నవీ కూడా ప్రభుత్వం, అభిశంసించవలసిన చర్య ఏదీ తీసుకోలేదని అభిప్రాయ పడ్డారు.

జోషి, చెట్టియార్ తీర్మానాన్ని సమర్థించారు. సుంకం తగ్గింపును బొంబాయి మిల్లు యజమానులు ఎందుకు వ్యతిరేకించలేదో వివరించారు. "జవుళి కార్మికుల వేతనాలను తగ్గించే స్వేచ్ఛ బొంబాయి మిల్లు యజమానులకు ఉన్నంతకాలం, బ్రిటిషు సామగ్రి మీద సుంకాన్ని 5 శాతం తగ్గించడానికి వారు అభ్యంతరం పెట్టారు" అన్నారాయన. కొంత మంది బొంబాయి మిల్లు యజమానులు అప్పుడే ఈవిధంగా మాట్లాడుతున్నారని ఆయన తెలియచేశారు. అదీగాక బ్రిటిషు సామగ్రి మీద సుంకాన్ని 5 శాతం తగ్గించినందు వల్ల భారతదేశంలో బ్రిటిషు సామగ్రి ధర తగ్గబోదు కూడా. "బ్రిటిషు ప్రజలు తెలివైన వ్యాపారులు జపాన్ సామగ్రి మీద సుంకాలు ఎక్కువగా ఉన్నందువల్ల తమ

సామాగ్రికి మంచి ధర గిట్టుతుందని వారికి తెలుసు. బ్రిటిషు సామగ్రి మీద సుంకాన్ని 5 శాతం తగ్గించినందువల్ల వాడకం దార్లకు లాభం చేకూరుతుందని అనుకోవడంలో అర్థం లేదు." అన్నారు జోషి.

ప్రభుత్వం తరఫున అప్పటి వాణిజ్య సభ్యుడైన సర్ మహమ్మద్ జఫురుల్లాఖాన్ ప్రభుత్వాన్ని సమర్థించారు. చర్చకు సమయం ముగియబోతూవుందని తెలిసి అనవలీ, ఈ విషయాన్ని ఇప్పుడే తేల్చాలని కోరారు. ఈ సందర్భంలో ఆర్థిక సభ్యుడు మాట్లాడాలని కోరిక వెలిబుచ్చినట్టూ ఆయన శాఖ ప్రస్తుత విషయంతో సంబంధమున్నది కావటంచేత ఆయనకు అనుమతి నిరాకరించజాలమనీ సభాధ్యక్షులు తెలియచేశారు. వాణిజ్యసభ్యుడు ఇదివరకే మాట్లాడారనీ ఆర్థిక సభ్యుడు కూడా కావాలనుకున్నట్టయితే అదివరకే మాట్లాడి వుండవచ్చుననీ దేశాయి, రంగా పేర్కొన్నారు. ప్రత్యేకంగా ఇప్పుడు మాట్లాడాలని ఆర్థిక సభ్యుడు అనుకోవడం కుయుక్తి తప్ప మరొకటికాదనీ చెప్పారు. అయితే సభాధ్యక్షులు ముగింపు తీర్మానానికి అనుమతి నివ్వలేదు. ఆ ఘట్టంలో కాంగ్రెసుపార్టీకి చెందిన వారందరూ జాతీయవాద పార్టీకి చెందినవారూ, ఇండిపెండెంటు పార్టీకి చెందిన కొందరూ సిగ్గు సిగ్గు అని అరుస్తూ సభా భవనం నుంచి నిష్క్రమించారు.

సుంకాల విషయంలో కాంగ్రెసు వైఖరి గురించి ఆర్థిక సభ్యుడు కొంత వేదాంత ధోరణి వెలిబుచ్చారు. కాంగ్రెసు అధ్యక్షులు జవహర్‌లాల్ నెహ్రూ సోషలిజం గురించి మాట్లాడడంతో పెద్ద వాణిజ్యవేత్తలు భీతి చెందసాగారు. "..., కాంగ్రెసు పార్టీలోని మధ్యేమార్గులు లేదా రైట్‌వింగ్ వారు, కాంగ్రెసు పార్టీకి మూల ఆధారమైన వారిమీద పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఉపన్యాసాల ప్రభావాల తీవ్రతను తగ్గించేందుకు కృషిచేస్తున్నారు. ఎక్కువ సుంకాలు కావాలని కాంగ్రెసు కోరడానికి ఇదే కారణం" అని ఆర్థిక సభ్యుడు వివరించారు.[65]

## సైన్యంలో పూర్తిగా భారతీయులనే చేర్చుకోవాలని కోరిక

సైన్యంలో పూర్తిగా భారతీయులనే చేర్చుకోవాలని భారత జాతీయవాదులు ఎప్పటి నుంచో కోరుతూ వచ్చారు. సైన్యంలో భారతీయులను చేర్చుకోవడం ఏ విధంగా కొనసాగుతున్నదీ 1938లో సమీక్షించాలని 1926 వ సంవత్సరపు ఇండియన్ సాండ్ హర్స్టు సంఘం ఏకగ్రీవంగా అంగీకరించింది. 1938 సెప్టెంబరు 2వ తేదీన షౌకతలీ శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఇండియన్ సాండ్ హర్స్టు సంఘం శిఫార్సులను అమలుపరచేందుకు ఒక కార్యక్రమాన్ని తయారు చేసేందుకు కేంద్రశాసనసభలోని ఎన్నికైన సభ్యులూ, ఇతర సభ్యులతో ఒక సంఘాన్ని

ఏర్పాటుచేయాడానికి త్వరగా చర్యలు తీసుకోవలసిందని ఈ తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు శిపార్సు చేశారు. దీనికిగాను వెంటనే చర్యలు తీసుకోవాలని సంఘంలో ఎక్కువమంది ఎన్నికైన సభ్యులుండాలనీ చెట్టియార్ ఒక సవరణను ప్రతిపాదించారు.

ఆ తర్వాత జరిగిన చర్చలో కేంద్ర శాసనసభకు ఎన్నికైన మొట్టమొదటి మహిళ శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్ మాట్లాడుతూ ప్రభుత్వమే స్వయంగా ఈ సంఘాన్ని నియమించివుండవలసిందని అభిప్రాయపడ్డారు. తమ సంఘపు (షాండ్ హర్స్టట్ సంఘం) శిపార్సులను ప్రభుత్వం చిత్తశుద్ధితో అమలుపరచి వున్నట్టయితే, సైన్యం గురించీ, దేశరక్షణ గురించీ ప్రజల్లో ఏర్పడివున్న భయ సందేహాలను ఎప్పుడో తొల గించివుండ వచ్చునని ఆమె అన్నారు. సైనిక సిబ్బంది నివశిస్తున్న తరహా, ఈ దేశపు అలవాట్లకు తగినట్లుగాలేదని ఆమె చెప్పారు. భారతీయ ఆఫీసర్లకు ముట్టచెబుతున్న జీతభత్యాలు వారి కనీస అవసరాలకు కూడా చాలడంలేదని ఆమె అన్నారు.[66]

1922 నుంచీ సైన్యంలో భారతీయులను చేర్చుకోవడం ఏ విధంగా కొనసాగు తున్నదీ అస్సాంకు చెందిన కులధర్ చాలిహా వివరించారు. ఈ విషయంలో పురోగతి చాలా అసంతృప్తికరంగా వుందని ఆయన అభిప్రాయ పడ్డారు. డెహరాడూన్‌లోని ఒకేఒక సైనిక పాఠశాలకాక దేశం వివిధ ప్రాంతాల్లో అటువంటి పాఠశాలలను ఏర్పాటు చేయాలని సూచించాడు. భారతదేశంలో మూడురకాల సైనిక అధికార్లను సృష్టించి నందుకు బొంబాయికి చెందిన జి. వి. దేశ్‌ముఖ్ విచారం వ్యక్తపరచారు. వీరు కింగ్సు కమిషన్డ్ అధికార్లు, భారతీయ కమిషన్డ్ అధికార్లు, వైస్‌రాయ్ కమిషన్డ్ అధికార్లు, ఈ వర్గ విధానంవల్ల భారతీయ అధికార్లలో న్యూనత భావం ఏర్పడు తోందనీ భారతీయులు సైనిక స్కూల్లో చేరేందుకు ముందుకు రావడంలేదనీ ఆయన విమర్శించారు.

చర్చలో జోక్యం చేసుకుంటూ దేశాయి సైన్యంలో బ్రిటిషు వారి పునికి వారిధోరణి భారతీయ అధికార్లు సైన్యంలో చేరకుండా నిరుత్సాహపరుస్తూ వుందని ఆరోపించారు. అదీగాక, జీతభత్యాలూ, పింఛనూ మొదలైనవాటిలోకూడా తారతమ్యాలు, భారతీయులు అతికష్టంమీద తమకు మించిన ఆడంబరాలకు పోవలసినవిగా వున్నాయని దేశాయి పేర్కొన్నారు. ఈ విధంగా వ్యవహరించినందువల్ల కొంతమంది ఉన్నత పదవులకు చేరుకోగలరేమోకాని, దీనికి ఒకే ఒక పరిష్కారం, సైన్యంనుంచి బ్రిటిషు అధికార్లను తొలగించడమొక్కటేనని ఆయన స్పష్టంగా చెప్పారు. పదిహేనేండ్లలో భారత సైన్యమంతా భారతీయుల చేతుల్లో వుండాలని ఆయన కోరారు.[67]

చివర, షౌకతలీ తీర్మానం చెట్టియార్ సవరణతోపాటు ఆమోదించబడింది.

శాసన సభ్యులు. బడ్జెటు చర్చలో ప్రశ్నలు తీర్మానాల రూపంలో దీన్ని కోరుతూనే వచ్చారు. 1939 మార్చి 14 వ తేదీన సర్దార్ సంత్‌సింగ్, ఇదే విషయమై కోత తీర్మానాన్ని ప్రతిపాదించారు. రక్షణశాఖకు సంబంధించి భారత ప్రభుత్వాన్ని అభిశంసించే రూపంలో దీన్ని ప్రతిపాదించారు. తీర్మానాన్ని సభవారు 57 ఓట్లతో ఆమోదించారు. తీర్మానానికి ప్రతికూలంగా 46 ఓట్లు పడ్డాయి.

రక్షణ-విదేశ వ్యవహారాల్లో తమకు ఎటువంటి అధికారమూ లేదన్న సంగతి భారతీయులకు ఎప్పుడూ బాధకరంగానే వుంటూవచ్చింది. స్వాతంత్ర్య పోరాటం, బ్రిటిష సామ్రాజ్యవాదంతో పోరాడుతున్న దళితప్రజల ఉద్యమంతో ముడిపడి వుందని కాంగ్రెసుపార్టీ సభ్యులు చాలామంది అభిప్రాయపడటంతో వారికి ఇది మరీ బాధకరంగా తోచింది. భారత ప్రభుత్వం, బ్రిటిష సామ్రాజ్యవాద వ్యవస్థలో భాగంగా, పాల్గొంటున్న కొన్ని కార్యకలాపాలను జాతీయవాదులు విరశించారు కాని వారు, అటువంటి కార్యకలాపాల గురించి శాసన సభలో చర్చించే స్థితిలో లేరు. ఉదాహరణకు 1937 లో జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా చైనా మొరపెట్టుకున్నపుడు, చైనా విజ్ఞప్తి గురించి శాసనసభ అభిప్రాయాన్ని భారత ప్రభుత్వం తెలుసుకోకపోవడం గురించి చర్చించేందుకు వాయిదా తీర్మానాన్ని ప్రవేశ పెట్టడానికి సత్యమూర్తి సెప్టెంబరు 3 వ తేదీన సభవారి అనుమతి కోరారు కాని తీర్మానానికి అనుమతినివ్వలేదు. అంతకు సరిగ్గా ఒక సంవత్సరం ముందు, నీలకంఠదాసు అబిసీనియాకు భారతదేశం నుంచి సైనికులను పంపడం గురించి చర్చించేందుకు సభవారి అనుమతి కోరినపుడు సభను సంప్రదించే హక్కు-గురించి మాత్రమే ప్రస్తావించవలసిందని ఆయన్ను కోరారు. సహజంగా చర్చకు పెద్ద అవకాశం లేకుండా పోయింది.

అయినా శాసన సభలోని ఎన్నికైన సభ్యులు ఇటువంటి విషయాల్లో జోక్యం చేసుకునేందుకు మార్గాలను అన్వేషిస్తూనే వచ్చారు. 1938 ఫిబ్రవరి 4 వ తేదీన గాడ్గిల్ శాసన సభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. భారత సైన్యంతో కేంద్ర శాసన సభలో ఎన్నికైన సభ్యులకు సంబంధం వుండేట్టు స్థాయీ సంఘాన్ని ఏర్పాటు చేయాలని ఈ తీర్మానంలో గవర్నర్ జనరల్‌కు శిఫార్సు చేశారు. ఆధునిక పోరాట రీతులకూ పారిశ్రామిక - వ్యవసాయ ఉత్పత్తికీ పరస్పరం సంబంధం వుందనీ అందువల్ల ప్రజలకూ - సైన్యానికీ మధ్య సహకారం అవసరమనీ గాడ్గిల్ ఉద్ఘాటించారు. అదృష్ట్యా స్థాయీ సంఘం ప్రయోజనకరంగా వుంటుందని ఆయన అభిప్రాయపడ్డారు. 68

శ్రీ. సంతానం, తీర్మానాన్ని సమర్థిస్తూ సైన్యానికీ ప్రజలకూ సంబంధం లేకుండా

వున్నందుకు విచారం వ్యక్తపరిచారు. "సైన్యంలో పూర్తిగా భారతీయులను నియమించినంత మాత్రాన చాలదు. సైన్యంలో ఎవరు వున్నా ఆసైన్యం భారతీయుల కోసం ఏర్పాటైనదనీ, భారతీయుల రక్షణకోసం ఏర్పాటైనదనీ ప్రజల్లో విశ్వాసం కుదిరేట్లు చూడడం అవసరం. స్థాయీ సంఘం నియామకం ఈవిషయంలో కొంత తోడ్పడగలదు" అన్నారాయన 69

అబ్దుల్ కయ్యూం మాట్లాడుతూ సైన్యాన్నీ విదేశ వ్యవహారాలనూ తమ అధీనంలో ఉంచుకోవాలని భారతీయులు కృత నిశ్చయంతో వున్నారనీ ప్రభుత్వం బాధ్యతా రహితమైనదే అయినా ప్రజాభిప్రాయాన్ని చాలాకాలం నిర్లక్ష్యం చేయజాలదనీ చెప్పారు. తిరుమలరావు మాట్లాడుతూ గాడ్గిల్ ప్రతిపాదించిన మితవాద తీర్మానాన్ని కూడా ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తున్నందుకు విచారం వ్యక్తపరిచారు. ముహమ్మద్ అజ్ హరలీ కూడా తీర్మానాన్ని సమర్థించారు.

ఫిబ్రవరి 18వ తేదీని సభవారు ఈ తీర్మానం మీద చర్చ కొనసాగించినపుడు అసఫలీ, సంఘం విధులను స్పష్టీకరిస్తూ ఒక సవరణను ప్రతిపాదించారు. ఈ సంఘం విధుల్లో, గవర్నర్ జనరల్‌కు భారత సైనికులను విదేశాలకు పంపడం - అదనపు ఖర్చుతో కూడుకున్న కొత్త ప్రతిపాదనలు సైన్యంలో భారతీయులను చేర్చుకోవడం వంటి విషయాల్లో సలహాలివ్వడంకూడా వుండాలని సవరణలో పేర్కొన్నారు.

బజోరియా, వెంకటాచలం చెట్టి, అణే మొదటి తీర్మానాన్నీ అసఫలీ సవరణనూ సమర్థించారు. ఈప్రతిపాదనలోని రాజ్యాంగ పరమైన అంశం విషయమై ముహమ్మద్ యామిన్‌ఖాన్, రక్షణ కార్యదర్శితో ఏకీభవించలేదు. అప్పటి రాజ్యాంగం కింద అటువంటి సంఘాన్ని నియమించడానికి వీలు లేదన్న రక్షణ కార్యదర్శి వాదనతో ఆయన అంగీకరించలేదు. ఎన్నికైన సభ్యులను సైన్యానికి సంబంధించిన విషయాల గురించి సంప్రదించడానికి వీలులేదన్న విషయమై కూడా ఆయన అంగీకరించలేదు. తీర్మానాన్ని సభలోని అన్ని పక్షాలవారూ ఆమోదించాలని ఆయన కోరారు. 70

సవరణతోపాటు తీర్మానం మీద ఓటింగ్ జరిగినపుడు, 53 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 45 ఓట్లు పడ్డాయి.

## రైల్వేల్లో ఆసక్తి

శాసన సభ్యులు ఆసక్తి కనబరచిన అంశాల్లోరైల్వేలు ఒకటి. మూడవ శాసన సభలో పండిత హృదయనాథకుంజ్రు రైల్వేల విషయమై ప్రత్యేక

శ్రద్ధ కనబరిచారు. రైల్వేల్లోకి పూర్తిగా భారతీయులనే తీసుకోవడం, మూడవతరగతి ప్రయాణీకుల సౌకర్యాలను ఎక్కువ చేయడం రైల్వేలకు కావలసిన సామగ్రిని భారత దేశంలోనే కొనుగోలు చేయడం వంటి అంశాలు రైల్వే బడ్జెటు మీద జరిగిన చర్చల్లో ప్రస్తావనకు వస్తూ వుండేవి.

అయిదవ శాసన సభలో కూడా ఇవి ప్రస్తావనకు వచ్చాయి. రైలింజన్లను భారత దేశంలో ఉత్పత్తి చేయడం గురించి ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఈశాసన సభలో రైల్వే బడ్జెటు మీద మొదటిసారి జరిగిన చర్చలో (1935) ప్రభుత్వం ఈవిషయంలో ప్రజాభిప్రాయాన్ని ఖాతరు చేయనందుకు వి. వి. గిరి ప్రభుత్వాన్ని ఖండించారు. రైలింజన్లను, దేశంలోనే ఉత్పత్తి చేయాలని భారతీయులు 1918 నుంచీ ఏవిధంగా కోరుతూ వచ్చినదీ, ఈవిషయం పరిశీలనలో వున్నట్లు ప్రభుత్వం ఏవిధంగా సమాధానం చెబుతూ వచ్చినదీ ఆయన పేర్కొన్నారు. 1934 లో కూడా ప్రభుత్వం అటువంటి సమాధానమే ఇచ్చింది. "అయ్యా, ఒకవేళ ఇదే మాప్రభుత్వమే అయిన పక్షంలో, మాప్రజా ప్రభుత్వం అయిన పక్షంలో, ఇటువంటి సమాధానాలిచ్చినట్లయితే ప్రభుత్వాన్ని ఆ మరునాడే తొలగిస్తాం" అన్నారు గిరి. 71

కె. సంతానం 1938 సెప్టెంబరు 24 వ తేదీన మళ్ళీ ఈ అంశాన్ని ప్రస్తావించారు. రైల్వేలకు చెందిన ఓపెన్‌లైన్‌వర్క్సుకు సంబంధించిన పద్దుల్లో కోత ప్రతిపాదిస్తూ ఆయన, రైలింజన్ల ఉత్పత్తికి భారతదేశంలో రెండు వర్కుషాపులను ఏర్పాటు చేసేందుకు వీలుందని చెప్పారు. ఈసమయంలో కూడా ప్రజాభిప్రాయాన్ని నిర్లక్ష్యం చేయవద్దని ఆయన ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. దేశాయి, ఆచే, బకోరియా చాలామంది ఇతరులూ సంతానం తీర్మానాన్ని గట్టిగా బలపరిచారు. చివరకు సభవారు తీర్మానాన్ని ఆమోదించారు. అయినా ప్రభుత్వం మాత్రం, రైలింజన్ల ఉత్పత్తి ప్రారంభించలేదు. 1939 ఫిబ్రవరి 20వ తేదీన మోహన్‌లాల్ సక్సేనా, రైల్వే పద్దుల్లో ఒకదానికి కోత ప్రతిపాదించారు. ఈవిషయంలో ప్రజాభిప్రాయాన్నీ శాసన సభ్యుల అభిప్రాయాన్నీ ఖాతరు చేయనందుకు ఆయన ప్రభుత్వాన్ని అభిశంసించారు. భారతదేశంలో రైలింజన్ల ఉత్పత్తిని ప్రారంభించినట్లయితే గ్రేట్‌బ్రిటన్ ఆదాయం పోతుం దన్న భయంతో ప్రభుత్వం, భారతదేశంలో రైలింజన్ల ఉత్పత్తిని ప్రారంభించడం లేదని ఆయన చెప్పారు. 72 ఈతీర్మానాన్ని కూడా సభవారు ఆమోదించారు. ఆఏడాది రైల్వే బడ్జెట్ మీద జరిగిన చర్చలో రైలు పనివారి ఇబ్బందులూ ప్రయాణీకుల ఇబ్బందులూ ప్రస్తావనకు వచ్చాయి. తిరుమలరావు, మూడవతరగతి ప్రయాణీకుల ఇబ్బందుల గురించి ప్రస్తావించారు. రైలుస్టేషన్లలో ఆహారపదార్థాల విక్రయం గురించి

రాధాబాయి సుబ్బరాయన్, రైల్వే యూనియన్ల గురించి రంగా, మాట్లాడారు. త్వరగా ప్రయాణంచేసే రైళ్లలో మూడవ తరగతిప్రయాణీకులు ప్రయాణం చేయకుండా అరికడుతున్నందుకు ఎన్. ఎమ్. జోషి ప్రభుత్వాన్ని విమర్శించారు. "ప్రభుత్వం ఈరైళ్లను ఎవరికోసం నడుపుతున్నట్టు, ధనికుల కోసమా, బీదవారికోసమా?" అని ఆయన ప్రశ్నించారు.

రైల్వేలమీద జరిగిన తీవ్రమైన చర్చలో ఒక చర్చ 1937 ఫిబ్రవరి 24వ తేదీన జరిగింది. ప్రభుత్వ యాజమాన్యంలోని రైల్వేల ఆర్థిక పరిస్థితిని పరిశీలించి రైల్వేల ఆదాయాన్ని మెరుగుపరచేందుకు తీసుకోవలసిన చర్యలను సూచించేందుకు వెడ్జ్‌వుడ్ సంఘాన్ని నియమించడం గురించి, దర్భంగకుచెందిన సత్యనారాయణ సిన్హా ప్రశ్నించారు. సంఘంలోని సభ్యులందరూ శ్వేతజాతీయులే. దక్షిణాఫ్రికాకు చెందిన ఒక సభ్యుడుకూడా సంఘంలో వున్నారు. సంఘంలో భారతీయ నిపుణులొకరిని కూడా నియమించనందుకు సత్యమూర్తి, బి. దాసు, జహంగీర్, అణే, గజ్‌నవీ, అజరలీ యామిన్‌ఖాన్ అందరూ విచారం వ్యక్తపరిచారు. డాక్టర్ భగవాన్‌దాస్ వ్యంగ్యంగా ఈమాటలన్నారు:

"రైల్వే సభ్యుడిని రైల్వేల ఆర్థిక విషయాల కమీషనర్‌నూ, రైల్వేబోర్డు సభ్యులనూ వారి సహాయ సిబ్బందినీ అందరినీ మొదట ఇంటికి పంపడం మంచిది. వీరు, కొత్త నిపుణుల సహాయం లేకుండా పనిచేయలేకుండా వున్నట్టు కనిపిస్తూవుంది. కొత్త నిపుణులను తప్పకుండా నియమించవలసిందే. అయితే ఇప్పటి సిబ్బందికి అదనంగా మాత్రం కాదు, వారి స్థానే నియమించుకుందాం. ఇప్పటికే ప్రజలు విపరీతమైన భారంతో కృంగి పోయివున్నారు."73

చివరకు, సత్యనారాయణ సిన్హా కోతతీర్మానాన్ని సభవారు ఆమోదించారు.

## మెరుగైన కార్మిక శాసనంకోసం పోరాటం

అయిదవ శాసనసభలో సభ్యులు, కార్మిక శాసనాల విషయమై ప్రత్యేక శ్రద్ధ వహించారు. భారత ప్రభుత్వం అనుసరిస్తున్న విధానంస్థానే దేశంలో నిరుద్యోగ సమస్య పరిష్కారానికి దరిమిలా జెనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక మహాసభలో ఆమోదించిన ముసాయిదాను ధృవపరచేందుకూ శాసనసభ కొన్ని చర్యలు శిపార్సు చేసేందుకు గిరి, జోషి, రంగా, మోహన్‌లాల్ సక్సేనా ప్రయత్నించారు. కాని, దీనికి సంబంధించిన సవరించిన తీర్మానం ఒకటి 1935 ఫిబ్రవరి 21వ తేదీన ఒక ఓటు తేడాతో వీగిపోయింది. 1935 వ సంవత్సరపు భారతీయ గనుల (సవరణ) బిల్లు మీద జరిగిన చర్చలో పాల్గొంటూ ఈ సభ్యులు అంతర్జాతీయ కార్మిక సంస్థ శిపార్సు

చేసిన విధంగా గనుల్లో పనిచేసేవారికి రోజుకు ఏడు గంటల నలభై అయిదు నిముషాల పనిగంటలను నిర్ణయించాలని కోరారు. భారత ప్రభుత్వం రోజుకు తొమ్మిది గంటల కాలాన్ని ప్రతిపాదించింది.

1935 ఫిబ్రవరి 13వ తేదీన ప్రభుత్వం, శాసనసభ్యుల వేతనాల చెల్లింపు బిల్లును ప్రవేశపెట్టినపుడు, సభ్యులలో చాలామంది, పనివారికి మెరుగైన సౌకర్యాల కోసం అడిగారు. కొన్ని పరిశ్రమల్లో కార్మికుల వేతనాల చెల్లింపును క్రమబద్ధంచేసేందుకు ఈ బిల్లును ఉద్దేశించారు. బిల్లు గురించి నివేదించేందుకు గిరి ఒక సభ్యులుగా ఒక శిపార్సుల సంఘాన్ని నియమించారు. శిపార్సుల సంఘం నివేదికతోపాటు బిల్లుమీద సభవారు చర్చ ప్రారంభించినపుడు జోషి అనేక సవరణలు సూచించారు. బిల్లును, అన్ని పరిశ్రమల్లోని, అందరూ కార్మికులకూ వర్తింపచేయాలనీ వేతనాలను నెలకొకసారికాక, పదిహేను రోజులకొకసారి చెల్లించాలనీ, ట్రేడ్ యూనియన్ అధికారి ఒకరు కార్మికుడి తరపున వ్యవహరించే వీలు కల్పించాలనీ జోషి కోరారు. గిరి, ఈ సవరణలన్నిటినీ, ముఖ్యంగా ఆఖరు సవరణను, భారతదేశంలో ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని ప్రోత్సాహించాలన్న అవసరం దృష్ట్యా సమర్థించారు.

1936 ఫిబ్రవరి 10వ తేదీన ప్రభుత్వం ఒక సవరణను ప్రతిపాదించినపుడు తీవ్రమైన వాదోపవాదాలు జరిగాయి. పదిమంది కాని, అంతకంటె ఎక్కువమంది గాని కలిసి, సరైన కారణం చూపకుండా, ముందు తెలియపరచకుండా పనికి హాజరుకానట్టయితే, వారి వేతనాలనుంచి పదమూడు రోజులకు మించకుండా వేతనాలను తగ్గించేందుకు ఈ సవరణను ఉద్దేశించారు.

గిరి, ఈ సవరణను గట్టిగా వ్యతిరేకించారు. ఎంత న్యాయమైనా, హఠాత్తుగా జరిపే సమ్మెలు ఈ సవరణవల్ల చట్టవిరుద్ధమైనవి కావడమేకాక అసలు వీలుండదుకూడా. ట్రేడ్‌యూనియన్ నాయకులే అయినా గిరి సమ్మెలను ఎప్పుడూ ప్రోత్సహించలేదు. ముఖ్యంగా రాజకీయ సమ్మెలను ఆయన ప్రోత్సహించలేదు. ఈ విషయమై కమ్యూనిస్టు ట్రేడ్‌యూనియన్ నాయకులైన ఎస్. ఏ. డాంగే – ఎస్. ఎస్. మిరాజ్‌కర్‌లకూ, గిరికీ భేదాభిప్రాయాలుండేవి.[74] కాని ప్రభుత్వ సవరణవల్ల సమ్మె చేసేందుకు సంబంధించి కార్మికులకున్న మూల హక్కుకే భంగం వాటిల్లుతుందన్న దృష్టితో గిరి, సవరణను వ్యతిరేకించారు. "ప్రజలు బ్రతికేందుకూ పని చేసుకునేందుకూ ఎటువంటి హక్కు కలిగివున్నారో సమ్మెచేసే హక్కుకూడా అదే విధంగా కలిగివున్నారు. కార్మికులు ఎటువంటి పరిస్థితుల్లోనూ ఈ హక్కును ఒదులుకోలేరు" అన్నారు గిరి.[75]

జోషి, ఎం. అనంతశయనం అయ్యంగార్, రంగా, కూడా సవరణను వ్యతిరే

కించారు. అయ్యంగార్, సూత్రరీత్యా లాభనష్టాల దృష్ట్యాకూడా సవరణను వ్యతిరే కించారు. "ఒక వ్యక్తి పనిచేసి సంపాదించుకున్న వేతనం, ఆ వ్యక్తికి దక్క కుండా చేసే హక్కు యజమానికి ఉండరాద"ని అన్నారు.[76]

యజమానులూ ఉద్యోగులూ పరస్పరం ఒకే విధంగా వ్యవహరించాలన్న వాదన గురించి ప్రస్తావిస్తూ రంగా, కార్మికులున్న దయనీయ పరిస్థితిలో యజమానులూ — కార్మికులమధ్య సమాన భాగస్వామ్యం అన్నది వీలుపడదని చెప్పారు.

ప్రభుత్వమూ పెట్టుబడిదారులూ ఒకటై, కార్మికులను వేధిస్తున్నన్నందుకు రంగా విమర్శించారు.

సవరణమీద ఓటింగు జరిగినప్పుడు 65 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 44 ఓట్లు పడ్డాయి. సవరించిన రూపంలో బిల్లును, సభవారు ఆమోదించారు. అంతకు ముందు కాంగ్రెసుపార్టీ తరపున గిరి, రంగా, బిల్లూ సవరణలోని అభ్యంతరకరమైన అంశాల గురించి సందేహాలను వ్యక్తపరిచారు.

1936 అక్టోబరు 13 వ తేదీన వాణిజ్య వివాదాల సవరణ బిల్లును ప్రవేశపెట్టినపుడు సమ్మె చేసేందుకు కార్మికులకున్న హక్కుల గురించి చర్చించేందుకు మరొక అవకాశం కలిగింది. జోషి, బిల్లులో కార్మికులకు అనుకూలంగావున్న కొన్ని అంశాలపట్ల హర్షం వ్యక్తపరుస్తూ బిల్లులోని 8 వ క్లాజుకు అభ్యంతరం తెల్పారు. "కార్మికులు తాము పనిచేస్తున్న పరిశ్రమలోని వివాదాలకు సంబంధించికాక, సమాజానికి ఇబ్బంది కలిగిస్తూ ప్రభుత్వాన్ని ఒత్తిడిపేట్టేందుకు ఉద్దేశించిన" సమ్మెలను చట్టవిరుద్ధమైనవిగా ప్రకటించేం దుకు ఈ క్లాజును ఉద్దేశించారు. మొదటి బిల్లులోని అంశాలకంటె ఈ బిల్లులోని ఈ అంశం కఠినంగా వుందని జోషి వాదించారు.[77] జెనీవా మహాసభకు యజమానుల ప్రతినిధివర్గానికి సలహాదారుగా హాజరైన బి, దాసు మాత్రం, కొత్త క్లాజు, పాతదాని కంటె మెరుగ్గా వుందనీ కార్మికులు కల్పితమైన ఇబ్బందులు కారణంగా హఠాత్తుగా సమ్మెలు ప్రారంభించరాదనీ చెప్పారు. 78 బెంగాల్‌లోని యూరోపియన్ల ప్రతినిధి అయిన జి. మార్గన్ కూడా, కొత్త క్లాజు, పాతదానికంటె మెరుగ్గా వుందని పేర్కొ న్నారు. పాతదానివల్ల, ఒక సమ్మెను చట్టవిరుద్ధంగా ప్రకటించడంలో న్యాయస్థానాల చేతులు కట్టివేసినట్లయిందని ఆయన వాదించారు.

గిరి, భారతదేశంలో పారిశ్రామిక వివాదాల చరిత్రను వివరించారు. 1929 లో ఆమోదించిన పారిశ్రామిక వివాదాల చట్టం, కొండను త్రవ్వి ఎలుకలను పట్టినట్లయిందని చెప్పారు. ఈ చట్టంవల్ల ఏర్పాటైన సంప్రదింపుల యంత్రాంగాన్ని కూడా ప్రభుత్వం అయిదు సందర్భాల్లో మాత్రమే ఉపయోగించినందుకు ఆయన ప్రభుత్వాన్ని విమ ర్శించారు. ప్రభుత్వం ఈవిధంగా వ్యవహరించిన తర్వాత కార్మికులకు ప్రభుత్వంలో

విశ్వాసం పోయిందనీ, ఒకవేళ ఈ యంత్రాంగాన్నంతటినీ ఉపయోగించినా సమ్మె విజయవంతం కాకుండా ఉండేందుకు వినియోగిస్తారని వ్యవస్థీకృతమైన కార్మికులు భావిస్తున్నారనీ గిరి చెప్పారు. సమ్మెచేసేహక్కు గురించి ఆయన ఈవిధంగా అన్నారు:

"కార్మికుల మీద ఎటువంటి జరిమానాలు విధించే పద్ధతినీ మేము ఆమోదించ లేము. కార్మికులకు సమ్మె చేసే హక్కు స్వతహాగా వుంది. దాన్ని బేరా నికి పెట్టేందుకు వీలు లేదు. అందువల్ల, జరిమానాలు విధించడానికి కార్మికులు వప్పుకోరు (వినండి, వినండి) రాజకీయ సమ్మెలను అరికట్టాలన్నది ప్రభుత్వ ఉద్దేశ్యమై ఉండవచ్చు. ఈ విషయంలో కార్మికుల అభిప్రాయాలను తెలియ చేయడం నా విధి. కార్మికులు, మొదట ఈ దేశ పౌరులు. ఆ తర్వాత కార్మికులు (వినండి, వినండి) రేపు రాజకీయ ఆందోళన జరిగినట్లయితే, ప్రభుత్వానికి నచ్చినా నచ్చకపోయినా కార్మికులు రాజకీయ సమ్మె జరుపడమన్నది మాత్రం తథ్యం (వినండి. వినండి)"79

బిల్లును సవరించే సమయంలో ఇతర విషయాలతో పాటు ప్రభుత్వం ఈ క్రింది వాటిని కూడా గుర్తుంచుకోవడం మంచిదని గిరి సూచించారు.

1) నమోదయిన ఒక ట్రేడ్ యూనియన్‌కూ, ఒక యజమానికీ మధ్య ఏర్పడే ఎటువంటి వివాదమైనా పారిశ్రామిక వివాదంగా గుర్తించబడవలసిందే. అటువంటప్పుడే ట్రేడ్ యూనియన్‌కు పారిశ్రామిక వివాదంలో పాల్గొనే వీలుంటుంది.

2) వివాదంతో సంబంధమున్న ఒక పక్షం కోరినప్పుడుగాని, వివాదం ఏర్పడ వచ్చునన్న సందేహంతో దానితో సంబంధమున్న పక్షం కోరినప్పుడుగాని, అది కూడా తగినంత ఆధారం వున్నప్పుడే ఒక వివాదాన్ని ఏదైనా బోర్డుకుగాని న్యాయ స్థానానికిగాని నివేదించవలసి వుంటుంది. 80

చివరకు, బిల్లును ప్రజాభిప్రాయ సేకరణకు పంచిపెటాలన్న తీర్మానాన్ని ఆమో దించారు. సబ్సిడీ సౌకర్యం పొందుతున్న పరిశ్రమల్లో పనిచేస్తున్న భారతీయుల పని పరిస్థితుల గురించి శ్రీ ప్రకాశ ప్రత్యేక శ్రద్ధ వహించారు. 1938 ఫిబ్రవరి 4 వ తేదీన, ఆయన ఈ విషయమై శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. కేంద్ర ప్రభుత్వం నుంచి ఎటువంటి రూపంలోనైనాసరే సహాయం పొందుతున్న పరి శ్రమలన్నిటితో విధించవలసిన నిబంధనలను ఈ తీర్మానంలో, గవర్నర్ జనరల్‌కు సిఫార్సుచేశారు. అవి 1) అటువంటి పరిశ్రమల్లో పైతరగతి ఉద్యోగాల్లోనూ, ఇతరఉద్యోగా ల్లోను నిర్ణీతమైనమేరకు భారతీయులను నియమించడం 2) అటువంటి పరిశ్రమల్లోపనిచేసే భారతీయులకు తగినవేతనాలు చెల్లించి వారిని బాగా చూడడం. 81 జోషి, తీర్మానాన్ని

సమర్థిస్తూ, ప్రభుత్వం నుంచి సబ్సిడీ పొందుతున్న పరిశ్రమల్లో, ప్రభుత్వం విధించిన నిబంధనలు పాటించేట్టు చూసేందుకు ప్రభుత్వం డైరెక్టర్లనూ ఇన్స్పెక్టర్లనూ నియమించాలని కోరారు. వెంకటాచలం చెట్టి-రంగా-అజే-నౌమన్, తీర్మానాన్ని సమర్థించారు. జెహంగీర్ మాత్రం తీర్మానంమీద దరిమిలా చర్చ జరుపనవసరం లేదని భావించారు. ఓటింగ్ జరుపకుండానే తీర్మానాన్ని సభవారు ఆమోదించారు.

శాసనసభ వెలుపల రాజకీయాలు

1936 డిశంబరులో జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన జరిగిన ఫైజ్‌పూర్ కాంగ్రెసులో "ఈ రాజ్యాంగంతో సహకరించరాదు, దీనికి అంగీకరించరాదు. శాసన సభ లోనూ వెలుపల దీన్ని ప్రతిఘటించవలసిందే" అని తీర్మానించారు. రాష్ట్ర శాసనసభలకు జరిగిన ఎన్నికల ఫలితాలు తేలిసిన పిమ్మట కాంగ్రెసుకు మంత్రుల పదవులను అంగీకరించాలా వద్దా అన్న పెద్ద సమస్య ఎదురైంది. 1937 మార్చిలో, పదవులను అంగీకరించరాదు అన్నా వామపక్ష ప్రతిపాదనను ఎ. ఐ. సి. సి. త్రోసిపుచ్చింది. మంత్రుల రాజ్యాంగపరమైన కార్యకలాపాలకు అవరోధంగా గవర్నర్లు తమ ప్రత్యేక అధికారాలను వినియోగించబోరని ప్రభుత్వం ప్రకటించినట్టయితే కాంగ్రెసు సభ్యులు పదవుల నలంకరించవచ్చునని నిర్ణయించారు. దరిమిలా కాంగ్రెసు ఏడు రాష్ట్రాల్లో మంత్రి మండలులను ఏర్పాటుచేసింది. ప్రారంభంలో, కాంగ్రెసు మంత్రిమండలులు, పౌర స్వాతంత్ర్యం - వ్యవసాయ రంగంలో శాసనాలు మొదలైన విషయాల్లో కొంత విజయం సాధించాయి. కాని క్రమేణా కాంగ్రెసు మంత్రిమండలులు చట్టాన్ని అమలుపరచవలసి వచ్చింది. ఈ విషయమై కప్లాండ్ ఈ విధంగా రాశారు: "రాజ్యాంగాన్ని ప్రతిఘటించాలన్న తమ కార్యక్రమాన్ని కాంగ్రెసు దాదాపు మర్చిపోయినట్టే కనిపించింది."82 దీనితో కాంగ్రెసులోని వామపక్ష - దక్షిణ పక్షాలమధ్య విభేదాలు ఎక్కువయాయి. ఫలితంగా, కొత్తగా ఎన్నికైన అధ్యక్షులు సుభాష్ బోసు 1939 ఏప్రిల్‌లో రాజీనామా చేశారు. యూరోపులో యుద్ధమేఘాలు క్రమ్ముకుంటూ వుండగా, కాంగ్రెసులో అంతకంతకూ ఎక్కువవుతున్న చీలిక, భారత రాజకీయాలో కొత్తరకమైన క్లిష్టపరిస్థితి తెచ్చిపెట్టింది.

కాంగ్రెసూ - ముస్లింలీగ్‌మధ్య అంతకంతకు ఎక్కువవుతున్న అగాధంవల్ల మరొక సమస్య తలఎత్తింది. కొన్ని రాష్ట్రాల్లో కాంగ్రెసు మంత్రిమండలులు ఏర్పాటైనప్పటి నుంచీ, ఈ రాష్ట్రాల్లో ముస్లింలను ఇబ్బందులు పెడుతున్నారని జిన్నా ఇతర ముస్లిం మతవాద నాయకులూ ఆరోపించడం ప్రారంభించారు. "తాము పరిస్థితిని జాగ్రత్తగా పరిశీలించామనీ ముస్లింలను అణిచివేస్తున్నట్టు తమకు ఆధారమేదీ కనిపించలేదనీ"

లిన్‌లిత్‌గో, స్వయంగా ఆ తర్వాత జిన్నాకు చెప్పినట్టు గ్లెన్‌డొవెన్ వ్రాశారు.[83] అయితే ముస్లింలీగ్ జిన్నా వ్యక్తిగతంగా కొంత సాధించినట్టు చెప్పవచ్చు. జవహర్‌లాల్ నెహ్రూ - జిన్నా 1938లో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలవల్లకూడా రెండు పార్టీల మధ్య అగాధం పూడకపోవడమేకాక, ఆ తర్వాత మరింత ఎక్కువైంది. "... ... కాంగ్రెసు ముస్లింలీగును, సమాన హోదాలో గుర్తించి, హిందూ ముస్లిం పరిష్కారానికి సిద్ధపడితేతప్ప, మేము మా స్వశక్తిమీద ఆధారపడి వేచివుండవలసిందే... ..." అని జిన్నా, జవహర్‌లాల్ నెహ్రూకు ఏప్రిల్ 12వ తేదీన వ్రాసిన లేఖలో బెదిరించారు.[84] కాంగ్రెసు సహజంగా ఈ ప్రతిపాదనకు అంగీకరించలేకపోయింది.

కాంగ్రెసు, భారతదేశంలో హిందూరాజ్ ఏర్పాటుకు కృషిచేస్తూ వుందన్న విశ్వాసం లీగ్‌లో ప్రబలింది. కేంద్ర శాసనసభలో తమకు మెజారిటీ లభిస్తుందన్న నమ్మకం ఏర్పడినపుడు రాజ్యాంగంలోని ఫెడరల్ భాగాన్ని అమలుపరచేందుకు అంగీకరిస్తుందని కూడా విశ్వసించింది. ఫెడరల్ వ్యవస్థలో సంస్థానాల ప్రతినిధుల స్థానాలను గెల్చుకునే ఉద్దేశ్యంతోనే సంస్థానాల్లో పాలనా వ్యవస్థను ప్రజాస్వామ్యం చేయాలన్న ఉద్యమాన్ని కాంగ్రెసు ప్రోత్సహించిందనికూడా ముస్లిం మతవాద నాయకులు విశ్వసించారు. ఒకప్పుడు ఫెడరల్ వ్యవస్థను సమర్థించిన ఆగాఖాన్, లిన్‌లిత్‌గోకు ఈ విధంగా వ్రాశారు. "......సంస్థానాల ప్రతినిధులను సంస్థానాధీశులు నామినేట్ చేయబోరని వారిని సంస్థానాల ప్రజలు ఎన్నుకుంటారని ఎప్పుడైతే వెల్లడైందో అప్పుడే అందులోని ఆకర్షణంతా మాయమైంది. అటువంటి ఏర్పాటుకింద ముస్లింలకు సంస్థానాల్లో, కాంగ్రెసుతో పోటీ చేయగలిగినన్ని ఓట్లు లభించవు.[85]

అందుచేత ముస్లింలీగ్, రాజ్యాంగంలోని ఫెడరల్ భాగాన్ని ప్రతిఘటించడం ఎక్కువైంది. సంస్థానాధీశులు కూడా మారిన పరిస్థితులలో ఫెడరేషన్‌లో చేరేందుకు సుముఖంగాలేరు, ఫలితంగా 1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభంకామన్న తరుణంలో భారతదేశంలో వైస్‌రాయి ఎంతో ప్రయత్నించినప్పటికీ అఖిల భారత ఫెడరేషన్ ఏర్పడే అవకాశం కన్పించలేదు.86

ఈలోగా యూరోపులో యుద్ధమేఘాలు క్రమ్ముకుంటున్నాయి. 1939 మార్చిలో జరిగిన త్రిపుర కాంగ్రెసు మహాసభలో, బ్రిటిషు విదేశాంగ విధానాన్ని విమర్శించారు. మ్యూనిక్ ఒప్పందాన్ని, ఆంగ్లో - ఇటాలియన్ ఒప్పందాన్ని, ఫ్రాంకో యొక్క స్పెయిన్‌ను గుర్తించడాన్ని కాంగ్రెసు తీవ్రంగా విమర్శించింది. ఇటువంటి విధానాన్ని అనుసరించడం ప్రజాస్వామ్యానికే ద్రోహం చేయడమని కాంగ్రెసు వర్ణించింది. ఫాసిస్టు

శక్తులకు సహాయంచేస్తూ వస్తున్న బ్రిటిషు విధానంతో తమకెటువంటి సంబంధమూలేదని కాంగ్రెసు స్పష్టం చేసింది. భారతదేశంమీద యుద్ధాన్ని బలవంతంగా రుద్దేందుకు జరిగే ప్రయత్నాలన్నిటినీ వమ్ముచేయాలనీ భారతీయుల అనుమతిలేకుండా భారతీయ వనరులను యుద్ధానికి ఉపయోగించడాన్ని ప్రతిఘటించాలని ఏప్రిల్‌లో ఏ. ఐ. సి. సి. నిశ్చయించుకుంది. కాంగ్రెసు కార్యవర్గం ఆగస్టులో సమావేశమైనపుడు భారతీయ సైనికులను భారతీయుల అభిప్రాయానికి వ్యతిరేకంగా ఈజిప్టుకూ సింగపూర్‌కు పంపి నందుకు నిరసన తెలియచేసింది. కేంద్ర శాసనసభ పదవీకాలాన్ని మరొక సంవత్సరం పాటు పొడిగించినందుకు కూడా తన అసమ్మతిని తెలియచేసింది. దీనికి నిరసనగా కేంద్ర శాసనసభలోని కాంగ్రెసు సభ్యులందరూ శాసనసభ వచ్చే సమావేశానికి హాజరు కారాదని కార్యవర్గం కోరింది. బ్రిటిషు ప్రభుత్వపు యుద్ధ సన్నాహాలకు ఏవిధంగానూ తోడ్పడవద్దని రాష్ట్ర ప్రభుత్వాలను కోరింది.

## శాసనసభ బహిష్కరణ

కేంద్ర శాసనసభ ఆగస్టు 30 వ తేదీన సమావేశమైనపుడు కాంగ్రెసు సభ్యులు హాజరు కాలేదు.

. సెప్టెంబరు 3 వ తేదీన యూరోపులో యుద్ధం ప్రారంభమైంది. బ్రిటన్, జర్మనీ మీద యుద్ధాన్ని ప్రకటించింది. ఆ తర్వాత కొన్ని గంటలకు వైస్‌రాయ్, భారతదేశం యుద్ధం జరుపుతూవుందని ప్రకటించారు. అప్పట్లో సమావేశం జరుపుతున్న శాసన సభనుగాని భారతీయనాయకులనుగాని ఆయన సంప్రదించలేదు. వెంటనే భారత రక్షణ ఉత్తర్వును జారీ చేశారు.

సెప్టెంబరు 5 వ తేదీన న్యాయశాఖ సభ్యుడు సర్ మహమ్మద్ జఫురుల్లాఖాన్, శాసనసభలో భారత రక్షణ బిల్లును ప్రతిపాదించారు. ప్రజాభద్రతకూ భారతదేశ రక్షణ ప్రయోజనాలకూ, కొన్ని రకాల నేరాల గురించి విచారణ జరిపేందుకూ ప్రత్యేకచర్యలు అమలు జరిపేందుకు ఈ బిల్లువల్ల వీలు కలుగుతుంది. అంతకు ముందు జారీ చేసిన ఉత్తరువులోని కఠినమైన చర్యలన్నిటినీ బిల్లులో పొందు పరిచారు. బిల్లులోని కొన్ని కఠినమైన చర్యలను జోషి, సంత్‌సింగ్, బెనర్జీవంటి వారు వ్యతిరేకించారు. కాని యామిన్‌ఖాన్‌వంటి వారు, బిల్లును సమర్థించారు. ఓటింగ్ జరుపకుండానే సభవారు బిల్లును ఆమోదించారు.

అప్పటికి భారతదేశ చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమైంది.

## రెఫరెన్సులు


1. హిందూ, 9. అక్టోబరు 1934
2. ఇబిడ్.
3. ఇబిడ్., 2, అక్టోబరు 1934
4. యన్. జి. రంగా, ఫైట్ ఫర్ ఫ్రీడమ్ (కొత్త ఢిల్లీ, 1968), పే. 178-84, శ్యామసుందర్ అండ్ సావిత్రి శ్యామ్, పొలిటికల్ లైఫ్ ఆఫ్ పండిత గోవింద వల్లభ పంత్ (లక్నో, 1960) వా. 1, పే. 167-71
5. రంగ, యన్. 4, పే. 180
6. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1935, పే. 50
7. ఇబిడ్., పే. 62—66
8. ఇబిడ్., పే. 67
9. ఇబిడ్., పే. 70-73
10. ఇబిడ్., పే. 86-88
11. ఇబిడ్., పే. 89-90
12. సి. హెచ్. ఫిలిప్స్ ఎడ్., ది ఎవొల్యూషన్ ఆఫ్ ఇండియా అండ్ పాకిస్తాన్ 1858-1940. సెలెక్ట్ డాక్యుమెంట్స్ (లండన్, 1962) పే. 308-313
13. బాల్డ్విన్ రేడియో ప్రసంగం, 5 ఫిబ్రవరి 1935; ఆర్. పామెదత్, ఇండియా టుడే (బొంబాయి 1949) పే. 463-4
14. డి. చక్రవర్తి అండ్ సి. భట్టాచార్య; కాంగ్రెస్ ఇన్ ఎవొల్యూషన్; ఎ కలెక్షన్ ఆఫ్ కాంగ్రెస్ రెసొల్యూషన్స్ ఫ్రమ్ 1885-1934 (కలకత్తా యన్. డి) పే. 32-33
15. ఇండియన్ అన్యువల్ రిజిస్టర్ వా. 2, 1934, పే. 273
16. ఇబిడ్., పే. 311
17. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1935, పే. 266-72
18. ఇబిడ్., పే. 276-80
19. ఇబిడ్., పే. 318-25
20. ఇబిడ్., పే. 299-302
21. ఇబిడ్., పే. 536-41

22. ఇబిడ్., పే. 312
23. ఇబిడ్., పే. 274-6
24. ఇబిడ్., పే. 505-11
25. ఇబిడ్., పే. 305-09
26. ఇబిడ్., పే. 543-6
27. ఇబిడ్., పే. 465-8
28. ఇబిడ్., పే. 458-61
29. ఇబిడ్., పే. 547-50
30. ఇబిడ్., పే. 567-79
31. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 13, 1935 పే. 2741-2
32. కేట్. ఎల్. మిచెల్, ఇండియా విత్ ఔట్ ఫేబుల్ (న్యూయార్క్, 1942) పే. 197
33. ఎ. బి. కీత్, ఎ కాన్‌స్టిట్యూషనల్ హిస్టరీ ఆఫ్ ఇండియా; 1600-1935 (లండన్, 1936), పే. 474
35. బి. శివరావు: ది ఫ్రేమింగ్ ఆఫ్ ఇండియాస్ కాన్‌స్టిట్యూషన్: సెలెక్ట్ డాకుమెంట్స్ (కొత్త ఢిల్లీ, 1966) వా. 1. పే. 80
36. రిజినల్డ్ కప్‌లాండ్, ఇండియా: ఎ రీ స్టేట్‌మెంట్ (లండన్ 1945), పే. 153
37. పట్టాభి సీతారామయ్య: ది హిస్టరీ ఆఫ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (బొంబాయి, 1947) వా. 2, పే. 38-40
38. అర్. పామెదత్, యన్. 13, పే. 48
39. కప్‌లాండ్, యన్. 36, పే. 154
40. ఇబిడ్., పే. 179-82
41. ఇబిడ్., పే. 183-4
42. శివరావు, యన్. 35, పే. 86-92
43. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 5, 1937, పే. 1889-91
44. ఇబిడ్., పే. 1900-01
45. ఇబిడ్., పే. 1929-30

46. ఇబిడ్., పే. 1914–15
47. ఇబిడ్., పే. 1932–4
48. ఇబిడ్., పే. 1905–07
49. ఇబిడ్., పే. 1924–7
50. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ , వా.1, 135, పే. 405–06
51. ఇబిడ్., పే. 388–95
52. ఇబిడ్., వా. 2, పే. 1924–5
53. ఇబిడ్., పే. 1941–2
54. పి. కోదండరావు ; ది రైట్ ఆనరబుల్ వి. యస్. శ్రీనివాస శాస్త్రి : ఎ పొలిటికల్ బయోగ్రఫీ (బొంబాయి, 1963) పే. 143–57
55. కప్లాండ్, యన్. 36, పే. 157
56. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1935, పే. 156
57. ఇబిడ్., పే. 159–65
58. ఇబిడ్., పే. 164–9
59. ఇబిడ్., పే. 191–3
60. స్పీచెస్ ఆఫ్ భూలభాయిదేశాయి : 1934–39, (మద్రాసు, 1938) పే. 119–36
61 లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, యన్. 56, పే. 223–6
62. ఇబిడ్., వా. 3, 1939, పే. 2987
63. జాన్‌గ్లెన్‌డొవన్, ది వైస్‌రాయ్ ఎట్ బే : లార్డ్ లిన్‌లిత్‌గో ఇన్ ఇండియా 1936–1943 (లండన్, 1971) పే. 123–4
64. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 6, 1936, పే. 316–19
65. ఇబిడ్., పే. 328–30
66. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, 1938, పే. 1502–09
67. స్పీచ్ ఆఫ్ దేశాయి, యన్. 60, పే. 573–80
68. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1938, పే. 378–80
69. ఇబిడ్., పే. 382–8

70. ఇబిడ్., పే. 660–62
71. ఇబిడ్., వా. 2, 1935, పే. 1045-47
72. ఇబిడ్., వా. 2, 1939, పే 1209
73. ఇబిడ్., వా. 2, 1937, పే. 986
74. జి. యస్. భార్గవ, వి. వి. గిరి (బొంబాయి, 1969) పే. 30–32, 40
75. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1936, పే. 516–17
76. ఇబిడ్., పే. 674
77. ఇబిడ్., వా. 9, 1936, పే. 3104–10
78. ఇబిడ్., పే. 3111-12
79. ఇబిడ్., పే. 3117
80. ఇబిడ్., పే. 3120
81. ఇబిడ్., వా. 1, 1938, పే. 345
82. కవ్‌లాండ్, యన్. 36, పే. 161
83. గ్లన్‌డోవన్, యన్. 63, పే. 151
84. ఫిలిప్స్, యన్. 12, పే. 350
85. లిన్‌లిత్‌గో టు జెట్‌లాండ్, 27 ఫిబ్రవరి 1940 సి. ఎచ్. ఫిలిప్స్ అండ్ మేరీ డొరీన్ వెయిన్ రైట్ ఎడిటర్స్ ది పార్టిషను అఫ్ ఇండియా: పొలిటిక్స్ అండ్ పర్స్పెక్టివ్స్ 1935-1947 (లండన్, 1970) పే. 83
86. అర్. జె. మూర్, బ్రిటిష్ పాలసీ అండ్ ది ఇండియన్ ప్రాబ్లెమ్ 1936-40, ఫిలిప్స్, యన్. 85, పే. 79-85

## ఏడవ అధ్యాయము

# యుద్ధమూ - శాసనసభ
# (1939 - 1945)

### యుద్ధము - భారత రాజకీయాలు

భారతదేశం, జర్మనీమీద యుద్ధం ప్రకటించినట్టు వైస్‌రాయ్ 1939 సెప్టెంబరు 3వ తేదీన ప్రకటించారు. భారత నాయకులతో సంప్రతించడంగాని కేంద్ర శాసన సభలో దీనిని గురించి ప్రస్తావించడంగాని లేకుండానే ఇది జరిగింది. దీనితో భారత దేశమంతటా నిరసన వ్యక్తమైంది. తన తప్పును సరిదిద్దుకోవడానికే అన్నట్టు వైస్‌రాయ్ వెంటనే, గాంధీజీని ఇతర భారత నాయకులనూ సంప్రదింపులకోసం ఢిల్లీ ఆహ్వానించారు. గాంధీజీ సెప్టెంబరు 4వ తేదీన వైస్‌రాయ్‌ని కలుసుకున్నారు. ఇంటర్వ్యూనుంచి, ఆయన "రిక్తహస్తాలతో ఎటువంటి ఒప్పందమూ లేకుండానే" తిరిగి వచ్చారు. అయితే గాంధీజీ "మతభేదాలకు బ్రిటిషువారే కారణమ"ని మాత్రం చెప్పి వచ్చారు.[1]

వైస్‌రాయ్, జిన్నానుకూడా అదేరోజున కలుసుకున్నారు. పంజాబు ముఖ్యమంత్రి సికందర్ హైయత్‌ఖాన్ అతంకుముందే హెచ్చరించినా, వైస్‌రాయ్ మాత్రం జిన్నా విషయంలో ఓటమి వహించాలని నిశ్చయించుకున్నారు. "జిన్నాను సంతృప్తిపరచేందుకు ఎటువంటి చర్య తీసుకోరాదనీ అతనితో వ్యవహరించడం మరింత కష్టతరం చేయవద్ద"నీ సికందర్‌ఖాను వైస్‌రాయిని హెచ్చరించారు. వైస్‌రాయి, గాంధీజీకి చెప్పినట్టుగానే జిన్నాకుకూడా "యుద్ధంవల్ల, 1935వ సంవత్సరపు రాజ్యాంగంలోని ఫెడరల్ పథకాన్ని ప్రవేశపెట్టే కృషికి అంతరాయం కలిగింద"ని చెప్పారు. తమ అనుయాయులకు చెప్పేందుకు వీలైతే రాజ్యాంగాన్ని పూర్తిగా పునర్వ్యవస్థీకరించే విషయమై తమకేమైనా హామీ లివ్వవలసిందని జిన్నా వైస్‌రాయిని కోరారు. కాంగ్రెసు మంత్రిమండలులను పదవినుంచి తొలగించాలని కోరుతున్నారా అని లిన్‌లిత్‌గో అడిగినపుడు "అవును, వారిని వెంటనే తొలగించండి. దానితో వారికి తెలివి వస్తుంది"[2] అన్నారు జిన్నా. భారతదేశంలో ప్రజాస్వామ్యంలో తమకు విశ్వాసం లేదంటూ

జిన్నా ప్రకటనచేయటంలో అర్థమేమిటని వైస్‌రాయి అడిగారు. ప్రజాస్వామ్యంద్వారా కాకపోతే భారతదేశానికి స్వపరిపాలన ఏవిధంగా వస్తుందని వైస్‌రాయి ప్రశ్నించారు. విభజన ఒక్కటే మార్గమని జిన్నా సమాధానం చెప్పారు.[3] దేశాన్ని విభజించాలన్న తమ మతపరమైన కోర్కెను సాధించుకునేందుకు బ్రిటిషు వారికి సన్నిహితమయేందుకు గాను జిన్నా ముందు సంవత్సరాల్లో అనుసరించబోయే విధానాన్ని ఈ ఇంటర్వ్యూ సూచించింది. బ్రిటిషువారుకూడా జిన్నాకు సహాయం చేసేందుకు ఎంతో ఆతురత పడు తున్నట్టు వైస్‌రాయి, నెలరోజుల తర్వాత జిన్నాను కలుసుకున్నపుడు జరిగిన చర్చల వల్ల తెలిసిపోయింది.

వైస్‌రాయి అక్టోబరు 5వ తేదీన జిన్నాను కలుసుకున్నపుడు, జిన్నా అంతకు ముందుకంటె సుముఖంగా కనిపించారు. ముస్లింలందరినీ ఏకంగా ఉంచేట్టు చేయ డంలో తమకు సహాయం చేసినందుకు జిన్నా వైస్‌రాయికి కృతజ్ఞత తెలియచేశారు. ముస్లింల అభిప్రాయాన్ని పూర్తిగా సమర్థంగా వ్యక్తంచేయడం దేశ ప్రయోజనాల దృష్ట్యా మంచిదని లిన్‌లిత్‌గో సమాధానం చెప్పారు.[4]

ముస్లింలీగ్ బలహీనంగా వున్నట్టు 1937 ఎన్నికలవల్ల తెలిసిన పంజాబు, బెంగాల్ లలో ముస్లింలీగ్‌ను పటిష్టం చేసేందుకు వైస్‌రాయి, జిన్నాకు సహాయం చేసినట్టు దీని వల్ల తెలిసింది.

ఈలోగా కాంగ్రెసు కార్యవర్గం సెప్టెంబరు 14వ తేదీన సమావేశమై పోలెండుపై నాజీ దాడిని గట్టిగా గర్హించింది. దాన్ని ప్రతిఘటిస్తున్నవారిపట్ల తమ సానుభూతిని వ్యక్తపరిచింది. గ్రేట్ బ్రిటను, ప్రజాస్వామ్య పరిరక్షణకూ విస్తరణకూ పోరాడు తున్నట్టయితే, మొదట తమ ఆధీనంలోవున్న ప్రాంతాల్లో సామ్రాజ్యవాదాన్ని తుద ముట్టించాలనీ భారతదేశంలో పూర్తి ప్రజాస్వామ్యాన్ని ఏర్పాటు చేయాలనీ భారతీయులు బయటివారి జోక్యంలేకుండా రాజ్యాంగ నిర్ణయసభ ద్వారా, తమ రాజ్యాంగాన్ని తామే రూపొందించుకునే వీలు కల్పించాలనీ కోరింది. స్వతంత్ర ప్రజాస్వామ్య భారతదేశం, ఇతర స్వతంత్ర దేశాలతో దురాక్రమణ జరిగిన సందర్భాల్లో పరస్పర రక్షణకూ ఆర్థిక సహకారానికి ఎంతో సంతోషంగా అంగీకరిస్తుందనికూడా కార్యవర్గం పేర్కొంది. ప్రజాస్వామ్యమూ — సామ్రాజ్యవాదతత్వమూ - వీటికి సంబంధించి తమ యుద్ధలక్ష్యా లను బ్రిటిషు ప్రభుత్వం స్పష్టంగా పేర్కొనాలని కార్యవర్గం కోరింది. భారతదేశానికి సంబంధించినంతవరకు ఈ లక్ష్యాలను ఏ విధంగా అమలు జరుపబోతున్నదీకూడా తెలియ చేయాలని కోరింది. ప్రభుత్వం, తన యుద్ధ లక్ష్యాలను పూర్తిగా వివరించేవరకు యుద్ధ ప్రయత్నాలకు తమ సహకారానికి సంబంధించి కార్యవర్గం తన తుది నిర్ణయాన్ని వాయిదావేసింది.

వైస్రాయి అక్టోబరు 17వ తేదీన ఒక ప్రకటనచేస్తూ, బ్రిటిషు ప్రభుత్వ యుద్ధ లక్ష్యాలను అస్పష్టంగా పేర్కొన్నారు. దురాక్రమణను ప్రతిఘటించి ప్రపంచంలో శాంతిని నెలకొల్పేందుకు బ్రిటిషువారు పోరాటం జరుపుతున్నట్లు ఆయన పేర్కొన్నారు. భారతదేశానికి సంబంధించినంత వరకు, భారత – బ్రిటన్‌ల మధ్య సహకారాన్ని పెంపొందించి, భారతదేశం, డొమినియన్లలో తన స్థానాన్ని ఆక్రమించేట్టు చూడడమే బ్రిటిషు ప్రభుత్వ లక్ష్యమని చెప్పారు. యుద్ధం ముగిసిన తర్వాత, 1935వ సంవత్సరపు చట్టంలో అవసరమయే మార్పులు చేసేందుకు బ్రిటిషు ప్రభుత్వం, వివిధ మతాలవారి ప్రతినిధులతోనూ, పార్టీల ప్రతినిధులతోనూ, సంస్థానాధీశుల ప్రతినిధులతోనూ సంప్రదింపులు జరుపుతుందని తెలియచేశారు. ప్రస్తుతానికి యుద్ధానికి సంబంధించి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకునేందుకు బ్రిటిషు ఇండియాలోని పెద్ద పార్టీల ప్రతినిధులతోనూ సంస్థానాధీశుల ప్రతినిధులతోనూ వైస్రాయి సంప్రదింపుల బృందాన్ని ఏర్పాటు చేస్తారు.

వైస్రాయి ప్రకటన "పూర్తిగా అసంతృప్తికరంగా వుందని కాంగ్రెసు కార్యవర్గం అభిప్రాయపడింది. గ్రేట్ బ్రిటన్‌కు ఎటువంటి సహాయంచేసినా అది సామ్రాజ్యవాద తత్వాన్ని బలపరచినట్టే అవుతుంది కాబట్టి బ్రిటన్‌కు ఎటువంటి సహాయమూ చేయరాదని నిర్ణయించుకుంది. మొదటి చర్యగా కాంగ్రెసు మంత్రిమండలులన్నీ వెంటనే రాజీనామా చేయాలని కార్యవర్గం నిశ్చయించింది.

ఫలితంగా కాంగ్రెసు మంత్రిమండలులు అక్టోబరు – నవంబరు నెలల్లో రాజీనామా చేశాయి. ముస్లింలీగ్‌కు ఇది సంతోషకారణమైంది. జిన్నా ప్రోత్సాహంతో ముస్లింలీగ్, డిశంబరు 22వ తేదీన దేశమంతటా "విమోచన దినాన్ని" పాటించింది.

## యుద్ధ లక్ష్యాలు : శాసనసభలో చర్చ

శాసనసభలో 1960 మార్చి 11వ తేదీన సమావేశమైనపుడు, యుద్ధలక్ష్యాలు చర్చకు వచ్చాయి. కాంగ్రెసు ఆదేశాన్ని అనుసరించి శాసనసభలోని కాంగ్రెసు సభ్యులు శాసనసభకు హాజరుకాలేదు. కాంగ్రెసు జాతీయవాదపార్టీ నాయకులైన ఎం. ఎస్. అణే కార్యవర్గసమితి పద్ధుల్లో కోతవిధిస్తూ తీర్మానాన్ని ప్రతిపాదించారు. బ్రిటిషు ప్రభుత్వపు యుద్ధలక్ష్యాల ప్రకటనకు సంబంధించి భారత ప్రభుత్వ పాత్ర గురించి సభలో చర్చించాలని తీర్మానంలో కోరారు.

యుద్ధానికి సంబంధించి భారతప్రభుత్వం శాసనసభలో ఇంతవరకూ ఎటువంటి ప్రకటన చేయలేదని అణే పేర్కొన్నారు. వైస్రాయి సెప్టెంబరు 3వ తేదీన చేసిన ఉప

న్యాసం గురించి ప్రస్తావిస్తూ అణే, వివిధ రాజకీయ పార్టీల అభిప్రాయాలను కూడా తెలియచేశారు. ఇంగ్లాండు - భారతదేశం మధ్య వున్న రాజకీయ సంబంధాలపట్ల దేశప్రజల్లో అసంతృప్తి ప్రబలివుందనీ, ఈ సంబంధాలను వెంటనే సవరించాలని అందరూ కోరుతున్నారనీ అణే చెప్పారు. "స్వయం నిర్ణయ హక్కు ఉండాలని భారతదేశం కోరుతూవుంది. యుద్ధలక్ష్యాల గురించి బ్రిటిషు ప్రభుత్వం వివరించిన సిద్ధాంతాలు భారతదేశానికి వర్తిస్తాయా అన్నది అసలు ప్రశ్న. వర్తించనపుడు భారతీయులకు వాటితో పనిలేదు" అన్నారు అణే. భారతదేశమంతా ఒకే జాతి అనీ దాన్ని విభజించడానికి వీలులేదనీ అన్న సూత్రానికి బ్రిటిషు ప్రభుత్వం 1935వ సంవత్సరపు చట్టంద్వారా కట్టుబడివుందని అణే గుర్తుచేశారు. మతపరమైన తీర్పుల పేరుతో స్వప్రయోజనపరులైన రాజకీయ వర్గాలను సృష్టించడం, భారతదేశమంతా ఒకేజాతి అన్న సిద్ధాంతానికి పూర్తిగా విరుద్ధమని ప్రభుత్వం గుర్తించడం మంచిదని ఆయన గుర్తుచేశారు.5 అఖిలచంద్రదత్త, పి. ఎన్. బెనర్జీ, కృష్ణకాంత మాలవ్యా అణేను సమర్థించారు. యుద్ధభారాన్ని మోయవలసిందని భారతదేశాన్ని కోరేముందు, భారతదేశం స్వతంత్ర మవుతుందా కాదా అన్న విషయాన్ని స్పష్టం చేయాలని మాలవ్యా కోరారు.

యామిన్‌ఖాన్ ముస్లింలీగ్ అభిప్రాయాన్ని తెల్పుతూ కోత తీర్మానాన్ని వ్యతిరేకించారు. యూరోపులో దురాక్రమణ జరిగినపుడు బ్రిటిషు ప్రభుత్వం జాప్యం చేయజాలదని ఆయన చెప్పారు. "భారతదేశాన్ని సంప్రదించలేదని అనడం, చిన్నపాకుతో సభా కార్యక్రమాలకు హాజరు కాకుండా ఉండాలని అనుకుంటున్న వారి వాదన మాత్రమే" కాంగ్రెసువారు కోరుతున్న స్వయంనిర్ణయ హక్కు అన్నది, భారతదేశానికంతటికీ స్వయం నిర్ణయ హక్కు ఎన్నటికీ కాజాలదని ఆయన చెప్పారు. సంఖ్యలో పెద్దదైన కాంగ్రెసు, బ్రిటిషు ప్రభుత్వానికి ఆదేశాలు జారీచేసి, సంఖ్యలో తక్కువగా ఉన్నవారిని అణిచివేయాలని చూస్తూవుందని అన్నారు. సంఖ్యలో ముస్లింలు తక్కువగా ఉన్నా రాజకీయంగాకూడా అల్పసంఖ్యాకులన్న ప్రతిపాదనకు వారు ఎప్పుడూ అంగీకరించబోరని యామిన్‌ఖాన్ అన్నారు.6

ఖాన్ వాదనలను సర్ సయ్యద్ రజా అలీ సమర్థించారు. కాంగ్రెసు జాతీయవాద పార్టీ సభ్యులు, కాంగ్రెసుపార్టీ వినాదాలను వల్లిస్తున్నందుకు ఆయన హేళన చేశారు. ప్రభుత్వం కాంగ్రెసుతో విభేదాలను సర్దుకుని "మా సంగతే పూర్తిగా విస్మరించవచ్చు" నన్న భయాన్ని ఆయన వ్యక్తపరిచారు. అటువంటి ధోరణే వున్నట్టయితే ప్రమాదమని ఆయన ముస్లింలీగ్ తరపున, ప్రభుత్వాన్ని ఈవిధంగా హెచ్చరించారు.

రాజ్యాంగ నిర్ణయసభ విషయమై కాంగ్రెసుతో రాజీ కుదుర్చుకుని, సమాధానపడినట్లయితే, ముస్లింలీగ్‌కు చెందిన మేము, కాంగ్రెసు-జాతీయవాద కాంగ్రెసు-ప్రభుత్వమూ ఈ మూడింటి ప్రయత్నాలనూ అన్ని విధాలా వమ్ముచేయడానికి ప్రయత్నిస్తాం". 7

ఈవిధంగా రెండు పక్షాలూ పూర్తిగా విడిపోయాయి. అదే తీర్మానం మీద ఓటింగ్ జరిగినపుడు 54 ఓట్లతో వీగిపోయింది. అనుకూలంగా 10 ఓట్లు మాత్రమే పడ్డాయి.

## పాకిస్తాన్ కావాలని కోరడం

ఆ వెంటనే కాంగ్రెసు, రామ్‌గర్‌లో మార్చి 19-20 తేదీలలో సమావేశమై, బ్రిటిషు ప్రభుత్వపు అసంతృప్తికరమైన ప్రకటన దృష్ట్యా, యుద్ధ కృషిలో కాంగ్రెసు సహకరించజాలదని నిశ్చయించారు. స్వాతంత్ర్యమూ రాజ్యాంగ నిర్ణయసభ కావాలని మళ్ళీ కోరారు. సత్యాగ్రహం నిర్వహించేందుకు ఏర్పాట్లు చేయవలసిందని కాంగ్రెసు తన సంఘాలను కోరింది. గాంధీజీని, ఉద్యమానికి నాయకులుగా నియమించింది.

మరొక వైపున ముస్లింలీగ్, మార్చి 23 వ తేదీన లాహోర్‌లో సమావేశమై "భౌగోళిక పరమైన ప్రాంతాలను ప్రాంతీయ సర్దుబాట్లతో నిర్దేశించాలనీ, ముస్లింలు అధిక సంఖ్యలో వున్న వాయవ్య పరిహద్దు ప్రాంతమూ తూర్పు ప్రాంతం వంటి ప్రాంతాలను, స్వతంత్ర రాష్ట్రాలుగా పునర్వ్యవస్థీకరించాలనీ వాటికి స్వపరిపాలనా ప్రతిపత్తి సర్వంసహాధికారమూ ఉండాలనీ" ఈ సిద్ధాంతం ప్రాతిపదికగా రూపొందించే రాజ్యాంగ పథకాన్ని తప్ప మరే పథకాన్నీ ముస్లింలీగ్ ఆమోదించరాదని తీర్మానించారు.8

## ప్రతిష్టంభనకు కాంగ్రెసు పరిష్కారం

మూడు నెలల తర్వాత జులైలో కాంగ్రెసు భారత రాజకీయ పరిస్థితిలో ఏర్పడిన ప్రతిష్టంభన పరిష్కారానికి రెండు షరతులను పెట్టింది. భారతదేశానికి పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వాలన్న సంగతిని గ్రేట్ బ్రిటన్ గుర్తిస్తూ వెంటనే స్పష్టంగా ఒక ప్రకటన చేయడం ఒకటి. రెండవది, మొదటి చర్యగా వెంటనే కేంద్రంలో ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం. అటు వంటి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడం తాత్కాలిక చర్యే అయినా, కేంద్ర శాసనసభలోని ఎన్నికైన సభ్యుల విశ్వాసాన్ని చూరగొనేదిగా వుండాలనీ, రాష్ట్రాల్లోని బాధ్యతాయుత ప్రభుత్వాల సహకారాన్ని పొంద కలిగేదిగా ఉండాలనీ కోరారు. ఈ చర్యలను అమలు జరిపినట్లయితే కాంగ్రెసు, దేశ రక్షణకు పటిష్టమైన వ్యవస్థను ఏర్పాటు చేయడంలో తన పూర్తి బలాన్ని వినియో

గిస్తుంది. 9 నెలాఖరులో పూనాలో జరిగిన ఎ. ఐ. సి. సి. సమావేశం ఈ నిర్ణయాలను బలపరిచింది.

## వైస్‌రాయి ప్రకటన

యుద్ధ పరిస్థితి అంతకంతకూ తీవ్రమవుతున్న దృష్ట్యా గవర్నర్ జనరల్ 1940 ఆగస్టు 8 వ తేదీన మరొక ప్రకటన చేశారు. "యుద్ధం ముగిసిన తర్వాత ఎటువంటి జాప్యమూ లేకుండా, కొత్త రాజ్యాంగ రూపకల్పనకు, భారత ప్రజా జీవితంలోని ప్రధానవర్గాల ప్రతినిధులతో ఒక సంస్థ ఏర్పాటుకు బ్రిటిషు ప్రభుత్వం ఎంతో సంతోషంతో అంగీకరిస్తుందని" ఆయన ప్రకటించారు. రాజ్యాంగ నిర్ణయసభను ఏర్పాటు చేయాలన్న కాంగ్రెసు కోరికకు ఇది బ్రిటిషు ప్రభుత్వ సమాధానమన్నమాట. అయితే అధికారాన్ని బదలాయించేందుకుద్దేశించిన ఎటువంటి పథకంలోనైనా ఒక ముఖ్యమైన అంశం వుంటుంది. "భారతీయ ప్రజాజీవితంలోని ఎక్కువ మందికి, శక్తివంతమైన వర్గాలకు అధికారం లేకుండా వుండే ఎటువంటి ప్రభుత్వ వ్యవస్థకైనా బాధ్యతలను అప్పగించేందుకు బ్రిటిషు ప్రభుత్వం అంగీకరించజాలదు. అటువంటి వర్గాలు అటువంటి ప్రభుత్వానికి విధేయులుగా ఉండేట్టు బలవంత పెట్టజాలదు కూడా". తమ ఆమోదం లేకుండా భారతదేశంలో ఎటువంటి రాజ్యాంగాన్నీ రూపొందించరాదన్న ముస్లింలీగ్ వాదనకు పూర్తిగా అంగీకరించినట్టయింది.

భారత రాజకీయ పార్టీల్లోని విభేదాల మూలంగా, గవర్నర్ జనరల్ కార్యవర్గ సమితిని విస్తరించడాన్ని ఇక మీద ఏ మాత్రం వాయిదా వేయరాదని బ్రిటిషు ప్రభుత్వం భావిస్తున్నట్టు కూడా వైస్‌రాయ్ ప్రకటించారు. దీనికి అనుగుణంగా, కార్యవర్గ సమితిలో సభ్యులుగా ఉండేందుకు కొంతమంది భారతీయ ప్రతినిధులను ఆహ్వానించేందుకు ఆయనకు అధికారమిచ్చారు. సంస్థానాల ప్రతినిధులతోనూ, ఇతరవర్గాల ప్రతినిధులతోనూ యుద్ధ విషయాల సలహా సమితిని ఏర్పాటు చేసేందుకు కూడా ఆయనకు అధికారం లభించింది. 10

ఆగస్టు ప్రకటన, కాంగ్రెసుకు ఆమోదయోగ్యంగాలేదని స్పష్టంగా తెలిసిపోయింది. తమ ఆమోదంలేనిదే రాజ్యాంగ పరమైన పురోగతి వుండబోదని తెలిసి ముస్లింలీగ్ సంతోషించింది. అయినా, భారతదేశాన్ని విభజించాలన్న ప్రతిపాదనను ఆమోదించక పోవడంతో వారికి కొంత అసంతృప్తిగానే వుంది. కాంగ్రెసు, తన తీర్మానానికి అనుగుణంగా గాంధీజీ నాయకత్వంలో అక్టోబరు 17 వ తేదీన వ్యక్తిగత పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ప్రారంభించింది.

**శాసనసభలో జిన్నా కొత్త వైఖరి**

ఈ పరిస్థితిలో నవంబరులో శాసనసభలో ఒకముఖ్యమైన చర్చ జరిగింది. కాంగ్రెసు సభ్యులు, కార్యవర్గం అనుమతితో ఆర్థిక బిల్లును తిరస్కరించేందుకు సమావేశానికి హాజరయ్యారు. కొంతకాలంగా సభ కార్యక్రమాల్లో అంత ఆసక్తి కనబరచకుండా వున్న జిన్నా కూడా ఈ సందర్భంలో సభలో వున్నారు.

సత్యమూర్తి, బిల్లును ప్రతిఘటించడం ప్రారంభించారు. "భారతదేశంలో అంతా సవ్యంగా వుందనీ యుద్ధ కృషిలో భారతదేశం మనస్ఫూర్తిగా పాల్గొంటూవుందనీ ప్రపంచ దేశాల వారందరికీ చెప్పవలసిందని భారతీయులను అడగడమే ఇది" అని ఆయన చెప్పారు. భారతీయులను సంప్రదించకుండా శాసనసభ అభిప్రాయాన్ని తెలుసు కోకుండా భారతదేశాన్ని యుద్ధంలో దింపినందుకు ఆయన విమర్శించారు. "మేము అడుగుతున్నది ఒక్కటే. స్వాతంత్ర్యం ఇస్తున్నట్టు ఇప్పుడు ఇక్కడ ప్రకటించాలి, అమలు పరచడం యుద్ధం తర్వాతనే అయినా. ఈ సభలోని ప్రధాన పార్టీల ప్రతి నిధు లతో కేంద్రంలో జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలి. ఈ విధంగా ప్రకటించిన తర్వాత భారత రక్షణలో మేం సహాయపడుతాము.......కాని సమాధానమేమిటి ? తిరస్కార భావంతో మొండి చెయ్యి చూపించారు" భారతదేశం ఛిన్నా భిన్నంగా వున్నందువల్ల ప్రభుత్వ బాధ్యతలను అప్పగించడానికి వీలులేదన్న ప్రభుత్వ వాదన గురించి ప్రస్తావిస్తూ ఆయన ఈ విధంగా సమాధానం చెప్పారు. " మా గొడవలను మేము సర్దుకోగలం, సర్దుకుంటాం. మధ్యలో మీరెందుకు ? మీ రిక్కడినుంచిపోతే చాలు. మీరు ఇక్కడ గొడవ చేయకుండా వుంటే మేము మా వివాదాన్ని సర్దుకో గలం." 11

శ్రీ ప్రకాశ మాట్లాడుతూ, "యుద్ధంతో మాకేమీ సంబంధం లేదు. ఎదురుగా కూర్చుని వున్న గౌరవనీయులైన సభ్యులు, శక్తి సంపన్నులు. వారు మమ్ములను పిండవచ్చు మా రక్తాన్ని త్రాగవచ్చు, ఏమైనా చేయగలరు వారు. కాని మా హృద యాలను మాత్రం చూరగొనలేరు" తమ సహచరులైన పాలివాల్, రంగా, ముఖ్యంగా జవహర్‌లాల్‌నెహ్రూను జైల్లో పెట్టినందుకు ఆయన ప్రభుత్వాన్ని విమర్శించినపుడు సభ్యులు, సిగ్గు సిగ్గు అని అరిచారు. 12

కాంగ్రెసు వారు నాయకులకుగాని, పాసిస్టులకుగాని మిత్రులుకారని అసఫలీ ప్రభుత్వానికి హామీ ఇచ్చారు. కాని, వారు, నాజీజంను ద్వేషించినంతగా సామ్రాజ్యవాద తత్వాన్ని కూడా ద్వేషిస్తారని చెప్పారు. "భారతదేశం గత యుద్ధంలో కూడా బ్రిటిష ప్రభుత్వానికి సహాయం చేసింది. కాని ఫలితం ? జలియన్‌వాలాభాగ్‌లో రక్తపాతం,

పెషావర్‌లో మరొక రక్తపాతం, దేశమంతటా రక్తపాతం" అందువల్ల భారతదేశం స్వతంత్రదేశమయేదీలేనిదీ ఇప్పుడు ఇక్కడ ప్రకటించాలని కోరడం న్యాయమేనన్నారు అసఫలీ. "భారతదేశం ఉత్సాహంతో యుద్ధకృషిలో పాల్గొనాలని మీరు కోరుతున్నట్టయితే, భారతదేశం స్వతంత్రదేశమని ప్రకటించండి. భారతీయులు తమ స్వాతంత్ర్యపరిరక్షణకోసమూ, మీ స్వాతంత్ర్య పరిరక్షణకోసమూకూడా పోరాడుతారు. అది జరిగేవరకూ ధన సహాయానికిగాని మనిషి సహాయానికిగాని అడిగే హక్కు మీకు లేదు."13

యుద్ధసమయంలోకూడా భారతదేశంలోని ప్రధాన పరిశ్రమలను నిర్లక్ష్యం చేసినందుకు సంతాపం, భారత ప్రభుత్వాన్ని విమర్శించారు. ప్రభుత్వ ఆర్థిక విధానాన్ని వివరిస్తూ ఆయన, యుద్ధం తర్వాత ఇంగ్లాండు తన స్టర్లింగ్ విలువను తగ్గించవలసి వుంటుందని హెచ్చరించారు.

"భారతదేశం ఆర్థికంగా పూర్తిగా స్టర్లింగ్‌మీద ఆధారపడివుండాలని వారు కోరుతున్నారు. అటువంటి సందర్భంలో బ్యాంక్ ఆఫ్ ఇంగ్లాండ్ చెప్పినట్టు నడుచుకుంటే తప్ప, మేము పేదలమై పోతాము. భారతదేశం ఆర్థికంగా పూర్తిగా తమ మీద ఆధారపడి వుండేట్టు చేసేందుకు యుద్ధాన్ని ఉపయోగించుకోవాలని చూస్తున్నారు. యుద్ధం ముగిసేసరికి మమ్మలను దరిద్రులుగా చేయాలని కోరుతున్నారు."14

ఎన్. ఎమ్. జోషి మాట్లాడుతూ స్వాతంత్ర్యం లభించగలదన్న హామీ ఉండి, బ్రిటిష ప్రజలు తమ వాగ్దానాలు నిలబెట్టుకోగలరన్న సూచనలు కనిపించినట్టయితే, భారతీయులు – శ్రామికవర్గంతోసహా బ్రిటిషవారితో సహకరిస్తారనడంలో తమ కెటువంటి సందేహమూలేదని చెప్పారు.

చర్చ అయిదవరోజున భూలభాయిదేశాయి జోక్యం కల్పించుకున్నారు. భారతదేశం మీద యుద్ధాన్ని రుద్దినందుకు ఆయన గర్హించారు. ఈ విషయంలో కాంగ్రెసు వైఖరిని ఆయన ఈ విధంగా తెలిపారు.15 "ఈ యుద్ధం ప్రస్తుత పరిస్థితులను కొనసాగించేందుకు ఉద్దేశించినట్టయితే, సామ్రాజ్యవాద ప్రాంతాలనూ వలస ప్రాంతాలనూ స్వప్రయోజనాలనూ ప్రత్యేక హక్కులనూ పరిరక్షించుకునేందుకు ఉద్దేశించినట్టయితే భారతదేశానికి ఈ యుద్ధంతో ఎటువంటి సంబంధమూలేదు. ఆ విధంగా కాకుండా ప్రజాస్వామ్య పరిరక్షణకోసం ప్రజాస్వామ్యం ఆధారంగా వుండే ప్రపంచ వ్యవస్థ పరిరక్షణకోసం జరుపుతున్న యుద్ధమైనట్టయితే భారతదేశం తప్పకుండా పాల్గొంటుంది. యుద్ధ లక్ష్యాలకు సంబంధించిన ప్రకటన గురించి కాంగ్రెసు అడిగినదానికి బ్రిటిష ప్రభుత్వం ఇంతవరకు సంతృప్తికరమైన సమాధానం ఇవ్వలేదు. అంధకారాన్ని విస్తరింపచేస్తున్న

శక్తులకు వ్యతిరేకంగా జరుపుతున్న నాగరికతా యుద్ధం ఇది అని చెబుతున్నారు. భారత దేశం శాశ్వతంగా బానిసదేశంగా ఉండడమే నాగరికత అయినట్టయితే ఆ నాగరికత నా కవసరములేదు. బ్రిటిషు ప్రభుత్వ ఉద్దేశ్యం అసలు ఏమిటి ప్రజాస్వామ్యాన్ని మేమెంతో గౌరవిస్తామని బ్రిటిషువారు చెప్పుకోవడం ఉత్త బూటకం" అంటూ ఆయన ఈ విధంగా ముగించారు :

"......వారు ప్రస్తుత వైఖరిని కొనసాగించినంతకాలం, యుద్ధంలో భారతదేశం పాల్గొనేందుకు సంబంధించిన ఇటువంటి చర్యను మేము సూత్రప్రాయంగాగాని మరే విధంగాగాని సమర్థించడం కుదరదు. మిత్రదేశాలుగా మాకున్న శక్తిసామర్థ్యాలతో పోరాడగలంగాని, మరొకరి సాధనాలుగా మాత్రం కాదు"16

అణే, బిల్లును ప్రతిఘటించారు. యుద్ధానికి సభవారు నిధులను మంజూరుచేయవలసి నట్టయితే అటువంటి ఖర్చు గురించి సభవారికి పూర్తిగా తెలియచేసేందుకూ ఆ ఖర్చు మీద ఓటు చేసే హక్కు కల్పించేందుకూ వీలుకల్పిస్తూ 1935వ సంవత్సరపు చట్టాన్ని సవరించేందుకు ప్రభుత్వం సిద్ధపడాలని అణే చెప్పారు. యుద్ధాన్ని ప్రకటించేముందు శాసనసభను సంప్రదించివుంటే బాగుండేదని ఆయన వాదించారు. శాసనసభను సంప్ర దించకుండా భారత సైనికులను విదేశాలకు పంపించడాన్ని ఆయన నిరసించారు. ఇది నమ్మకద్రోహమని ఆయన పేర్కొన్నారు.

ఆ తర్వాత జిన్నా, యుద్ధం విషయంలోనూ భారతదేశం రాజ్యాంగ ప్రతిష్ఠంభన విషయంలోనూ ముస్లింలీగ్ వైఖరిని వివరించారు. "ముస్లింలీగ్‌కు సంబంధించినంత వరకు, మొదటినుంచీ మేము ప్రభుత్వానికి అవరోధంగా ఎప్పుడూ లేమని నిర్భయంగా చెప్పగలము." ప్రభుత్వం ఎప్పుడు ముందు అడుగువేసినా తాము సహకరించామనీ గాంధీజీ తిరస్కరిస్తూవచ్చారనీ జిన్నా వాదించారు.

"......ముందు మీరు 'పాకిస్తాన్' ఇచ్చేందుకు అంగీకరిస్తేతప్ప, మేము మీకు సహాయం చేయబోమని మేము ఎన్నడూ చెప్పలేదు : నన్ను విశ్వసించండి : నా మిత్రులైన కాంగ్రెసుపార్టీ సభ్యులు ఏమనుకున్నా మేము మాత్రం అదే మా అంతిమలక్ష్యం, దానికోసం మేము పోరాడుతాము, ప్రాణాలనుకూడా అర్పిస్తాము. ఈ విషయంలో ఎవరికీ ఎటువంటి సందేహాలూ ఉండనవసరంలేదు. ప్రజాస్వా మ్యం అంతరించింది- శ్రీ దేశాయి ప్రజాస్వామ్యం వంటిది. మేము సంఖ్యలో కొద్దిమంది మాత్రమే కావచ్చు, అవునుకూడా ; కాని, మేము అనుకుంటే, కాంగ్రెసుకంటే వందరెట్లు మిమ్మలను ఇబ్బందిపెట్టగలము. ఇది బెదిరింపుకాదు. మీకు తెలియడం మంచిదని చెబుతున్నాను. కాని మేము ఆ విధంగా ఇబ్బంది

పెట్టాలని అనుకోవడంలేదు. మీరు గుర్తించగలరు. ఇప్పుడుకూడా మేము ఆ విధంగా చేయాలని తలపెట్టడంలేదు. భవిష్యత్తుమాట అంటారా, ఇప్పటికి దాన్ని వదిలేద్దాం. అందువల్ల ప్రభుత్వానికి సంబంధించినంతవరకు ముస్లింలీగ్ విధానం ఇది."

జిన్నా ఆ తర్వాత రాజ్యాంగనిర్ణయసభ గురించిన కాంగ్రెసు ప్రతిపాదన గురించి ప్రస్తావిస్తూ, కాంగ్రెసు తమపార్టీ ఒక్కటే భారతీయుల ప్రతినిధి అని ఇంకా అనుకుంటూవుందని చెప్పారు.

దేశంలోని అన్ని పార్టీలవారికీ ఆమోదయోగ్యమైన ఆచరణయోగ్యమైన ప్రతిపాదన ఏదైనా వున్నట్టయితే సరైన మార్గాన్ని సరైన పద్ధతిని సరైన విధానాన్ని ఎందుకు అనుసరించడంలేదని జిన్నా, కాంగ్రెసు నాయకులను ప్రశ్నించారు. బ్రిటిషు ప్రభుత్వం తాత్కాలిక జాతీయ ప్రభుత్వం ఏర్పాటుకు వెంటనే అంగీకరించినట్టయితే, ముస్లింలీగ్, ప్రధానమంత్రిని ఎన్నిక చేసేందుకు కాంగ్రెసులోని తమ సహచరులు అంగీకరించేట్టు తాము నచ్చచెప్పగలమనీ, అటువంటి ప్రధానమంత్రి, జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయవచ్చుననీ శ్రీ రాజగోపాలచారి చేసిన ప్రకటన గురించి జిన్నా ప్రస్తావించారు. "అయితే రాజాజీ తమతో చర్చించేందుకు ప్రధానమంత్రిని కాగల నన్నెందుకు ఆహ్వానించలేదు? డెయిలీ హెరాల్డ్‌లో ఎందుకు వ్రాయవలసివచ్చింది. ఇదేనా వ్యవహరించవలసిన తీరుఅని నేను నా గౌరవనీయులైన మిత్రులను అడుగుతున్నాను."17

చివర, జిన్నా, వైస్‌రాయ్ 'ఆగస్టు ప్రకటన' గురించీ, కేంద్రంలో జాతీయ ప్రభుత్వం ఏర్పడాలన్న కాంగ్రెసు కోరిక గురించీ ప్రస్తావించారు.

"శ్రీ భూలభాయి దేశాయి తమ ఉపన్యాసంలో రెండు అంశాల గురించే ఎక్కువగా మాట్లాడారు. "ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యం, ప్రజాస్వామ్యం— జాతీయ ప్రభుత్వము", దీనివల్ల ప్రయోజనమేమిటి, మంత్రిమండలి ఎటువంటిదైనా శాసనసభకు జవాబుదారీగా వుండవలసిందే - శాసనసభలో శ్రీ భూలభాయిదేశాయికి మూడింట రెండువంతులమంది ఎన్నికైన సభ్యుల మద్దతు వుంటుంది. కాంగ్రెసు ఆదేశాలను పాటించని కాబినెట్ సభ్యుడి పరిస్థితి దయనీయమైనది."18

అసలు తీర్మానంమీద ఓటింగ్ జరిగినపుడు 55 ఓట్లతో వీగిపోయింది. అనుకూలంగా 53 ఓట్లు మాత్రమే వచ్చాయి. ప్రభుత్వానికి ఇది పెద్ద ఓటమే.

### అట్లాంటిక్ ప్రణాళికల గురించి శాసనసభలో చర్చ

1941లో కేంద్ర శాసనసభ ఆకులురాలు సమావేశంలో, బ్రిటిషు ప్రభుత్వపు యుద్ధ

లక్ష్యాలు మళ్ళీ ప్రస్తావనకు వచ్చాయి. 1941 ఆగష్టు నెలలో కుదిరిన అట్లాంటిక్ ప్రణాళికలో "అన్ని దేశాల ప్రజలకూ తమకు ఎటువంటి ప్రభుత్వంఉండాలో నిర్ణయించే హక్కు వుండాలనీ" సర్వంసహాధికారమూ స్వపరిపాలనా లేకుండాపోయిన ప్రజలకు అవి మళ్ళీ సంక్రమించాలనీ బ్రిటన్ - అమెరికా కోరుతున్నట్టు పేర్కొన్నారు.19 అయితే చర్చిల్ కామన్సుసభలో సెప్టెంబరు 9వ తేదీ చేసిన ఉపన్యాసం నిరుత్సాహ పరచింది. అట్లాంటిక్ ప్రణాళికలో పేర్కొన్న స్వపరిపాలనా సిద్ధాంతం, నాజీ ఆక్రమణలో వున్న యూరోపు దేశాలకు వర్తిస్తుందనీ బ్రిటిషు సామ్రాజ్యంలోని ప్రాంతాల్లో స్వపరిపాలన ఏర్పడడమన్నది పూర్తిగా భిన్నమైన సమస్య అనీ చర్చిల్ పేర్కొన్నారు.20

అట్లాంటిక్ ప్రణాళిక భారతదేశానికికూడా వర్తించేట్టు వెంటనే చర్యలు తీసుకోవల సిందని ప్రభుత్వానికి శిఫార్సుచేస్తూ రషీద్‌చౌధురి అక్టోబరు 29వ తేదీన ఒకతీర్మానాన్ని ప్రతిపాదించారు. ప్రణాళికమీద రూజ్‌వెల్ట్ సంతకం చేసినందువల్ల భారతీయులు ఎంతో ఆశతో ఎదురుచూసినట్టు శ్రీ చౌధురి చెప్పారు. "ప్రణాళిక, భారతదేశానికి వర్తించదని బ్రిటిషు ప్రధానమంత్రి ఆ తర్వాత చెప్పారు. శత్రువు వాకిటదాకా వచ్చాడు. భారతదేశంలో పరిస్థితి తీవ్రంగా వుంది. బ్రిటిషువారు పట్టించుకోకుండా వుండ గలరు. ఇప్పటికే భారతదేశంనుంచి ఎంతో పొందారు. దానితో తృప్తిపడి ఊరుకో గలరు. మేము మాత్రం ప్రస్తుత పరిస్థితితో తృప్తిపడి ఊరుకోజాలము. బ్రిటిషు వారు వైదొలగడంతో భారతదేశంలో బానిసత్వం అంతమొందాలని మేము కృతనిశ్చ యంతో వున్నాము......"21

నాగపూర్‌కు చెందిన గోవింద దేశ్‌ముఖ్ తీర్మానాన్ని సమర్థించారు. "ప్రణాళికతో భారతదేశానికి ఎటువంటి సంబంధమూ వుండరాదని బ్రిటన్ భావించినట్టయితే, మా సహాయం పొందడం ఎందుకు ?" అని ఆయన ప్రశ్నించారు. చర్చిల్ వివరణను లాల్‌చంద్‌నవల్‌రాయ్, "తరువాత తోచిన కపటమైన వివరణ" అని వర్ణించారు. అట్లాంటిక్ ప్రకటనలోని అంశాలు అన్ని దేశాలకూ వర్తిస్తాయనీ, వాటిని అమలు పరచాలన్నదే ప్రణాళిక ఉద్దేశ్యమనీ అమెరికాకు చెందిన కార్డెల్‌హల్ ప్రకటించడాన్ని ఆయన పేర్కొన్నారు. అన్ని దేశాలలోని అన్ని జాతులవారికీ స్వయంనిర్ణయహక్కు ఉండాలని ప్రణాళికలు విస్పష్టంగా పేర్కొన్నట్టు జమునాదాస్ మెహతా చెప్పారు. ఎంతో పవిత్రమైన సందర్భంలో పెట్టిన సంతకాన్ని బ్రిటిషు ప్రభుత్వం ఇప్పుడు చర్చిల్ ఉపన్యాసంద్వారా ఖండించిందని ఆయన పేర్కొన్నారు. ప్రణాళికను త్రోసిపుచ్చిన తర్వాత భారతదేశానికి మిగిలినది, బ్రిటిషు ప్రభుత్వపు "ఆగష్టు ప్రకటన" "స్వప్రయో

జన పరులకు పీటోచేసే అధికారమూ దేశ పురోభివృద్ధికి అవరోధంగా వుండే మధ్య యుగంనాటి భూస్వామ్య వ్యవస్థకూ మతవాదతత్వానికి ప్రోత్సాహమూ లభించే ఈ బానిసత్వ ప్రకటన ఒకటే భారతీయులకు మిగిలింది."22

అహ్మద్‌కాజ్‌మి, బ్రిటిషు అధికారులూ భారత ప్రభుత్వమూ చేసిన వాగ్దానాలనూ వాటిని నిలబెట్టుకోకపోవడాన్నీ గుర్తుచేశారు: "బ్రిటిషు వారు భారత ప్రభుత్వాన్ని కపట నాటకంద్వారా సాగిస్తున్నా రనడంలో అసత్యంలేదు." భారతదేశంలో రాజ్యాంగఉన్నతికి సంబంధించి బ్రిటిషు ప్రభుత్వమూ భారత ప్రభుత్వమూ అనుసరించిన విధానాన్ని ఆయన గర్హించారు. భారతీయులు స్వశక్తిమీద ఆధారపడవలసిందేనని ఆయన విజ్ఞప్తి చేశారు.23

ప్రభుత్వ వాదనను వివరించే బాధ్యత అణే మీద పడింది. ఆయనా మరో నలుగురు భారతీయులూ గవర్నర్ జనరల్‌యొక్క కార్యవర్గ సమితికి జూలై 22వ తేదీన ఎన్నికయారు. ఈ నియామకానికిముందు అణే శాసనసభలో కాంగ్రెసు జాతీయవాద పార్టీ నాయకులుగానూ, భారత ప్రభుత్వ విమర్శకుల్లో ఒకరుగానూ వ్యవహరించారు. ఇప్పుడు ఆయన సభా నాయకులు కావడంతో సభ్యులు ముఖ్యంగా అధికారేతర భారతీయ సభ్యులు, ఆయన అభిప్రాయాలు ఏవిధంగా వుంటాయోనని ఆసక్తితో ఎదురు చూశారు.

భారతప్రభుత్వం, అట్లాంటిక్ ప్రణాళికలో భాగస్వామికాదని అణే చెప్పారు. "ప్రణాళికమీద సంతకాలు చేసినవారు మాత్రమే, తాము ఏ ఉద్దేశ్యంతో సంతకాలు చేశారో చెప్పగలరని" ఆయన అన్నారు. చర్చిల్ అధికారరీత్యా చేసిన ప్రకటన గురించి ప్రస్తావిస్తూ ఆయన, "... సంతకాలు చేసినవారు, యుద్ధంలో స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన దేశాల గురించి ప్రస్తావించి వుండవచ్చు. ఇది నా అభిప్రాయం. ప్రణాళికను భారతదేశానికి వర్తింపచేసినాకూడా దానివల్ల పెద్ద లాభమేమీ వుండివుండదు. ఎందువల్లనంటే, భారతదేశానికి ఇదివరలోచేసిన వాగ్దానం దృష్ట్యా అవసరమైన మార్పులతో మాత్రమే దాన్ని అమలుపరచివుండేవారు" అంటూ అణే సభ్యుల అభిప్రాయాలను అధికార్లకు తెలియచేసేందుకు చర్చ వివరాలన్నిటినీ తగిన అధికార్లకు పంపుతామని వాగ్దానం చేశారు.24

ఓటింగ్ జరపకుండానే సభవారు తీర్మానాన్ని ఆమోదించారు. ముస్లింలీగ్ సభ్యులు గవర్నర్ జనరల్‌యొక్క కార్యవర్గ సమితిని విస్తృతపరచిన విధానానికి దేశరక్షణ సమితిని ఏర్పాటుచేసిన విధానానికి నిరసనగా అక్టోబరు 28వ తేదీనుంచి శాసనసభ కార్య కలాపాలకు హాజరుకావడంలేదు.

## క్రిప్స్ మిషన్ - క్విట్ ఇండియా ఉద్యమం

ఈలోగా 1941 మే నెలనాటికి జైళ్ళలో సత్యాగ్రహుల సంఖ్య 14 వేలకు

మించింది. శాసనసభలో ఎన్. ఎమ్. జోషి, దత్త, బెనర్జి, సంత్ సింగ్, రషీద్ చౌధురి, అహ్మద్ కాజ్మి వంటి సభ్యులు, ప్రభుత్వం అణిచివేసే విధానాన్ని మానుకుని రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలని కోరుతూ వచ్చారు. ముఖ్యంగా జోషి, రాజకీయ కార్యకర్తలనేకాక, ట్రేడ్‌యూనియన్ - కిసాన్ నాయకులనుకూడా విడుదల చేయాలని కోరారు.[25] 1941 ఆఖరుకు ప్రభుత్వం, జవహర్‌లాల్ నెహ్రూ, అబ్దుల్ కలామ్ ఆజాద్‌తోసహా రాజకీయ ఖైదీలను విడుదల చేసింది. ఆ వెంటనే డిశంబరు 7వ తేదీన జపాన్, పెర్ల్‌హార్బర్‌మీద దాడి జరిపింది. అమెరికా జపాన్‌తో యుద్ధం ప్రకటించింది. జపాన్ అతిత్వరగా పురోగమించి, మలయా, సింగపూర్, బర్మాదాటి భారతదేశంవరకూ వచ్చింది. మార్చి 8వ తేదీన రంగూన్ ఓడిపోయింది. పరిస్థితి బాగా తీవ్రమైంది. భారతదేశం యుద్ధంలో సహకరించడం, అత్యవసరమైంది.

ఈ క్లిష్ట సమయంలో, యుద్ధ మంత్రిమండలిలో లేబర్‌పార్టీ సభ్యుడైన సర్ స్టాఫర్డ్ క్రిప్స్ రాజకీయ ప్రతిష్టంభన తొలగించేందుకు భారతదేశం వచ్చారు. భారతదేశంలో రాజ్యాంగ ఉన్నతికి సంబంధించి యుద్ధ మంత్రిమండలి ప్రతిపాదనలతో ముసాయిదా ప్రకటనను మార్చి 30వ తేదీన విడుదల చేశారు. యుద్ధం ముగిసిన వెంటనే భారతదేశానికి కొత్త రాజ్యాంగాన్ని రూపొందించేందుకు ఎన్నికైన సభ్యులతో ఒక సంస్థను ఏర్పాటు చేయడానికి చర్యలు తీసుకుంటారని బ్రిటిషు ప్రభుత్వం మొదటిసారిగా బహిరంగంగా ప్రకటించింది. "ఒక కొత్త ఇండియన్ యూనియన్"ను సృష్టించాలన్నది బ్రిటిషుప్రభుత్వ ఉద్యేశ్యమనికూడా ప్రకటించారు. ఈ యూనియన్‌లో ఒక డొమినియన్ యునైటెడ్ కింగ్‌డమ్‌కు అనుబంధంగా వుంటుంది. మిగతా డొమినియన్‌లు బ్రిటిషు ప్రభుత్వానికి విధేయంగా ఉంటాయి, అయితే సరి సమానంగా వుంటాయి. దేశ—విదేశ వ్యవహారాలకు సంబంధించిన ఏవిషయంలోనూ తలఒగ్గి వుండనక్కరలేదు. రాజ్యాంగ నిర్ణయసభ - పూర్తి స్వాతంత్ర్యానికి సంబంధించినంతవరకు కాంగ్రెసు కోరుతున్నదానికంటె ఇది ఎక్కువనే చెప్పవచ్చు. రాజ్యాంగ నిర్ణయ సభ రూపొందిచే రాజ్యాంగాన్ని కొన్ని షరతులకు లోబడి ఆమోదించి అమలు పరచేందుకుబ్రిటిషు ప్రభుత్వం అంగీకరించింది. బ్రిటిషుఇండియాలోని ఏ రాజ్యమైనా కొత్తరాజ్యాంగాన్ని ఆమోదించక పోయినట్టయితే ప్రస్తుత రాజ్యాంగవ్యవస్థనే అనుసరించవచ్చు ముందు ముందు అనుకున్నట్టయితే ఇండియన్ యూనియన్‌లో చేరవచ్చునన్నది షరతుల్లో ఒకటి. "అటువంటి రాష్ట్రాలతో, ఆరాష్ట్రాలు కోరినట్టయితే బ్రిటిషు ప్రభుత్వం కొత్త రాజ్యాంగానికి అంగీకరించేందుకు సిద్ధంగావుంది. అటువంటి రాష్ట్రాలకు ఇండియన్‌యూనియన్ మోస్తరుగానే పూర్తి ప్రతిపత్తి ఉంటుంది. ..."

అంటే పాకిస్తాన్ కావాలన్న ముస్లింలీగ్ కోరికకు బ్రిటిషు ప్రభుత్వం అంగీకరించ దన్నమాట.

కొత్త రాజ్యాంగాన్ని రూపొందించేవరకూ బ్రిటిషు ప్రభుత్వం భారతరక్షణ బాధ్యతను వహించవలసి ఉంటుందని పేర్కొంటూ, ఈ కృషిలో వెంటనే పాల్గొనవలసిందని భారతీయ నాయకులను ముసాయిదా ప్రకటనలో కోరారు.26

ముసాయిదా ప్రకటన ఆధారంగా క్రిప్స్ భారత నాయకులతో సంప్రదింపులు ప్రారంభించారు. ఒక ఘట్టంలో, సంప్రదింపులు బాగా సాగుతున్నట్లు కనిపించింది కాని చివరకు విఫలమయ్యాయి. క్రిప్స్ స్వయంగా సంప్రదింపులు జరుపడంలో సమర్థులు కారు. అదీకాక ఆయనకు పెద్ద స్వేచ్ఛకూడా లేకపోయింది. బ్రిటిషు యుద్ధ మంత్రిమండలి ఆదేశాలను ఆయన అనుసరించవలసివుంది. (ఈసంగతి మనకు ఇప్పుడు తెలుస్తూవుంది) ఏదైనా ఒకరాష్ట్రం ఇండియన్ యూనియన్‌లో చేరకుండా వుండవచ్చునన్న అంశం కాంగ్రెసు అభ్యంతరాల్లో ప్రధానమైనది. తాత్కాలిక ఏర్పాట్ల విషయమై రక్షణబాధ్యత లేకుండా చేయడంతో బాధ్యత అన్నది ప్రహసనంగా తయారవుతుందని కాంగ్రెసు భావించింది. అందువల్ల కాంగ్రెసు, ప్రతిపాదనలను త్రోసిపుచ్చింది.

ముస్లింలీగ్, పాకిస్తాన్ ఏర్పాటయే అవకాశం ఉన్నందుకు సంతృప్తి వ్యక్త పరిచింది. కాని ముసాయిదా ప్రకటన లక్ష్యం ఒకే ఒక ఇండియన్ యూనియన్ కావడమూ ఒకదానికంటె ఎక్కువ యూనియన్లు ఏర్పాటయే అవకాశం ఇప్పట్లో లేకపోవడమూ ముస్లింలీగ్‌కు బాధ కలిగించింది.

క్రిప్స్‌మిషన్ విఫలమైన తర్వాత బ్రిటిషువారు, భారత జాతీయ ఉద్యమం గురించి దుష్ప్రచారం చేయడం ప్రారంభించారు. అప్పటి పరిస్థితిదృష్ట్యా కాంగ్రెసు, జపాన్ దురాక్రమణ నెదుర్కొనేందుకు జరుగుతున్న కృషి కుంటుపడరాదన్న అభిలాష వున్నప్పటికీ ప్రభుత్వంతో సహకరించరాదన్న విధానాన్ని కొనసాగించక తప్పలేదు.

భారతదేశంలో బ్రిటిషుపాలన వెంటనే ముగియాలనీ, విదేశపాలన చెడుపు అన్న ఉద్దేశ్యంతోనే కాక "బానిసదేశంగా భారతదేశం తనను తాను పటిష్ఠంగా రక్షించుకొన జాలదనీ మానవాళికే బెడదగా తయారైన యుద్ధంలో తగినపాత్ర వహించజాలదనీ" కాంగ్రెసు కార్యవర్గం తీర్మానించింది. భారతదేశంలో బ్రిటిషుపాలన అంతంకావాలని కోరడంతో యుద్ధకృషిలో బ్రిటన్‌గాని మిత్రదేశాలనుగాని ఇబ్బందిపెట్టాలని కాంగ్రెసు కోరడంలేదని స్పష్టంచేశారు.

తమ ప్రతిపాదనకు అంగీకరించవలసిందని కాంగ్రెసు బ్రిటిషుప్రభుత్వాన్ని అర్థించింది. అతర్వాత ఈవిధంగా హెచ్చరించింది:

"ఈ విజ్ఞప్తి విఫలమైనట్లయితే ప్రస్తుత పరిస్థితులు కొనసాగినట్లయితే పరిస్థితి విషమించవచ్చునని కాంగ్రెసు ఆందోళన పడుతూవుంది. అప్పుడు కాంగ్రెసు 1920 దరిమిలా సంతరించుకున్న తన అహింసాయుత శక్తినంతటినీ విధిలేక వినియోగించవలసి వస్తుంది. అటువంటి విస్తృతమైన పోరాటానికి గాంధీజీ నాయకులుగా వుండడం తథ్యం" . 27

ఇందులోని అంశాలు చాలా ముఖ్యమైనవి కావడంచేత తీర్మానాన్ని తుదినిర్ణయం కోసం ఎ. ఐ. సి. సి.కి నివేదించారు. అగస్టు 7వ తేదీన బొంబాయిలో ఎంతో ఉద్రిక్త వాతావరణంలో సమావేశమైన ఎ. ఐ. సి. సి. "చైనా, రష్యాల రక్షణ ఏంతో ముఖ్యమనీ దీనికి ఏవిధంగానూ భంగం కలుగరాదనీ. యునైటెడ్‌నేషన్స్ రక్షణ పాటవానికి ఎటువంటి భంగమూ వాటిల్లరాదనీ కాంగ్రెసు ఎంతో ఆదుర్దాగా వున్నట్లు" ప్రకటించింది. జాతీయకోర్కెకు సంబంధించిన కార్యవర్గం తీర్మానాన్ని కొన్ని సవరణలతో ఏ. ఐ. సి. సి. ఆమోదించింది. "స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సాధనకు సంబంధించి భారతదేశానికున్న హక్కును పొందేందుకు వీలైనంత విస్తృతమైన సరళిలో ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించేందుకు" అనుమతినిచ్చింది. ఈ విషయంలో మార్గదర్శకులుగా వుండవలసిందని గాంధీజీని అర్థించింది. 28

ఈతీర్మానాన్ని అగస్టు 8వ తేదీన ఆమోదించారు. అగస్టు 9వ తేదీ తెల్లవారు జామున గాంధీజీ – నెహ్రూ – అజాద్ – పటేల్ - రాజేంద్రప్రసాద్ – ఇతర నాయకులు అరెస్టయారు. కాంగ్రెసు సంస్థను, చట్టవిరుద్ధమైన సంస్థగా ప్రకటించారు. క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైంది. దాన్ని అణిచివేసేందుకు ప్రభుత్వం ఏమాత్రం వెనుకాడలేదు.

## శాసనసభలో చర్చ

ప్రజల్లో కాంగ్రెసుగురించి దుష్ప్రచారం చేయడంలో భాగంగా భారతప్రభుత్వం, క్విట్ ఇండియా ఉద్యమాన్ని శాసనసభదృష్టికి తేవడంలో జాప్యం చేయలేదు. శాసనసభ ఆకులురాలు సమావేశం సెప్టెంబరు 14 వ తేదీన ప్రారంభమైనపుడు, దేశవ్యవహారాల సభ్యుడు సర్ రెజినాల్డ్ మాక్స్‌వెల్ ఆ మరునాడు, భారతదేశంలో పరిస్థితి గురించి చర్చించాలని కోరుతూ ఒకతీర్మానాన్ని ప్రతిపాదించారు.

ఎ. ఐ. సి. సి. అగస్టు 8 వ తేదీన తీర్మానాన్ని ఆమోదించిన దరిమిలా భారతదేశంలో తీవ్రమైన పరిస్థితి ఉత్పన్నమైనట్లు మాక్స్‌వెల్ సభవారికి తెలియచేశారు.

"ఆగస్టు 9 వ తేదీన కాంగ్రెసు నాయకులను అరెస్టు చేశారు. అదేరోజున "మాబ్ దౌర్జన్యం" ప్రారంభమైంది. ఒక సందర్భంలో బీహారులో తీవ్రమైన పరిస్థితి ఏర్పడింది. కమ్యూనికేషన్ మార్గాలు సైనిక ప్రాముఖ్యంగల ప్రాంతాలూ విద్రోహాల దాడికి గురయ్యాయి." అన్నారు మాక్స్వెల్. ఈ "విద్రోహ కార్యకలాపాలు" ముందుగా అనుకుని చేసినవనీ హఠాత్తుగా జరిగినవి కావనీ దీనికి కారణం కాంగ్రెసేననీ ఆయన తమ ఉపన్యాసంలో పదేపదే చెప్పారు. ఇటువంటి ఉద్యమం వల్ల యుద్ధ ప్రయత్నాలకు అవరోధమేర్పడుతుందనీ భారత రక్షణ నిబంధనలకింద సంక్రమించే అధికారాలను పూర్తిగా వినియోగించడంలో ప్రభుత్వం ఏమాత్రం వెనుకాడబోదనీ ఆయన హెచ్చరించారు. 29

మాక్స్వెల్ ఉపన్యాసం తర్వాత అనేక సవరణలను ప్రతిపాదించారు. కాంగ్రెసు ప్రారంభించిన ఉద్యమాన్ని అణిచివేసేందుకు ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను శాసనసభ ఆమోదించాలని అధికార సవరణలో కోరారు. పౌర ఉల్లంఘన ఉద్యమాన్ని ఉపసంహరించుకునేవరకూ ఈచర్యలను సడలించరాదనికూడా సవరణలో పేర్కొన్నారు.

మరొకవైపున అహ్మద్ కాజ్మి ఒక సవరణ ప్రతిపాదిస్తూ ప్రస్తుత విచారకరమైన పరిస్థితులకు కారణం, కాంగ్రెసు గురించి దుష్ప్రచారం చేస్తున్నవారేనని పేర్కొన్నారు. "యునైటెడ్ నేషన్స్కు కాంగ్రెసు గురించి దురభిప్రాయం కలిగేటట్లు దుష్ప్రచారం చేస్తూ కాంగ్రెసునాయకులు తమ పౌర ఉల్లంఘన ఉద్యమం గురించి చెప్పేముందే, వారిని అరెస్టు చేయడం వల్లనే ఈపరిస్థితి ఏర్పడింది. ప్రభుత్వం అవసరమైనదానికంటె ఎక్కువగానే తన బలాన్ని ప్రయోగించడంతో దేశంలో శాంతికి భగం కలిగింది. దీనివల్ల యుద్ధకృషికి అంతరాయం కలుగవచ్చు. కాంగ్రెసుమీద చేసిన ఆరోపణలను ఖండించేందుకు కాంగ్రెసు నాయకులకు అవకాశం కల్పించడం భావ్యం. తమ అసంతృప్తిని తెలియచేసేందుకు దౌర్జన్యాన్ని మానుకుని అహింసాయుత మార్గాలను అనుసరించడం మంచిది. భారతదేశం విషయంలో బ్రిటిషు ప్రభుత్వ ఉద్దేశ్యాలకు సంబంధించి భారతీయుల్లో విశ్వాసాన్ని కల్పించేందుకు వెంటనే చర్యలు తీసుకోవడం అవసరం" అని కాజ్మి తమ సవరణలో కోరారు.30

వెంటనే స్వాతంత్ర్యాన్ని ఇస్తున్నట్టు ప్రకటన చేయవలసిందని సంత్ సింగ్ ఒక సవరణ ప్రతిపాదించారు. కాంగ్రెసుమీద నిషేధాన్ని తొలగించి కాంగ్రెసు నాయకులను విడుదలచేసి, ఎన్నికలు జరిపికాంగ్రెసునూ లీగ్నూ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసేందుకు ఆహ్వానించాలని కూడ సంత్ సింగ్ తమ సవరణలో కోరారు.

నియోగి, ప్రభుత్వ విధానాన్ని ఖండించారు. దేశంలో ప్రస్తుత పరిస్థితికి రెండు ప్రధానమైన కారణాలున్నాయని చెప్పారు. ఒకటి, తమ జీవితమంతా భారతదేశానికి శత్రువుగా వ్యవహరించిన ఒక వ్యక్తి ఇంగ్లాండులో ప్రధానమంత్రిగా ఉండడం. రెండు, భారతదేశంలోనే ప్రభుత్వ అధికారమంతా, ఎటువంటి పాపభీతి దయా దాక్షిణ్యాలు లేని కొంతమంది అభివృద్ధి నిరోధకుల చేతుల్లో వుండడం. ప్రస్తుత పరిస్థితికి మరొక కారణం, భారతదేశంలో బ్రిటిషు పాలనవల్ల ఆర్థికరంగంలో ఏర్పడిన దుస్థితి. ఉద్యమాన్ని కఠినంగా అణిచివేయడంలో సైనికులూ పోలీసులూ జరుపుతున్న అమానుషకృత్యాల గురించి నియోగి ఆతర్వాత ప్రస్తావించారు. "బ్రిటిషు ప్రభుత్వానికి భారతదేశంలో తన అధికారాన్ని వదులుకోవడం ఇష్టంలేదు. ఈగొడవకంతా అదే మూలకారణం" అన్నారాయన. 31

దేశంలో ప్రస్తుత పరిస్థితికి ప్రభుత్వమే బాధ్యత వహించాలని మెహతా కోరారు. భారతదేశంలో బ్రిటిషువారు మొదటినుంచీ అనుసరిస్తూ వచ్చిన విధానాన్ని వివరిస్తూ ఆయన భారతీయులను అణిచివేసి స్వప్రయోజనాలకు వినియోగించుకోవడమే ప్రస్తుత అశాంతికి కారణమని చెప్పారు. ప్రజా జీవితంలోని ప్రధాన స్రవంతినుంచి వేరుపడవద్దని ఆయన ముస్లింలీగ్‌కు విజ్ఞప్తి చేశారు. 32

పౌర ఉల్లంఘనకు దిగడంలో కాంగ్రెసు ఏదైనా పొరపాటు చేసివున్నట్టయితే భారత ప్రభుత్వం నిజంగా పెద్ద పొరపాటే చేసిందని జోషి అన్నారు. "కాంగ్రెసు సంప్రదింపులకు ఎప్పుడూ సిద్ధంగానే వుంది. ప్రభుత్వంమాత్రం బాధ్యతా రహితంగా త్రోసిపుచ్చింది" అన్నారు జోషి. భవిష్యత్తుకు సంబంధించినంతవరకు, కాంగ్రెసువారు జైళ్ళలో వుండగా పౌర ఉల్లంఘనను ఉపసంహరించుకోవలసిందని కోరడం సరిగాలేదని చెప్పారు. ముగింపుగా ఆయన ఈమాటలన్నారు:

> "జపాన్ దాడినుంచి రక్షించుకోవడం తమ శక్తివంచన లేకుండా కృషిచేయడం ఈదేశపు ప్రజల విద్యుక్తధర్మం. జపాన్ దాడినుంచి రక్షించుకోవడానికి ఏకైక మార్గం దేశప్రజల్లో ఐకమత్యాన్ని పెంపొందించడం. దేశంలో అధిక సంఖ్యాకులైన హిందువులు, ముస్లింలకు వారు కోరుతున్న విధంగా స్వయం నిర్ణయ హక్కును ప్రసాదించాలని నేను సూచిస్తున్నాను. స్వయంనిర్ణయ హక్కు కావాలని కోరడం సబబే."33

ప్రభుత్వం నిర్మాణాత్మకమైన సూచన చేయకపోవడాన్ని నవల్‌రాయి గర్హించారు. దమన విధానంతో బ్రిటిషు ప్రభుత్వం భారతదేశాన్ని పాలించజాలదని ఆయన హెచ్చరించారు.

బెనర్జీ, హింసాకాండనూ దౌర్జన్యాన్నీ నిరసించారు. అయితే, కాంగ్రెసుకు వీటితో సంబంధం ఉందన్న దేశ వ్యవహారాల సభ్యుడి వాదనతో ఆయన అంగీకరించ లేదు. కాంగ్రెసు విధానంతో తాము ఏకీభవించక పోయినప్పటికీ, కాంగ్రెసు అహింసా యుత విధానాన్ని విడనాడిందని, తాము అనుకోవడంలేదని బెనర్జీ చెప్పారు. ప్రస్తుత పరిస్థితికి కాంగ్రెసు కొంతవరకూ కారణం కావచ్చు కానీ ప్రభుత్వ బాధ్యత అంతకంటె ఎక్కువగానే వుంది. కాంగ్రెసు కార్యవర్గమూ ఎ. ఐ. సి. సి. తుది నిర్ణయాలు తీసుకుంటూ సమావేశాలు జరిపి కూడా మూడువారాలకు పైగా అయింది. అయినా, పార్టీ ప్రతినిధులను సమావేశపరచేందుకు ప్రభుత్వం ఎటువంటి ప్రయత్నమూ చేయ లేదు. కాంగ్రెసుతో పాటు వివిధ పార్టీల ప్రతినిధులనూ సమావేశపరచి అధికారంలో కొంతమేర దేశప్రజలకు అప్పగించవలసిందని ఆయన ప్రభుత్వాన్ని కోరారు.[34]

ప్రస్తుత పరిస్థితికి ప్రభుత్వం తన బాధ్యత వహించక తప్పదని నామినేటెడ్ ఆంగ్లోఇండియన్ సభ్యుడైన ఫ్రాంక్ ఆంథోని అన్నారు. "భారత ప్రభుత్వపు సర్వ అధికారాలూ గల అధికార యంత్రాంగం, భారతదేశంలో విస్తరించి వుంది. ప్రజల్లో నిరుత్సాహం ప్రబలి వుంది" అన్నారు ఆంథోనీ.[35] క్రిప్స్ సూచించిన ప్రతిపాదనలను తిరస్కరించినందుకు జెహంగీర్, కాంగ్రెసును విమర్శించారు. దేశాన్ని బహిరంగ తిరుగుబాటులో దింపేముందు ఇతర రాజకీయ వర్గాల సహకారం పొందేందుకు ప్రయ త్నించవలసినందుకు కూడా కాంగ్రెసును ఆయన విమర్శించారు.[36]

శాసనసభలో జిన్నా స్థానంలో ముస్లింలీగ్ నాయకులుగా వ్యవహరిస్తున్న నవాబ్ జాదా లియాఖత్ అలీఖాన్ మాట్లాడుతూ, దేశ స్వాతంత్ర్యాన్ని సాధించేందుకు కాక, బ్రిటిషు ప్రభుత్వం అంగీకరించిన తమకోరికను సాధించేందుకు ఈ బహిరంగ తిరుగు బాటును ప్రారంభించాలని కాంగ్రెసు నిర్ణయించుకున్నందుకు లీగ్ ఇది వరకే గర్హించిం దని తెలియ చేశారు. ప్రభుత్వం మూడేండ్లుగా కాంగ్రెసు పార్టీని సంతృప్తి పర చేందుకు ప్రయత్నిస్తూ వచ్చిందనీ లీగ్, సహకరిస్తామన్నా అంగీకరించలేదనీ ఆరో పించారు లియఖత్ అలీఖాన్. అందువల్ల ప్రస్తుత పరిస్థితి ప్రభుత్వం బాధ్యత వహించక తప్పదని చెప్పారు. భారతదేశం స్వతంత్రం కావడానికి ఒకే ఒక మార్గం, పాకి స్తాన్‌కు అంగీకరించడమేనని ఆయన స్పష్టం చేశారు.

తమ విధానం అహింస అని కాంగ్రెసూ గాంధీజీ చెప్పుకోవడం బూటకమనీ దేశంలో గడ్డు పరిస్థితిని ఎదుర్కొంటున్న పోలీసు అధికార్లకు అన్ని విధాలా సహాయం చేయాలనీ యామిన్‌ఖాన్ అభిప్రాయపడ్డారు.

క్రిప్స్ భారతదేశం సందర్శించినపుడు కాంగ్రెసును తప్ప మిగతా అన్నిపార్టీలనూ

నిర్లక్ష్యం చేశారని గజ్నవీ ఫిర్యాదు చేశారు. కాంగ్రెసు, యావత్ భారతదేశానికి ప్రాతినిధ్యం వహించ జాలదనీ ముస్లింలీగ్ కూడా భారతదేశంలోని ముస్లిం లందరికీ ప్రాతినిధ్యం వహించజాలదనీ చెప్పారు. ముస్లింలీగ్ కాక ముస్లింలతో కూడిన ఇతర ముఖ్యమైన పార్టీలున్నాయని అంటూ గజ్నవీ, జమియత్ ఉల్‌ఉల్‌మా-మోమిన్-అహ్రార్-అజాద్ ముస్లింలను పేర్కొన్నారు. కాంగ్రెసులో కూడా కొంతమంది ముస్లింలున్నారని ఆయన పేర్కొన్నారు. భారతదేశంలో 40 కోట్ల మంది సహకారాన్ని పొందేందుకు బ్రిటన్ భారతీయులకు వెంటనే అధికారాన్ని అప్పగించి, ఈ యుద్ధాన్ని ప్రజాయుద్ధంగా మార్చవలసిందని ఆయన ప్రభుత్వాన్ని కోరారు.[37]

ప్రభుత్వం తరఫున చర్చకు సమాధానం చెబుతూ అణే, గాంధీజీనీ కార్యవర్గ సభ్యులనూ అరెస్టు చేసి పరిస్థితిని తీవ్రం చేసిందని ప్రభుత్వాన్ని తప్పు పట్టడానికి వీలులేదని వాదించారు.[38]

చర్చ ఆఖరున సవరణలన్నిటినీ ఉపసంహరించుకున్నారు. తీర్మానం మీద ఓటింగ్ జరుపకుండానే సభ వాయిదా పడింది.

## గాంధీజీ నిరశన వ్రతం

అగస్టు 9 వ తేదీనుంచీ, దేశంలో జరుగుతున్న హింసాకాండకు ప్రభుత్వం కాంగ్రెసును తప్పుపడుతూ వచ్చింది. ప్రభుత్వం చేస్తున్న ఈ ఆరోపణలను గాంధీజీ పూనాలోని అగాఖాన్ భవనంనుంచి ఖండిస్తూ వచ్చారు. అరెస్టుచేసిన తర్వాత గాంధీజీని ఆగాఖాన్ భవనంలో వుంచారు. కాంగ్రెసునాయకులందరినీ అరెస్టు చేయడంతో ప్రజలు నిగ్రహం కోల్పోయేటంత ఆగ్రహం చెందారని గాంధీజీ పేర్కొన్నారు. తాముచేసిన తప్పులేమిటో తమకు తెలియచేసినట్లయితే తాము సవరించుకుంటామనీ లేనట్లయితే నిరాహారదీక్ష ప్రారంభిస్తామనీ గాంధీజీ లిన్‌లిత్‌గోకు చెప్పారు. అయితే వైస్‌రాయి, ఎటువంటి సాక్ష్యాధారాలు లేకుండా తమ పాత ఆరోపణలను చేయసాగారు. గాంధీజీ 1943 ఫిబ్రవరి 10 వ తేదీన ఇరవైఒక్క రోజుల నిరాహారదీక్ష ప్రారంభించారు. బేషరతుగా గాంధీజీని విడుదల చేయాలని కోరుతూ దేశవ్యాప్తంగా ఆందోళన ప్రారంభమైంది. బేషరతుగా విడుదల చేసేందుకు వైస్‌రాయి నిరాకరించారు. ఒక్కొక్క రోజు జరిగినకొద్దీ దేశమంతటా విచారం వ్యాపింపసాగింది. శాసనసభకూడా పట్టించుకోకుండా ఉండలేకపోయింది.

ఫిబ్రవరి 15వ తేదీన, మైత్ర, గాంధీజీ ప్రారంభించిన నిరాహారదీక్ష గురించి చర్చించాలని కోరుతూ శాసనసభలో ఒక వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించారు.

గాంధీజీ - వైస్‌రాయ్ మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల గురించి ప్రస్తావిస్తూ మైత్ర గాంధీజీని కలుసుకోకుండా వైస్‌రాయి పొరపాటుచేశారని చెప్పారు. "గాంధీజీ జైల్లో చనిపోయినట్టయితే భారతదేశం ఈ పొరపాటును తమను ఎన్నడూ క్షమించబోదని ప్రభుత్వానికి తెలుసునా?" అని మైత్ర ప్రశ్నించారు. గాంధీజీ జైల్లో మరణించడమే జరిగినట్టయితే, భారతదేశంలో ఏర్పడే పరిస్థితిని ఏ ప్రభుత్వమూ ఎంత శక్తివంతమైనదైనా అదుపులో పెట్టజాలదని మైత్ర ప్రభుత్వాన్ని హెచ్చరించారు. 39

టి. టి. కృష్ణమాచారి, మైత్ర తీర్మానాన్ని సమర్థించారు. గాంధీజీ ప్రారంభించిన నిరాహారదీక్ష బెదిరింపు అని వర్ణించినందుకు ఆయన ప్రభుత్వాన్ని గర్హించారు. గత అయిదువందల ఏండ్లలో భారతదేశంలో అంతటి గొప్పవ్యక్తి జన్మించలేదనీ అటువంటి వ్యక్తిని ఆవిధంగా దూషించడం ప్రభుత్వానికి తగదనీ కృష్ణమాచారి చెప్పారు. ప్రస్తుత ప్రతిష్టంభనను తొలగించేందుకు లభించిన అవకాశాన్ని ప్రభుత్వం వినియోగించుకోనందుకు ఆయన విచారం వ్యక్తపరిచారు. గాంధీజీ పరిస్థితి విషమించినట్టయితే భారతీయులుగా వారి పరిస్థితి దాదాపు సహించరానిదే అవుతుందని కృష్ణమాచారి కార్యవర్గ సమితిలోని భారతీయ సభ్యులను హెచ్చరించారు. 40

జోషి మాట్లాడుతూ, నిరాహారదీక్ష ఫలితంగా గాంధీజీ మరణించినట్టయితే బ్రిటిషు ప్రభుత్వానికీ భారతీయులకూ మధ్య సంబంధాలేకాక బ్రిటిష్ ప్రజలకూ భారతీయులకు మధ్య సంబంధాలుకూడా శాశ్వతంగా విద్వేషపూరితమవుతాయని హెచ్చరించారు. గాంధీజీని బేషరతుగా విడుదల చేసినట్టయితే భారతదేశంలో రాజకీయ పరిస్థితి మెరుగుపడుతుందనీ, నిరాహారదీక్షవల్ల కలిగే ప్రమాదాలన్నీ మాయమవుతాయనీ జోషి చెప్పారు.41 బెనర్జీ కూడా ఇదేవిధంగా అభిప్రాయపడ్డారు. కార్యవర్గ సమితిలోని భారతీయ సభ్యుల నిబంధనలు ఆధారంగా వ్యవహరించరాదనీ క్లిష్టపరిస్థితి ఏర్పడిందనీ, పరిస్థితికితగినట్టు వ్యవహరించవలసిందనీ సంత్‌సింగ్ విజ్ఞప్తి చేశారు. గాంధీజీ జైల్లో మరణించడమే సంభవించినట్టయితే జైల్లో కృష్ణుడు జన్మించినట్టవుతుందని ఆయన హెచ్చరించారు. 42

లియాఖత్ అలీఖాన్‌మాత్రం, ఈసందర్భాన్నికూడా విద్వేషపూరితమైన రాజకీయ ఉపన్యాసం చేసేందుకు ఉపయోగించుకున్నారు. ఆగస్టు 8 వ తేదీ తర్వాత జరిగిన దానికంతటికి కాంగ్రెసూ గాంధీజీ కారణమని ఆయన మళ్ళీ తప్పుపట్టారు. వైస్‌రాయికీ-గాంధీజీకి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల్లో హిందూ ముస్లింల ఐకమత్యం గురించి పస్తావనే లేదని చెప్పారు. గాంధీజీని విడుదల చేసినట్టయితే, హిందూ ముస్లిం

సమస్య పరిష్కారమయ్యే అవకాశం వుందని తమకు హామీ ఇవ్వవలసిందని ఆయన తమ హిందూ సహచరులను కోరారు. తమకు అటువంటి సూచన ఏదీ కనిపించడం లేదని చెప్పారు. కాంగ్రెసు అంగీకరిస్తేతప్ప, మిగతా భారతీయులకు అధికారాన్ని అప్పచెప్పజాలమని ప్రభుత్వం చెబుతున్నందుకు ఆయన ప్రభుత్వాన్ని విమర్శించారు. గాంధీజీని విడుదల చేయాలన్న కోరిక గురించి ప్రస్తావిస్తూ ఆయన, ముస్లింలీగ్‌కు అధికారం లేదుకనుక విడుదల చేయమనిగాని వద్దనిగాని అనజాలదని చెప్పారు. 43

లియాఖత్ అలీఖాన్ గాంధీజీమీద చేసిన ఆరోపణలను ఖండిస్తూ మెహతా గాంధీజీని మించిన ముస్లిం అనుకూలవాది దేశంలో మరొకరు లేరన్న సంగతి గుర్తుంచుకోవలసిందని చెప్పారు. 44

తీర్మానంమీద ఓటింగ్ జరిపించకుండానే సభ వాయిదా పడింది.

## రాజకీయఖైదీల విడుదలకోసం ఒత్తిడి

నిరాహారదీక్ష తర్వాత, భారతదేశంలో రాజకీయ ప్రతిష్ఠంభన తొలగించేందుకు గాంధీజీని ఇతర రాజకీయ నాయకులనూ విడుదల చేయాలని ప్రభుత్వంమీద ఒత్తిడి ఎక్కువవుతూ వచ్చింది. గాంధీజీని విడుదల చేయాలనీ ప్రభుత్వమూ కాంగ్రెసు ఒక సమాధానానికి రావాలనీ, కోరుతూ ముప్పయిఅయిదుమంది ప్రముఖులు మార్చి 9 వ తేదీన ఒక ప్రకటన విడుదల చేశారు. శ్రీ రాజగోపాలాచారి–భూలాభాయిదేశాయి–సప్రు – జయకర్ – మొదలైనవారు ప్రకటనమీద సంతకాలు చేశారు. వైస్‌రాయి మాత్రం అటువంటి విజ్ఞప్తులన్నిటినీ త్రోసిపుచ్చారు.

శాసనసభలో కృష్ణమాచారి, నియోగి. జోషి, నీలకంఠదాసు. అహ్మద్ కాజ్మీ ఇతరులూ రాజకీయఖైదీల విడుదలగురించి చాలాసార్లు ప్రస్తావించారు. కాని ప్రభుత్వం 1943 అంతా తన వైఖరిని మార్చుకోలేదు. 1944 ఫిబ్రవరి 8 వ తేదీన, రాజకీయ ప్రతిష్ఠంభనను తొలగించి, యుద్ధకృషిని మెరుగుపరచేందుకు రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని గవర్నర్ జనరల్‌కు శిఫార్సుచేస్తూ నవల్‌రాయ్ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. రాజకీయ ఖైదీలను విడుదల చేసినట్లయితే అన్ని రాజకీయపార్టీలూ, సమావేశమై ఒక అంగీకారానికి వచ్చే అవకాశం వుందని ఆయన ఉద్ఘాటించారు. ఈవిషయమంతా రాష్ట్రప్రభుత్వాల చేతుల్లో వుందని అనడం కళ్ళనీళ్ళు తుడవడం మాత్రమేనని ఆయన చెప్పారు. భాగల్‌పూర్‌కు చెందిన కైలాష్ బిహారీలాల్ మాట్లాడుతూ ప్రభుత్వం మొదాటినుంచీ అతిగా ప్రవర్తించిందనీ ప్రభుత్వం తన విధానాన్ని సవరించుకుని ప్రజలకు న్యాయం చేకూర్చాలనీ ప్రజలు సిద్ధాంతరీత్యా

ప్రభుత్వానికి వ్యతిరేకంగా లేరనీ వారికి వ్యతిరేకంగా ఉండాలని కోరడంలేదనీ చెప్పారు.

అబ్దుల్‌కయ్యూమ్ మాట్లాడుతూ కాంగ్రెసువైఖరి స్పష్టంగా వుందని చెప్పారు. "బ్రిటిషువారు భారతదేశంనుంచి వైదొలగాలని మేము కోరుతున్నాం. అందువల్ల ఆగస్టు 8 వ తేదీనాటి తీర్మానాన్ని ఉపసంహరించుకునే ప్రశ్నేలేదు. ఉపసంహరణ అంటూ ఏదైనా వుంటే ప్రభుత్వమే ఆపని చేయవలసి వుంటుంది" అన్నారు కయ్యూమ్. దేశప్రజలందరి తరపునా కాంగ్రెసు మాట్లాడ్డానికి వీలులేదని లియాఖత్ అలీఖాన్ వాదించారు. ముస్లింల తరపున వారుమాట్లాడ్డానికి అసలు వీలులేదని చెప్పారు. పాకిస్తాన్ ఏర్పాటు కావాలన్న ముస్లింలీగ్ కోరికను ఆయన పునరుద్ఘాటిస్తూ "పాకిస్తాన్ ఏర్పడినపుడు స్వతంత్ర హిందూస్తాన్‌కూడా ఏర్పడుతుందన్న" జిన్నా మాటలను పేర్కొన్నారు.45

కృష్ణమాచారి, నవల్‌రాయి తీర్మానాన్ని సమర్థిస్తూ ప్రభుత్వానికి ఈవిధంగా చెప్పారు :

"మీరిక్కడ వున్నంతకాలం, హిందువులూ ముస్లింలూ ఒక అంగీకారానికి రారన్న సాకుతో ప్రతిష్టంభన పరిష్కారానికి అంగీకరించరు. యుద్ధ కృషి పేరుతో నాయకులను జైలులో వుంచకండి. ఎందుకంటె మీ యుద్ధకృషి నిజానికి అర్థంలేనిది. మీరు యుద్ధంలో సరిగా పోరాడ్డంలేదు నాయకులను కాలనిర్ణయం లేకుండాజైలులో ఉంచరాదని అడిగే హక్కు మాకుంది. వీరిని విడుదల చేయక తప్పదు."46

జోషి - అహమద్‌కాజ్‌మి, మెహతా చాలామంది ఇతరులూ తీర్మానాన్ని సమర్థించారు. కాని ప్రభుత్వం సభవారు త్రోసిపుచ్చేట్టు చేయడంలో ప్రభుత్వం విజయం సాధించింది.

ప్రతిపక్షాల వారికి ఆ మరునాడు, కలసి వచ్చింది. భారత రక్షణచట్టం అమలు జరుగుతున్న తీరు గురించి చర్చ జరుగాలని కోరుతూ అహమద్‌కాజ్‌మి ఒక సవరణ తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఈ చట్టాన్ని అమలు పరుస్తూ ప్రభుత్వం, చట్టం మూలంగా ప్రజలు కోల్పోతున్న స్వేచ్ఛనూ, హక్కులనూ వీలైనంత త్వరగా మళ్ళీ కల్పిస్తామని హామీ ఇచ్చినసంగతి కాజ్‌మి గుర్తుచేశారు. ఈ వాగ్దానాన్ని నిలబెట్టుకోలేదు సరికదా, ఈ భారత రక్షణ నిబంధనలు న్యాయ నిర్వహణకు అంతరాయంగా కూడా వున్నాయి. అంథోని, న్యాయవాదిగా ఈ తీర్మానాన్ని సమర్థించారు. "...ప్రస్తుత వ్యవస్థలో మన మేజిస్ట్రేటులకు ఏమాత్రం స్వేచ్ఛలేదు. చేతులు కట్టుకుని అధికార్లు ఏంచేయమంటే అది చేస్తున్నారు. వాళ్ళను తప్పుపట్టి లాభంలేదు. వ్యవస్థే

అటువంటిది..."47 జఫరలీఖాన్, లియాఖత్ అలీఖాన్ కూడా తీర్మానాన్ని సమర్థించారు. సభవారు 43 ఓట్లతో తీర్మానాన్ని ఆమోదించారు. ప్రతికూలంగా 42 ఓట్లు పడ్డాయి. చాలాకాలం తర్వాత ప్రభుత్వ వీగిపోయింది.

బొంబాయి ప్రణాళిక గురించి చర్చ

1944 నవంబరులో శాసనసభలో, భారత ఆర్థిక పథకాల గురించి అతి ఆసక్తికరమైన చర్చ జరిగింది. సోవియట్ యూనియన్‌లో పంచవర్ష ప్రణాళికలు విజయవంతమైనప్పటినుంచీ అన్ని దేశాల వారి దృష్టి వాటిమీద పడింది. భారతదేశంలో ఎం. విశ్వేశ్వరయ్య, భారత ఆర్థిక వ్యవస్థను ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి చేయడం గురించి మొదట వ్రాశారు. 1938లో సుభాష్ చంద్రబోసు, భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులుగా వున్నప్పుడు భారత ఆర్థిక పునర్నిర్మాణానికి పథక రచనకు జవహర్‌లాల్‌నెహ్రూ అధ్యక్షతన జాతీయ ప్రణాళికా సంఘం ఒకదాన్ని ఏర్పాటు చేశారు. "మొత్తందేశం స్వయంసమృద్ధమయేట్టు ప్రణాళికలను రూపొందించుకోవాలనీ అయితే దీని ఫలితంగా ఆర్థిక సామ్రాజ్యవాదంలో చిక్కుకుపోకుండా జాగ్రత్తపడాలనీ" భారతదేశంలో ప్రణాళికల లక్ష్యం ఇదేనని సంఘం స్పష్టంగా పేర్కొంది.48 యుద్ధంవల్లా అదరిమిలా భారత రాజకీయాల్లో గొడవలవల్లా సంఘం కృషికి అంతరాయం కలిగింది.

యుద్ధం ముగుస్తుందనీ యుద్ధం తర్వాత దేశ ఆర్థిక పురోభివృద్ధికి ఒక ప్రణాళికను తయారుచేసుకునేందుకు చాలా ప్రయత్నాలు జరిగాయి. భారతదేశంలోని ప్రముఖ పారిశ్రామికవేత్తలు 15 మంది ఒక ప్రణాళిక తయారుచేశారు. దీన్ని బొంబాయి ప్రణాళిక అని వ్యవహరించారు. పదిహేనేండ్లలో తలసరి ఆదాయాన్ని రెండింతలు చేసేందుకూ జాతీయ ఆదాయాన్ని మూడింతలు చేసేందుకూ వీలుగా ప్రణాళికను తయారుచేశారు. 1944 జులైలో భారతప్రభుత్వం ప్రణాళిక అభివృద్ధి శాఖను కొత్తగా ప్రారంభించింది. సర్ అర్దెషిర్ దలాల్‌ను ఈ శాఖకు అధిపతిగా నియమించింది. బొంబాయి ప్రణాళికమీద సంతకాలు పెట్టినవారిలో సర్ దలాల్ ఒకరు. ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి పత్రికల్లో ప్రముఖ విషయమైంది. కాని అప్పటి దేశ రాజకీయ ధోరణులతో కలగాపులగమైంది. శాసనసభలో ఈ విషయమై జరిగిన చర్చలో ఇది వ్యక్తమైంది.

"దేశ ప్రజల సంక్షేమం దృష్ట్యా భారతదేశంలోని పెట్టుబడిదారులు తయారుచేసిన పదిహేనేండ్ల పథకంగురించి ఆలోచించరాద"ని ప్రభుత్వానికి శిఫార్సుచేస్తూ జియావుద్దీన్ ఖాన్ శాసనసభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. "యుద్ధం ముగిసిన తర్వాత జాతీయ ప్రభుత్వం ఏర్పాటవుతుందనీ, అటువంటి ప్రభుత్వం ఆర్థిక విషయాల్లో దేశ

మంతటికీ అధిపత్యం వహించగలదని ఈ ప్రణాళికను తయారుచేసినవారు భావిస్తున్నారు. బొంబాయి ప్రణాళిక వెనుకవున్న ఈ ఉద్దేశ్యాన్ని భారతప్రభుత్వం ఆమోదించినట్టు కనిపిస్తూవుంది" అని జియావుద్దీన్‌ఖాన్ తమ భయాన్ని వ్యక్తం చేశారు.[49]

పాట్నాకు చెందిన ముహమ్మద్ నేమన్, జియావుద్దీన్‌ఖాన్ తీర్మానాన్ని సమర్థించారు. ప్రణాళికపట్ల తమ అభ్యంతరాన్ని ఆయన మరింత స్పష్టంగా వివరించారు. "ఒక కేంద్ర - ఏకపక్ష ప్రభుత్వం ఏర్పాటు కాగలదన్న సిద్ధాంతాన్నీ ముస్లిం ప్రతినిధులమైన మేము వ్యతిరేకిస్తున్నాం"[50] అన్నారాయన. ప్రణాళికలో వ్యవసాయానికీ గ్రామ పరిశ్రమలకూ అంత ప్రాధాన్యం ఇవ్వనందుకుకూడా ఆయన అభ్యంతరం తెల్పారు.

పంజాబుకుచెందిన షేక్ ఫజల్-ఇ-హక్ పిరాచా ఈ అభ్యంతరాలను మరికొంత వివరించారు. భారతదేశానికంతటికీ ఒకేఒక జాతీయ ప్రభుత్వం ఏర్పాటు కాగలదన్న అభిప్రాయం పదికోట్లమందితో కూడిన ముస్లింజాతికి ఎన్నటికీ ఆమోదయోగ్యం కానేరదని ఘంటాపథంగా చెప్పారు. యుద్ధం తర్వాత రాష్ట్రాలు ఆర్థికరంగంలో పాలనా స్వేచ్ఛ కోరుతాయనీ బొంబాయి ప్రణాళికలో తలపెట్టిన విధంగా, కేంద్ర అధికారానికి ఏమాత్రం తావుండదనీ ఆయన అభిప్రాయపడ్డారు. వ్యవసాయరంగపు అవసరాలను నిర్లక్ష్యంచేసి, దేశాన్ని త్వరితంగా పారిశ్రామికీకరణ చేసేందుకు ఎక్కువ శ్రద్ధ వహిస్తున్నందుకు ఆయన విమర్శించారు.[51]

ప్రభుత్వం వివిధ ప్రణాళికలనూ పరిశీలించి, యుద్ధం తర్వాత భారతదేశాన్ని ఆర్థికంగానూ, పారిశ్రామికంగానూ అభివృద్ధిపరచేందుకు త్వరగా ఒక నిర్ణయం తీసుకోవడం మంచిదని కృష్ణమాచారి కోరారు. భారతీయ పారిశ్రామికవేత్తలు పరిశ్రమలను నెలకొల్పుకోవాలని అనుకున్నపుడు ఎన్నో నిబంధనలకు గురికావలసివస్తూవుందనీ విదేశీయులకు ఎటువంటి నిబంధనలూ లేకపోవడం విచారకరమనీ ఆయన అన్నారు.[52]

అవినాశలింగం చెట్టియార్, అసలు తీర్మానానికి కాంగ్రెసు సవరణను ప్రతిపాదించారు. యుద్ధం తర్వాత భారతదేశపు ఆర్థికాభివృద్ధికి ఉద్దేశించిన అనేక ప్రణాళికలను పరిశీలించేందుకు ప్రభుత్వం శాసనసభలోని ఎన్నికైన సభ్యులు పదిహేనుగురికి మించకుండా ఒక సంఘాన్ని నియమించాలని ఆయన శిఫార్సు చేశారు. తమ ప్రతిపాదనను వివరిస్తూ ఆయన, ప్రణాళికలను తయారు చేసేటపుడు మామూలు ప్రజానీకాన్ని దృష్టిలో పెట్టుకోవాలనీ, మోటారుబండ్లు, యంత్ర పరికరాలు మొదలైన పెద్ద పారిశ్రామిక సంస్థలు ప్రభుత్వ యాజమాన్యంలో వుండాలని కాంగ్రెసు అభిప్రాయపడుతూవుందనీ చెప్పారు.[53]

రాధాబాయి సుబ్బరాయన్, చెట్టియార్ తీర్మానాన్ని సమర్థించారు. ప్రణాళికాబద్ధమైన పురోభివృద్ధిలో రష్యా సాధించిన విజయాలగురించి ప్రస్తావిస్తూ ఆమె, ఈ విషయంలో భారత ప్రభుత్వం అశ్రద్ధచేసినందుకు విచారం వ్యక్తపరిచారు. ప్రభుత్వం ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి గురించి మాట్లాడడానికి ఒత్తిడి కారణమని ప్రజల స్థితిగతులను మెరుగుపరచే ఉద్దేశ్యంలో మాత్రం కాదనీ ఆమె చెప్పారు." ...బ్రిటిష గుత్తాధిపత్య పెట్టుబడిదారులకు మరింత లాభాలు చేకూరేట్టు వారు తప్పకుండా ప్రయత్నిస్తారు. దానివల్ల మన ప్రజలకు నష్టం కలిగినా లెఖ్ఖచేయరు. భారత దేశంపై సామ్రాజ్యవాద అధిపత్యాన్ని మరింత పటిష్టం చేసుకునేందుకు అన్ని విధాలా కృషి చేస్తారు" అంటూ ఆమె మహిళలు ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి కార్యక్రమాలతో నవభారతావనిని నిర్మించే బృహత్తరకృషిలో మహిళలు తమ పాత్రను వహించాలని ఉద్బోధించారు.[54]

పెట్టుబడిదారుల ఆధిపత్యంలోవున్న సమాజవ్యవస్థలో పౌరులందరికీ సమానహక్కులుండే పరిస్థితులు కల్పించడం వీలుపడదని జోషి వాదించారు. ఈ దృష్ట్యా వ్యక్తిగత ఆస్తి హక్కులను బాగా పరిమితం చేయడమూ కొన్ని సందర్భాల్లో రద్దు చేయడమూ జరుగాలని ఆయన కోరారు.[55]

ప్రతిపక్ష నాయకులైన భూలాభాయిదేశాయి చెట్టియార్ తీర్మానాన్ని సమర్థించారు. విదేశ ప్రభావానికిలోనైగాని, విదేశ ప్రయోజనాలదృష్ట్యాగాని తయారుచేసే ఏ ప్రణాళిక వల్లనైనా ప్రయోజనం వుండబోదని ఆయన పేర్కొన్నారు. పూర్తి స్వేచ్ఛ కలిగిన జాతీయ ప్రభుత్వం మాత్రమే, దేశప్రజల సంక్షేమానికి తగిన ప్రణాళికను తయారు చేయగలదని ఆయన అభిప్రాయపడ్డారు. దురదృష్టవశాత్తు భారతదేశంలో ఆ పరిస్థితి లేదని అన్నారు. ఏదైనా ఒక సంఘం ఏర్పాటై, ప్రభుత్వం ఆ సంఘంతో సహకరించేందుకు నిరాకరించినట్టయితే, అప్పుడుకూడా వారు, జాతీయప్రభుత్వానికి ఆమోదయోగ్యమైన ప్రణాళికను తయారుచేస్తారనీ, విదేశీయుల ఆధిపత్యంలోని వర్గాలు తయారు చేసే ప్రణాళికను అది అధిగమించుతుందనీ దేశాయి పేర్కొన్నారు.[55a] ఆ దరిమిలా చెట్టియార్ సవరణను సభవారు ఆమోదించారు.

## దేశాయి - లియాఖత్ ఒప్పందం

1944 చివరలోనూ 1945 ప్రారంభంలోనూ భారతదేశంలో రాజకీయ ప్రతిష్టంభన పరిష్కారానికి శాసనసభ స్థాయిలో ప్రయత్నం జరిగింది. శాసనసభలో కాంగ్రెసు పార్టీ నాయకులైన భూలాభాయిదేశాయికీ, శాసనసభలో ముస్లింలీగ్ నాయకులైన లియాఖత్ అలీఖాన్‌కూ మధ్య సంబంధాలు బాగుండేవి. గాంధీజీ అనుమతితో భూలాభాయి

దేశాయి, కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసే అవకాశాన్ని పరిశీలించేందుకు లియాఖత్ అలీఖాన్‌తో సంభాషణలు ప్రారంభించారు. . సంభాషణలు జరుగుతూ వుండగా దేశాయి గాంధీజీకి ఎప్పటికప్పుడు సంభాషణల గురించి తెలియచేస్తూ ఆయన సలహాను పొందుతూండేవారు.[56] చివరకు ఉభయులూ ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. దీనిని లియాఖత్ - దేశాయి ఒప్పందం అని వ్యవహరించారు. ఈ ఒప్పందం ప్రకారం :

కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడంలో కాంగ్రెసూ ముస్లింలీగూ సహకరిస్తాయి. అటువంటి ప్రభుత్వాన్ని ఈ క్రింది విధంగా ఏర్పాటుచేయవలసి వుంటుంది :

1) కేంద్ర శాసనసభలో కాంగ్రెసూ, లీగ్ ఎన్నికచేసే సభ్యులు సమాన సంఖ్యలో వుంటారు. (నామినేట్ చేయబడినవారు కేంద్ర శాసనసభలో సభ్యులుగా వుండనక్కరలేదు)

2) అల్ప సంఖ్యాకుల ప్రతినిధులు (ముఖ్యంగా షెడ్యూల్డు కులాలూ, శిఖ్ఖులూ)

3) కమాండర్ - ఇన్ - చీఫ్.

ప్రస్తుత భారత ప్రభుత్వ చట్టానికిలోబడి ప్రభుత్వం ఏర్పాటై, పరిపాలన సాగిస్తుంది. ఏదైనా ఒక బిల్లును శాసనసభ ఆమోదించేట్టు మంత్రిమండలి చేయలేకపోయినట్టయితే, గవర్నర్ జనరల్‌కుగాని, వైస్‌రాయికిగాని వున్న ప్రత్యేక అధికారాల సహాయంతో ఆ బిల్లును ఆమోదించే ప్రయత్నం మంత్రిమండలి చేయరాదు. (దీనివల్ల వీరు గవర్నర్ జనరల్‌మీద అంత ఆధారపడనక్కరలేదు.)

అటువంటితాత్కాలిక ప్రభుత్వం ఏర్పడినట్టయితే మొదట కాంగ్రెసు కార్యవర్గ సభ్యులను విడుదల చేయాలని కాంగ్రెసూ లీగూ అంగీకరించారు.

దీన్ని సాధించేందుకు తీసుకోవలసిన చర్యలను ఈ విధంగా సూచించారు :

ముస్లింలీగూ కాంగ్రెసూ కుదుర్చుకున్న ఒప్పందం ఆధారంగా కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటుకావాలని తాము కోరుతున్నట్టు గవర్నర్ జనరల్ ప్రతిపాదించడమో సూచించడమో చేసేందుకు ఒక మార్గాన్ని అన్వేషించడం మొదటి చర్య. గవర్నర్ జనరల్ శ్రీ జిన్నానూ శ్రీ దేశాయినీ విడివిడిగాగాని ఒకటిగాగాని ఆహ్వానించినపుడు పైన పేర్కొన్న ప్రతిపాదనలు చేస్తూ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడంలో తాము సహకరిస్తామని ఆయనకు చెప్పవలసివుంటుంది.

ఆ తర్వాత చర్య, రాష్ట్రాలలో 93వ సెక్షనును తొలగించేట్టు చూడడం, వీలైనంత త్వరగా రాష్ట్రాల్లో సంకీర్ణ ప్రభుత్వాలను ఏర్పాటు చేయడం. ఈ ఒప్పందం మీద

దేశాయి లియాఖత్ అలీఖాన్ 1945 జనవరి 11 వ తేదీన సంతకాలు చేశారు.[57] దేశాయి, జనవరి 20వ తేదీన వైస్‌రాయిని కలుసుకుని ఒప్పందం గురించి చర్చించారు. ఈ ప్రతిపాదనలను గాంధీజీ ఆమోదించారని దేశాయి వైస్‌రాయికి తెలియచేశారు. జిన్నాకు కూడా ఇది తెలుసుననీ ఆయనకూడా ఆమోదించినట్టు తాను విశ్వసిస్తున్నాననీ చెప్పారు. బ్రిటిషు ప్రభుత్వం, రాజకీయ నాయకుల మద్దతుతో కేంద్రప్రభుత్వాన్ని నిజంగా ఏర్పాటు చేయదలచుకున్నట్టయితే ఇది మంచి అవకాశమని దేశాయి వైస్‌రాయికి చెప్పారు.

రాజకీయరంగంలో పురోభివృద్ధికి దేశాయి సూచించిన పథకం మంచి అవకాశాన్ని కల్పిస్తుందని వైస్‌రాయి భారతదేశానికి సంబంధించిన బ్రిటిషు మంత్రికి సూచించినట్టు తెలిసింది. బ్రిటిషు ప్రభుత్వం ఒప్పందంలోని అనేక అంశాలకు వివరణ కోరింది. ఈలోగా, దేశాయి - లియాఖత్ ఒప్పందం గురించి తమకేమీ తెలియదని జిన్నా బహిరంగంగా ప్రకటించారు. అయితే దీనివల్ల దేశాయి నిరుత్సాహపడలేదు.[58] కాంగ్రెసు కార్యవర్గంకూడా 1945 జూన్‌లో విడుదలైన తర్వాత దేశాయి కృషిని కొట్టివేసింది.

## అయిదవ శాసనసభ ఆఖరు సమావేశం

ఇటువంటి పరిస్థితుల్లో అయిదవ శాసనసభ బడ్జెటు సమావేశం 1942 ఫిబ్రవరి 8వ తేదీన ప్రారంభమైంది. ఇదే ఆఖరు సమావేశంకూడా. 1944లో మోస్తరుగానే, ఈ ఏడాదికూడా ప్రభుత్వ బడ్జెటు ప్రతిపాదనల్లో చాలావాటిని కాంగ్రెసుపార్టీ ముస్లింలీగ్ కలిసి ఓడించాయి.

మార్చి 9వ తేదీన అబ్దుల్ కయ్యూమ్, కార్యవర్గసమితి పద్దులను 1 రూపాయకు తగ్గించాలని కోరుతూ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. భారత ప్రభుత్వాన్ని తిన్నగా అభిశంసించడమే ఇది. ప్రభుత్వం అనేక నిర్బంధ శిబిరాలను ఏర్పాటుచేసి భారత మాత పుత్రుల్లో ఉత్తములను విచారణ జరిపించకుండా నిర్బంధించి భారతదేశం పేరు ప్రతిష్ఠలకు భంగం కలిగించారని కయ్యూమ్ ఆరోపించారు. భారత ప్రభుత్వం అమెరికాలో భారత నాయకులగురించి దుష్ప్రచారం జరుపుతూవుందనికూడా ఆయన ఆరోపించారు.[59]

1935లోకూడా ప్రశాంతంగావున్న కొండజాతులు నివసించే ప్రాంతాల్లో రాయల్ ఎయిర్‌ఫోర్సు బాంబు దాడులు జరిపినందుకు రంగా ఈ విధంగా గర్హించారు :

"భారత ప్రభుత్వం ముసోలినీకి మార్గదర్శకంగా వ్యవహరించింది. భారత ప్రభుత్వం ముసోలినీ అడుగుజాడల్లో నడిచిందనటం సరికాదు. అయినా,

ఫాసిజంతో నాజిజంతో హిట్లర్ టోజోతో పోరాడుతున్నామని చెప్పుకునేందుకు ప్రభుత్వం ఏమాత్రం సిగ్గుపడడంలేదు." 60

భారతదేశంలోని రాజ్యాంగపరమైన క్లిష్టపరిస్థితికి ప్రభుత్వంలోని భారతీయ సభ్యులు కారణమన్న ఆరోపణను కార్యవర్గ సమితిలోని కామన్ వెల్త్ సంబంధాల సభ్యుడు ఎన్. బి. ఖరే ఖండించారు. యుద్ధం విషయంలో కాంగ్రెసు విధానం గురించి ప్రస్తావిస్తూ ఆయన, కాంగ్రెసు అన్నిటికీ సిద్ధపడిందనీ ముస్లింలీగ్‌కు గాయ పరచడంచేతనవునుకాని దెబ్బతీసేధైర్యం లేదని పేర్కొన్నారు. 61

ఖరే ఉపన్యాసంలోని ఈభాగం, లియాఖత్ అలీఖాన్‌కు నచ్చలేదు. "దెబ్బతీసేందుకు ముస్లింలీగ్ ఎప్పుడూ వెనుదీయదు. దెబ్బ ఏవిధంగాతీయాలో ఎప్పుడుతీయాలోకూడా ముస్లింలీగ్ కు బాగా తెలుసు" అని ఆయన హెచ్చరించారు. ప్రభుత్వం అనుసరిస్తున్న అణిచివేసే విధానాన్ని ఆయన గర్హించారు. "భారతీయులకు సంబంధించినంతవరకూ బ్రిటిషువారు, 1919 లో జనరల్ డయర్ వ్యవహరించిన తీరుగానే ఈనాడు వ్యవహరిస్తున్నారు" అంటూ లియాఖత్అలీఖాన్, గత కొన్నేండ్లుగా భారత ప్రభుత్వం అనుసరించిన విధానం వల్ల ప్రజలు ఇబ్బందులపాలయారని పేర్కొన్నారు. కయ్యూమ్ ప్రతిపాదించిన కోత తీర్మానాన్ని ఆయన సమర్థించారు.62

కాంగ్రెసు సభ్యులు సభలో లేనిసమయంలో కార్యవర్గ సమితిలోని భారతీయ సభ్యులు వారివిధులను నిర్వర్తించారనడాన్ని దేశాయి అవహేళన చేశారు. ఆ సభ్యులు వ్యవహరించినతీరు భారతదేశానికే తలవంపులుగా వుందని ఆయన పేర్కొన్నారు. యుద్ధం ప్రారంభమైన తర్వాత రూ॥ 830లను ఋణంగా సేకరించినట్లు ఆర్థిక సభ్యుడు తెలియచేసిన సమాచారం గురించి ప్రస్తావిస్తూ ఆయన, మనిషివిలువతో పోల్చి చూసినట్లయితే అది ఎంత అని ప్రశ్నించారు. భారతదేశపు స్టర్లింగ్ నిల్వల మాటేమిటని కూడా ఆయన ప్రశ్నించారు. భారతీయులు కరువుకాటకాలకు లోనై ఆకలి బాధలకు గురై చమటోడ్చిన ఫలితమే ఈసొమ్ము అనీ దీని గురించి ప్రభుత్వం సూచించిన పరిష్కారానికి తాము అంగీకరించజాలమనీ దేశాయి చెప్పారు. 63

చర్చ ఆఖరున తీర్మానంమీద ఓటింగ్ జరిగింది. కయ్యూమ్ కోతతీర్మానం 61 ఓట్లతో నెగ్గింది. వ్యతిరేకంగా 53 ఓట్లు పడ్డాయి. యుద్ధం తర్వాత ప్రణాళికలకూ అభివృద్ధికి ఉద్దేశించిన పద్దులను రూ॥ 1, కి తగ్గించవలసిందని కోరూతూ ముస్లింలీగ్‌కు చెందిన ఎసాక్ సేఠ్ ఆమరునాడు ప్రతిపాదించారు. కాంగ్రెసు సభ్యులు కోతతీర్మానాన్ని సమర్థించారు. తీర్మానం 59 ఓట్లతో నెగ్గింది. ప్రతికూలంగా 48 ఓట్లుపడ్డాయి. కాంగ్రెసూ ముస్లింలీగూ శాసనసభలో ఈవిధంగా ఏకంకావడంతో

ప్రభుత్వ ఆగ్రహానికి మేరలేకపోయింది.

ఆతరువాత ఆర్థికబిల్లుమీద విరుచుకుపడ్డారు. మార్చి 26 వ తేదీన చర్చలో పాల్గొంటూ లియాఖత్ అలీఖాన్ 1941 నుంచీ ముస్లింలీగ్ ఆర్థిక బిల్లులను వ్యతిరేకిస్తూ వచ్చిందని పేర్కొన్నారు. ప్రభుత్వ అధికారంలో తమకెటువంటిపాత్ర లేనపుడు, ప్రభుత్వం తన ఇచ్ఛవచ్చినట్లు ఖర్చు చేసుకునేందుకు నిధులను అందచేసే బాధ్యత వహించజాలమన్నది ముస్లింలీగ్ వాదన. లీగ్ రాజకీయ లక్ష్యాలను ఆయన ఈవిధంగా పునరుద్ఘాటించారు:

"... ... భారతదేశానికి పూర్తి స్వాతంత్ర్యం కావాలని ముస్లింలీగ్ కోరుతూవుంది. దేశంలోని రెండు పెద్ద మతవర్గాలకు - హిందువులకూ - ముస్లింలకూ సమాన అవకాశాలు వున్నపుడే దేశంలో శాంతి నెలకొని అభ్యున్నతికి వీలుంటుందని మేము అభిప్రాయపడుతున్నాము. హిందువులకు ముసల్మానులకూ ప్రత్యేక రాష్ట్రాలుంటేతప్ప ఇది వీలుపడదు. పాకిస్తాన్ కావాలని కోరడం, భారతదేశం బానిసదేశంగా కొనసాగేందుకు కాదు, భారతదేశం స్వతంత్రదేశం కావడానికే ఈవిధంగా కోరుతున్నాము."

లియాఖత్ అలీఖాన్ ఈ సందర్భంగా మాట్లాడుతూ, తాము దేశాయితో ఎటువంటి రహస్య ఒప్పందమూ కుదుర్చుకోలేదని చెప్పారు. ఇంకా ఈ విధంగా చెప్పారు :

"అధ్యక్ష మహాశయా, ఇది అభూత కల్పన. మేమిద్దరమూ ఒక ఒప్పందం కుదుర్చుకున్నామనడమే హాస్యాస్పదంగా వుంది. వైస్‌రాయి కార్యవర్గ సమితిలోని గౌరవనీయులైన భారతీయ సభ్యుల మోస్తరుగా మేము రాజకీయ అనాథలమేమీకాదు. దేశంలోని రెండు అతిప్రధానమైన అఖిలభారత సంస్థల సభ్యులము మేము. హిందూ - ముస్లిం సమస్యకు సంబంధించి ఎటువంటి ఒప్పందమైనా కుదిరేట్టయితే అది కాంగ్రెసు - ముస్లింలీగ్‌ల మధ్య మాత్రమే కుదరగలదు"64

లియాఖత్ అలీ తర్వాత దేశాయి మాట్లాడారు. భారత ప్రభుత్వం యునైటెడ్ నేషన్స్ శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశానికి పంపబోతున్న ప్రతినిధివర్గం గురించి ఆయన ప్రస్తావించారు. భారతదేశం పేరుతో ఈ బృందాన్ని పంపుతున్నందుకు ఆయన నిరసన తెలియచేశారు.

దేశాయి ఆ తర్వాత యుద్ధం విషయంలో భారతీయుల వైఖరి గురించి మాట్లాడారు. యుద్ధంలో భారతదేశం పాల్గొనేందుకు కాంగ్రెసు పెట్టిన షరతులను ప్రభుత్వానికి గుర్తుచేశారు:

"యుద్ధలక్ష్యాలను ప్రకటించాలని కోరాము. ఎందుకని ? రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత కూడా మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత మోస్తరుగానే బానిసలుగా ఉంటామా అన్న సంగతి కనుక్కునేందుకు. మొదటి ప్రపంచ యుద్ధంకూడా చిన్న దేశాల స్వాతంత్ర్యంకోసం పోరాడినదే. ఒకసారి దెబ్బతిన్నాంకాబట్టి ఈసారి, మా పరిస్థితి గురించి తెలుసుకుందామని అనుకున్నాము. మీరు పోరాడదలుచు కున్నట్టయితే మీ దేశంలోనే నిధులను సేకరించుకుని పోరాడండి. అంతేగాని, మా దగ్గరనుంచి రాబట్టుకుని, దానికి మమ్మలను గర్వపడవలసిందని కోరకండి. ఆ విధంగా కోరడానికి మీకు నోరెలా వచ్చింది ? పరిస్థితి ఇది. అందుచేత ఈ విజయ సందేశం మీ స్వాతంత్ర్య విజయమూ మా బానిసత్వమూ అయినట్టయితే మానవులుగా మీరు ఈ సందేశాన్ని ఆమోదించజాలరు. దాన్ని చూసుకుని గర్వించజాలరుకూడా. మీ కార్లమీద, టోపీలమీదవున్న 'V'ని తొలగించండి."

దేశాయి అటురువ, "యుద్ధంవల్ల ఈదేశానికి ఏమి చేకూరింది? " శాసనసభ్యుల మాట ఒదిలేయండి అని ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. దానికి సమాధానంకూడా హృదయవిదారకంగా ఈవిధంగా చెప్పారు:

"దేశంలో క్షామం ఏర్పడివుంది. అంటువ్యాధులు ప్రబలివున్నాయి. నగ్నదేవత దేశమంతటా తాండవమాడుతూ వుంది. ఋణభారంతో కృంగిపోయి వుంది దేశం. దేశాన్ని పిల్చి పిప్పిచేయడంతో తుడిచిపెట్టినట్టయి వుంది. ఇటువంటి దుర్భర పరిస్థితుల్లో మేము దీన్ని ఆమోదించాలని కోరుతున్నారు. పరిస్థితులు ఇంత నిరాశాజనకంగా వున్నా మేము ఆశ ఏమాత్రం ఒదులుకోలేదు.

"తంత్రీ ప్రాక్ దిశను కనికరించు
ఆశా జ్యోతి వెలుగొందినపుడు
మరొక వెలుగెందుకు"

అన్న కవితోపాటు నేనుకూడా ఆశాజీవిని. అది నెరవేరినప్పుడే మేము ఓటు చేస్తాం.65

ఆర్థిక బిల్లును సభవారు తిరస్కరించారు. ఆ మరునాడు శాసనసభ బిల్లును ఆమోదించవలసిందని వైస్‌రాయి శిఫార్సు చేశారు. బిల్లును ప్రవేశపెట్టేందుకు అనుమతిని కోరుతున్న తీర్మానాన్ని దేశాయి వ్యతిరేకించారు. దేశాయి, కొంచసేపే మాట్లాడినా ఆ ఉపన్యాసం చిరస్మరణీయమైనది. శాసనసభలో ఆ తర్వాత ఆయన మాట్లాడలేదు కూడా. ఆయన ఈ విధంగా అన్నారు :

"బెర్లిన్ ఆత్మశుద్ధికోసం దగ్ధమైపోతూవుందని మొన్న బి. బి. సి. అనౌన్సరొకరు గంభీరమైన కంఠంతో ప్రకటించగా విన్నాను. దీనిలోని నిగూఢ అర్థం అందరికీ తెలిసిందని చెప్పడానికి సాహసిస్తున్నాను. బెర్లిన్ ఆత్మశుద్ధికోసం దగ్ధమవుతూన్నట్టయితే అంతకంటె శుద్ధిపొందవలసిన సామ్రాజ్య నిర్మాతలు చాలామందే వున్నారు. ఇంగ్లాండు స్వాతంత్ర్యాన్ని అపహరించేందుకు ప్రయత్నించిన పాపానికి బెర్లిన్ తనను తాను శుద్ధిచేసుకుంటూవున్నట్టయితే ఇంగ్లాండు అటువంటి అనేక పాపాలకు ఆత్మశుద్ధి చేసుకోవలసివుంటుంది. పాపపరిహారాన్ని చేతలద్వారా వ్యక్తపరిచే సమయం ఆసన్నమైంది. ఆత్మశుద్ధికర్మ, సామ్రాజ్యవాద పాపానికి పరిష్కారమూ, వీటిని అనౌన్సర్ బెర్లిన్‌కు మాత్రమే వర్తింపచేయలేదని నేను ఆశిస్తున్నాను. ఇది మంచి గుణపాఠం. బ్రిటన్ కాలయాపనలేకుండా దీన్ని అనుసరించటం మంచిది. ఇకమీదట ఎటువంటి సాకులూ ఉండరాదు. నేను నిన్న చెప్పినట్టు మా దేశ వ్యవహారాలను ప్రజాప్రతినిధులమైన మేము చూసుకుంటామని స్పష్టంగా చెబుతున్నాను. అందుకుగాను నిన్న నాతోపాటు ఓటు చేసిన సభ్యులూ నాతో పాటు ఓటు చేయకపోయినా రాజ ఆదేశాన్ని ఉల్లంఘించాలని కోరుతున్న చాలామందీ ఈ బిల్లును తిరస్కరిస్తున్నాం."66

అనుమతి తీర్మానంమీద ఓటింగ్ జరిగింది. వ్యతిరేకంగా 57 ఓట్లు రావడంతో వీగిపోయింది. అనుకూలంగా 50 ఓట్లు మాత్రమే వచ్చాయి. అంతకుముందు రోజు మాస్తరుగానే కాంగ్రెసు సభ్యులు ముస్లింలీగ్ సభ్యులూ జాతీయవాదపార్టీ సభ్యులూ ఏకమై వైస్‌రాయి శిఫార్సుకు వ్యతిరేకంగా ఓటుచేశారు.

అయిదవ శాసనసభ ఆఖరు సమావేశం ముగిసింది. 1934 చివర ఎన్నికైన అయిదవ శాసనసభ సమావేశం చాలారోజులు జరిగింది. భారతదేశంలో రాజకీయ సమస్య పరిష్కారంలో భాగంగా తప్ప శాసనసభకు కొత్తగా ఎన్నికలు జరిగే అవకాశం లేదు.

## రెఫరెన్సులు

1. జాన్ గ్లెన్‌డొవెన్, ది వైస్‌రాయి ఎట్ బే : లార్డ్ లిన్‌లిత్‌గో ఇన్ ఇండియా, 1936–1943 (లండన్, 1971), పే. 137
2. ఇబిడ్., పే. 137-8
3. ఇబిడ్., పే. 138
4. ఇబిడ్., పే. 150

5. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 2, 1940, పే. 1120-24
6. ఇబిడ్., పే. 1127-9
7. ఇబిడ్., పే. 1147-8
8. సి. హెచ్. ఫిలిప్స్, ఎడ్., ది ఎవొల్యూషన్ ఆఫ్ ఇండియా అండ్ పాకిస్తాన్ 1858-1947 : సెలెక్ట్ డాక్యుమెంట్స్ (లండన్. 1962). పే. 354
9. ఇండియన్ నేషనల్ కాంగ్రెసు : మార్చి 1940 టు సెప్టెంబరు 1946. (అలహాబాదు. ఎ. ఐ. సి. సి, యన్. డి), పే. 74-75
10. ఫిలిప్స్. యన్. 8, పే. 370-71
11. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 41, 1940, పే. 299-315
12. ఇబిడ్., పే. 319-33
13. ఇబిడ్., పే. 460-69
14. ఇబిడ్., పే. 407-08
15. ఇబిడ్., వా. 5, పే. 790-804
16. ఇబిడ్., పే. 822
17. ఇబిడ్., పే. 826-27
18. ఇబిడ్., పే. 828
19. యఫ్. యల్. షూమన్, ఇంటర్‌నేషనల్ పాలిటిక్స్ (న్యూయార్కు, 1958) ఎడ్., 6, పే. 193
20. మారిస్ గ్వేయర్ అండ్ ఎ. అప్పాదురై, కంపా., స్పీచెస్ అండ్ డాక్యుమెంట్స్ ఆన్ ది ఇండియన్ కాన్‌స్టిట్యూషన్ 1921-1947 (లండన్, 1957) వా. 2, పే. 517-18
21. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1941, పే. 211-14
22. ఇబిడ్., పే. 235-36
23. ఇబిడ్., పే. 220-22
24. ఇబిడ్., పే. 224-28
25. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1941, పే. 1013-1017
26. డ్రాఫ్ట్ డిక్లరేషన్ ఇన్ గ్వేయర్ అండ్ అప్పాదురై యన్. 20, పే. 520-21

27. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్, యన్. 9, పే. 120-24
28. ఇబిద్.. పే. 29-35
29. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ వా. 3 1942, పే. 141-51
30. ఇబిద్., పే. 151
31. ఇబిద్., పే. 262-71
32. ఇబిద్., పే. 227-31
33. ఇబిద్., పే. 210-13
34. ఇబిద్.. పే. 293-4
35. ఇబిద్.. పే. 225-27
36. ఇబిద్., పే. 245-46
37. ఇబిద్., పే. 287-88
38. ఇబిద్.. పే. 309
39. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1943, పే. 248-50
40. ఇబిద్.. పే. 254-7
41. ఇబిద్.. పే. 250-52
42. ఇబిద్., పే. 252
43. ఇబిద్., పే. 256-58
44. ఇబిద్., పే. 264
45. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1944, పే. 108-10
46. ఇబిద్., పే. 115-18
47. ఇబిద్.. పే. 179
48. ఇండియన్ అన్యువల్ రిజిష్టర్ 1944, వా. 1, పే. 101
49. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 4, 1944. పే. 233-38
50. ఇబిద్., పే. 243-45
51. ఇబిద్., పే. 295-6
52. ఇబిద్., పే. 969-70

53. ఇబిద్., పే. 238-41

54. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ వా. 5, 1944 పే. 1958-61

55. ఇబిద్., పే. 963-66

55.a ఇబిద్., పే. 976-81

56. యం. సి. సీతల్‌వాద్, భూలాభాయి దేశాయి (కొత్తఢిల్లీ, 1968), చాప్టర్ 10

57. ఇబిద్., అపెండిక్స్ II

58. వి. పి. మీనన్, ది ట్రాన్స్‌ఫర్ అఫ్ పవర్ ఇన్ ఇండియా (కొత్తఢిల్లీ, 1968) పే. 176-8

59. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 2, 1945, పే. 1254-57

60. ఇబిద్., పే. 1269-71

61. ఇండియన్ అన్యువల్ రిజిస్టర్ 1945, వా. 1, పే. 171

62. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, యన్ 59, పే. 1275-77

63. ఇబిద్., పే. 1281-84

64. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 3, 1945, పే 2042-49

65 ఇబిద్., పే. 2050-56

66. ఇబిద్., పే. 2110

# ఎనిమిదవ అధ్యాయము

## ఆఖరి ఘట్టం (1945 - 1947)

యూరోపులో యుద్ధం 1945 మే నెలలో అంతమైంది. దీనికి ముందు వైస్‌రాయి భారతదేశానికి సంబంధించిన మంత్రితో సంప్రదింపులు జరిపేందుకు లండన్ వెళ్ళారు. తిరిగి వచ్చిన తర్వాత జూన్ 15 వ తేదీన, కొత్త కార్యవర్గ సమితి ఏర్పాటు గురించి చర్చించేందుకు భారతీయ నాయకులను ఆహ్వానించతల పెట్టినట్టు ప్రకటించారు. కొత్త సమితిలో హిందువులూ ముస్లింలూ సమాన నిష్పత్తిలో వుంటారని తెలియచేశారు. వైస్‌రాయి, కమాండర్— ఇన్-చీఫ్ తప్ప సమితిలోని మిగతా సభ్యులందరూ భారతీయులే వుంటారు. ప్రస్తుత రాజ్యాంగానికి లోబడి అది పని చేస్తుంది. కొత్త శాశ్వత రాజ్యాంగం కుదిరి అమల్లోకి వచ్చేంతవరకూ తాత్కాలిక ప్రభుత్వం, బ్రిటిషు ఇండియా ప్రభుత్వాన్ని కొన సాగిస్తుంది.

తమ పథకానికి అనుకూలంగా వైస్‌రాయి, కాంగ్రెసు కార్యవర్గ సభ్యులను వెంటనే విడుదల చేసేందుకు ఉత్తర్వులు జారీ చేశారు. రాజకీయ ప్రతిష్టంభన తొలగించేందుకుద్దేశించిన వైస్‌రాయి పథకంలోని సమావేశం జూన్ 25 వ తేదీ నుంచి జూలై 14 వ తేదీ వరకు సిమ్లాలో జరిగింది. ముస్లింలీగ్‌లో సభ్యులైన ముస్లింలను మాత్రమే వైస్‌రాయి సమితిలో చేర్చుకోవాలని జిన్నా పట్టు పట్టడంతో సమావేశం విఫలమైంది. కాంగ్రెసు దీనికి అంగీకరించ లేదు.

జులై ఆఖరుకు ఇంగ్లాండులో లేబర్‌పార్టీ అధికారంలోకి వచ్చింది. ఆగష్టులో జపాన్ ఓటమిని అంగీకరించింది. సెప్టెంబరు 19 వ తేదీన వైస్‌రాయి మరొక ప్రకటన చేశారు. "భారత దేశంలో త్వరలో స్వయంపాలన" ఏర్పడేట్లు చూడడమే బ్రిటిషు ప్రభుత్వ విధానమని ప్రకటనలో పేర్కొన్నారు. ఇందుకు మొదటి చర్యగా, కేంద్ర రాష్ట్ర శాసనసభలకు కొత్తగా ఎన్నికలు జరుగుతాయనీ ఆ తర్వాత రాజ్యాంగాన్ని రూపొందించేందుకు ఒక సంస్థను సమావేశపరుస్తారనీ ప్రకటించారు.

### శాసన సభలకు ఎన్నికలు

ఈ ప్రకటనకు అనుగుణంగా కేంద్ర-రాష్ట్ర శాసనసభలకు ఎన్నికలు 1945-46 శీతాకాలంలో జరిగాయి. ప్రజాభిప్రాయంలో కాంగ్రెసు, ముస్లింలీగ్ రెండు పెద్ద

పార్టీలుగా అవతరించాయి. కేంద్ర శాసనసభలో కాంగ్రెసు, సాధారణ నియోజక వర్గాలలో 91.3 శాతం ఓట్లతో 57 స్థానాలను గెల్చుకుంది. ముస్లింలీగ్, 30 ముస్లిం స్థానాలనూ గెల్చుకుంది. ముస్లిం ఓట్లతో 86.6 శాతం ఓట్లను ముస్లింలీగ్ గెల్చుకుంది, రాష్ట్ర శాసనసభ ఎన్నికల్లో కాంగ్రెసు, మొత్తం ఓట్లలో 55.5 శాతంతో 930 స్థానాలు సంపాదించింది. ముస్లింలీగ్, ముస్లిం ఓట్లలో 74.3 శాతంలో 507 ముస్లిం స్థానాల్లో 427 స్థానాలు సంపాదించింది.[2] ముస్లింలీగ్ యుద్ధ సమయంలో లభించిన అవకాశాన్ని బాగా వినియోగించుకునిమతపరమైన విద్వేషాన్ని వ్యాపింప చేయడంలో విజయవంతమైంది. తమ పార్టీకి ముస్లింలో ఎక్కువమంది మద్దతు వుందని జిన్నా ఇప్పుడు చెప్పుకోగలిగారు. దేశంలోని మతవాద పత్రికలతో పోరాడీ, బెంగాల్-పంజాబ్‌లలో కర్షక ప్రజానీకంతో సన్నిహిత సంబంధం కోసం ప్రయత్నించీ జాతీయ వాదులు ప్రతిఫలంగా పొందినది ఇది.

ఈ పరిణామాలు జరుగుతూ వుండగా భారత ప్రజానీకంలో దౌర్జన్యవాదం పెరుగుతూ వచ్చింది. ఐ. ఎన్. ఏ. కు అనుకూలంగా కలకత్తా-బొంబాయి ఇతర నగరాల్లో జరిగిన బ్రహ్మాండమైన ప్రదర్శనలవల్ల ఇది బాగా ప్రస్ఫుటమైంది. 1946 ఫిబ్రవరిలో బొంబాయి-కరాచి- మద్రాసుల్లో రాయల్ ఇండియన్ నేవీకి చెందిన రేటింగ్‌లు తిరుగుబాటు జరుపడం వారికి తను మద్దతు ప్రకటిస్తూ దేశం వివిధ ప్రాంతల్లో కార్మికులూ ఇతరులూ సమ్మెలు జరుపడంవల్ల దేశ ప్రజల్లో రాజకీయ చైతన్యం బాగా ఎక్కువైనట్టు స్పష్టమైంది. ప్రజల్లో అసంతృప్తి ప్రబలింది. కార్మికులూ విద్యార్థులూ పోలీసులు కూడా సమ్మెలు ప్రదర్శనలు జరుపడం ప్రారంభించారు. ఈ అసంతృప్తి సాయుధ దళాల్లో, అధికార యంత్రాంగంలో కూడా వ్యాపించింది. ప్రజా సమూహం జరుపుతున్న పోరటంలో బ్రిటిషు అధికార్లు ఈ ఘట్టంలో తమ దమన విధానాన్ని కొనసాగించలేక పోయారు.

## ఆరవ శాసన సభ

ఈ వాతావరణంలో ఆరవ శాసనసభ 1946 జనవరి 21 వ తేదీన మొదటి సమావేశం ప్రారంభించింది. సభ్యుల్లో చాలా మంది కొత్తవారు. కాంగ్రెసు సభ్యులు గాంధీ టోపీలు పెట్టుకుని వెళ్లారు. ముస్లింలీగ్ సభ్యులు ఫెజ్ టోపి పెట్టుకుని బటన్ హోల్‌లో జిన్నా బొమ్మను పెట్టుకుని వెళ్ళారు.

శరత్ చంద్రబోస్, శాసనసభలోని కాంగ్రెసు పార్టీకి నాయకులయ్యారు. ఈయన విడుదల కోసం అయిదవ శాసనసభ ఎంతో పోరాడింది. అసఫలీ ఉప నాయకులయ్యారు. జిన్నా ఇదివరకటి మోస్తరుగానే ముస్లింలీగ్ నాయకులయ్యారు. లియాఖత్ అలీ ఖాన్

ఉపనాయకులయ్యారు. కాంగ్రెసు-ముస్లింలీగ్ పక్షాల్లో చాలా మంది పరిచయస్థులు గావడంతో శాసనసభలో స్నేహపూరిత వాతావరణం ఉండేది. అయి అందరిలోనూ ఒక కొత్త ధోరణి కనిపించింది.

శాసనసభ సమావేశమైన మొదటి రోజునే ఎన్. జి. రంగా చర్చా ధోరణి ప్రారంభించారు. జపాన్‌తో యుద్ధం ముగిసిన తర్వాత కూడా ఇండోనేషియా ఇండో చైనాల్లో బ్రిటిషు ప్రభుత్వం నిర్వహించిన సైనిక కార్యకలాపాల్లో సహకారాన్ని భారత ప్రభుత్వం నిరాకరించకపోవడం గురించి చర్చించాలని కోరుతూ రంగా ఒక వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించారు. శాసనసభ అభిప్రాయాన్ని తెలుసుకోకుండా భారత సైనికులను ఈ దేశాలకు పంపడానికి ప్రభుత్వం నిర్ణయించినందుకు కూడా ఆయన విమర్శించారు. ఈ దేశాల్లో జరుగుతున్న యుద్ధం, ధనికులూ-పేదల మధ్య జరుగుతున్న యుద్ధమని ఆయన వర్ణించారు. ఇండొనేషియాలో డచ్ సామ్రాజ్య వాదాన్ని ఇండో చైనాలో ఫ్రెంచ్ సామ్రాజ్యవాదాన్ని సమర్థించేందుకు భారతీయ సైనికులను ఉపయోగిస్తున్నందుకు ఆయన ప్రభుత్వాన్ని గర్హించారు.

రంగాను శరత్ చంద్రబోస్ గట్టిగా సమర్థించారు. డచ్ వారిపట్ల తమకున్న నైతికపరమైన బాధ్యత గురించి బ్రిటిషు ప్రభుత్వం పదే పదే చెప్తూవుందని అంటూ బోస్, తమ అధీనంలోని తూర్పు దేశాలపై వలస ఆధిపత్యాన్ని కొనసాగించేందుకు పశ్చిమ దేశాలకు చెందిన ఒక స్వప్రయోజన పరుడికి మరొక స్వప్రయోజనపరుడిపట్ల వున్న బాధ్యత ఇదీ అని వివరించారు. భారతదేశం మీద తమ ఆధిపత్యాన్ని కొనసాగించేందుకేకాక ఫ్రెంచ్-డచ్-అమెరికన్ సామ్రాజ్యవాద ఆధిపత్యం కొనసాగించేందుకు కూడా సామ్రాజ్యవాద దళాలు పోరాటం సలుపుతున్నాయని ఆయన పేర్కొన్నారు. భారత ప్రభుత్వానికి నైతికపరమైన బాధ్యత ఏదైనా వున్నట్లయితే అది భారతీయులపట్ల వుందని భారతీయులు తూర్పుదేశాల పట్ల తమ సానుభూతిని మద్దతునూ ఏక కంఠంతో ప్రకటించివున్నారని ఆయన భారత ప్రభుత్వానికి చెప్పారు. కొత్తగా ఏర్పాటైన ఇండొనేషియా రిపబ్లిక్ స్వాతంత్ర్యాన్ని అపహరించేందుకు భారత సైనికులను పంపించడంపట్ల జిన్నా తమ దిగ్భ్రాంతిని వ్యక్తపరిచారు. ప్రభుత్వం అబద్ధాలతో తన చర్యలను సమర్థిస్తూ వుందని ఆయన పేర్కొన్నారు.

కాంగ్రెసు - ముస్లింలీగుకు - చెందినవారు చాలామంది, బ్రిటిషు చర్యను గర్హించారు. వాయిదా తీర్మానాన్ని సమర్థించారు. తీర్మానంమీద ఓటింగ్ జరప కుండానే శాసనసభ తీర్మానాన్ని ఆమోదించింది.

జనవరి 23 వ తేదీన మోహన్‌లాల్ సక్సేనా, డెటిన్యూలను విడుదల చేయనం దుకు భారత ప్రభుత్వాన్ని అభిశంసిస్తూ ఒక వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించారు. డెటిన్యూలపై ఏవైనా ఆరోపణలున్నట్లయితే, న్యాయస్థానంలో ఎందుకు హాజరు పరచ లేదని ప్రభుత్వాన్ని కోరారు. ప్రభుత్వం విచారించవలసినరోజు ఎంతోదూరంలేదని హెచ్చరించారు. దేశభక్తులను ప్రభుత్వం విచారణ జరిపించకుండా ఖైదులో వుంచ గలదు కాని ఈవిధంగా చేస్తునందుకు ఒకరోజు విచారించవలసి వస్తుందని అన్నారు. ఉత్తర్వును ఉపసంహరించుకుని డెటిన్యూలను విడుదలచేయడం మంచిదని సలహా ఇచ్చారు.

ఎం. ఆర్. మసాని తీర్మానాన్ని సమర్థించారు. జయప్రకాష్ నారాయణ్, రామమనోహర్ లోహియా - సర్దార్ శార్దూల్‌సింగ్ కలీషర్ కృష్ణన్‌నాయర్‌ల గురించి ఆయన ప్రత్యేకంగా మాట్లాడారు. ఇంగ్లండులోని లేబర్ ప్రభుత్వం, భారత దేశంలోని ఈ సోషలిస్టు నాయకులను ఖైదులో వుంచేందుకు ఆయన విచారం వ్యక్త పరిచారు. భారతదేశంలో ప్రజాస్వామ్య పద్ధతులద్వారా సోషలిస్టు సమాజ స్థాపన కోరుతున్న వ్యక్తి ఎవరైనా ఈదేశంలో వున్నట్లయితే ఆవ్యక్తి జయప్రకాశ్ నారాయణ్ అని చెబుతూ మసాని, డెటెన్యూలందరినీ విడుదలచేయాలని ప్రభుత్వాన్ని కోరారు. 3

కలకత్తాకు చెందిన అబ్దుర్‌రహ్‌మాన్ సిద్దికీ వాయిదాతీర్మానాన్ని సమర్థిస్తూ, ప్రభుత్వం ఐ. ఎన్. ఎ. సిబ్బందిని అంతసులభంగా విడుదలచేసినపుడు నలుగురినీ బ్రిటిషు ఇండియా భద్రతకోసం నిర్బంధంలో వుంచడం సబబూ న్యాయసమ్మతమూ అని ఎంత వాదించినా తాము అంగీకరించజాలమని చెప్పారు.

ఈ వాయిదా తీర్మానాన్నికూడా సభవారు ఓటింగ్ జరుపకుండానే ఆమోదించారు.

## శాసనసభ అధ్యక్షుడి ఎన్నిక

జనవరి 24 వ తేదీన శాసనసభ అధ్యక్షుడి ఎన్నిక జరిగింది. కాంగ్రెసుపార్టీ, జి. వి. మవలంకర్‌ను నామినేట్ చేయగా ముస్లింలీగ్ కావాస్‌జీ జహంగీర్‌ను నామినేట్ చేసింది. ప్రభుత్వం, తనతరపు అభ్యర్థి ఎవరూ లేకపోయినా లీగ్ అభ్యర్థి విజయానికి బాగా ప్రయత్నించింది. ఆఖరి క్షణంవరకూ అంటే జనవరి 24 వ తేదీ ఉదయం వరకూ ప్రభుత్వ విప్‌లు లీగ్ అభ్యర్థివిజయానికి ప్రయత్నించారు.

ఎన్నికల ప్రచారం ముమ్మరంగా జరుగుతూ వుండగా అధ్యక్ష ఎన్నిక జరిగింది. కాంగ్రెసు అభ్యర్థి మవలంకర్, మూడుఓట్ల మెజారిటీతో గెల్చారు. కాంగ్రెసు బెంచీలవారు, సంతోషంతో జైహింద్ అని వినాదాలు చేశారు. ఈ ఎన్నికలో ముస్లిం

లీగ్ సభ్యులూ ప్రభుత్వపక్షంవారూ, యూరోపియన్లూ అందరూ కలిసి కాంగ్రెసు అభ్యర్థికి వ్యతిరేకంగా ఓటుచేశారు. ఈ ఎన్నిక సందర్భంగా జరిగి ఒక ముఖ్య విశేషం, యూరోపు బృందం తరపున పి. జె. గ్రిఫిత్స్ కొత్తగా ఎన్నికైన అధ్యక్షులను అభినందిస్తూ ఈ శాసనసభ ముగిసేలోపున పూర్తి సర్వం సహాధికారం గల శాసనసభగా రూపొందగలదన్న ఆశాభావాన్ని వ్యక్తపరచినపుడు లియాఖత్‌అలీఖాన్ తప్ప మిగతా సభ్యులందరూ హర్షధ్వానాలు చేశారు. లియాఖత్‌అలీఖాన్ మాత్రం 'వీలులేదు' అని అరిచారు.[4]

ఐ. ఎన్. ఎ. అధికార్ల విడుదలకోసం ఒత్తిడి

శాసనసభ మొదటి సమావేశంలో సభ్యులు, ఐ. ఎన్. ఎ. సిబ్బందిని విడుదల చేయడం గురించి చాలాసార్లు ప్రస్తావించారు. బహదూర్‌గర్ శిబిరంలో ఐ. ఎన్.ఎ. సిబ్బందిని క్రూరంగా చూడడం గురించి చర్చించాలని కోరుతూ దివాన్ చమన్‌లాల్ జనవరి 30 వ తేదీన ఒక వాయిదా తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. సుభాష్‌చంద్రబోస్ నాయకత్వంలో ఇండియన్ నేషనల్ ఆర్మీగా ఏర్పాటైన సుమారు మూడువేలమందిని బర్మానుంచి తీసుకువచ్చి బహదూర్‌గర్ శిబిరంలోపెట్టి వారిని అమానుషంగా చూస్తున్నారని సభవారికి తెలియచేశారు. స్వాతంత్ర్యంకోసం ప్రయత్నించినందుకూ తమను క్రూరంగా చూసినందుకు నిరసన తెలియచేసినందుకూ వారిని నిర్బంధంలో వుంచారని ఆయన పేర్కొన్నారు.

శ్రీ ప్రకాశ తీర్మానాన్ని సమర్థించారు. ఐ. ఎన్. ఎ. సిబ్బందిమీద భారత ప్రభుత్వానికి ఎటువంటి అధికారమూ నైతికంగాగాని చట్టబద్ధంగాగాని లేదని వాదించారు. బ్రిటిషు ప్రభుత్వం వారిని ఒకవిదేశంలో అనాథలుగావదిలేసిందని ఆయన పేర్కొన్నారు. బ్రిటిషు ఆఫీసర్లు వీరిని జపాన్‌కు పట్టిఇచ్చిన సంగతి నిజంకాదా అని ఆయన ప్రశ్నించారు. "అటువంటప్పుడు వారేంచేస్తారు? అటువంటి పరిస్థితుల్లో వారు స్వదేశానికి వ్యతిరేకంగా వ్యవహరించినందుకు మనమందరమూ గర్వపడవలసి వుంది. నిజానికి ప్రభుత్వం వారిని సన్మానించివుండవలసింది. దానికి బదులు ప్రతీకారచర్య తీసుకోవాలన్న భావంతో వారిని పట్టితెచ్చి ప్రశ్నించి, హింసించి, వారిని అన్నివిధాలా పీల్చి పిప్పిచేస్తున్నారు. వారు తమ ప్రయత్నాల్లో విజయం పొందలేకపోయారన్నది మనందరికీ సంతోషదాయకం" అన్నారు శ్రీ ప్రకాశ.[5]

లియాఖత్‌అలీఖాన్, తీర్మానాన్ని కొన్ని షరతులతో సమర్థించారు. ఐ. ఎన్. ఏ.లో చేరినవారిలో చాలా కొద్దిమందిమాత్రమే తమ ఇష్టానుసారం చేరారనీ అందువల్ల ప్రభుత్వం వారిమీద అసలు కేసును ప్రారంభించి వుండరాదనీ అన్నారు. తమకు

అనుకూలంగా ప్రచారం చేసుకూనేందుకు కాంగ్రెసు ఐ. ఎన్. ఏ. ఖైదీలను ఉపయోగించుకుంటూ వుందని ఆయన ఆరోపించారు. తీర్మానాన్ని ప్రతిపాదించిన గౌరవనీయులైన సభ్యులూ మరికొంతమందీ, ఐ. ఎన్ ఏ. సిబ్బందిని దేశభక్తులుగా వర్ణిస్తున్నారు. అధ్యక్ష మహాశయా వీరిలో కొంతమంది, తమ పరిస్థితి మెరుగ్గా వుంటుందన్న ఆశతో ఈ సైన్యంలో చేరారు. మరికొంతమంది బోసు నాయకత్వంలో తమ వర్గం వారికి, ఈ దేశంలో శ్రీ బోసు వర్గం వారికి ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసే అవకాశం లభించగలదన్న ఆశతో చేరారు. ఇకపోతే ముస్లింలు ఈ సైన్యంలో చేరక పోయినట్టయితే ఈ సైన్యం భారతదేశానికి వచ్చినపుడు కొంతమందికి స్వాతంత్ర్యమూ మరికొంతమందికి బానిసత్వమూ లభించగలదన్న భయంతో ముస్లింలు ఈ సైన్యంలో చేరారని కేప్టన్ అబ్దుర్‌రషీద్ తమ ప్రకటనలో పేర్కొన్న సంగతి మనకు తెలుసు". 6

లియాఖతలీ ఖాన్‌వారికి ముస్లింలీగ్ తరపున సానుభూతి వ్యక్తపరిచారు. తీర్మానం మీద ఓటింగు జరుగలేదు. సభ వాయిదాపడేవరకూ చర్చ జరుపుతూనే ఉన్నారు.

1946 ఫిబ్రవరి 4వ తేదీన పండిత గోవింద మాలవ్యా ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. ఐ. ఎన్. ఏ.కు చెందిన ఆఫీసర్లు సిబ్బందిమీద జరుపుతున్న విచారణను రద్దుచేయాలనీ, ఇతర రాజకీయ ఖైదీలందరినీ విడుదల చేయాలని తీర్మానంలో కోరారు. ఐ. ఎన్. ఏ. ఆఫీసర్లూ సిబ్బందీ భారతీయుల గౌరవాన్ని చూరగొన్న వీరులనీ, ప్రభుత్వం భారతీయుల అభిప్రాయాలను మన్నించాలనీ మాలవ్యా కోరారు. జయ ప్రకాశ్‌నారాయణ, అచ్యుతపట్‌వర్ధన్ వంటి నాయకులు నిర్బంధంలో వున్నంతకాలం సహకారం గురించీ సుహృద్భావం గురించీ మాట్లాడటం నిరుపయోగమేకాక నిష్ఫల మైన పిల్లచేష్టయే కాగలదని ఆయన వాదించారు.7

ఠాకుర్‌దాసు భార్గవ, గాడ్గిల్, శశాంకశేఖర్ సన్యాల్, డి. పి. కర్మార్కర్ ఇత రులూ మాలవ్యాను సమర్థించారు.

శరత్‌చంద్ర బోసు, ఈ విషయమై చాలా బాగా మాట్లాడారు. ఐ. ఎన్. ఏ.కు చెందిన వేలాదిమంది సిబ్బంది భారతదేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన యోధులుగా చిరస్మరణీయులని ఆయన చెప్పారు. భారతీయుల దృష్టిలో షానవాజ్‌ఖానుకూ, అబ్దుర్ రషీద్‌కూ భేదంలేదని అన్నారు వారందరినీ బేషరతుగా విడుదలచేయాలని ఆయన ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.8

అసఫలీ తీర్మానాన్ని సమర్థిస్తూ ఐ. ఎన్. ఏ. ఆఫీసర్లమీద జరుపుతున్న విచారణ వల్ల ఒక సంగతి స్పష్టంగా తెలుస్తున్నదని చెప్పారు. భారతీయసైన్యం ఎంతబాగా వ్యవస్థీకృతమైనది అయినప్పటికీ, పరిణామాలను లెక్కచేయకుండా పోరాడేందుకుగానీ,

ప్రాణాలర్పించేందుకుగాని వారిలో ఉత్సాహం లోపించిందని ఆయన పేర్కొన్నారు. భారతీయ సైన్యం, పోరాటం సల్పేందుకు ఎప్పుడూ ప్రేరేపణ యేదీ వారికి కనిపించ లేదు. కాని, ఐ. ఎన్. ఏ.కి చెందిన ఆఫీసర్లూ సిబ్బందిమాత్రం సమయం వచ్చి నప్పుడు తమదేశంకోసం, అతి ప్రతికూల పరిస్థితుల్లోకూడా పోరాడ్డానికి వెనుదీయలేదని ఆయన చెప్పారు. "జపాన్ చేతుల్లో కీలుబొమ్మలుగా పనిచేయటానికి ఐ. ఎన్. ఏ.ని యేర్పాటు చేయలేదు. అసలు ఐ. ఎన్. ఏ. విషయాన్నంతటినీ త్వరలో అధికారం లోకి రాబోతున్న కొత్త ప్రభుత్వానికి వదిలేయవలసింది. భారతదేశంలో అధికారం, చేతులు మారబోతూవుందని వింటున్నాం. ఇది జరిగినదాకా ప్రభుత్వం ఎందుకు వేచి వుండలేకపోయింది" అని అసహలీ ప్రభుత్వాన్ని ప్రశ్నించారు.[9]

జిన్నా మాట్లాడుతూ ఐ. ఎన్. ఏ. విషయంలో ప్రభుత్వం పెద్ద పొరపాటుచేసిందని చెప్పారు. "విచారణ అంతా జరిపినతర్వాత న్యాయస్థానం, తీర్పు, శిక్ష యిచ్చిన తర్వాత, ప్రభుత్వం అందరినీ ఆ మరుక్షణమే విడుదలచేయటం హాస్యాస్పదంగావుంది. అసలు విచారణ ప్రారంభించకుండా వుండవలసింది. రషీద్ అమానుషంగా ప్రవ ర్తించారని నేను అనుకోవడం లేదు. షానవాజ్, ఇతరులకంటె రషీద్ అపరాధి ఏమీ కాదు."

"సమయం వచ్చినపుడు పాకిస్థాన్‌లో నా సైన్యం, ఫలితాలు ఎటువంటివైనా విధేయ తతోవుంటుంది. ఒకవేళ ఆ విధంగా లేనివాడు సైనికుడుగానీ, ఆఫీసరుగానీ, పౌరుడుగానీ వారికి విల్లియం జాయిస్, జాన్ అమెరీలకు పట్టినగతే పడుతుంది"[10]

ఐ. ఎన్. ఏ.కి చెందిన సిబ్బందినీ, ఆఫీసర్లనందరినీ విడుదల చేయాలని జిన్నా కోరారు.

శ్రీమతి అమ్ముస్వామినాధన్ తీర్మానాన్ని సమర్థిస్తూ, భారతీయుల అభిమానాన్నీ, గౌరవాన్నీ చూరగొన్న వేలాది దేశభక్తులను బేషరతుగా విడుదలచేస్తే తప్ప, రాజకీయ సమస్య పరిష్కారానికి అవసరమైన శాంతియుత వాతావరణం ఏర్పడబోదని చెప్పారు. అసలు ఎవరినైనా దేశద్రోహులని పేర్కొనే అధికారం ప్రస్తుత ప్రభుత్వానికిలేదని మణి లెన్‌కారా చెప్పారు. దేశద్రోహ నేరానికి ఎవరిమీదైనా విచారణ జరిపించేహక్కు ప్రస్తుత ప్రభుత్వం ప్రజలనుంచి పొందలేదని ఆమె వాదించారు.

ఈ తీర్మానంమీద, ఈ సమావేశంలో మూడురోజులు చర్చ జరిగింది. ఆ తర్వాత సమావేశంలోకూడా కొనసాగింది. ఆ తర్వాత సమావేశంలోకూడా లియాఖత్‌అలీఖాన్ అప్పటికి తాత్కాలిక ప్రభుత్వంలోచేరిన సర్దార్ వల్లభాయ్ పటేల్ సూచించిన మీదట చర్చను ఆ తర్వాత సమావేశానికి వాయిదావేశారు. ఏది ఏమైనప్పటికీ ఐ. ఎన్. ఏ.

సిబ్బందినీ, ఆఫీసర్లనూ విడుదలచేయాలని శాసనసభ్యులు కోరుతున్నట్టు స్పష్టం అయింది.

రాయల్ ఇండియన్ నేవీ (నౌకాదళం) తిరుగుబాటు గురించి చర్చ :

అరవ శాసనసభ దృష్టిని ఆకర్షించిన మరొక ముఖ్య సంఘటన రాయల్ ఇండియన్ నేవీ తిరుగుబాటు. ఇండియన్ నేవీ అధికారం రేటింగు (అనధికారపూర్వకంగా నియమింపబడిన సైనికులు) ల విషయంలో అనుసరిస్తున్న విధానంవల్ల తలఎత్తిన తీవ్రపరిస్థితి గురించి చర్చించాలనికోరుతూ అసఫలీ ఫిబ్రవరి 22వ తేదీన ఒక వాయిదా తీర్మానాన్ని ప్రతిపాదించారు. నౌకాదళంలోని చిన్నపిల్లలపట్ల అధికార్లు వ్యవహరిస్తున్న తీరును ఆయన గర్హించారు. ఈ విషయంలో రక్షణ సలహా సంప్రదింపుల సంఘాన్ని సంప్రదించాలని ఆయన సూచించారు. మొత్తం సమస్యనంతటినీ ప్రజాప్రతినిధులకు నివేదిస్తున్నారనీ వారి సలహాతో యుద్ధశాఖ భవిష్యత్తులో అనుసరించవలసిన విధానాన్ని రూపొందిస్తుందనీ, తిరుగుబాటు జరుపుతున్న రేటింగులకు తెలియచేయవలసిందని అసఫలీ కోరారు.

ఆ మర్నాడుకూడా కొనసాగిన చర్చలో పాల్గొంటూ అసఫలీ సైన్యంలో సమ్మెలవల్ల జరిగే ప్రమాదాల గురించి తమకు పూర్తిగా తెలుసునని చెప్పారు. అయితే ఈ సమ్మెకు ఎవరు బాధ్యులని ఆయన ప్రశ్నించారు. "ప్రస్తుత పరిస్థితుల్లో నిగ్రహించుకుని ఉండడం ఎంతో కష్టమే అయినా వీలయినంత నిగ్రహంతో వ్యవహరించాలనీ నేను కోరుతున్నాను. భారతనౌక త్వరలో ఒడ్డుకు చేరుకోబోతూ వుంది అని నాకు తెలుసు కనుక నేను నిగ్రహించుకోగల్గుతున్నాను."12

శరత్‌చంద్రబోస్, అసఫలీ సూచనను సమర్థించారు. బొంబాయి - కరాచీల్లో పరిస్థితి విషమిస్తూవుందని పేర్కొంటూ ఆయన ప్రభుత్వం అతిజాగ్రత్తగా వ్యవహరించాలని కోరారు.

సర్దార్ మంగల్‌సింగ్ మాట్లాడుతూ, సర్దార్ వల్లభాయి పటేల్ కృషివల్ల రక్తపాతం జరుగకుండా ఆగిందనీ దేశం ఆయనకు ఋణపడివుందనీ పేర్కొన్నారు. భారత ప్రభుత్వం అశ్రద్ధ చేయరాదనీ విచారణ వెనుకవున్న పరిస్థితులను అర్థంచేసుకోవలసిందనీ ఆయన ప్రభుత్వాన్ని కోరారు. యుద్ధశాఖ అనుసరిస్తున్న జాతి వివక్షణ దీనికంతటికీ మూల కారణమని చెప్పారు.

రేటింగులలో తమకు భద్రతలేదన్న భావమే ఈ అలజడులకు ప్రధాన కారణమని మసాని పేర్కొన్నారు. ఒకవైపున వందలాది భారతీయ ఆఫీసర్లనూ వేలాది భార

తీయ రేటింగులనూ నౌకాదళంలో నుంచి పంపివేస్తూ మరొక వైపున బ్రిటిషు రాయల్ నేవీకి చెందిన 300 మంది ఆఫీసర్లను భారతదేశానికి తరలిస్తున్నట్టు ఆయన తెలియ చేశారు. నౌకాదళ కేంద్ర కార్యాలయానికి ఈ ఇబ్బందుల గురించి చాలాకాలంగా తెలుసుననీ అయినా పట్టించుకోలేదనీ ఆయన ఆరోపించారు. "పరిస్థితి అదుపులో వుందనీ ప్రభుత్వ గౌరవప్రతిష్ఠలకు భంగం కలుగలేదనీ శాసనసభకు చెబుతూ వుచ్చారు. అన్ని పార్టీల జాతీయనాయకులూ అధికార్ల ఆదేశాలను సమర్థించినందువల్లనే ప్రభుత్వ పేరు ప్రతిష్ఠలకు భంగం కలుగలేదు. అయినా ఈవిధంగా సాధించిన విజయం ఎందుకు ? రేటింగ్‌ల నిజమైన ఇబ్బందులను తొలగించి వారి ఆత్మాభిమానాన్నీ దేశభక్తినీ గుర్తించగలరని నేను ఆశిస్తున్నాను" అన్నారు మసాని. 13

రేటింగుల ఇబ్బందుల గురించి తెలుసుకోవడానికిగాని, వాటిని సరిదిద్దేందుకుగాని ప్రభుత్వం ప్రయత్నించనందుకు లియాఖత్ అలీఖాన్ విచారం వ్యక్తపరిచారు. ప్రభుత్వం మత్తు ఒదలించుకుని, ప్రజాభిప్రాయాన్నీ శాసన సభ్యుల అభిప్రాయాలనూ మన్నించా లని కోరారు. 14

ఈ వాయిదా తీర్మానం మీద రెండు రోజులపాటు చర్చ జరిగిన తర్వాత, సభవారు 74 ఓట్లతో ఆమోదించారు. ప్రతికూలంగా 40 ఓట్లు పడ్డాయి.

### మంత్రి మండలి బృందం పథకం

రాయల్ ఇండియన్ నేవీ తిరుగుబాటూ, సానుభూతి సమ్మెలూ ఉధృతంగా ఉన్న పుడు ప్రధాన మంత్రి శ్రీ అట్లే, ఫిబ్రవరి 19 వ తేదీన, కామన్స్ సభలో ఒక ప్రకటన చేశారు. రాజ్యాంగ–రాజకీయ సమస్యను పరిష్కరించేందుకు మంత్రిమండలి బృందాన్ని భారతదేశానికి పంపడానికి ప్రభుత్వం నిశ్చయించుకున్నట్టు ఈ ప్రకటనలో పేర్కొన్నారు. భారతదేశానికి సంబంధించిన మంత్రి లార్డ్ పెధిక్ లారెన్స్, స్టాఫర్డ్ క్రిప్స్, ఏ. వి. అలెగ్జాండర్, మార్చిలో భారతదేశం చేరుకున్నారు. భారతీయ నాయకులతో సుదీర్ఘ చర్చలు ప్రారంభించారు: రాజ్యాంగాన్ని రూపొందించేందుకు ప్రాతిపదిక విషయమై కాంగ్రెసూ–లీగ్ ఒక అంగీకారానికి రాలేకపోవడంతో మంత్రి మండలి బృందం, మే నెల 16 వ తేదీన తన పథకాన్ని ప్రకటించింది.

రాజ్యాంగ రూప కల్పనకు తమ ప్రతిపాదనలో భాగంగా మంత్రి మండలి బృందం, రాజ్యాంగ నిర్ణయ సభను నియమించాలని శిఫార్సు చేసింది. ఇటీవల ఎన్నికైన రాష్ట్ర శాసనసభలు రాజ్యాంగ నిర్ణయసభ సభ్యులను ఎంచుకోవాలని ప్రతిపా దించారు. వివిధ రాష్ట్రాల ప్రజలకు ప్రాతినిధ్యం వుండేందుకుగాను,

1) ఒక్కొక్క రాష్ట్రానికి జనాభాకు తగినట్టు పదిలక్షల మందికి ఒకరు చొప్పున స్థానాలను కేటాయించడం.

2) ఈ సీట్లను ప్రతి రాష్ట్రంలోని జనాభాకు తగినట్టు ప్రధాన మత వర్గాల మధ్య విభజించడం.

3) ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్క మతానికి కేటాయించిన ప్రతినిధులను శాసనసభలోని అదే మతానికి చెందిన సభ్యులు ఎన్నుకోవడం చేసినట్టయితే మంచిదని భావించారు. ఎన్నికల కోసం, బృందం, మూడు ప్రధాన మత వర్గాలను మాత్రమే గుర్తించింది. సాధారణ, ముస్లిం, శిఖ్ఖు. సాధారణ వర్గంలో ముస్లింలూ శిఖ్ఖులూ కాని వారందరూ వస్తారు.

## రాజ్యాంగ నిర్ణయ సభకు ఎన్నికలు

బృందం పథకం గురించి వాదోపవాదాలు తలఎత్తినప్పటికీ కాంగ్రెసూ లీగూ కూడా రాజ్యాంగ నిర్ణయ సభకు ఎన్నికల కోసం సన్నాహాలు చేసుకోవడం సాగించాయి. 1946 జులై ఆఖరుకు ఎన్నికలు పూర్తయాయి. రాజ్యాంగ నిర్ణయ సభలో బ్రిటిషు ఇండియన్ రాష్ట్రాలకు 296 స్థానాలున్నాయి. వీటిలో 205 స్థానాలను కాంగ్రెసు గెల్చుకుంది. సాధారణ స్థానాల్లో తొమ్మిదింటిని తప్ప మిగతా అన్నింటినీ కాంగ్రెసు గెల్చుకుంది. ముస్లింలకు కేటాయించిన 78 స్థానాల్లో లీగ్, 73 గెల్చుకుంది. శిఖ్ఖు స్థానాలు కొంత కాలం ఖాళీగా వున్నాయి.

## మతోన్మాదం

ఇదంతా జరుగుతూ వుండగా మతపరమైన సంఘర్షణ ముమ్మరమవుతూ వచ్చింది. ముస్లింలీగ్ ముందు అనుకున్న విధంగా ఆగష్టు 16 వ తేదీని, దేశమంతటా "ప్రత్యక్ష కార్యచరణ దినంగా" పాటించింది. కలకత్తాలో మతపరమైన హత్యాకాండకు ఒడి గట్టింది. దరిమిలా తూర్పు బెంగాల్ బిహార్‌లలో తీవ్రమైన కొట్లాటలు జరిగాయి. ఐ. ఎన్. ఏ. ప్రదర్శనలూ తంతి తపాలా సమ్మె, రాయల్ ఇండియన్ నేవీ తిరుగు బాటూ సందర్భాల్లో ప్రజాఉద్యమాలు జరిపినపుడు మత సామరస్యాన్ని ప్రదర్శించిన భారతదేశం, మంత్రిమండలి బృందం పథకం ఫలితంగా మతపరమైన హత్యా కాండలో మునిగి పోయింది.

## శాసనసభపాత్రమీద ఫలితం

సెప్టెంబరు 2 వ తేదీన కాంగ్రెసు తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది.

అతర్వాత కొన్నివారాలకే అక్టోబరు 26 వ తేదీన లీగ్ సభ్యులు చేరారు.

కాంగ్రెసునాయకులూ లీగ్‌నాయకులూ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడంతో శాసనసభ బ్రిటిషు సామ్రాజ్యవాదానికి భారత జాతీయవాదానికి మధ్య సంఘర్షణకు వేదికగా ఉండడం ఆగిపోయింది. ఐ. ఎన్. ఎ. సిబ్బందిని విడుదల చేసే విషయంలో ఇది స్పష్టంగా తెలిసింది. ఐ. ఎన్. ఎ. ఖైదీలను వెంటనే విడుదల చేయాలని కోరుతూ అబ్దుల్ గనీఖాన్ 1947 ఫిబ్రవరి 18 వ తేదీన ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. ఈ విషయమై అరవ శాసనసభ మెదటిసారి సమావేశమైనప్పటినుంచీ సుదీర్ఘమైన చర్చ జరుగుతూ వచ్చింది. ఇప్పుడు ప్రభుత్వంలో వున్న నాయకులు చాలా మంది ఈ విషయమై ఎంతో గట్టిగా మాట్లాడివున్నారు. గనీఖాన్ తీర్మానంమీద చర్చ ప్రారంభమైనపుడు చాలామంది సభ్యులు, ఉదాహరణకు గనీఖాన్. అహ్మద్ ఇ. ఎచ్. జాఫర్, శ్రీమతి స్వామినాధన్, శశాంక శేఖర్‌సన్యాల్, మాట్లాడుతూ, ప్రజా ప్రభుత్వం అధికారంలోకి వచ్చి కొన్ని నెలలైనా ఐ. ఎన్. ఎ. సిబ్బందిని ఇంకా విడుదల చేయనందుకు విస్మయం ప్రకటించారు. పండిత బాలకృష్ణ శర్మ ఈమాట లన్నారు.

"ఐ. ఎన్. ఎ. సిబ్బందిని విడుదల చేయాలని మనమందరమూ కోరుతున్నాము. అయితే మనం ఒక ఏడాదిక్రితం మాట్లాడినట్టు ఇప్పుడు మాట్లాడలేం. ప్రజా ప్రభుత్వం అధికారంలోకి వచ్చి ఎనిమిది నెలలైన సంగతి నిజమే. ఏడు నెలలుగా సంకీర్ణ ప్రభుత్వం పని చేస్తున్నది. పండిత నెహ్రూ, లియాఖతలీఖాన్, ఐ. ఎన్. ఎ. సిబ్బందిని విడుదల చేయలేకపోయారూ అంటే ఏదో పెద్ద అడ్డంకి వుండి వుంటుంది. వారు ఈ విషయంలో ఒకనిర్ణయం తీసుకోక పోవడానికి బలీయమైన కారణం ఏదో ఉండి వుంటుంది. పండిత నెహ్రూను దుయ్యబట్టి లాభంలేదు." 15

మారిన పరిస్థితిలో మరొక విశేషం శాసన సభ్యులు మొత్తంమీద ప్రభుత్వ చర్యల విషయంలో తమ తమ పార్టీలకు అనుగుణంగా వ్యవహరించారు, అంటే ఒక సభ్యుడు ఏదైనా చర్యను ప్రతిపాదించినపుడు, ఆసభ్యుడి పార్టీ దృష్ట్యా మిగతా సభ్యులు వ్యవహరించేవారు. 1947 లో బడ్జెటు చర్యల సందర్భంగా ఇదిబాగా ప్రస్ఫుటమైంది. ఆర్థిక సభ్యుడు లియాఖతలీఖాన్ ప్రతిపాదించిన బడ్జెటులో వాణిజ్య జనాభాలమీద భారీ పన్నులను విధించారు. భారతదేశంలోని విపరీతమైన అసమానతలను తగ్గించేందుకు తాము ఈవిధంగా చేసినట్టు ఆయన పేర్కొన్నారు. బడ్జెటులోని కొన్ని అంశాలపట్ల సభలోని అన్ని పక్షాలవారూ హర్షం వెలిబుచ్చిన సంగతి నిజమే, కాని ముస్లింలీగ్

సభ్యులమాత్రం, లియాఖత్‌అలీఖాన్ సమర్పించినది కాబట్టి బడ్జెటును పూర్తిగా సమర్థించారు. కాంగ్రెసు సభ్యుల్లో చాలామంది, ఈ బడ్జెటును కాంగ్రెసు పార్టీకి ఇబ్బంది కలిగించేవిధంగా ఆర్థిక సభ్యుడు తయారుచేశారని భావించారు.[16]

### దేశ విభజనకు దారి

ఈలోగా రాజ్యాంగనిర్ణయసభ విషయమై ప్రతిష్టంభన కొనసాగింది. డిశంబరు 9వ తేదీన సమావేశం కావలసివున్న రాజ్యాంగ నిర్ణయసభ చర్చల్లో పాల్గొనేందుకు లీగ్ ఇంకా నిరాకరిస్తూనే వుంది. ఒకవైపు రాజ్యాంగనిర్ణయ సభలో పాల్గొనేందుకు నిరాకరిస్తూ తాత్కాలిక ప్రభుత్వంలో పాల్గొనడం పరస్పర విరుద్ధంగా వుందని కాంగ్రెసు వాదించింది. డిశంబరులో లండన్‌లో ఒక సమావేశం జరిగింది. దీనికి అట్లీవేవెల్, నెహ్రూ, జిన్నా, బల్‌దేవ్‌సింగు హాజరయారు. సమావేశంవల్ల ఫలితమేమీలేకపోయింది కాని, బ్రిటిషు ప్రభుత్వం డిశంబరు 6వ తేదీన ఒక ప్రకటన విడుదలచేసింది. దానిలో ఈ విధంగా పేర్కొన్నారు :

> "భారతీయులలో ఎక్కువ మంది పాల్గొనని రాజ్యాంగ నిర్ణయసభ రాజ్యాంగాన్ని రూపొందించినట్లయితే దేశంలో అందుకు అంగీకరించని ప్రాంతాల్లో ఆ రాజ్యాంగాన్ని బలవంతంగా ప్రవేశపెట్టాలని బ్రిటిషు ప్రభుత్వం తలపెట్టదు. కాంగ్రెసు కూడా అదే విధంగా అభిప్రాయపడుతున్నట్లు తెలియచేసింది."[17]

బ్రిటిషు ప్రభుత్వం, భారతదేశాన్ని విభజించే దృష్టితో ఆలోచిస్తూ వుందని దీనివల్ల తెలిసిపోయింది. ముస్లింలీగ్‌కు ఇప్పుడు వీలు లభించింది. కొంతకాలం వరకూ మొండిగా వ్యవహరిస్తేచాలు.

రాజ్యాంగనిర్ణయసభ డిశంబరు 9వ తేదీన సమావేశమైంది. ముస్లింలీగ్ సమావేశానికి హాజరుకాలేదు. అయినా సభ తన కార్యక్రమాన్ని కొనసాగించింది. సభలో మిగతా అందరికంటె వయస్సులో పెద్దవారైన సచ్చిదానంద సిన్హాను తాత్కాలికంగా అధ్యక్షులుగా వ్యవహరించ వలసిందని కోరారు. రాజేంద్రప్రసాద్ సభాధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయారు. నెహ్రూ "లక్ష్యాల తీర్మానాన్ని" ప్రతిపాదించారు. చర్చనీయాంశావళిలో ఇది రాజకీయంగా అతి ముఖ్యమైనది. ఇండియన్ యూనియన్ స్వతంత్ర సర్వంసహాధికారంగల రిపబ్లిక్‌గా వుంటుందనీ, దానిలో స్వపరిపాలనా ప్రతిపత్తిగల విభాగాలు రెసిడ్యుయరీ (అవశిష్టమైన) అధికారాలు కలిగి వుంటాయనీ తీర్మానంలో పేర్కొన్నారు. అన్ని వర్గాల ప్రజలకూ సాంఘిక - ఆర్థిక - రాజకీయ ప్రజాస్వామ్యం ఉంటుందనీ, అల్పసంఖ్యాకవర్గాలకూ వెనుకబడివున్న వారికి వెనుకబడివున్న ప్రాంతాలకూ తగిన రక్షణలుంటాయనీ పేర్కొన్నారు. తీర్మానంమీద చర్చను 1947

జనవరి 20 వరకూ వాయిదా వేశారు. ముస్లింలీగ్ ప్రతినిధులూ, సంస్థానాల ప్రతినిధులూ రాజ్యాంగ నిర్ణయసభలో పాల్గొనేందుకు వీలుగా ఈ విధంగా చేశారు. కాని, లీగ్, మరింత మొండి వైఖరి అవలంబించింది. సభకు హాజరయేందుకు నిరాకరించింది. సభ మళ్ళీ జనవరి 20వ తేదీన సమావేశమై "లక్ష్యాల తీర్మానాన్ని" ఆమోదించింది, కార్యాచరణకు కొన్ని ప్రధానమైన సంఘాలను నియమించింది.

ముస్లింలీగ్ రాజ్యాంగ నిర్ణయసభలో చేరేట్టుగాని లేనిపక్షంలో తాత్కాలికప్రభుత్వం నుంచి వైదొలగేట్టుగాని బ్రిటిషు ప్రభుత్వం చేయాలని కాంగ్రెసు ఇప్పుడు కోరింది. బ్రిటిషు ప్రభుత్వం ఈ విషయంలో వ్యవహరించకపోయినట్టయితే తాము రాజీనామా చేస్తామని హెచ్చరించింది. బ్రిటిషు ప్రభుత్వం 1948 జూన్ నాటికి వైదొలగేందుకు నిశ్చయించుకున్నట్టూ, అప్పటికి అధికారాన్ని అప్పగించేందుకు సంబంధించి సంప్రదింపులు జరపేందుకు లార్డ్ మౌంట్‌బాటన్‌ను వైస్‌రాయిగా పంపబోతున్నట్టు ప్రకటించింది. లార్డ్ మౌంట్‌బాటన్ బ్రిటిషు ప్రభుత్వం 1947 ఆగష్టు 15నాటికి వైదొలగుతుందనీ, భారతదేశాన్ని విభజిస్తారనీ ప్రకటించారు.

## భారత స్వాతంత్ర్య చట్టము కేంద్ర శాసనసభ ముగింపు

మౌంట్ బాటన్ పథకంలోని అంశాలను భారత స్వాతంత్ర్య బిల్లులో పొందుపరచి కామన్సుసభలో జూలై 4వ తేదీన ప్రవేశపెట్టారు. జ్యూలై 18వ తేదీన ఆమోదించారు. భారత స్వాతంత్ర్య చట్టం ప్రకారం, భారతదేశం ఆగస్టు 15వ తేదీ నుంచీ రెండు స్వతంత్ర డొమినియన్‌లుగా — భారత - పాకిస్తాన్‌లుగా ఏర్పడుతుంది ఒక్కొక్క డొమినియన్‌కూ ఒక రాజ్యాంగ నిర్ణయసభ. ఏ రాజ్యాంగాన్నయినా రూపొందించి అమలుపరచేందుకు అన్ని అధికారాలూ కలిగివుంటుంది. ఆగస్టు 14వ తేదీ తర్వాత శాసనసభ రాజ్యసమితి రద్దవుతాయి. ఆ తర్వాత వాటి విధులను రాజ్యాంగ నిర్ణయ సభ నిర్వహిస్తుంది.

### స్వతంత్ర భారత అవతరణ

ఆగష్టు 14వ తేదీ అర్ధరాత్రి రాజ్యాంగనిర్ణయసభ క్రొత్త ఢిల్లీలో డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ అధ్యక్షతన సమావేశమైంది. త్వరలో భారతదేశానికి మొదటి ప్రధానమంత్రి కాబోతున్న పండిత జవహర్‌లాల్ నెహ్రూ చిరస్మరణీయమైన ఉపన్యాసం చేశారు. ఈ సందర్భపు చరిత్రాత్మక ప్రాముఖ్యాన్ని గుర్తించుకుని సభ్యులు దేశసేవకు తమను తాము అంకితం చేసుకోవాలని ఉద్బోధించారు.

"ఎన్నో ఏండ్లనాడు మనం విధితో ఒక ఒప్పందం కుదుర్చుకున్నాం. దాన్ని నిజంగా సంపూర్ణంగా నిలబెట్టుకోవలసిన సమయంవచ్చింది. అర్ధరాత్రి అయినపుడు ప్రపంచమంతా నిద్రాదేవి ఒడిలో వున్నపుడు భారతదేశం చైతన్యవంతమవుతుంది, స్వతంత్రమవుతుంది. చరిత్రలో అతి అరుదుగా వచ్చే ఒకానొక ఘడియలో మనం పాతనుంచి కొత్తలోకి అడుగుపెడతాము. ఒక తరం అంతరిస్తుంది. దీర్ఘకాలంగా అణిచివేయబడిన ఒక జాతి విమోచన పొందుతుంది. ఇటువంటి మహత్తరమైన ఘడియలో భారతదేశానికి భారతీయులకూ, మానవాళి అంతటికీ సేవచేసేందుకు మనలను అంకితం చేసుకుంటూ ప్రతిజ్ఞ పూనడం విధాయకం."[18]

ఈ శాసనసభలో స్వాతంత్ర్య సమరం ఫలప్రదమైంది. 1947 ఆగస్టు 15వ తేదీన స్వతంత్ర భారతావని అవతరించింది.

## రెఫరెన్సులు


1. వి. పి. మీనన్, ది ట్రాన్స్ఫర్ ఆఫ్ పవర్ ఇన్ ఇండియా (క్రొత్త ఢిల్లీ 1966), పే. 228.
2. ఆర్. పి. దత్, ఇండియా టుడే (బొంబాయి 1952), పే. 548
3. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, వా. 1, 1946, పే. 145-50
4. ది హిందూ 25 జనవరి 1946
5. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్, యన్. 3, పే. 290-1
6. ఇబిడ్., పే. 291-2
7. ఇబిడ్., పే. 428-35
8. ఇబిడ్., వా. 5, 1946. పే. 3311-12
9. ఇబిడ్., యన్. 3, పే. 797-801
10. ఇబిడ్., పే. 808-10
11. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్. వా. 2, 1946, పే 1352-3
12. ఇబిడ్., పే. 1405-07
13. ఇబిడ్., పే. 1411-13
14. ఇబిడ్., పే. 1420-1
15. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్. వా. 1, 1947, పే. 807

16. మౌలానా అబ్దుల్ కలామ్ ఆజాద్, ఇండియా విన్స్ ఫ్రీడమ్ : ఏన్ ఆటో బయోగ్రఫీకల్ నెరేటివ్ (కొత్త ఢిల్లీ, 1959), పే. 175-76

17. బి. శివరావు, ఎడ్. ది ఫ్రేమింగ్ ఆఫ్ ఇండియాస్ కాన్‌స్టిట్యూషన్: సెలెక్టు డాక్యుమెంట్స్ (కొత్త ఢిల్లీ, 1966), పే. 348

18. ఇబిడ్., పే. 558-9

# ముగింపు వాక్యాలు

భారతదేశంలో ప్రజా ఉద్యమం ఒత్తిడి ఎక్కువ కావడంతో వలస అధికార్లు రాజ్యాంగ సవరణల రూపంలో చర్య తీసుకోవలసి వచ్చింది. భారత ప్రభుత్వంతో మధ్య తరగతి పైతరగతి ప్రజలకు సంబంధం వుండేట్టు చూడడం బ్రిటిషుప్రభుత్వ విధానంగా వుంటూ వచ్చింది. అదే సమయంలో దేశప్రజల కోరిక మరీ తీవ్రం కాకూండా, దానికి అండగా ప్రజాఉద్యమం పటిష్టమైన వ్యవస్థగా తయారుకాకుండా అరికట్టే ఉద్దేశ్యంతో కూడా బ్రిటిషుప్రభుత్వం తన విధానాన్ని రూపొందించుకుంది. దీనికిగాను బ్రిటిషువారు, రెండు ప్రధాన మార్గాలను అవలంబించారు. ఒకటి: భారత రాజకీయరంగాన్ని భూస్వాములూ — వాణిజ్య — శ్రామికవర్గాలు — మతవర్గాలు — యూరోపియన్ బృందాలు మొదలైన భాగాలుగా విభజిస్తూ ఎన్నికల పద్ధతి నొకదాన్ని రూపొందించి విభజనను పటిష్టం చేశారు. అన్నింటికంటే ముఖ్యమైనది, ముస్లింలకు ప్రత్యేక నియోజక వర్గాలను ఏర్పాటుచేసి రాజకీయరంగంలో మత తత్వాన్ని ప్రోత్సహించారు. మాంటేగు — చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల ద్వారా ప్రాంతీయ — సాధారణ నియోజకవర్గాల పద్ధతిని పరిమితంగా ప్రవేశపెట్టినపుడు, సహాయనిరాకరణ ఉద్యమంవల్లా 1919 తర్వాత వామపక్షాల ఆందోళనవల్ల రాజకీయరంగంలోకి ప్రవేశించిన గ్రామప్రజలు రాజ్యాంగపరమైన చర్యలకు దూరంగా వుండేట్టు జాగ్రత్త పడ్డారు. రెండు : బ్రిటిషు అధికార్లు రాజ్యాంగసవరణలను అమలుజరిపే ప్రతి ఘట్టంలోనూ జాతీయ ఉద్యమంలో ప్రధాన భాగానికి రాజకీయ బృందాల్లో ఏదో ఒకటి దూరంగా వుండేట్టు కృషిచేస్తూ వచ్చారు. మితవాదులను దౌర్జన్యవాదులకు దూరంగా ఉంచడమే వారి ఉద్దేశ్యం. 1909 వ సంవత్సరపు సంస్కరణలముందు మాంటేగు చేసిన కృషి. సైమన్‌సంఘాన్ని నియమించేముందు బర్కెన్‌హెడ్ వైస్‌రాయికిచ్చిన ఆదేశాలూ, రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభదశలో లిన్‌లిత్‌గో జిన్నాతో జరిపిన సంప్రదింపులూ దీనికి నిదర్శనాలు.[1]

బ్రిటిషువారు అనుసరించిన ఈ రాజకీయ — రాజ్యాంగ స్వరూపంలో కేంద్ర శాసన సభ, స్వాతంత్ర్య పోరాటంలో ఎటువంటిపాత్ర వహించగలదు. స్వాతంత్ర్య పోరాటంలో కేంద్ర శాసనసభ వహించిన పాత్రను పరిశీలించినట్టయితే, గాంధీజీ భావించినటు బ్రిటిషు సామ్రాజ్యవాదంతో సహకరించరాదన్న విధానానికి సమితిల్లో

చేరడం ప్రమాదకరమన్న సంగతి ధృఢపడింది. సమితుల్లో చేరాలన్న విధానాన్ని ఎంతోఉత్సాహంతో సమర్థించిన మోతీలాల్‌నెహ్రూ కూడా, శాసనసభలో స్వరాజ్యవాదుల బృందానికి ఎంతో విజయవంతంగా నాయకత్వం వహించినప్పటికీ, కొన్ని సంవత్సరాల్లో ఈసంగతి గుర్తించారు. స్వాతంత్ర్య పోరాటం జరిపేందుకు ఆయన శాసనసభనుంచి బయటికి పోవలసి వచ్చింది మాలవ్యా – విఠల్‌భాయిపటేల్, ప్రభుత్వానికి సహాయాన్ని నిరాకరించాలన్న దేశప్రజల ఉద్దేశాన్ని మన్నించకుండా 1630 లో కొన్ని నెలలపాటు శాసనసభలో ఉన్నవారుకూడా శాసనసభ స్వప్రయోజనానికి ఉపయోగించుకొనే "సాధన" మని గుర్తించి శాసనసభలో సభ్యత్వానికి రాజీనామా చేశారు. 2

భారతస్వాతంత్ర్య పోరాటం ప్రధానంగా శాసనసభ భవనాల వెలుపల జరిగింది. అనేక కారణాలవల్ల జాతీయ ఉద్యమంలో లొసుగులు ఏర్పడినా సామ్రాజ్యవాద విధానాలను వ్యతిరేకించేందుకు శాసనసభ. ఒక వేదికగా ఉపయోగింపబడింది. అటువంటి సమయాల్లో. సమితిలోని ప్రతిపక్షం సామ్రాజ్యవాద – వ్యతిరేక చర్యలను ప్రజల దృష్టికి తెచ్చేది, "బ్రిటిషువారితో సహకరించి తద్వార స్వయంపాలన సాధించవచ్చు" నన్న భ్రమకూడా శాసనసభలకు జరిగిన ఎన్నికలవల్ల తొలగిపోయింది. రెండు మూడూ అయిదూ ఆరూ శాసనసభలకు జరిగినఎన్నికల్లో ఉదారవాదులూ రెస్పాన్సివ్‌కో అపరేటర్లూ చిత్తుగా ఓడిపోవడంతో, బ్రిటిషువారితో సహకరించే విధానాన్ని భారతీయులు తిరస్కరించినట్లు స్పష్టమైంది. అయినా సంస్కరణలను శాసనసభ లోనే మట్టుపెట్టవచ్చునని భావించడంకూడా పొరపాటే అయింది. శాసనసభలో ప్రభుత్వం ఓడిపోయినప్పటికల్లా ఆ ఇబ్బందికర పరిస్థితినుంచి బయటపడేందుకు సంస్కరణ చట్టాల లోనే ఏర్పాట్లుండేవి. బడ్జెటులనూ ఆర్థిక బిల్లులనూ భారతబ్రిటిషు ఒప్పందాలను అనేక ఇతర చర్యలను శాసనసభ చాలాసార్లు తిరస్కరించింది. అయితే ఈప్రతివదనంల్లో ఇమిడివున్న విధానాన్ని అమలుపరచడంలో ప్రభుత్వానికి ఏ మాత్రం అటంకం కలుగలేదు. భూలాబాయి దేశాయి ఒకసారి శాసనసభలో "శాసనసభలోని భారతీయ సభ్యులు ప్రభుత్వంతో అంగీకరించిన సందర్భంల్లో వారిని ఉపయోగించుకున్నారు. అంగీకరించని సందర్భల్లో వారిని ఎందుకూ పనికిరానివారుగా జమకట్టారు" అని పేర్కొన్నారు.3 అందువల్ల శాసనసభ్యులుగావుంటూ సంస్కరణలను ప్రతిఘటించలేకపోయినారు. ఫైజ్‌పూర్‌లో అధ్యక్షోపన్యాసమిస్తూ జవహర్‌లాల్‌నెహ్రూ, "రాజ్యాంగాన్ని" శాసనసభలో చర్యలద్వారా మాత్రమే మట్టుపెట్టజాలము దానికి శాసనసభ వెలువల ప్రజాందోళన అవసరము. మన స్వాతంత్ర్య సమరానికి

ప్రజాబాహుళ్యాన్ని వ్యవస్థీకరించి కార్యాచరణకు పూనుకునేట్టు చేయడం చాలా ముఖ్యమని మనం విస్మరించరాదు'' అన్నారు.[4] ఇది అక్షరాలా నిజం.

పరిస్థితులు ఇంత ప్రతికూలంగా వున్నప్పటికీ కేంద్ర శాసనసభ స్వాతంత్ర్య సమరంలో ఎంతో ప్రయోజనకరమైన పాత్ర వహించింది. రాజ్యాంగ పురోభివృద్ధి, సైన్యమూ, సర్వీసెస్, రైల్వేల్లో చేర్చుకోవడం, దేశవాళీ పరిశ్రమలకు సహాయం మెరుగైన సాంఘిక - కార్మిక - శాసనాలు — మొదలైన వాటికోసం శాసనసభలోని భారతీయ సభ్యులు బ్రిటిషు వారిని ఒత్తిడిపెడుతూ వచ్చారు. దమన చట్టాలను తొల గించే విషయమై ప్రజాందోళన జరుపడాన్ని చాలామంది ఆమోదించకపోయినా భార తీయ సభ్యులందరూ ఏకాభిప్రాయంతో వున్నారు. 1928-29లో ప్రజాభద్రత బిల్లుమీద సుదీర్ఘంగా జరిగిన చర్చ, ఈ సందర్భంలో అధ్యక్షులైన పటేల్ అనుసరించిన విధా నమూ దీనికి నిదర్శనాలు. సామ్రాజ్యవాద ప్రయోజనాల దృష్ట్యా ప్రవేశపెట్టిన చర్యలను ప్రతిఘటించడంలో భారత జాతీయవాదులకృషి, శాసనసభల్లో జరిగిన చర్చల వల్ల సుస్పష్టమవుతుంది. ఈ సందర్భంలో ఉక్కు రక్షణ బిల్లు, కరెన్సీ బిల్లు, అట్టావా వాణిజ్య ఒప్పందం, భారత - బ్రిటిషు ఒప్పందం వీటిమీద జరిగిన చర్చలు బాగా ఉపకరిస్తాయి. ఈ సందర్భంలో ఒక విషయం గమనార్హం. శాసనసభకు కార్మిక ప్రతినిధులను ప్రభుత్వం నామినేట్ చేసేది. అయినా ట్రేడ్ యూనియన్ హక్కులూ కార్మికు లకు ఓటు హక్కూ మెరుగైన పరిస్థితులు, పరిశ్రమల నిర్వహణ వంటి విషయాల గురించి చర్చ జరిగినపుడు సభలో కార్మికుల అభిప్రాయాలు వినవచ్చేవి.

శాసనసభలో జరిగిన పోరాటంలో అతి సంతోషకరమైన విషయం, భారతీయ సభ్యులు తమ హక్కులు సౌకర్యాలకోసమూ శాసనసభ హక్కులు సౌకర్యాలకోసమూ సమైక్యంగా శక్తివంచనలేకుండా కృషిచేయడం. భారతీయులు, తమ దేశంలో ఒక పార్లమెంటును ఏర్పాటుచేసుకునేందుకు పరోక్షంగా ప్రయత్నిస్తున్నారని భారతప్రభుత్వం భావించినందువల్ల శాసనసభలోని భారతీయులు ఈ విషయమై అధికార పక్షంతో భారత ప్రభుత్వంతో ప్రత్యేకంగా ఘర్షణ పడవలసివచ్చింది. ఈ విషయంలో అధ్యక్షులైన పటేల్ కొంత సాధించారు. పౌర స్వేచ్ఛకోసం ముఖ్యంగా అభిప్రాయ వ్యక్తీకరణ, పత్రికలు, సమావేశాలు జరుపడం మొదలైన వాటికి స్వేచ్ఛకోసం భారతీయ సభ్యులు నిర్విరామ పోరాటం సలిపారు.

భారతదేశంలో బ్రిటిషువారు అనుసరిస్తున్న విధానాన్నీ వారి చేతలనూ భారతీయులు కోత తీర్మానాలూ, వాయిదా తీర్మానాలూ ప్రశ్నలు మొదలైన చర్యలద్వారా బట్టబయలు చేయడంలో కృతకృత్యులయ్యారు. అటువంటి సందర్భంలో భారతప్రభుత్వ ప్రతినిధులు

ఇరుకునపడేవారు. అఖిలభారత గ్రామ పరిశ్రమలకు సంబంధించి ప్రభుత్వం రహస్యంగా పంపిన సర్క్యులర్ గురించి జరిగిన చర్చ దీనికి ఒక ఉదాహరణ.

దేశంలోని ప్రధాన రాజకీయ వర్గాల ప్రతినిధులు శాసనసభలో వున్నపుడు శాసనసభలో ఘర్షణ జరిగిన సందర్భంలో అతి ఉత్తమమైనవి. అంటే 1924 నుంచీ 1929 వరకూ, 1935 నుంచీ 1939 వరకు. (1945–47 మధ్యకాలం, వ్యవధి ఎక్కువ లేకపోవడంతో శాసనసభ్యులు ఎక్కువ ఏమీ చేయలేకపోవడమేకాక, ఆ సమయంలో సభసభ వెలుపల ముఖ్యమైన సంఘటనలు చాలా జరుగడంతో శాసనసభా కార్యకలాపాలు వాటి మరుగున పడ్డాయి) ఈ రెండు సందర్భాల్లోనూ స్వరాజ్యవాదులు (కాంగ్రెసు పార్టీలో ఒక భాగం) కాంగ్రెసు పార్టీ శాసనసభలో ఏకైక పెద్దపార్టీగా వుండేవారు. మోతీలాల్ నెహ్రూ, భూలాభాయిదేశాయి, సత్యమూర్తి, గోవిందవల్లభపంత్, అసఫలీ వంటి గొప్ప పార్లీమెంటరీ వ్యవహర్తలు శాసనసభలోని ఈ పార్టీలకు నాయకులుగా వున్నారు. వారు సమర్థులైన వక్తలూ, ప్రముఖ నాయకులూ మాత్రమే కాక, శాసనసభలో వెలుపల జరుగుతున్న జాతీయ ఉద్యమంనుంచి ప్రేరణపొందేవారు. ప్రజలకు వారిలో వున్న విశ్వాసం అండగా వారు, ప్రభుత్వంమీద విరుచుకుపడే వారు. శాసనసభలోనే ప్రభుత్వం ఓటమి పొందడంచూసి బయట ప్రజలు సంతోషించేవారు.

### రెఫరెన్సులు


1. చాప్టర్ I, II, IV & VII
2. 'ది నెక్స్ట్ కౌన్సిల్స్' ఎడిటోరియల్, హిందూస్థాన్ టైమ్స్, 8 ఆగస్టు 1930
3. లెజిస్లేటివ్ అసెంబ్లీ డిబేట్స్ వా. 5, 1940, పే. 792
4. ఇండియన్ అన్యువల్ రిజిష్టర్, వా. 2, 1936, పే. 227